

# కన్యాకుమారి యాత్ర

## చంపూకావ్యము




రచన :

కవిశేఖర - సుకవి సుధాకర

సాహిత్య విద్యాప్రవీణ - భాషాప్రవీణ

**బూరుగల గోపాలకృష్ణమూర్తి**

ప్రథమ ముద్రణము :
ఆంగీరస - జ్యేష్ఠము
జూన్ - 1992
ప్రతులు 1000



మూల్యం 75/-

ప్రాప్తిస్థానము :
కవిశేఖర - సుకవి సుధాకర
బూరుగల గోపాలకృష్ణమూర్తి
పుట్టావారివీధి. నాజరుపేట,
తెనాలి - 522 201
(గుంటూరు జిల్లా)

ఈ గ్రంథము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ద్రవ్య సహాయముతో ముద్రింపఁబడినది.

---

ముద్రణము : విజయశ్రీ ప్రింటర్స్ ఉప్పుబజార్, తెనాలి-522 201

# విషయనిర్దేశిక


| | | Page |
|---|---|---|
| 1. | యాత్రాసంకల్పము | 2 |
| 2. | శ్రీశైలము - సాంప్రదాయములు | 18 |
| 3. | మహానంది | 30 |
| 4. | అర్థవాదములు | 35 |
| 5. | మంత్రాలయము | 38 |
| 6. | హంపి | 41 |
| 7. | విజయనగరము | 51 |
| 8. | తుంగభద్ర | 83 |
| 9. | గోకర్ణము | 85 |
| 10. | ఉడుపి | 88 |
| 11. | ధర్మస్థల | 92 |
| 12. | బేలూరు - వేలాపురి | 95 |
| 13. | హాళిబేడ్ | 111 |
| 14. | శ్రావణ బెళగోళ | 112 |
| 15. | బెంగుళూరు | 114 |
| 16. | మాతృభాషా ప్రాశస్త్యము | 115 |
| 17. | మైసూరు | 122 |
| 18. | బృందావన గార్డెన్ | 128 |
| 19. | ఊటి | 133 |
| 20. | పళని | 139 |
| 21. | మధుర | 144 |
| 22. | విల్లిపుత్తూరు | 152 |
| 23. | కుర్తాళము | 156 |
| 24. | కేరళ - త్రివేంద్రము | 162 |
| 25 | నాగర్‌కోయిల్ | 167 |
| 26. | కన్యాకుమారి | 169 |
| 27, | వివేకానంద స్తూపము | 176 |
| 28. | శుచీంద్రము | 192 |

శ్రీ


| | | Page |
|---|---|---|
| 29. | తిరునల్వేలి | 196 |
| 30. | వైకుంఠపురము | 198 |
| 31. | నమ్మాళవార్ నగరము | 200 |
| 32. | తిరుచ్చెందూర్ | 201 |
| 33. | మంటపము | 209 |
| 34. | రామేశ్వరము | 212 |
| 35. | ద్వాదశ జ్యోతిర్లింగములు | 213 |
| 36. | దర్భశయనము | 232 |
| 37. | నవపాషాణములు | 240 |
| 38. | ధనుష్కోటి | 241 |
| 39. | శ్రీరంగము | 242 |
| 40. | జంబుకేశ్వరము | 250 |
| 41. | తిరుచినాపల్లి | 253 |
| 42. | తంజాపూరు | 260 |
| 43. | కుంభకోణము | 266 |
| 44. | మాయవరము | 276 |
| 45. | వైద్యేశ్వరము | 278 |
| 46. | చిదంబరము | 280 |
| 47. | శివకంచి | 286 |
| 48. | విష్ణుకంచి | 296 |
| 49. | మద్రాసు | 299 |
| 50. | శ్రీ తిరుపతి - తిరుమల | 305 |
| 51. | శ్రీ వేంకటేశ్వర శరణాగతి | 309 |
| 52. | పద్మావతీ చరిత్ర | 328 |
| 53. | వేంకటాద్రియందలి తీర్థములు | 360 |
| 54. | శ్రీ అలమేల్ మంగాపురము | 381 |
| 55. | శ్రీకాళహస్తి | 390 |
| 56. | నెల్లూరు | 411 |

# అభివ్యక్తి

మేము 1984 అక్టోబరులో యాత్రబస్సులో ప్రయాణించి దాక్షిణాత్య క్షేత్రములను దర్శించి వచ్చితిమి. ఆక్షేత్ర విషయములను చంపూ కావ్యముగా వ్రాయవలయునని యాత్రారంభములోనే నాకు సంకల్పము కలిగినది. దానిని భగవదాజ్ఞగా భావించి ఆ దృష్టితో ఆయా క్షేత్రవిషయములను కొన్నింటిని స్థానికులద్వారా తెలిసికొంటిని - కొన్నింటిని చరిత్రలను బట్టి గుర్తించితిని-ఏ యాధారములు లేనివానిని ప్రకరణ బలమువలన నూహించి నిర్ణయించుకొంటెని.

తెలుఁగులో తీర్థక్షేత్రములను గురించిన గ్రంథములు గద్యములో నున్నవి- అవి కేవలము విషయ కథన పరములేగాని సాహిత్య పరములు కావు- అందువలన నేను దాక్షిణాత్యక్షేత్రములను గురించి సాహిత్యపరముగా చంపూకావ్యమును రచించితిని. చంపూ కావ్యమనగా గద్య పద్యములతోఁ గూడినది.

కావ్యరచన కష్టసాధ్యము - కథారచనవంటిదికాదు - కథను చెప్పుకొనుచు పోవుటయే కథారచనలో కవి పని - అది యంత కష్టముకాదు.

కావ్య నిర్మాణమునకు కొంత కావ్యసామాగ్రి కావలయును- ఆ సామాగ్రిలో వర్ణనము ముఖ్యము- వర్ణనము కవి సామర్థ్యమును దెలుపు నికషపాషాణము. కావ్యసామాగ్రిపాటనమున్నఁగాని కావ్యము శోభింపదు- తిరుమల మందిర సుందరుడు దయతో నా కనుగ్రహించిన కావ్యసాధనములతో ''కన్యాకుమారి యాత్ర'' చంపూకావ్యమును రచించితిని.

దక్షిణభారతము శిల్పలక్ష్మికిఁ గాణయాచి- ఆ శిల్పములో దేవాలయ శిల్పము పరాకాష్ఠతనందినది. ఈ గ్రంథములో నపూర్వ శిల్ప విన్యాసములను- నామౌచిత్యములను- చరిత్రలను- ప్రసక్తానుప్రసక్తములగు కథలను-గాథలను- సంబంధిత వర్ణనములను బొందుపఱచితిని- ప్రసక్త కథాకథనము పురాణ సంప్రదాయమే కదా !

అపూర్వ్యములైన మన సంప్రదాయములకు- ఆచార వ్యవహారములకు కొన్నింటికి నిర్వచనములు ఈ కావ్యములోఁ బరిశీలింపఁబడినవి.

దురాచారములు నిరసింపఁబడినవి-పదములయొక్క సాధుత్వాఽసాధుత్వములుగూడ దిఙ్మాత్రముగా (కొంతవఱకు) జర్చింపబడినవి.

తటాకాది నిర్మాణములను సప్తసంతానము లందురు. వానిలోఁ గావ్యరచన యొకటి- అది ఐహికాముష్మిక ఫలప్రదదక్షము కావ్యపఠనమువలన అనిర్వచనీయానందముకలుగును- అందువలననే పూర్వము రాజులు మహారాజులు కావ్యరచనను మిగులఁ బ్రోత్సహించిరి. వేదశాస్త్ర పురాణములు నీతిబోధకములే- కావ్యము వానికంటె మిక్కిలి సరసముగాఁ బఠితృలోకము నాకర్షించి నీతిబోధచేయఁగలదు. అందువలన సత్కావ్యముల నాదరించుట జాతిధర్మము.

దాక్షిణాత్య శిల్పమనేకత్ర అనేకథా సృష్టింపఁబడినది కావున నా శిల్పవర్ణనములలో పునరుక్తవదాభాసములు అచ్చటచ్చట చోచరించును- కొన్నియెడల పునరుక్తములును గావచ్చును- అయినను విషయవైవిధ్యమున్నయెడల పునరుక్తి దోషముకాదు- భాగవతాదులలోఁబలుతావులలోఁ గన్పట్టు భగవన్మహిమానువర్ణనములనుఁ బునరుక్తులని యనలేముకదా

కావ్యజగత్తులో శతాంశములుగా నిర్దుష్టమైన కావ్యములేదని చెప్ప వచ్చునేమో- ప్రతికావ్యములోను- ఏదియోయొక కోణమునుండి చూచిన ఎంతో కొంతదోషము కనుపించకమానదు- తావన్మాత్రముచేతనేకావ్యము నింద్యముకాదు- రసచర్వణమునకు-అల్పదోషము లడ్డుగోడలు కాలేవు.

ఎంతజాగ్రత్తగాఁ బరిశీలించినను- నాలుగుకండ్లతోనో- ఆఱుకండ్లతోనో నిశితముగాఁ బరిశీలింపఁదగిన కావ్యము రెండుకండ్లతోనే (నా యొక్కనిచేతనే) బరిశీలింపఁబడుటవలన ముద్రణాదిస్థానిత్యము లనివార్యములైనవి- వానినిఁ గొంతవఱకైనను సరిచేయుటకు గ్రంథాంతమందు శుద్ధాఽశుద్ధపత్రము లనుసంధింపఁబడినవి- ఆ పట్టికకఁదని దోషములుగూడ గ్రంథములో నుండవచ్చును- సహృదయులైన పాఠకులే వానిని సవరించుకొందురుగాక

గ్రంథవిషయ సులభపరిజ్ఞానమునకై గ్రంథాదియందు ముఖ్య విషయనిర్దేశిక నిర్దేశింపఁబడినది- ఆ నిర్దేశికలోఁ జేరని విషయములింకను గంథములో నున్నవి. ఇప్పటికే నిర్దేశిక దీర్ఘమైనదిగదా !

గ్రంథవిస్తరణభీతిచేత నా ప్రథమలిఖితగ్రంథమునుండి సుమారు నూఱుపేజీలు తగ్గించి ఈ కావ్యమును ముద్రింపించితిని- ఆ విషయము కూడ నున్నచో గ్రంథమునకు మఱికొంత యుదాత్తతచేకూరి యుండెడి దేమో- గ్రంథము బహుళమైన ముద్రణవ్యయము కూడ బహుళమగును గదా.

కవిత్వము కూడ ఒక మహావ్యసనమే - ఆ వ్యసనమునకు దాసుఁడైనవాఁడు దానియెడినుండి విడిపడలేదు. ఆ రుచిని, సద్యః పరనిర్వృతిని, మఱువజాలడు- వయోభారము నా నెత్తినపడినది- ఓపిక తగ్గినది- ఆరోగ్యము సరిగాలేదు- అయినను నేను ఆ వ్యసనమును మాన లేక పోవుచున్నాను. ఇంతకంటె నుత్తమ కావ్యములు వ్రాయవలెనన్న- ఆశ-తపన-అభిలాషలు నానుండి తొలగుటలేదు- గడియారమువారి శివ భారతమువంటి యుత్తమకావ్యమును వ్రాయవలెనన్నది నా గాఢాభి లాష- వ్రాసి యేమిచేయవలయును ? దానిని వెలుఁగులోనికిఁ దెచ్చు (ముద్రణము) శక్తి నాకున్నదా? సర్వలోకములకు నేడుగడయైన యేడుకొండల ప్రభుని యనుగ్రహ మెట్లున్నదో !

కరుణాసాగరుఁడు భక్తవత్సలుఁడునైన శ్రీ శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తులకు నదృష్టఫలముల నొసంగుచుండునని ప్రతీతి- కాని యా దయాళువు నా యీ కావ్యముద్రణమునకు దృష్టఫలము (పదివేల రూపాయిలు)నొసఁగి భక్తబాంధవ బిరుదమును సార్థకము చేసికొన్నాఁడు. ఆ యిలవేల్పునకు మా యిలువేల్పునకు సప్రశ్రయ సహస్రాధిక కృతజ్ఞతా ప్రణామములు.

నేను గోరినంతనే ఈ గ్రంథముపైఁ దమ యభిప్రాయము నందించిన ప్రాచార్య, జ్ఞానపీఠ అవార్డుగ్రహీత- డా॥ శ్రీ సి. నారాయణ రెడ్డిగారికి.

నా యందున్న గౌరవముతో గ్రంథమును సాకల్యముగాఁ బరిశీ లించి గ్రంథవిశేషములను నాకు, ఉపద, (కానుక)గాఁ బంపిన డా॥ సాహిత్యబ్రహ్మ- చి॥ వి.వి.యల్. నరసింహారావుగారికి.

నవలారచనలో నిమగ్నులై యున్నను నే నడిగినంతనే నా గ్రంథమును జదివి గ్రంథ విషయములనే గాక, వారికి-వారి కుటుంబమునకు-నాకుంగల నిర్నిబంధమైన పవిత్రానుబంధమును, కవిహృదయము అనే శీర్షికలోఁ బొదిగి నాకు బహూకరించిన చి॥ డా॥ శ్రీ రవీంద్రబాబు యం.యస్. గారికి.

నిరంతర గ్రంథావలోకనములో విశ్రాంతి సెఱుగకయున్నను నా యభ్యర్థనమును మన్నించి గ్రంథముపై తమ యభిప్రాయము నిచ్చిన ప్రాచార్య-డా॥ శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని

వయోభారముచేత నోపికలేకపోయినను గ్రంథముపై కుమారుని చేతఁ దమ యభిప్రాయమును వ్రాయించి పంపించిన- కళాప్రపూర్ణ-మహాకవి శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికిని.

నేను యాత్రకు బయలుదేరునప్పుడు సోదరవాత్సల్యముతో నన్నా శీర్వదించి- "యాత్రా మార్గదర్శిని" అను గ్రంథమును (ఆ గ్రంథము క్షేత్రవిషయక పరిజ్ఞానములో నాకెంతో యుపయోగించినది) నా కిచ్చిన మా అన్నగారు బ్రహ్మశ్రీ మార్కండేయశాస్త్రిగారికిని నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు-

ఈ గ్రంథ నిర్వహణమునకై వెయ్యిరూపాయలు విరాళముగా నిచ్చిన ఉదారులు వదాన్యులునైన శ్రీ నూకల రామకోటేశ్వరరావుగారికి నా హార్దిక కృతజ్ఞతలు.

ఈ గ్రంథమును జక్కగా ముద్రించిన- విజయశ్రీ ప్రింటర్సు యజమానులు శ్రీ ఎ. విజయ్‌గారికి వారి కార్యకర్తలకు నా హృదయపూర్వక అభినందనములు-

శ్రీ శారదా మాత నా కనుగ్రహించిన జ్ఞానమును బురస్కరించుకొని నా యోపినంతవఱకు నీ కావ్యమును దీర్చి దిద్దితిని, హంసక్షీరన్యాయముగా రసజ్ఞులు సహృదయులునైన పాఠక ప్రవరులు రసవత్తునుమాత్రమే గ్రహించి ఆనందించి నా రచనలకుఁ జేయూతనిత్తురని భావించుచున్నాను.

జయంతి తే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః॥

# కవిగారి జననీజనకులు



బూరుగల లలితారామకృష్ణయ్యగారు, సీతమ్మగారు

అమ్మానాన్నలారా !

కొడుకుగఁ బుట్టినందులకు, గారమిరాశిగఁ బోసి కండ్లలో
నిడుకొని పెంచినందులకు నిర్జరపూజ్యులఁ దల్లిదండ్రులన్
బుడమినిఁ గీర్తిరూపములఁ బొల్పుగ నిల్పుట పుత్రధర్మమం
చెడదను నమ్మి నాకృతినిఁ జేర్చితి మీ సుమనోహరాకృతిన్.

స్వర్గమునందు శాశ్వత నివాసముఁ గూర్పగఁ జాలునట్టి స
న్మార్గములందు మేలయిన మార్గము కావ్యము, దానియొక్క యం
తర్గతమందు నిల్పి మిము ధన్యుఁడనైతిని. ఈ సుకర్మ నా
దుర్గతి దుర్గతిన్ బొరసెఁ దుష్టి జనించెను జన్మసిద్ధికిన్.



గ్రంథకర్త
కవిశేఖర - సుకవి సుధాకర
బూరుగల గోపాలకృష్ణమూర్తి

గ్రంథకర్త ధర్మపత్ని
రామలక్ష్మి

# కవివంశ భూరుహము (వృక్షము)

అది కోసలదేశము - శ్రీరామచంద్ర పాదారవింద ముద్రాసుందరము. పిపీలికాది బ్రహ్మపర్యంతము బ్రహ్మానంద మందిన శ్రీరామ రాజ్యము.

ఆ దేశములో నున్న బ్రాహ్మణ వంశములలో నొక వంగడ మున్నది - అది వేదవేదాంత పారగము - షట్కర్మ నిరతము. వారి గృహనామము భూరుహమువారు - భూరుహమనగా వృక్షము - వృక్షము పరోపకార పరాయణము. ఆ వంశములోఁ బెద్దలు పరోపకార పరాయణు లగుట వలన వారి వంశమున కా సార్థక నామము వచ్చినది. భూరుహుల వారు కౌండిన్యస గోత్రులు - ఆపస్తంభ సూత్రులు కృష్ణ యజు శ్శాఖీయులు.

శ్రీరామచంద్ర మహారాజు ననంతరము వేల సంవత్సరములు గతించినవి - దేశపరిస్థితులు తాఱుమాఱైనవి. బ్రాహ్మణుల కక్కడ జీవనోపాధి కష్టతరమైనది - అందువలన నచ్చటి విప్రవంశములు తలకొక దిక్కునకుఁ దరలి పోయినవి.

భూరుహవంశము దక్షిణముగాఁ బ్రయాణించి క్రమముగాఁ ద్రిలింగదేశము చేరినది - చివరకు తెనాలి తాలూకా (ఇప్పటి) యందలి అమృతలూరును నివాసయోగ్యముగా భావించి యచ్చట స్థిరనివాస మేర్పఱచుకొన్నది. ఆ గ్రామ దైవమైన అమృతేశ్వర స్వామిని బట్టి ఆయూరున కాపేరేర్పడినది తెలుఁగు సంప్రదాయము ననుసరించి యిచ్చట కోసనీయులు కౌసలనాటి వారైనారు - నాడు అనగా దేశ మని యర్థము - భూరుహులవారు బూరుగుల వారైనారు

అమృతలూరు వలస వచ్చినవారిలో మొదటి విప్రోత్తముడు రఘునాథ నాయకులుగారు - ఆయనను "అయ్యవారప్ప" యని గ్రామ స్థులు గౌరవించెడివారట - ఆనామాంతరమును బట్టి ఆయన ఉపాధ్యా యులుగా నుండెడివారేమో, అయనకు కుమారులైదుగురు.

రఘునాథ నాయకులుగారి కుమారులలో - వేంకటాచల సోమ యాజిగారు జ్యేష్ఠపుత్రులు - ఆయన యజన యాజనాది షట్కర్మ నిరతులు - పరోపకారశీలి - కృషీవలుఁడు.

సోమయాజిగారికి ఒక్కడే కుమారుఁడు - ఆయనపేరు సీతారామ శాస్త్రిగారు - ఆయన కర్మిష్ఠి - కవయిత - చిన్నచిన్న రచనలు చేయు చుండెడివారట - ఆయన 10- ఎకరములు వ్యవసాయము చేయుచుండెడి వారఁట.

సీతారామశాస్త్రిగారికిని ఒక్కడే కుమారుఁడు - ఆయన పేరు వేంకటేశ్వరశాస్త్రి (వెంకయ్య) ఆయనభార్య మహాలక్ష్మమ్మ ఆయన హయాము నాటికి భూమి 15-ఎకరములైనదఁట- ఆ మహీసురమణి వైదిక కర్మ నిరతుఁడై సంస్కృతాంధ్రముల నభ్యసించి విద్యాదానము చేయు చుండెడివారఁట.

వేంకటేశ్వరశాస్త్రిగారికిఁ గుమారులు ముగ్గురు- వారిలో వేంకట రామశాస్త్రిగారు రెండవవారు - ఆయన మేనమామ కుమార్తెనే ధర్మ పత్నిగా స్వీకరించెను - ఆమెపేరు సీతమ్మ.

వేంకటరామశాస్త్రిగారు - ఆజానుబాహువు-ఆయన ఇదం బ్రాహ్మ్యం ఇదం క్షాత్రం - అన్నట్లు - వైదిక కర్మల ద్వారా బ్రాహ్మ్యమును- కృషి - ఆర్త రక్షణముల ద్వారా క్షాత్రమును, బ్రకటించు చుండెడివారు. ఆభూసురోత్తముఁడు సంస్కృతాంధ్రముల నభ్యసించి ధార్మిక చింతన ముతోఁ గాలక్షేపము చేయుచుండెడివాఁడు.

వేంకటరామశాస్త్రిగారి భార్య (సీతమ్మ) ఎక్కువగా చదువు కొనలేదు- ఐనను నామెకు ఆధ్యాత్మిక తత్త్వము వెన్నునంబుట్టినది- ఆ యూరిలోని స్త్రీలకు నామె గురుస్థానీయురాలు- ప్రతినిత్యము వారి గృహము అపరాహ్ణమునందు సీతమ్మగారి తత్త్వబోధనతోను, కోకిలనే చీకాకు పఱచు మధుర కంఠముతో నామె గానముచేయు తత్త్వముల తోను, బ్రతిధ్వనించుచుండెడిదట. కామధేనువునే పెరటిలో కట్టివేసికొన్న ఉత్తమ గృహిణి సీతమ్మగారు. ఇంకవారికి పాడికేమికొదవ? వెంకటరామ శాస్త్రిగారి హయాములోఁ బొలము పెఱిగినది - వ్యవసాయము వృద్ధి పొందినది ఇంక పంటకేమిలోటు.

వేంకటరామశాస్త్రిగారెంత గంభీరులోయంత యుదారులు. పరోపకార మాయనకుఁ బరమాన్నము - అమృతలూరునకు ఎనిమిది కిలోమీటర్ల

దూరములో పొన్నవల్లి యను నగ్రహారమున్నది - ఆ యూరి ప్రజలు త్రాగుటకు నీరు కఱవై బాధలు పడుట గమనించి శ్రీ శాస్త్రిగారు - శ్రమకు భయపడక వ్యయమునకు వెనుకాడక ఆ గ్రామమునకు వాయువ్యముగా ఒక మహాతాటకమును త్రవ్వించి యా గ్రామమునకే కాక ఆ పరిసరములకే మహోపకారము చేసినారు - వారిది భూరుహ వంశముకదా ! ఇప్పటికిని యా తటాకమును బూరుగుల వారి చెఱువను చుందురు.

శ్రీశాస్త్రిగారికి ప్రాక్తన జన్మకృత దుష్కర్మ పరిపాకము చేతనేమో వరుసగా పన్నెండుమంది బిడ్డలు పుట్టి కొంతకాలము పెరిగి మరణించిరఁట ఆయన ఆ పుత్ర నష్టబాధతోఁ గుమిలిపోవుచుండగా నొకనాఁడు వారి యింటికి నొక యోగివచ్చి భక్తిశ్రద్ధలతో వారిచ్చిన యాతిధ్యమును స్వీకరించి వారి జపతపానుష్ఠాన - అతిథి పూజలకు సంతృప్తుఁడై శాస్త్రి గారికి లలితాదేవీ మంత్రము నుపదేశించి భక్తిశ్రద్ధలతో నా మంత్ర మును జపించిన- వంశోద్ధారకుడైన కుమారుడు జన్మించి కులమునకే వన్నె తేఁగలడని చెప్పి వెడలిపోయినాఁడఁట.

లలితోపాసనము ప్రారంభించి సంవత్సరము పూర్తిగాక ముందె ఆ దంపతులకు నొకకుమార్తె జన్మించినదఁట- ఆమెపేరు మహాలక్ష్మమ్మ. మహాలక్ష్మమ్మగారు పొన్నపిల్లివారి యింటికోడలు, భగవద్గీతకు అష్టా ధ్యాయములు ఆమెకుఁ గరబదరములు. అక్షరములు రాని సరస్వతి ఆమె నిరతాన్నప్రదాత్రి- ఆమె గరికమ్మ యను నామముతో పుణ్యాత్మ రాలుగాఁ బ్రసిద్ధి చెందినది.

మఱి మూడు వసంతములు గడిచినవి- తిరిగి సీతమ్మగారికి సీమంతోత్సవము వేడుకగా జఱిగినది- తొమ్మిది మాసములు గడువగా ఆ దంపతులకు నొక శుభ మూహూర్తమున.

పచ్చని పైఁడియుంగియయి పండినయట్లుగ, ధార్మికత్వమే
ముచ్చటకొద్ది శాస్త్రిగృహమున్ వరియించినయట్లు, శాంతమే
మెచ్చి జపించినట్లు - పరమేశ్వరి వేంకటరామశాస్త్రికై
యిచ్చిన మేల్ వరంబన జనించెను బుత్రుఁడు కీర్తిపాత్రుఁడై

లలితాదేవి యనుగ్రహంబు వలనన్ రాణించె నాబిడ్డ, చూ
పులకున్ మోదముఁగూర్చు జాబిలిగ, దాపుల్ జల్లు పూబంతిగాఁ,
లలితామాత పదానురక్తుఁడుగ వైరాగ్యస్వభావుండుగాఁ
దలలో నాల్కఁగ నెల్లవారలకుఁ, బెద్దల్ మెచ్చు సద్వర్తనన్

లలితాదేవి యనుగ్రహము వలన జన్మించిన వాఁడగుటచే, తన కుమారునకు వేంకటరామశాస్త్రిగారు "లలితారామకృష్ణయ్య" అని పేరుపెట్టు కొనిరి- ఆ బిడ్డ గారాలకూచి యగుట చేత నా దంపతులు తమ కుమారుని కన్నయ్య (కృష్ణుఁడు) అను ముద్దుపేరుతోఁ బిలుచుకొన సాగిరి- ఆ బాలుఁడు తరువాత కన్నయ్య యను పేరుతోనే ప్రసిద్ధుఁడయ్యెను.

కన్నయ్యగారికి రెండేళ్ళు వచ్చినవి. ఒకరోజున ఆ బాలుడు చాపపై నిద్రించుచుండగా రెండు బారల నల్లత్రాఁచొకటి ఆ కన్నయ్య గారి చుట్టు తిరుగసాఁగినది. అది చూచి వేంకటరామశాస్త్రిగారు ఆత్రాఁచు తోఁకను బట్టుకొని గిరగిరఁ ద్రిప్పి నేలపై కొట్టినారఁట- ఆ పాము చచ్చినది. కాని శాస్త్రిగారి కన్నులు పోయినవి.

తరువాత ఒక వారమునకు ఒక బైరాగి వచ్చి, నాగేంద్రస్వామికి మ్రొక్కుకొన్నచో శాస్త్రిగారికిఁ జూపు వచ్చునని చెప్పెను. శాస్త్రి దంపతు లట్లు మ్రొక్కుకొనగా శాస్త్రిగారికి చూపు వచ్చినది- అది మొదలుకొని మాఘ మాసములో సుబ్బరాయషష్ఠికి నాగేంద్రారాధన మాగృహములో జరుగసాగినది-

కన్నయ్యగారి హయాములోఁ పొలము ముప్పది యెకరములైనది. ఆక్షేత్రమును వ్యవసాయము ద్వారా కన్నయ్యగారు సుక్షేత్రము చేసి ధాన్యగర్భనుగాఁ బెంపొందించిరి.

కన్నయ్యగారు స్థిత ప్రజ్ఞులు - ఆత్మస్థైర్యము కలవారు- ఒకప్పుడు మూసాబత్తులవారు (ఆభిచారిక మాంత్రికులు) కన్నయ్యగారి యింటికి వచ్చి ఇంద్రజాలము చూపించి ఐదురూపాయలిమ్మన్నారుట - ఆ విప్రోత్తముడు - ఒక రూపాయి యిత్తునన్నారఁట - అప్పుడు రూపాయి యనగా నిప్పు డిరువది రూపాయలు మాంత్రికులు కోపించి

వేపమండలను దూసి ఆ యాకులనే పాములనుగా తేళ్ళనుగా జేసి కన్నయ్యగారిపై ప్రయోగించినారఁట- అది చూచి కన్నయ్యగారు మంతహాసము చేయుచుఁ గన్నుల మూసికొని ధ్యాన నిమగ్నులై నారఁట ఆ కృత్రిమ సర్ప వృశ్చికము లా మహానుభావుని దేహముపై ప్రాఁక సాఁగినవఁట — కాని యా గరుడ గమన భక్తుండేమాత్రము చలింప లేదఁట - ఆ సర్ప వృశ్చికములట్లు కన్నయ్యగారి మేనిపైన నడయాడి యాడి చివరకదృశ్యములై నవట - మాంత్రికులా భూసురవర్యుని యను భావమున కబ్బురపడి పాదములపైఁబడి క్షమార్పణము చెప్పుకొని ఆ దాత యిచ్చిన రూపాయి తీసికొని వెడలి పోయినారఁట.

లలితారామకృష్ణయ్యగారు లలితాదేవతోపాసకులు — అందువలన వారికి చక్కని వాక్శుద్ధి లభించినది - ఆ శక్తితో వారు "వస్తువులను పశువులను, పోగొట్టుకొన్నవారు వచ్చి యా పుడమి దేవతను ప్రశ్న మడిగిన - ఆ వస్తువు- ఆ పశువు ఎక్కడున్నది చెప్పెడివారు. అది యక్కడనే లభ్యమయ్యెడిది.

కన్నయ్యగారికిఁ గవితాశక్తి యంతర్గతముగా నుండెడిది- సందర్భముల ననుసరించి యాయజ్ఞాతకవి యాశువుగాఁ గవిత్వమల్లెడి వారు. ఆ కవిత్వము ఛందోబద్ధము కాదుగాని శ్రవణానందముగా నుండెడిది.

భూరుహ వంశ సంప్రదాయము కన్నయ్యగారిలోనూ నున్నది. ఆ మహనీయుఁడు తమ పితృపాదులు త్రవ్వించిన పొన్నపల్లి యగ్రహారము చెఱువు దిబ్బవేయగా నెంతయో ధనము వ్యయముచేసి ఆ చెఱువును బాగుచేయించి యా గ్రామప్రజలకెంతయో నుపకారము చేసి ప్రాణదానము చేసినారఁట. "నీరే ప్రాణాధారము" అని పెద్దల వాక్యముకదా- చెఱువు పూడిక తీయించు నప్పుడు శ్రీరామచంద్రమూర్తి సీతాలక్ష్మణ సహితుఁడై కన్నయ్యగారికి విగ్రహరూపమున దర్శన మిచ్చినాఁడట.

కన్నయ్యగారు వీతరాగులు - సంపదలకుఁ బ్రాధాన్యమిచ్చెడి వారుకారు. సత్యము- ధర్మము- న్యాయము- అన్నప్రదానము- ఆర్త పోషణము ఆ ధార్మికునకు ఐదుప్రాణములు.

కన్నయ్యగారి పెదతండ్రి యపుత్రకుడు. చట్టము ననుసరించి పెదతండ్రి ముప్పది యెకరముల భూమికి కన్నయ్యగారే వారసులు. కాని ఆ సత్యవాగ్మి తండ్రికిచ్చిన మాటప్రకారమా సుక్షేత్రబండమును గంటక క్షేత్రమునువలెనే సునాయాసముగానే వదలివేసినారఁట- ఎంతటి భావసంపత్తి కన్నయ్యగారిది!

జనకుడు చక్రవర్తియయి స్వాంతము బ్రహ్మమునందుఁ జేర్చి యా
శను విడనాడి యోగియయి సారసపత్ర జలంబురీతి జీ
వనమున సాఁగినట్లు, గృహావంతుడునయ్యు విరాగియౌచు స
జనకులరాజు కన్నయ యశస్వియ శ్రీలలితావరంబునన్.

బంగరుఫాలపట్టమునఁ బచ్చని గంధపురేఖ, దానిపై
నం గల కుంకుమాంకము సనాతనభావము ముద్ర, యచ్ఛపై
డిం గెలుపొందు మేనిజిగి, దీనికిఁ దావుగనుండు, గన్నయా
ఖ్యుం గనినంత నే కరములుంతురు శీర్షములందుఁ జూపఱుల్

ఆనందతీర్థుల వారు వ్రాసిన శ్రీకృష్ణ తరంగములన్న కన్నయ్య గారికి పంచప్రాణములు- అర్థనిమీలతనేత్రులై పొడుము (నశ్యము) పట్టున్న చేతితో తాళము వేయుచు తరంగగానము చేయు కన్నయ్య గారు ముక్తసంగుడైన యోగి వలె భాసించెడివారు.

కన్నయ్యగారు గూడ మేనమామ కుమార్తెనే పరిణయమాడిరి. ఆ సుగృహిణి నామము సీతమాంబ (సీతమ్మ).

సీతమాంబ ఆ పూజ్యగృహస్థునకు సన్నివిధముల దగిన ఇల్లాలు. ఆమె దరిలేని, యాదరమునకు సోదరి. సుగుణభావ వల్లరులకుఁ బూఁదరి సతీ ధర్మములకు మాదిరి.

పేరుకొన్నట్టి బిడ్డల ప్రేమయామె
అతిథి సత్క్రియ నన్నపూర్ణమ్మయామె
కల్లకపటపు లెఱుగని చల్లనమ్మ
ఆమెసీతమ్మ ఓర్పున భూమిదేవి

భర్తకర్ధము, గృహిణియన్ బదమునకును
నర్థమాచును వార్థికన్యకయుఁ బోలె
పుట్టినింటికి మెట్టినయట్టియింటి
కమల కీర్తుల నిచ్చె సీతమ్మసాధ్వి.

సీతమాంబ చదువుకొన్నది కాదు. అయినను భగవంతుని మీదఁ జక్కని పాటలల్లి పాడుకొనుచుండెడిది. అడిగిన వారికిఁ జెప్పుచుండెడిది. "ఎవరైనను ఈ పాటలు బాగున్నవి. ఎవరు వ్రాసినారు" అని అడిగినను తాను రచించినట్లు చెప్పెడిదికాదు- అంతటిది- ఆమె నిరహంకారత.

ఆ పుణ్య దంపతులకుఁ గుమారుల నలుగురు. వారిలోఁ బ్రథమ పుత్రుఁడు సత్యనారాయణశాస్త్రి- భాషాప్రవీణుఁడు- చక్కని కవిత్వము చెప్పఁగలవాడు- ఆంధ్రోపాధ్యాయుఁడు.

ద్వితీయుఁడు సుందరరామశాస్త్రి- భాషాప్రవీణుఁడు- అందముగా కవితల్లఁగలవాఁడు- ఆంధ్రోపాధ్యాయుఁడు- ఆ సోదరద్వయము పద్యములు దోహదము లేక పేటికాంతర్గతములై చివికిపోయినవి.

తృతీయ పుత్రుఁడు- మార్కండేయశాస్త్రి- వేదము క్రమాంత స్వాధ్యాయపరుఁడు- విద్వాన్ పట్టభద్రుఁడు- ఆంధ్రోపాధ్యాయుఁడు.

నాల్గవ కుమారుఁడు- గోపాలకృష్ణమూర్తి- సాహిత్య విద్యా ప్రవీణుఁడు. భాషాప్రవీణుఁడు- ఆంధ్రోపాధ్యాయుఁడు కవిశేఖర- సుకవి సుధాకర- బిరుదాంకితుఁడు. కన్యాకుమారి చంపూకావ్యకర్త- గోపాలకృష్ణమూర్తి కుమారుఁడు చి॥ ఆంజనేయ వరప్రసాద్-



# అభినందన

**Prof : C. NARAYANA REDDY,**
M. A. Ph, D, D. Litt.
Vice-Chancellor
Telugu University

గద్యపద్యోభయం చంపువు. ప్రాచీన కావ్యాల్లో ఈ చంపూ సంప్రదాయాన్ని ఎందరో కవులు పాటించారు. మన ఆంధ్ర భారత భాగవతాలు చంపూ పద్ధతిలో రాసిన గ్రంథాలే.

శ్రీ బూరుగల గోపాలకృష్ణమూర్తిగారు తమ "కన్యాకుమారి యాత్ర"ను గద్యపద్యోభయ సమన్వయ పద్ధతిలో రచించారు. వస్తు పరంగా చూస్తే ఈ గ్రంథంలో ఎన్నెన్నో పుణ్యక్షేత్రాల వర్ణన వివరణ లున్నాయి. ఛందఃపరంగా చూస్తే ఈ గ్రంథంలోనే ప్రౌఢ పద్య రచనా చణత ఎంతో ముచ్చట గొలుపుతుంది. గ్రాంథిక శైలిలో వచన రచన చేసే నేర్పుకూడా ఈ పుస్తకమంతటా కనిపిస్తున్నది.

ఏది చూసినా హృదయంగమంగా ప్రకటించే రచనా సామర్థ్యం ఉన్నందువల్ల ఈ గ్రంథం అత్యంత పఠనీయంగా రూపొందింది. అందుకు గోపాలకృష్ణమూర్తిగారికి నా అభినందన.

(సం.) సి. నారాయణరెడ్డి.

## ప్రత్యేక కృతజ్ఞతలు

నా మొదటి మూడు కృతులకు - ఆకృతులను గల్పించిన వారు- ప్రసిద్ధ నవలా రచయితలు సహృదయులైన డా॥ కొత రవీంద్రబాబు- యం. యస్. గారికి.

ఉదార గుణవంతురాలు- రవీంద్రబాబుగారి యర్ధాంగి నాయీ "కన్యాకుమారి యాత్ర" అను కావ్యము రూపకల్పనము నకు దోహదము చేసినవారు అయిన డా॥ పరిణామలక్ష్మి యం.డి. గారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు. - శ్రేయోభిలాషి

బూరుగల గోపాలకృష్ణమూర్తి.

# ఉపద

'సాహిత్యబ్రహ్మ' డా॥ వి. వి. యల్. నరసింహారావు,
M. A. Ph. D.
రిటైర్డు డైరెక్టర్,
ఆంధ్ర ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం, పరిశోధనాలయం

కవిశేఖర "సుకవి సుధాకర" బిరుదాంచితులైన శ్రీ బూరుగల గోపాలకృష్ణమూర్తిగారి "కన్యాకుమారి యాత్ర" చంపూకావ్యమును చూచినంతనే సంస్కృతమందలి వేంకటాధ్వరి విరచిత 'విశ్వగుణాదర్శ' చంపూకావ్యము మెఱపుతీగవలె మనస్సున కదలినది. విమానయానులై విశ్వమును దర్శింప వెడలిన గంధర్వులు - కృశానువిశ్వావసులు మా కృష్ణమూర్తిగారి కలమున కదలినట్లైనది.

తత్త్వవాసన లతిమాత్రముగ గుబాళించు యాత్రా బృహత్కావ్యము ప్రస్తుత 'కన్యాకుమారి యాత్ర'.

కన్యాకుమారి భారతదేశమునకు దక్షిణపు సరిహద్దు. కవిగారు తెనాలిలో బయలుదేరి శ్రీశైలము, మంత్రాలయము, హంపి, ఉడిపి, బేలూరు, హళిబేడ శ్రావణబెళగుళ, శ్రీరంగపట్టణము, ఊటి, మధుర, విల్లిపుత్తూరు, కుర్తాళము మొదలుగా కన్యాకుమారి వఱకు పోయి తిరిగి రామేశ్వరము, ధనుష్కోటి, తంజావూరు, చిదంబరము, మద్రాసు మీదుగా స్వస్థలము చేరుకొనిరి. దాదాపు ఏబదియాఱు ప్రదేశములను ఎంతో శ్రద్ధాభక్తులతో దర్శించి, ఒక యాత్రాకావ్యమునకు కావలసిన మూలద్రవ్యమును సమకూర్చుకొనిరి.

ఒక క్షేత్రమును బాహ్యనేత్రములతో చూచి వచ్చుట వేఱు; అంతర్నేత్రముతో దర్శించి, మహాకావ్యమున కితివృత్తముగా సిద్ధము చేసికొని వచ్చుట వేఱు.

కావ్యవిషయ మంతయు దక్షిణభారతయాత్రకు మాత్రమే పరిమితము. దక్షిణభారత యాత్ర చేసి గ్రంథము రచించిన వారిలో

ప్రాతూరి వేంకట శివరామశర్మగారు, బులుసు వేంకటరమణయ్యగారు, మాలతీచందూర్‌గారు మొదలైనవారు గలరు. వీరిలో కన్యాకుమారిని ప్రస్తావించినవారు ఒకరిద్దరు మాత్రమే. ఇవి వచన గ్రంథములగుటచే వర్ణనాత్మక కావ్యకోటిలో జేరవు. కేవల వర్ణనాత్మక చంపూకావ్య దృష్టితో రచించిన కృతి 'కన్యాకుమారియాత్ర' మాత్రమె.

గ్రంథరచనా ప్రణాళిక కూడ ఇఁదు విలక్షణమై నిర్దిష్టముగా నున్నది. భౌగోళికముగా స్థలనిర్దేశము చేయుట, స్థలనామమునకు వ్యుత్పత్త్యర్థమును విగ్రహవాక్య సహితముగా, శాస్త్రబద్ధముగా వివరించుట, స్థలపురాణాంశములు పేర్కొని ఐతిహ్యములను మనోహరముగా చెప్పుట, కథన సందర్భములో తాత్త్విక, సాంఘికాంశములను సందేశాత్మకముగనో ఉపదేశాత్మకముగనో సూచించుట- ఇట్లు అర్ధశతాధిక క్షేత్రకథలను పఠితకుత్కంఠ సడలనీయక రమణీయమగు పద్యగద్యములతో ప్రవచించుట ఈ బృహత్కావ్య విశేషము.

'కన్యాకుమారి' సమాసమందలి ఏకార్థ బోధక శబ్దద్వయ విశేషార్థమును శాస్త్ర సంప్రదాయముతో నిరూపించి (పుట 170) క్షేత్రకథను వివరించిన రీతి ఇందుకుదాహార్యము. పరమేశ్వరుడు- తన్ను భక్తి ప్రేమపాశములతో బంధించిన కన్యాకుమారి గళమున మంగళసూత్రము సూర్యోదయాత్పూర్వమే కట్టవలెనను కట్టడి జరుగక పోవుటచే ఆదినురాలు విరక్తయై శిలగామారిన తావే దేవాలయమైనదట. కన్యను ధారవోయుదునని హిమాలయుఁడు కూతుముక్కున కీలించిన ముంగర 'నాగమణి' నామకమైన అమూల్యాభరణము. దానిని చూచి నావికులు దీపగేహము (లైట్‌హౌస్)గా భ్రమించి ఇబ్బందులకు గుఱియయ్యెడి వారట.

"అట్టి ముక్కుర పెట్టంగ గట్టుతేని భాగ్యమెంతటిదో? యోగ్యపగునె లాతి
కట్నమైచ్చిక మొకనాఁడు; కాని, నేఁడు ప్రాణసంకటమయ్యె దౌర్భాగ్యగరిమ" (పు. 172)

కవి ఇట్టి సామాజికాంశములను పౌరాణికాంశములతో మేళవించి చెప్పెడు రీతి ఉభయతారకమై పరమ ప్రయోజనము సాధింపుచున్నది.

కన్యాకుమారిపర్యంతము సాగిన యాత్రా విశేషములు గల కావ్యము కనుక కావ్యనామమైన 'కన్యాకుమారియాత్ర' సార్థకము.

వాస్తవమునకు యాత్రాగ్రంథములు దినచర్యాగ్రంథముల (డైరీలు) కంటె గొప్పవి కావు- వినోదార్థమై విహారయాత్ర చేయు రిత్తమానిసి కనీసము డైరీకూడ వ్రాయడు. విశ్వేశ్వరుని ఆలయ ప్రాంతముననే విశ్రాంతి గృహములో విషయవాంఛలు తీర్చుకొని ఇల్లు చేరుచుండును. కాని పుట్టు కృతార్థతం బొరయ తీర్థక్షేత్ర సందర్శనము నకై యాత్రికుడై వెడలిన సత్కవి అట్లు గాదు కదా! అతడు ద్రష్ట: స్రష్ట; మహామనీషి; క్రాంతదర్శి; మహాకవి. విశ్వశ్రేయఃకాంక్షతో తన యాత్రను కవితాయాత్రగా మలచుకొనును. కృష్ణమూర్తి కవి సరిగా అదే పని చేసెను. తన కవితాయాత్రను అన్యవాంఛ లెక్కడ భంజిం చునో యని చెప్పవాల్చినను చెప్ప వాల్చనట్లే ప్రయాణించెను. దొంగల భయమున్న స్టేషనులో ఆదమరచి నిద్ర పోరాదుగదా! రామేశ్వరస్వామి దేవాలయమునకు మంటపము వంటిదైన మండపము రైలుస్టేషనులో కవిగారి నిద్ర అట్లే సాగినది.

"అచ్ఛభల్లము చెట్టుపై ఆదమఱచి నిద్రపోవుచు నొకకంట నెల్లదిశల
చూచుచున్నట్లె యొకకంట- వేచియొకట లాతి గున్కుటె మా
శివరాత్రినాఁడు" —(పుట 210)

ఈ పద్యభావమునకు 'బహిరంతరులయెడ జాగరూకత'గల కృష్ణదేవ రాయల ఆముక్తమాల్యద మూలమని తజ్జ్ఞులిట్లె గ్రహింపగలరు. విశే షాంశ మొకటి గలదు- అవకాశాభావముచే ప్రాప్తించినదైనను-నిర్నిద్రత్వ నిరాహారత్వములు శివరాత్రి దీక్షాంగములగుటచే - కవిగారి కారాత్రి శివరాత్రియై ఫలము దక్కెనట. చమత్కారచారుపులు, భక్తిభాసురములు నైన నిట్టి సందర్భములు కవితాఫలమైన లోకోత్తర చమత్కారమునకు దారితీయుచున్నవి.

ప్రయాణ సాధనములైన బస్సును, రైలుబండిని లక్షణార్థద్యోతక చమత్కార పర్యాయపదములతో కవిగారు పేర్కొనిరి. ముందు రెండు

చక్రములు, వెనుక నాలుగు చక్రములు గల బస్సును 'షట్పద' మనియు అనేక చక్రములు గల రైలుబండిని 'సహస్రపాద' మనియు పేర్కొనుట విశేషమే కదా! కవి మనస్సే 'సహస్రాక్షము, సహస్ర పాదము' అయినపుడు జగన్మోహన కవితా 'మంత్రపుష్ప' పరిమళములు పరివ్యాప్తమగుటలో నాశ్చర్య మేముండును?

హంపి, విజయనగరము, బేలూరు, హాలీబేడ్. తంజావూరు మొదలైన తావుల నభివర్ణించునపుడు, విద్యారణ్యాది మహర్షులయు, కృష్ణరాయ రఘునాథాది రాజన్యులయు, జక్కనాది మహాశిల్పులయు చరిత్రలను కవిగారు అమృతలేఖినితో చిత్రించి పఠితృలోకమునకు పరమ పారవశ్యము గలిగించుచున్నారు. హైందవసంస్కృతి యందలి మహోన్నతత్త్వ మహౌన్నత్యములను కన్నుల గట్టించినారు. ఈ కారణముచేగూడ ఈ 'కన్యాకుమారి యాత్రా'కావ్యము దక్షిణభారత సంస్కృతికేకాక విశ్వ హిందూ సంస్కృతికే దర్పణమై వివేకానంద వాణీమాధుర్యము నాత్మ తర్పణముగా నందించుచున్నది.

తత్త్వదర్శనము లేని కవిత - శబ్దసౌభాగ్యముచే చెవికింపుగానున్నను- ఆత్మకు రుచింపదు. కృష్ణమూర్తికవి సర్వక్షేత్రములకు తత్త్వ దర్శనాభిలాషతోనే పయనించెను. "దిగంబరుడును అంబరకేశుడునైన చిదంబరేశ్వరుని తత్త్వదర్శనాభిలాషతో"నే కవి సమీపించెను.

"చిత్+అంబర' మివ-చిదంబరమ్" అని చిదంబర సమాసమునకు విగ్రహవాక్యము ఆకాశమువంటి పరమాత్మయని పరిణతార్థము.(పు.280)

చిదంబర రహస్యార్థము వివరించుచు కవిగారు సుజ్ఞాని సుగమ్యమైన పరమేశ్వర నిస్సంగ నిర్గుణ నిరాకార తత్త్వముగా దానిని నిరూపించిన తీరు మంతవ్యము; గంతవ్యము శివాలయమున విష్ణుదర్శనము విష్ణ్వాలయమున శివదర్శనము చేయింపగల అద్వైత శిల్పమును కవి దర్శించెను. నటరాజు నానందతాండవము నడుమ వైకుంఠవాసుల శ్వేత ద్వీపవైభవము తిలకింపగలుగుట అద్వైత శిల్పముగాక మఱేమగును.

చిదంబరాలయ పంచమ ప్రాకారములో విశ్రాంతి తీసికొనుచున్న బసవయ్య జాతికి పితామహుడైన భారతనంది. అట్టి నంది పునస్కారము

ప్రభుత్వ ప్రసక్తి లేకయే బూరుగల కవిత ల్లజుడు పొందగలిగెను. ఇచ్చట కవిగారు ముత్తెమువంటి 'ఒక్కమాట' పలికిరి. "దాక్షిణాత్య శిల్పములో నందీశ్వరసృష్టి ప్రముఖస్థాన మాక్రమించినది" వందల కొలది నందులున్నను దేని సౌందర్యము దానిదే. వైకవిధనంది శిల్పము లోగల భావ వైవిధ్యము గుర్తించుట మానవ రూపభేదము గుర్తించి నంత తేలికకాదు. కాని కవిబ్రహ్మ కది కష్టముకాదు. శిల్పి బ్రహ్మ తత్త్వము కవిబ్రహ్మకు సుగ్రహము. అచ్చటచ్చట కవిగారు చేసిన వర్ణనలలో ద్విరుక్తి ద్యోతకమగుటకు భావవైవిధ్యమే కారణము. (పుట. 285) ఈమాట కవిగారే చెప్పిరి. విశ్వగుణాదర్శములో వేంకటా ధ్వరి పేర్కొన్న కేవల పురోభాగిత్వ (దోషైక దృష్టి) లక్షణముకంటె గుణగ్రహణ పారీణత గొప్పది. మద్రాసులోని మోర్ మార్కెట్టులో విక్రేతల మోసము కవి పురోభాగియై గుర్తించినను ఒకనాటి తెనుగు పత్తనమైన ఆ చెన్నపట్టణము సౌందర్యమునకు ఆయన ముగ్ధుడుకాక మానలేదు.

తీర్థక్షేత్ర సందర్శనము మనశ్శాంతికి మంచిమార్గము. బహు నాయకయై భిన్న కథలతో గూడిన యాత్రాకావ్యమునందు అంగిరసము చిత్తప్రశమన రూపమైన శాంతము. వివిధములైన అంగరసములను ప్రబంధించు రససూత్రము శాంతము. తృష్ణాక్షయ సుఖపరిపోషకమై మోక్షకారకమగునది శాంతము. 'కన్యాకుమారియాత్ర'లో కవిగారు పుష్కలముగా దీనినే పోషించిరి.

ప్రాచీనార్వాచీ నాంధ్రకృతులలో నిర్వచనోత్తర రామాయణము కంటె కృతులొండు రెండు తక్క తక్కిన వన్నియు పద్య గద్యాత్మక చంపూకావ్యములే. శ్రీనాథుని కాశీఖండ, భీమఖండ, శివరాత్రి మాహాత్మ్య ములవలె కృష్ణమూర్తిగారి కన్యాకుమారియాత్ర సర్వరసజ్ఞ పరితోష దాయిని కాగలదు.

ప్రాచీన భారతమును దర్శించిన విదేశ యాత్రికులు మెగస్తనీసు, ఫాహియాన్, మార్కొపోలో, దేశీయద్రష్టలైన శ్రీరాహుల్ సాంకృత్యాయన్, ఏనుగుల వీరాస్వామయ్యగారు, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు మొ॥వారి రచనలకంటె భిన్నమై బూరుగులవారి ఈ బృహత్కావ్యము ప్రాజ్ఞులకు పరమానంద సంధాయిని కాఁగలదు.

ఇట్టి మహాకావ్యమునకు ముందుమాట వ్రాయుట కవకాశమిచ్చిన అస్మత్ బాల్యగురువులు శ్రీ గోపాలకృష్ణమూర్తిగారి శిష్యవాత్సల్యమునకు కృతజ్ఞతా పూర్వక నమస్సులు.

హైదరబాద్
18-6-1992

— వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు.



# ఆశీరభినందన

కళాప్రపూర్ణ, మహాకవి
**మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు**

శ్రీ బూరుగల గోపాలకృష్ణమూర్తిగారు విశ్వనాథ, దివాకర్లవంటి ప్రముఖుల ఆశీస్సులు పొందిన కవిశేఖరులు. వారి ఆశీః ఫలితముగా వెలువడిన వీరి రచనలు హనుమప్పనాయుడు (ఖండకావ్యము) రాచపులి (ప్రబంధము) ఇవికాక వీరి కలమునుండి అనేక గద్యకృతులునూ వెలువడినవి.

ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసి విశ్రాంతిని దీసికొనుచు చేసిన తీర్థయాత్రాఫలము ఈ చంపూకావ్యము 'కన్యాకుమారియాత్ర' దక్షిణ భారతమున గల అనేక క్షేత్రములు ఇందు వర్ణింపబడినవి. ఇది ఆయా క్షేత్రదర్శకులకు ఎంతేని ఉపకరించు గ్రంథము. వీరిపద్యమునకు వచనము తోడగుటచే సామాన్య పాఠకుని సహితము ఈ కావ్యము ఎంతో ఆకర్షించును. వీరికి నా ఆశీరభినందనలు. సులభ సుందరమైన వీరి శైలికి ఒక పద్యము.

నామది నీవయుండి గిరినాయక ! కన్యాకుమారి కావ్యమున్
సామి ! రచింపఁజేసితివి. సత్యమె. యీ కృతిమీది, దీని పె
ట్లోముదువో ! చిరాయువుగ నుంతువొ ! భారము మీదె, మీ దయా
ధామము నిత్యనూతన కథా మధురధ్వని జీవనంబగున్

రాజమహేంద్రవరం

(సం.) మ. సత్యనారాయణశాస్త్రి

# కవి హృదయం

ప్రసిద్ధ నవలా రచయిత. వైద్యనిపుణులు
డా॥ కొత్త రవీంద్రబాబు, యం. యస్., గారు

వార్ధక్యం, రుగ్మత, బడలిక, తొట్రుపాటు బలహీనత కవి శరీరాన్ని బాధిస్తాయేమోగాని కవి హృదయాన్ని తాకలేవు. రసానుభూతి అనే అమృతధార కవి హృదయాన్ని నిత్యనూతనోల్లాసంతో నింపుతుంది. ఒక కంటినుండి పాండితీగరిమ, ఒక కంటినుండి కవితాధార స్రవించే శ్రీ బూరుగులవారి లేఖిని 24 రోజుల దక్షిణయాత్రలో వారనుభవించిన వివిధానుభూతులను భావికాలానికి నిక్షిప్తం చేసి యిచ్చినదే "కన్యాకుమారి యాత్ర" అనే చంపూకావ్యం.

రెండు దశాబ్దాల క్రితం వైద్యంకోసం నావద్దకు వచ్చిన శ్రీ బూరుగలవారు అచిరకాలంలోనే ఆత్మీయులైనారు. నాకే కాకుండా మా కుటుంబ సభ్యులందరకూ మాస్టరుగారైనారు. ఆయన ప్రేమాభిమానాన్ని ఆయన కుటుంబ సభ్యులతో సమంగా మాకు పంచియిచ్చారు.

నారివద్ద నేను కేవలం ఉబుసుపోకకు మొదలుపెట్టిన కావ్యపఠనం ఒక దశాబ్దంపాటు నిరంతరాయంగా సాగింది. ఆ దశాబ్దంలో నా మనసులో కల్గిన కొత్తఆలోచనలు, అనుభూతులు వూపిరి ఆడనివ్వకుండా చేసాయి. మనసు నిండి పొర్లుతున్న భావనలను నా కలం వ్యక్తీకరించ సాగింది.

మాష్టరుగారి కవి హృదయం కొంత నా కలంలో ప్రవేశించిందేమో అన్న అనుభూతి కల్గేది.

రచయితగా నాకు వస్తున్న గుర్తింపుకు ఆయన ఎంతో సంతోషించేవారు. వారి ఆశీస్సులు నాకు కొత్తబలాన్నిస్తుండేవి.

మాష్టారు అనేక కావ్యాలు రాసారు. కొన్ని నా కంకితం యిచ్చారు. అలా వారికి బంధువునూ అయ్యాను. ఆయన దగ్గర చదువుకుని తర్వాత అనేక పెద్దపదవులను పొందిన శిష్యగణం వున్నారాయనకు. వాళ్ళంతా ఆయనను ఎంతో ఆదరంగా, గౌరవంగా చూచుకోటానికి కారణం వారి

సౌశీల్యమే: నిగర్వి - అతిశయం లేనివారు అయినందువలన ఆయన వారిని తన శిష్యులని చెప్పుకోటానికి వెనుకాడినా ఆయన శిష్యులు మాత్రం ఎంత ఉన్నత స్థితిలోవున్నా ఆయనను మరచిపోక "మేం బూరుగులవారి శిష్యులం" అని చెప్పుకుంటున్నారు.

దాదాపు అరవై క్షేత్రాలను ఇరవైనాలుగు రోజులలో చూడడమే కష్టం. మాస్టరుగారు శ్రీశైలంలో మొదలుపెట్టి వెల్లూరుతో ముగించిన యాత్రలో దాదాపుగా దక్షిణభారత దేశాన్నంతా తడిమిచూచారు. అరవై సంవత్సరాలు దాటిన వయసులో కొంత శారీరకమైన యనారోగ్యంతో బాధపడుచున్న స్థితిలో కవితావేశం, రసనిర్దేశం, ఆయన కలాన్ని పరుగెత్తింపజేసాయి.

షట్చక్రవాహనం (బస్సు) లో మిగిలిన ప్రయాణీకులతోపాటు ఆయన ప్రయాణం చేసి అందరితోపాటు విశ్రాంతి తీసుకున్నా ఆయన మనసు ప్రతిక్షణం కవితాధారలో మునిగితేలుతూ అవిశ్రాంతంగా శ్రమించింది.

చిన్ననాటినుండి పెద్దలవద్ద నేర్చుకొనియున్న చదువు స్వయంకృషితో పెరిగిన పాండిత్యం, కవిహృదయం యీ చంపూకావ్యంలో ఆద్యంతం దర్శనమిస్తాయి.

యాత్రావిశేషాలున్న పుస్తకాలు అరుదైనా కొన్ని అన్ని భాషల లోను వున్నాయి - తెలుగులోను వున్నాయి. అయితే అందులో ఎక్కువ భాగం యాత్రలు ఎలా చేయాలి అన్న దృక్పథంతో రాసినవే!

మన ప్రాచీనకవులలో కొంతమంది యాత్రల సందర్భంగా చెప్పిన చాటుపద్యాలు వారి కావ్యాలకంటే ఎక్కువ ప్రసిద్ధి పొంది ప్రజలనోళ్ళలో మెదులుతున్నాయి - యిప్పటికీ.

ఈ చంపూకావ్యం ఇరవైయో శతాబ్దాంతంలో వెలువడిన చాటు పద్యమాలిక అనాలి.

మాష్టారికి, ఆయన కవిత్వానికి తగినంత గుర్తింపు రాలేదని చాలా రోజులనుండి బాధపడుతుండేవాడిని. ఈ మధ్య ఆయనకు ఓపిక తగ్గు తున్న దశలో కొంత గుర్తింపు లభించడం గమనించి సంతోషపడ్డాను.

చంపూకావ్యం ముద్రితమై జనబాహుళ్యంలోకి వెళ్ళాక మాస్టారికి మరింత గుర్తింపు వస్తుందని భావిస్తున్నాను.

ప్రాచీన సంస్కృతాంధ్ర కావ్యాలను ఔపాసనపట్టి ప్రఖ్యాతకవుల హృదయాలను అర్థం చేసుకొని, జీవితానుభవంతో పండించి జాతీయతా భావం పెల్లివిరిసిన యీ కావ్యం గురించి ఉత్ప్రేక్షాలంకారలతో పొగడ వలసిన పని నాకు లేదు. కావ్యం చదివినవారెవరైనాగూడా ఆ పని చేస్తారు.

తన రచనలు వెలులోకి వస్తున్నప్పుడు రచయితకు కలిగే ఆనందం కొత్త జవాన్నీ జీవాన్నీ యిస్తుంది.

కన్యాకుమారియాత్ర వెలుగులోకి వచ్చి మాస్టారికి నూతనోత్సాహాన్నిస్తుందని ఆసిస్తూ-

(సం.) రవీంద్రబాబు



# Prof ; P. S. Sastri

M A., M, Litt. Ph. D. D. Litt.,
Retd Prof. & Head; Dept. of English
University of Nagapur.

శ్రీ బూరుగల గోపాలకృష్ణమూర్తిగారి "కన్యాకుమారియాత్ర' అనే చంపూకావ్యము రసవత్తర ఘట్టాలతో అనేక చారిత్ర్యక విషయాలను స్ఫురణకు తెచ్చుచున్నది. ఆంగ్ల సాహిత్యంలోని ట్రావెలోన్స్ వంటిదిగాక కవితా మాధుర్య సమ్మిశ్రితమైన దీకావ్యము. దక్షిణ భారతమున గల వివిధ పుణ్యక్షేత్రములను దర్శించి, అర్చించి భక్తిపారవశ్యమున చెప్పిన ఈ కావ్యమున శృంగార, కరుణ, వీర, రౌద్రరసములు భక్తిరసమున కానుషంగికములైనవి.

గద్యపద్య మిశ్రితమైన ఈ చంపూకావ్యమున ఇతివృత్తము భారతీయ సంస్కృతి. ఈ సంస్కృతిని మాటిమాటికి గుర్తుచేయుచున్న ఘట్టములలో శ్రీశైలము, విజయనగరము, ధర్మస్థలము, పళని, మధుర, కన్యాకుమారి, తిరుపతి, జంబుకేశ్వరము, చిదంబరము, శ్రీకాళహస్తి మొదలైనవి హృదయమునకు హత్తుకుపోగలవు.

భారతీయ సంస్కృతి దేశైక్యతను కాపాడినదని కవనముచేయుచు 'ఆంధ్రత్వమాంధ్రభాషాచ' అని మహామనిషి అప్పయ్యదీక్షితులవారని నట్లు ఆంధ్రభాషా ప్రాశస్త్యమును సుగ్గడించినారు.

ప్రాచీన ఛందోబద్ధ బాషలో బహుశః తెలుగులో మొదటిది చంపూకావ్యమనవచ్చును. ఈ సాహిత్య మార్గమును అవలంబించిన కవిశేఖర గోపాలకృష్ణమూర్తిగారిని ఆంధ్రసాహిత్యము మరువలేదు. ఈ కావ్యమును చదువుచున్న కొలది ప్రాచీన సాహిత్యప్రక్రియలను విడనాడుట మన సాహిత్యము నవమార్గమునకు త్రోలుటయే, అనుభావము దృఢీకృత మగుచున్నది.

శ్రీ గోపాలకృష్ణమూర్తిగారి ఈ చంపూకావ్యమును సాహిత్య పిపాసువులు, చారిత్రక పరిశోధకులు, భారతీయ సంస్కృతిని తెలసికొనగోరువారు తప్పక పఠించవలెను. ఇదియే ఈ కావ్యమును ప్రేరేపించినను 'సద్యఃపరనిర్వృతయే' అన్న ప్రయోజనము అనుస్యూతముగా అనుభూయమాన మగుచున్నది. **(సం.) పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి.**

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 17 | బాతించున్ | బాలించున్ |
| 7 | 12 | మైపులకింప | మైవులకింప |
| 13 | 21 | కళ్ళకు | కళ్లకు |
| 14 | 11 | నాబస్సుతోచె | బస్సుతోచెనా |
| 14 | 17 | మనసుసరసు | మనసుమడుగు |
| 16 | 4 | వాగితో | వారితో |
| 17 | 12 | నిరంతవము | నిరంతరము |
| 26 | 2 | కుధారను | కుతారను |
| 30 | 3 | నిండి | ఖిడి |
| 46 | 23 | తెలుఁగిందర | తెలుఁగిందిర |
| 55 | 4 | భిమవిజయు | మభివిజయు |
| 55 | 8 | మానన | మానస |
| 56 | 22 | కేయల్పతన్ | కియల్పతన్ |
| 58 | 20 | సుఖా | సఖా |
| 69 | 13 | తీ | ఆ |
| 69 | 6 | చరిత్ర | చరిత |
| 79 | 22 | వినుత | విమత |
| 62 | 14 | భావ | శిష |
| 85 | 10 | కమలి | కుమిలి |
| 92 | 25 | వనతన్ | శ్రీవనతన్ |
| 93 | 4 | బాయుదాక | బాయుదాక |
| 100 | 7 | దోషోచ్ఛల | దోషోచ్ఛల |
| 101 | 11 | భిందెమిదే | బిందెమిదే |
| 102 | 14 | వంచియున్ | వంచినన్ |
| 111 | 12 | చంద్రగురి | చంద్రసరి |
| 134 | 24 | వసులా | మసులా |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 148 | 11 | అప్రాణి | అప్రాణి |
| 165 | 7 | ప్రర్యోతించు | ప్రద్యోతించు |
| 170 | 10 | ఆసలప్తెపి | ఆసలపైన |
| 182 | 1టీ | జారి | జాతిరి |
| 196 | 21 | సంభము | స్తంభము |
| 206 | 17 | దిలియు | దివియు |
| 210 | 19 | నిద్రత్వ | నిర్ద్రిద్రత్వ |
| 213 | 14 | గణుతికెక్క | తిణుతికక్కె |
| 219 | 10 | యతమైనది | మతమైనది |
| 222 | 12 | జ్యోసులు | జోస్యులు |
| 228 | 6 | దీక్షమున్ | దీక్షయున్ |
| 232 | 3 | కరణియొంచి | కరణిసెంచి |
| 235 | 9 | మన్వాయము | మన్యాయము |
| 260 | చివర | వాసనన్ | వాసనల్ |
| 263 | 4 | సుహోక్ష | మహోక్ష |
| 264 | 19 | సెంపున్ | పెంపున్ |
| 265 | 4 | ఏనుఁగుల | ఏనుఁగున |
| 269 | 12 | చతుర్భుకారము | చేతుర్భుజాకారము |
| 269 | 24 | బట్టవి | బట్టని |
| 273 | 17 | శీసానుజ | సానుజ |
| 285 | 2 | భరిలప | భరింప |
| 286 | 3 | కంచికా | కంచిగా |
| 294 | 12 | తప్పటడ్డు | తప్పటడ్డుల |
| 295 | 19 | ప్రబోధయన్ | ప్రబోధమన్ |
| 313 | 2 | సత్యదీప్తి | సత్వదీప్తి |
| 324 | 18 | నరిలేని | సరిలేని |
| 327 | 23 | నినదంబు | నినదంబుల |
| 330 | 11 | దచ్చి | తవిలి |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 332 | 19 | ద్వీ మును | ద్వీపమును |
| 336 | 7 | లయంబునుం | లయంబునుఁ |
| 336 | 8 | కార్యము | నేరిమి |
| 339 | 7 | స్వీయ | స్వీయ |
| 340 | 4 | పద్ధతున్ | పద్ధతుల్ |
| 349 | 4 | దాఁటును | దాఁటుచు |
| ,, | 12 | తత్తము | తత్త్వము |
| 351 | 4 | జిమ్ముద్ర | జిన్ముద్ర |
| ,, | 5 | పడిలవి | పడినవి |
| 358 | 2 | పెదత్రోవ | పెడత్రోవ |
| 362 | 18 | బ్రోయుదురు | త్రోయుదురు |
| 364 | 3 | తీర్థయొక | తీర్థమొక |
| 365 | 1 | పోఁకక | సోఁకక |
| 385 | 3 | గితరుదు | గితరుఁడు |
| ,, | 4 | గ్రపించెడు | గ్రసించెడు |
| 386 | 23 | శైపై | శైవపై |
| 388 | 17 | మంగయ | మంగమ |
| 392 | 18 | చాగలిపడి | చాగిలివడి |
| 395 | 3 | మునేన్నక | సుంగనక |
| ,, | 11 | కీర్టువు | కీర్షువు |
| 406 | 12 | వాదరించు | నాదరించు |
| 407 | 24 | మున్నింపు | మన్నింపు |
| 408 | 14 | సార్వతి | పార్వతి |
| 409 | 1 | కారువి | కారుని |
| 412 | 20 | దగ్గక్ష | దగ్గఱ |
| ,, | 21 | యౌన | యౌవన |
| 428 | 6 | కన్యకుమరి | కన్యాకుమారి |



# శారదామాతా!

నీదు పదాంబుజంబులను నెమ్మనమందున నిల్పి తల్లి! నీ
యాదరమంది వ్రాసితి నిహార్యముగావ్యకుమారి గావ్యమున
మీదట నిట్టి గావ్యముల మీయకృపానిధి! వ్రాయఁజేయ నీ
పాదములంటి జేయుదును ప్రార్థన పారసగేహ దేవతా!

---

## ఇతరకృతులు

### పద్యగ్రంథములు

1. శ్రీ వేంకటేశ్వరస్వామి శతకము
2. మారుతి తారావళి
3. హనుమప్పనాయుఁడు (ఖండకావ్యము)
4. రాచపులి (ప్రబంధము)
5. కృష్ణకవివాణి (నీతిసూక్తిపంచశతి)
6. సమస్యలు - పూరణములు

వీనిలో మొదటి నాలుగు ముద్రితములు

### గద్యగ్రంథములు

1. స్వార్థత్యాగి - నవల
2. రాజవాహనుఁడు - నవల
3. మధుబిందువులు - కథలు
4. వీరద్వయము - కథలు
5. నేతాజీ విజయము (నాటకము)
6. మహాపురుషులు - కథలు

వీనిలో మొదటి నాలుగు ముద్రితములు)

ఓం

# అభ్యర్థన

ఉ. శ్రీ హృదయాంబుజంబున వసించిన షట్పదరాజు, భక్త చిం
తా హరణైక పండితుడు, ధర్మము వర్మము, శర్మదాత, ని
ర్మోహజనాంతరంగికుఁడు. రుద్రసురార్చిత భద్రమూర్తి, నా
యీహ లకున్, బరీమళములిచ్చుత, వేంకటనాధుఁ డర్మిలిన్.

చం. తిరుపతికొండపై వెలసి, తీర్చుచుభక్తుల కోర్కెలెల్ల సా
దరముగఁ గొంగుబంగరయి, తాఁగలికాలపు దైవతంబునై ।
పరఁగిన, వేంకటాద్రివిభు పాదసుకంజము లాత్మనిల్పి, న
న్నరయఁగ వేఁడికొందు, హృదయంబున నిండిన భక్తిపేర్మితో.

తే. సంగియయ్యును సతతమసంగియగుచు
నిర్గుణుండయ్యు సగుణుఁడై వెలవుకొనుచు
లేకయుండియు నుండియు లేకతోఁచు
చిన్మయానందమునికి మచ్చిత్తమిత్తు.

ఉ. గానము వీణపైసలిపి, కమ్మనిరాగమధుస్రవంతిలో
లీనముచేసిలోకము నిలింపులపెద్దకు నర్థమైన వి
ద్యానపసుందరీ ననుసదా కరుణింపుమ నీదయాసుధా
ధీనముచేసి నా కవిత. దేవి! సరస్వతి! నీకుమారుడన్

ఉ. తుండముతోడ విఘ్నతతిఁదుండము తుండముఁజేసి నాకు నీ
వండగనుండి కార్యములయందున సత్ఫలమిమ్ము దేవరా
అండజమండనాంగజ! దయారసవారిధి విఘ్ననాయకా
పండగఁ జేయుమారచనఁ బాహి గణేశ్వర పాదమంటుదున్.

చం. కరఁగిన డెందమందు రఘుకాంతునినిల్పుచు భక్తభక్తిచేఁ
గరఁగుదునీవు దాటి యల కంధిని సంసృతికంధి దాసులన్
తరివయి దాటఁజేసెదు ఘనాత్మ! మహాత్మమహాత్మ! మారుతీ!
కరములుమోడ్చి మ్రొక్కెదును గావుము మమ్ముల నాకవిత్వమున్.





# కన్యాకుమారి యాత్ర

## చంపూకావ్యము

అదియొక శుభదినము - మా జీవితములో ఒక పర్వదినము ఇహపరలోక పురుషార్థముల సాధనకు దోహదమిచ్చిన పుణ్యదినము పంచేంద్రియములకు సంతర్పణ మొనర్చు దివ్యసన్నివేశముల అనుభూతికి మార్గదర్శకమైన వేగుచుక్క - మఱపురాని ఆ మహాదినము కానిచో షష్టిపూర్తి యగువఱకు గాలించినను పరిశీలించినను గనుపించని తీర్థయాత్రాభిలాష నాలో కలిగి రూపుదాల్చుట తత్ఫలితముగ నేను మా శ్రీమతి ఆనాడు దక్షిణదేశయాత్రార్థమై బయలుదేరుట యెట్లుసంభవించును ?

తీర్థయాత్రలు మొదలగు కర్మకాండమంతయు చిత్తశుద్ధికి పునాదికావలెను. మానవుడు ఆ చిత్తశుద్ధిద్వారమున జ్ఞాననిష్ఠుఁడై మోక్ష మందవలయును - అని గీతాచార్యుని సందేశము కాని ఈనాడు తీర్థయాత్ర చేయువారిలో అధికభాగము ఆ చిత్తశుద్ధిని పొందకలుగు చున్నారా ?

ఉ. చేయుదురెందఱో జనులు జీవితమందునఁ దీర్థయాత్రలన్
బాయని కర్మపాశముల బంధము లయ్యలి త్రెంపునంచు కా
నీ యొకడైన యాత్రల ననేకముచేసి త్యజింపఁ గల్గెనే ?
ఆ యరిషట్కమం దొకటినైనను నొక్క శతాంశమేనియున్

ఉ. ఐనను లోపమెందులకు యత్నములం దని వీలుకల్గినన్
మానవుఁ డేగుచుండును శ్రమన్ గణియింపక తీర్థయాత్రకై

పోని, లవమ్మునైనఁ దనపూనికలో ఫల మందఁగల్గినన్
వానిది జన్మధన్యమగు, వ్యర్థమె అంతయులేని యాత్రయున్

వ. కనుక చిత్తశుద్ధికిఁ గారణముకాలేని తీర్థయాత్ర ఆధ్యాత్మిక ముగా నిరుపయోగము.

తె. పొగరుగిత్తకు ముకుఁద్రాడు పోసికాని
యదుపులో నుంచలేమె యా యదుపుఁదప్పు
గిత్తఁబూన్చిన బండి సాగింపఁగలదె?
ఒడుదుడుకులేనియానముఁ బడమియందు

తె. యోగసాధన మందిన యోగ్యపథము
నందుఁ బయనించుఁ జిత్త మహార్నిశంబు
యోగకర్మము సులభమై యుండదు గద
చలమనస్కులకేల యాత్రలు నిజమ్ము

ఈ యుద్దేశముతోనే నేను యాత్రలయందు ఆసక్తిఁ జూపలేక పోయితిని. అయితే నేను తీర్థయాత్రలకు విముఖుడనుకాను కానీ "తీర్థయాత్రలు చేయనంతమాత్రముచేత జన్మము చరితార్థముకాదు" అను భావమునకు మాత్రము వ్యతిరేకిని- జన్మ చరితార్థతకుఁ, గారణము లనేకములున్నవి కదా !

చూచుచుండగానే నాజీవితములోఁ బ్రకృతి యఱువది మాఱులు పులకించినది. ముకుళించినది. నేనంతవఱకు ప్రకృతి పులకింతలోని యందచందములనే గమనించితినిగాని ముకుళింత లోని భయంకరత్వమును బరిశీలింపనైతిని, నాకు షష్టిపూర్తి యగు నప్పటికి ఆముకుళింతలోని యథార్థభయంకరత్వము గోచరించినది. వయస్సు మళ్ళినది మనస్సు పెత్తనములు చేయుటమాని సొంతయింటిలోనే విశ్రాంతితీసికొనుచున్నది, ఆసోహాలు పోయినవి. ఊహాలు మాఱినవి దీనికి దోడుగ

రామేశ్వరయాత్ర మాకు ముఖ్యము కాశీమాట తరువాత ఆలోచింపవచ్చును ముందు రామేశ్వరయాత్ర చేయించండి" అను మాత్రీమతి యభ్యర్థనము నాలో మార్పు తెచ్చినది, చిత్తశుద్ధి యున్నపుడే యాత్రలు చేయవలయును అనుభావములో మార్పువచ్చినది, యాత్రలవలనఁ గూడ చిత్తశుద్ధి కలుగఁగలదేమో అనునూహ నాలోఁ దావుచేసుకొన్నది. అపుడు నేనిట్లనుకొన్నాను.

ఉ. తీర్థములందు క్షేత్రముల దివ్యవచస్కుల శక్తిచేత భ
క్త్యర్థము సుప్రతిష్ఠితములై విలసిల్లెడు విగ్రహాలలో
నర్థముకాని దివ్యమహిమాంశము తప్పకయుండునంచు శా
స్త్రార్థవిదుల్ వచించిరిగదా ఆటకేగుట కాన, మంచిదే

మఱియు- "అశ్మాపియాతిదేవత్వం మహద్భిః సుప్రతిష్ఠితః" (మహాత్ములచేత ప్రతిష్ఠింపఁబడిన రాయికూడ దేవతాభావమును జొందుచున్నది)

శ్లో. ప్రభావా దద్భుతాత్ భూమేః సలిలస్య చ తేజసామ్
పరిగ్రహాత్ మునీనాంచ తీర్థానాం (క్షేత్రాణాం) పుణ్యతాస్మృతా

తా. అని కాశీఖండమందు తీర్థమహాత్మ్యము వర్ణింపఁబడినది అనగా భూమియొక్క, నీటియొక్క, తేజస్సులయొక్క అద్భుత ప్రభావము వలనను, మహర్షులయొక్క నివాసములవలనను, తీర్థములు పవిత్రములై పాపహారములగుచున్నవని భావము.

ఉ. "చిత్తము గెల్వఁగల్గిన విశిష్టపరిస్థితి నాకు లేదె" యం
చుత్తలపాటు చెందక విశుద్ధ వినిర్మల నీర పూరితా
త్యుత్తమ తీర్థ దైవత మహర్షిమహా రాశ్రయ భాగ్యమందుచే
ఇత్తటి యోగ్యమంచు మదినెంచితి స్వామికృపావలంబినై

ఇట్లు పై శ్లోకములుగూడ తీర్థక్షేత్రములయొక్క ప్రాముఖ్యమును ప్రకటించుచున్నవి.

"బుద్ధిఃకర్మానుసారిణీ" కృతకర్మము ననుసరించి సంకల్పము తదాచరణము కలుగుచుండును. గతజన్మమున మేముచేసిన సుకృతలేశ ప్రేరణముచేతనే ఈనాఁడు మాకుఁ దీర్ఘయాత్రభిలాష కలిగినదని భావించితిని కావుననే ఆదినము మాకొక పర్వదినమని చెప్పియుంటిని

26-9-84 రక్తాక్షినామసంవత్సర ఆశ్వయుజశుద్ధ విదియ గురువారమున మాయూరినుండి (తెనాలి) దక్షిణ యాత్రకై ఒక బస్సు బయలుదేరినది. నేను మా శ్రీమతియు ఆ బస్సులో దక్షిణదేశ తీర్థక్షేత్రములలను దర్శించుటకై బయలుదేరితిమి.

దేశ కాలపరిస్థితులు బాగుగాలేవు. "శ్రేయాంసిబహువిఘ్నాని" అని యనుభవవాక్యము, వెళ్ళునది బహుదూరము, నాలుగురాష్ట్రాలలో నాలుగువేల మైళ్ళదూరము. దోపిళ్ళు, ప్రమాదములు, నిత్యకృత్యములు. అందువలన మాచిరంజీవి కొంత భయపడినాఁడు. అపుడు నేను వానికిట్లు ధైర్యము చెప్పితిని.

శా. లీలామానుష విగ్రహ ప్రథిత సర్వేశార్ద్రవీక్షాబలం,
బావించున్ మనభక్తిగీతముల సంభాళించుఁ గష్టంబులన్
వ్రీలంజేసి నిజానుజీవులను, జాలిం జెందగానేల ? పు
త్రా ! లేదెప్పుడు దుర్దశల్ హరిని హృద్ధామంబునన్ నిల్పినన్.

యాత్రీకులతో బస్సునిండినది. అది బయలుదేరు సమయము ఆసన్నమైనది. అప్పుడు-

ఉ. సారధి శంఖమొత్తె, నిఁక సాగగనుండె రథమ్ము, యాత్రికుల్,
వారినిఁబంప నచ్చుటకు వచ్చినవారికినెల్ల వీడ్కోలుల్
పేరిమి చెప్పు,చుంచు, నది లించునె క్షేమ సభాష్ప గద్గదో
చ్చారణ మొప్ప "వత్తుమని చల్లగఁజెప్పితి మెల్లవారికిన్.

చం. కదలెను బొబ్బపెట్టి మొనగాడు, భయంకరకంఠమెత్తి, మా
యెద బెదురంగ నాస్త్రగణమెల్లను జేతులనూపఁ బోరికిన్
గదలెడు ధీరునట్లు గుఱుగుఱ్ఱని మ్రోఁతల నెన్నొ చేయుచున్
వదలుచు ధూమపుంజముల నంతట నుక్కుశరీరి దాంతుఁడై

తె. ఏడుకొండలవాడ ! మమ్మేలుమయ్య !
వడ్డికాసులవాఁడ ! మీవారామయ్య !
శ్రీనివాసుఁడ ! మీపాద సేవకులము
కావు మమ్మంటి మాబస్సు కదలునపుడు

ఆ-వె. ఘంటసాలవారి కమ్మని గొంతులోఁ,
బలుకుచున్న శ్రీనివాసగీత
మధురరవముతోడ మందమందమ్ముగా,
కదలె బస్సు యాత్రికాళితోడ

ఉ. ఆఱుపదమ్ములన్ నడచు నా రథమట్లు గమించుచుండ మా
వారికి మాకు డెందముల బాధలుకల్గెను మూగవేదనల్
మీఱెను దేశసీమలను మించి గమించుచునుంటి మింకమా
వారిని జూచుకాల మది వచ్చున ? యన్న భయమ్ము మేల్కొనన్

ఉ. తైలముత్రాగువాఁడు, తనదారికి నడ్డమువచ్చువారి క
ర్ణాలఁబగుల్చు హెచ్చరికలన్ గడుచేయుచుఁ బోవుచుండ లో
కాలను గుక్షినుంచిన జగత్పతిగాఁ గనుపించెనాకు, గా
సీ! లయకారుఁడైన, యతఁడేలున? మ మ్మనుభీతి, సత్వసా
రాలయుఁ డేలయేలఁడను నాశయమున్ మదిఁగల్గె న త్తఱిన్

ఉ. గర్జనఁ జేసెబస్సు, మదిఁగల్గు భయంబును బాఱఁద్రోలుచున్
"వర్జితసర్వకార్యులయి పాంథులు! సిద్ధముకండు యాత్రకై
తర్జనభర్జనల్ విడిచి ధైర్యమునందుడు చాలమార్లు నే
నూర్జిత సత్వమూర్తినయి ఓమితిఁ బాంథుల నంచుఁదెల్పుచున్

తెనాలిలో మా బస్సు అట్లు బయలుదేరి రాత్రి యంతయు
ప్రయాణముచేసి

తే. తూర్పుకొండమ్మ యొడిలోని దుడుకుబిడ్డ,
మోముపై నెఱ్ఱరంగును బులుముకొనుచుఁ,
జేరి నెత్తము నల్లరిచేయునపుడు,
విన్నకొండకుఁజేరె మేమున్నబస్సు

ఉ. ఆయది విన్నకొండయట, ఆహరి రాముడు "రావణాసురుం
డాయువుమూఁడి జానకిని అగ్నిశిఖన్ ఒడినుంచి తెచ్చె, నే
నాయనతోడ దేవికయి యాలముచేయుచుఁ గూలితందు జా
టాయువువల్ల సీతకథ, అయ్యదియే వినుకొండయై" చనెన్

ఉ. దైవముకోసమై యమల ధర్మముకోసము జీవితంబె స
ద్భావముతోఁ దృణావళినిభంబుగ నెంచి, సురారినాథహం
భావముడించి, నేలపయిఁ వ్రాలిన వీరజటాయుమూర్తికిన్
మై పులకింపఁ జేసితి నమస్సులఁ ద్యాగమయాత్మజీలికిన్

ఉ. ఓయి ! జటాయు ! ధన్యము మహోన్నతమైనది నీదుజన్మ, నీ
కాయము నాదిదేవుఁ డధికంబగుప్రీతిని బుగ్గిచేసె ఓ
ధ్యేయచరిత్ర ! ఆ దశరథేశ్వరుఁడైనను బొందఁగల్గెనా ?
ఈయధికప్రభూతిని నదృష్టమటన్నను నీదె పుణ్యుఁడా

అని యాపక్షేంద్రుని ప్రస్తుతించితిని, అటనుండి మాబస్సు డోర్నాల్ చేరినది, అదియొక జనపదము. అక్కడనుండియే శ్రీశైలారోహణము ప్రారంభమగును.

## నల్లమల అడవుల వర్ణనము

డోర్నాల్ నువదలి మాషట్పద ముజుమ్మని ధ్వనిచేయుచు మార్గమును జీల్చుకొనుచు పోయిపోయి నల్లమల అడవులలో ప్రవేశించేనది నల్లమలఅడవులు అతిగహనములు అతిభయంకరములు. అవి క్రూరజంతువులకు క్రూరమానవులకుగూడ నివాసములు - పట్టపగలే యచ్చట యమకింకరులు క్రిక్కిరిసి

తిరుగుచుందురు - ఆ అరణ్యాని తరులతా గుల్మములతో బలిసియుండును.

"మల" అనగా కొండయనియర్థము - నల్లమలయనగా నల్ల కొండయని యర్థము. ఆకొండ నల్లని యుద్బిజ పరంపరలతో నిండి దూరదృష్టికి నల్లనిదిగా గోచరించును. అందువలన ఆనగమునకు ఆ నామ మేర్పడియుండును. నల్లమలందు ఏర్పడిన అడవులనే నల్లమలఅడవులందురు. ఆ యడవులలో అంధకారము కాపుర ముండును.

మావాహనము గహనమార్గములో వడివడిగా పోవు చున్నది కొంతమార్గము గడచినది. అక్కడ ఒకగిరియున్నది. ఒకకొండవాగు నెత్తమునుండి జలజలపాఱుచు కొండనుచుట్టి వచ్చి (ప్రదక్షిణము చేసినట్లు) దానిపాదములమీఁదుగా క్రిందికి పోవుచున్నది. అదృశ్యము.

ఉ. కాంచితి నొక్కచోట మెలికల్ కులుకుల్వలె దోచ కొండపై
నుంచియు చుట్టునుందిరిగి యొక్కెడ పాదములంటు ఓడికన్
వంచనచేసి తాఁ బ్రియుని బంధుర కంధరసీమ చేయిదో
యుంచియు నడ్డుదోయి దలనుంచియు నేడ్చు పడంతియోయనన్.

వ. అచ్చటికి కొంతదూరములో లతాంగనా పరివృతములైన కొన్ని యువవృక్షములు మహోన్నతములై విఱ్ఱవీగుచున్నవి. అవి.

చ. మృదుల లతావిలాసములు మేనికి చుట్టుకొనన్ విలాస సం
పదలమునింగి నింగిఁదమబాహుల నొత్తుచు విఱ్ఱవీగుచున్
మదమున నొప్పుచుండే నిసుమంతయు గొంకక ధూర్తవృక్షముల్
మదవతిమాయలోఁ బడిన మత్తుడు దూరముచూడనేర్చునే?

వ. అక్కడికి సమీపములోనే యెండి క్రుంగిన కొన్ని వృద్ధవృక్షము లున్నవి. ఆనీరసతరువులు.

ఉ. సారమువీఁగ నీరసము శక్తులనున్ దిగఁద్రావ, మేను ని
స్సారమునొట శూన్యమగు శారదనీరదరూపమై అతి
స్త్రీరతిదోషమున్, యుపకసింహులకున్ వచియించుచుండె, ఆ
చేరువ వంగినేలకు కృశించిన, శుష్కపలాశవృక్షముల్.

వ. మఱికొంతదూరమున ఒకప్రక్క ఆకాశమంటు కొండశిఖరములు. ఆప్రక్కనే పాతాళముఁ దాకు లోయలున్నవి ఆసన్నివేశము.

ఉ. మిన్నులఁదాకు కొండ లోకమేర వసింపగ వానిప్రక్క నా
పన్నుల యార్తులన్ వెలికివారగనీయని లోయ లుండియున్
పన్నుగ సౌఖ్యమబ్బినను ప్రక్కనె తప్పకయుండు కష్టముల్
తిన్నగఁజూడ నన్న యుపదేశముఁజేయును జూచువారికిన్.

వ. అచ్చటికి కనతిదూరములో ఒక పార్శ్వమునందు పెట్టనిగోడల వలె వెదురుగుబురులు తలచుకొనియున్నవి అవి.

చ. వెదురులమొత్తముల్ పగలు వీఁగినవేళల ఠేఁగి రివ్వనన్
జదలును గీయుచున్నటుల సాఁగియు నమ్రములై నిగర్వితన్
ఉదయమునందు సూర్యునకు నొయ్యన నంజలిసేయు దృశ్యముల్
ముదమున మానవాళికి ప్రబోధముచేయును మానవత్వమున్.

వ. ఆ మహాగహనములో అడ్డమరేయి మాబస్సు పరుగులెత్తుచున్నది. మా బాటకు కొంతవేటుదూరములో చెట్లమఱుగున దావాగ్ని విజృంభించినది. ఆదావాగ్ని

ఉ. పాపపులోకమున్ విడిచి పద్మదళాక్షుని ప్రాపుచెంచి దు
ర్ష్వాపవసస్థలిన్ మునిఁగి సారతపంబునుజేయు మౌని, ప్ర
ఖ్యాపిత తాపవహ్నులనఁ గన్పడెఁ దద్వనభాగమందునన్,
దీపితదిఙ్ముఖంబులగు తీవ్రదవాగ్నులు మిత్తినాల్కలై.

వ. దానికి ఒక కిలోమీటరుదూరములో ఒకమహారణ్యమున్నది అది నిబిడ నీరంధ్ర తరుచ్ఛాయా విలసితమైయున్నది. అది

ఉ. దిక్కులు పిక్కటిల్ల సముదీరిత శాఖల భూమిభాగమున్
జక్కవరేని తీవ్రకరజాలములన్ జొరనీక కప్పి ఆ
ప్రక్కనెయున్న బాలతరువారము వృద్ధినిఁబాపు వృక్షముల్
బక్కల ప్రాణమానములఁ బాపు మదాంధులవోలెఁగన్పడెన్.

వ. మాబస్సు ఆవిపినములో అతివేగముగాఁ బరుగులెత్తుచున్నది. వాయువేగముతో బస్సులోఁ బోవుచున్న మాకు ఆవనసుందరి

చ. మెఱపులమేలమాడు జిగిమించిన వన్నియలాడివోలె నీ
లరుచిపటాంతరస్థ వగలాడియనౌ అభిసారికాగతిన్
కరదుహ హూయమాన నిజకాంతయనౌ వెలయాలువోలెనా
ధరసతి తోచె నల్లమల దంతుర దీర్ఘ వనాంతరంబులన్.

ఇట్లు నల్లమల గహన దృశ్యముల నాలోకించుచు ముందునకు సాఁగితిమి.

మాబస్సు శ్రీగిరికభిముఖముగా నడయాడుచున్నది. ఆ ప్రాంత మంతయు శిలాశైలమయము - అక్కడక్కడఁ గొంత భాగము సేద్యానుకూలము - ఆశైలప్రకృతిలో నాకు గొన్ని భావములిట్లు కలిగినవి.

తె. స్వప్నమందునఁ బ్రియుఁడైన వాసుదేవు
దాదరంబునఁ దనుఁ జేర నంగమంత
రోమహర్షణమందె నా భూమిపైన
మెట్టపైరులు కనుపించె గుట్టలందు.

తె. మన్నుఁదాలుపు దగ్గఱనున్న నేల
అక్కడక్కడ నెఱ్ఱనై యలరుచుండె
భూమికామిని యొడలిపైఁ బూసికొన్న
రక్తచందన సౌందర్య రంజకమయి,

తె. కొండమొగమున నగపడు గుంటలరయ
నేలజవరాలి మొగముపైఁ గ్రాలు మొటిమ

లాహరింపఁగ నెలకొన్నయట్టి గాట్లు
వోలె నుండెను జిత్తము లేలుకొనుచు.

ఉ. పయ్యరయంజలన్ నడచువాఁడు రయంబునఁ బోవుచుండగా
నయ్యలనుండి రేఁగు నరుణారుణధూళి రజోవికారయౌ
తొయ్యలి భూమిదేవి మదిఁదూఁగిన రాజసభావ భంగముల్
చయ్యనఁ బైకిఁబొంగినటు స్వాంతమునం దనిపించె వింతగా.

చ. గతికలితోఁ బలాలములఁ గర్కశరక్తశిలాతలంబులన్
బరఁగెడునట్టి ధాత్రి బహుభంగులవర్ణ విరాజమానయై
కరమునుబట్టుపండుగను గల్గెడు నాకబలిప్రయుక్తమౌ
పతికవిధంబునన్వరలెఁ బర్వతమూర్ధమునుండి చూడఁగన్.

తె. జాడుకొన్నట్టి భూమిసంజాతమంత
గహనమైనట్టి, తత్త్వమార్గమ్ము వలెను
వానికావల లీలగాఁగానవచ్చు,
పుడమిమోపరి పరమాత్మవోలెనుండె.

తె. మిన్నులనురాయు కొండపైనున్న మేము
క్రిందుచూడఁగఁ బలుచెట్ల చందమొప్పె
కొండగోగులభంగిగా నిండులన్ని
పుట్టగొడుగులవోలె గన్పట్టుచుండె

తె. వెలికిలన్ బండి, బాహువే తలగడగను
నిద్రవోయెడు ధాత్రి పెన్నెదను నెగుడు
దిగుడుగా నుండు కుచముల తెన్నుగలిగి
ఉండెనచ్చట గుట్టలురెండు మిగిలి.

తె. వానిపై మంచుతెరయుండె భామినీ కు
చద్వయంబున జిలుగువస్త్రంబుపగిది
రవికరంబులఁ గలఁగిన ఇవము, ప్రియుని
స్పర్శ జాఱిన యందాలపైటవోలె.

పూర్వము శ్రీశైలయాత్ర కష్టతమముగాఁ బ్రాణాపాయ
కరముగా నుండెడిదంట ఆనాఁడు కేవలము భక్తితత్పరులు

మాత్రమే స్వామి దర్శనముకొఱకై అష్టకష్టములుపడుచు బోవుచుండెడివారఁట వారే భగవంతునకు నిజమైనభక్తుల వారు సమర్పించినది తృణమైనను స్వామి దానిని మేరువుగ స్వీకరించెడివాఁడఁట. "పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి।" అనిగదా 'శ్రీ'కృష్ణస్వామి ప్రవచనము

ఈనాఁడు మానవుడు కాలు మట్టికాకుండ శ్రీశైలయాత్ర చేయుచున్నాఁడు. యాత్రికులసంఖ్య వేలకుపెఱిగినది. దేవు ఆదాయము గూడ అధికమైనది. ఈ ఆదాయమునకు భగ వంతుఁడు తృప్తిపడుచున్నాడా? ఆనాఁటి భక్తునకిచ్చినట్లే ఈనాఁటిభక్తునకుఁదనహృదయములో స్థానమిచ్చుచున్నాడా? అన్నదే ప్రశ్న.

ఉ. విజ్ఞతకల్గుతండ్రి తనబిడ్డఁడు స్వేదజలంబు లాడ్చుచున్
ప్రాజ్ఞుఁడునై గడించు నొకపాటిధనంబునఁ దృప్తిఁజెందు, నే
యాజ్ఞలులేక స్వార్థపరుఁడై గణియింపక పాడి చేయు సా
వజ్ఞకుకర్మలన్ గలుఁగు పైడికి మెచ్చునె? సౌఖ్యమందునే?

క. కావున భగవంతుఁడు తన
దేవునకై ప్రాణమిచ్చు దీనునివలె శ్రీ
దేవీపుత్రులు రక్తులు
గ్రీవంబున దండవేయఁ దృప్తింగనునే ?

అయితే - ఆత్మనాథునకు ఆత్మను హారతిగా నీయలేని కోట్లాది సామాన్యమానవులు తరించుటకు మార్గములేదా? ఉన్నది అదియే సగుణోపాసనము.

ఉపాసనములు రెండువిధములు. సగుణోపాసనము-నిర్గుణోపాసనము - సగుణోపాసనము - సులభసాధ్యము - నిర్గుణోపాసనము అత్యంత దుర్లభము - వీనిని గురించిగీతలో.

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే.

అని చెప్పఁబడియుండుటవలన సగుణ నిర్గుణోపాసనములు రెండును మోక్షప్రాప్తికి హేతువులే యగుచున్నవి. ఈ రెండును చిత్తశుద్ధిసాధ్యములే. చిత్తశుద్ధికి ఈజన్మకర్మాచరణమే కారణము కానక్కఱలేదు. గతజన్మకర్మ కూడ కారణమగును. తిన్నఁడు వాల్మీకి మొదలగువారు గతజన్మసంస్కారముల వలననే ఈజన్మలోఁ జిత్తశుద్ధి కలిగిస్వామిని భజించితరించారు.

కావున సామాన్యమానవులు సులభసాధ్యమైన సగుణోపాసనమును జిత్తశుద్ధితోఁ జేసినయెడల వారికిమోక్షము లభింపఁగలదు. ఏ యుపాసనమున కైనను జిత్తశుద్ధి యత్యంతావశ్యకము. సామాన్యమానవునికొఱకే నిర్గుణుఁడు, నిరాకారుఁడు, నిస్సంగుఁడు. అయిన పరబ్రహ్మమందు సగుణత్వ సాకారత్వ-సంగిత్వము లారోపింపఁబడినవి.

తీర్థయాత్రాది కర్మలుగూడ సగుణోపాసనాంగములై చిత్తశుద్ధినిగలిగించి పరంపరాసంబంధముచేత ముక్తి హేతువులు కాఁగలవు. కాశీలో వదలవలసినవి కాయగూరలు కావు. అరిషడ్వర్గములో నేదొయొక్కదానినైన కనీసము ఆ పవిత్రక్షేత్రములో వదలాలి. తద్ద్వారమునఁ జిత్తశుద్ధినిబొందాలి. అదియే యాత్రకుసాఫల్యము ఆ మహారణ్యములో

ఉ. కళ్ళకు జోడుపెట్టుకొని కాంచుచు మార్గముఁ బోవుచుండె, మ
మ్మెల్లనుమోయువాఁడు భయమేమియులేక భయంకరాటవిన్
కళ్ళకుఁబండుగయ్యె నిరుగట్టుల గట్టుల మబ్బుచాలుతో
నల్లనమేలమాడెడు నగావళి హావళిఁగాంచుచుండగా.

చం. వనమనుకాంత మేఘములబారును మీఱెడు కేశపాశమున్,
బనువుగదువ్వి పాపటను బాగుగఁదీరిచియుండ నందులో

గునగునఁబ్రాకు పేనువలె గొబ్బునఁబోయెడు నాబస్సుతోఁచె
మనమున నావిసీల తరుమధ్య పథాంతర వీధియందునన్.

ఆకొండయడవులలో ఆటవికుల గుడిసెలు కొన్ని యున్నవి. ఆక్కడివారికి నగరవాసులకున్న సౌకర్యములలో నూటవ వంతుసౌకర్యములుగూడ లేవు. అయినా వారివదనములలో మందహాసములు మహానందములు కొల్లలుగానేయున్నవి. అందుకుఁగారణము వారికున్నతృప్తి. వా రున్నదానితో సుఖింతురేకాని కానిదాని కాశపడరు "తృప్తి" అనునది మానవుఁడు సుఖపడుటకు దైవమిచ్చినవరము.

ఉ. తృప్తియ యున్నచో నెరునిదే జగమంతయుఁ గాసులేకయున్.
గుప్తవిధంబులన్ ధనము కోట్లుగడించినఁ దృప్తిలేక, య
ప్రాప్తముఁ బొందఁగా, జనుఁడు వాకిలిఁగాయుచు, జీవితాంతమున్
సుప్తినిమున్గి వ్యర్థుఁడయి స్రుక్కును పెల్గను గాంచకింతయున్.

తే. మనసులోనున్నదీపము, మలవునాశ,
దివ్వెవెలిగించు, మనసులోఁ దృప్తిగుణము,
ఎన్నియుండిన లేకున్నఁ దృప్తియొకటి
జనువు పండదు, నిండదు మనసుసరస్సు

అడుగడుగున అపాయములకు నిలయము లాయడవులు, అయినా ఆయరణ్యములలోనివారు ఏ యపాయములకు గుఱికాక తమ బ్రతుకులను బండించుకొనుచు నేయున్నారు శతాయుష్మంతులగుచు నేయున్నారు- దానికిఁగారణము దైవ కృప.

ఉ. దైవబలంబె సర్పులను దిప్పకపోచును, మిద్దెమేడలున్
గావఁగలేవు దైవకృప కల్గనివానిని, కల్గువాఁడు, వ్యా
ఘ్రావనినున్న, నాతని నఖంబును ముట్టదు మృత్యువంచు, నా
కా, వనసీమ చెప్పెను మహార్థముఁ గండ్లకుఁగట్టినట్లుగన్.

మాబస్సు కొండలనెక్కుచు దిగుచు దన ప్రయాణము సాఁగించుచున్నది. ఆ బస్సు మాకొక సందేశమిచ్చినది.

అటునిటు మహావినీలగహనము. నడుమబాట, బాటపై బాటసారి యంత్రగమనుఁడు ప్రయాణముచేయుచున్నాఁడు, మెట్టలను గష్టముగానెక్కుచున్నాఁడు, పల్లములకు సుఖముగా దిగుచున్నాఁడు. ఆ సన్నివేశము.

ఉ. జీవితమందు మానవుఁడు చేరను సద్గతి, జాలుచుండు, నే
జీవియు నొక్కమాదిరిగ సృష్టినిఁ గాలముఁబుచ్చలేఁడు, సం
భావనచేసి, కష్టసుఖమండలి, నొక్కటిగా నెవండు, కా
ర్యావసరమ్ములన్ నడచు, నట్టిఁడు పొందును జీవితార్థమున్.

"అధ్వా జరా మనుష్యాణాం" అని శాస్త్రము. ఇచ్చట మనుష్య శబ్దము గమనముచేయవానిని బోధిస్తుంది. విశ్రాంతి లేకుండ ప్రయాణము చేయువానికి వ్యాధి ముసలితనము త్వరగా ప్రాప్తిస్తాయి అని పై వాక్యమునకు భావము.

మా బస్సు విశ్రాంతిలేకుండ ప్రయాణముచేయుచుండుట వలన దానికాయాసమువచ్చినది. మెట్టప్రదేశములను ఎక్కలేక యెక్కుచు గబ్బుగుబ్బుధ్వనులతోఁ దనబాధనువెళ్ళపోసికొనుచు "గంపెడు సంతానమును గని సంసారశకటమును లాగఁజాలక లాగుచున్న సంసారివలె" ముందుకు మెల్లగా సాఁగుచున్నది. దానిలో సారము (జలము) ఇంకిపోయినది. దానిగుండెలో తాపము (వేడి) హెచ్చినది.

ఉ. కొండను నెక్కుచుండగను గుంఠితవై ఖరి బస్సు, శీఘ్రమే
మండెనుదానిగుండె, జనమంత భయంపడె దానిఘోషకున్
వెండియు దానినుండి నెఱవేడిజలంబులు పైకిఁబొంగి, యా
దండఁగలట్టివారిపయిఁ దద్దయు దూకెను బొబ్బలెక్కఁగన్.

ఉ. బస్సున గోలపుట్టినది, ప్రాణభయంబునుగల్గె "నంతలోఁ
గస్సని బస్సురోషపడఁ గారణమేమియొ, గుండెమంటతో
"బుస్సని" రెచ్చి వేడిజలముల్ వెలిఁగ్రక్కఁగనేల ?, యంచు, నా
బస్సునవారు పల్కఁ విని పల్కెను సారథివేగవాగితో.

తె. మంటరేగెను యంత్రానఁ దంటవచ్చె,
నందుచేతనె నీరగ్గియగుచుఁ బొంగి,
ఒడలఁగాల్చెను జనులకు, బడలుపడెను
బస్సు, దానికి దప్పికబాధకలిగె.

తె. బస్సుదాహము తీర్చుటే భావ్యమిపుడు,
లేకపోయిన నీబండి కాఁకపోదు,
నీరమిప్పుడు కావలె దూరమందె
నుండెనయ్యది, అదిలేక మందుబస్సు.

వ. గుండెమండిన యీయంత్రజీవి భయంకరముగా నిప్పులనీట
ని వెదఁజిమ్ముచున్నది. అదిగమనించి యాబోధకుడు

ఉ. ఇంజను సారణీన మిపు డింకిననీరముచేత నేమిచే
యంజనదీయెడన్, వెనుకనంతయగాధము- బండిజాఱెనా,
భంజితమౌను, అంతమనప్రాణములుండవు, జాఱకుండ, వే
గంజని, వెన్కచక్రముల కడ్డముపెట్టుఁడు పెద్దబండలన్.

డ్రైవరు మాటలను వినగానే యువకులు కొందఱు గబగబ దిగి వెనుకచక్రములకు రాళ్ళనడ్డముపెట్టిరి- వెంటనే డ్రైవరు సలహామేఱకు యాత్రీకులు తమదగ్గరనుంచుకొన్న జలమంతయు సారథికందించిరి. అపుడాతఁ డానీటిని మంటలఁజిమ్ముచున్న యా తైలపాయి నోటికందీయగా నాతడానీటిని త్రాగి శాంత చిత్తుఁడై - "మదముడిగి మావటీనికి స్వాధీనమైన మత్తగజము వలె" లొంగిపోయెను.

27-9-84 ఉదయము 9 గంటలకు మాబస్సు శ్రీశైలశిఖరదర్శన ప్రాంతమునకుఁ జేరినది.

శ్రీశైలమునకు ఇరవైమైళ్ళకు దిగువన శ్రీశైలశిఖర దర్శనప్రాంత మున్నది. అచ్చటినుండి శ్రీశైలశిఖరమును దర్శింపవలెనట – శిఖరదర్శనము చేయనిదే శిఖరీశుని దర్శనము చేయరాదట. ఇదియొక విచిత్రాచారము.

బాటప్రక్కగా సుమారు రెండువందలమెట్లపైన పది చదరపుమీటర్ల పైశా ల్యముకల ఒకపెద్దరాయియున్నది. ఆప్రక్కనే ఒక పొత్రమున్నది - ఆ ప్రాంతములోనే నువ్వులపొట్లములను బెల్లపుముక్కల పొట్లములను అమ్ము చుందురు – తైర్థికులు ఆపొట్లములను గొని ఆ పెద్దరాతిపై నువ్వులను బెల్లము ముక్కలను బోసి ఆరాతికిఁ బ్రదక్షిణముచేసి పొత్రముతో వానిని నూఱువలయును పిమ్మటఅక్కడనుండియే శ్రీశైలశిఖరదర్శనము చేయవలెను. ఆ శిఖరము పాపాత్ములకుఁ గనఁబడదట – అశిఖరము నిరంతరము జలద సంచారము వలన - దవ్వగుటవలన - ఎవరికిఁగనఁబడదు. కాని యందఱు తాము పదిమందిదృష్టిలో పాపాత్ములమగుదుమేమో యను భయముచేత కని పించినదని యనుచుందురు. "గతానుగతికోలోకః" అనిగదాలోకోక్తి.

మన పూర్వాచారములన్నియు అర్థవంతములే. అవి బాహ్యచక్షువులకు గోచరింపవు. విచారించినచో నా యాచారములు ఆధ్యాత్మికవిషయ ప్రబోధ కములే - ఈ తిలగుడ మర్దనము శిఖరదర్శనము కూడా మానవులకు ఒక దివ్యసందేశ మిచ్చుచున్నవి

ఉ. రోలది దేహమూసుం దిల, లొప్పును మాత్రలుగాగ, బెల్లమున్
బోలు రజస్సుగా, నగును బొత్రము జ్ఞానము, నూఱుటన్న మో
హాలయమైన దేహమున, నాపుట యింద్రియదుష్టచేష్ట, దే
వాలయగోపురమ్ము కనుపట్టుటయన్నను, బ్రహ్మఁజూచుటే.

ఆ.వె. అనగ నర్థమేమి? అజ్ఞానతిమిరముఁ
బాఱఁద్రోల నవల భవుఁడు తోఁచు,
నంధకారమందు నడయాడువానికి,
దివ్వె లేక పోవఁ, బెన్ను గలదె.

తే. నూఱుచుందురు జనులెల్ల నువ్వులచట
కాని శిఖరము నొక్కరుఁ గాంచలేరు
శివుఁడు కన్పడునే పంకచిత్తములకు
అర్థమెఱుగని కార్యము సార్థకమ్మె ?

తె. అని తలంచియు నేనును, అందఱివలె,
నూఱితి నువ్వుఁ జూచితి నొక్కమాఱు
కానఁబడనట్టి శిఖరము. మానవుండు
సంఘమందున భిన్నుఁడై సాఁగఁగలఁడె?

అక్కడనుండి బయలుదేఱి 10-గం. శ్రీశైలస్వామి యాలయ ప్రాంగణములో నడుగుపెట్టితిమి- వెంటనే శ్రీశైలేశ్వరుని దర్శనముకొఱకై దేవాలయాభిముఖుల మైతిమి.

## శ్రీశైలము

శ్రీశైలము మహాశైవక్షేత్రము, అది భారతదేశ శైవమహా క్షేత్రములలో నొకటి, సముద్రమట్టమునకు 1500 అడుగుల మెత్తునమున్నది శిఖరము 2830 అడుగులమెత్తుననున్నది.

## శ్రీశైల నామనిర్వచనము

1. శ్రియా, ఆధ్యాత్మికసాధనభూతయా, భక్తిసంపదా యుతః
శైలః, శ్రీశైలః

(ఆధ్యాత్మికప్రాప్తికి సాధనమైన భక్తిసంపదతో గూడినపర్వతము.)

2. శ్రియః మోక్షలక్ష్మ్యాః ప్రకృతిసౌందర్యస్యవా స్థానం, శైలః
(మోక్షసంపదకు లేక ప్రకృతిసౌందర్యమునకు స్థానమైనపర్వతము)

3. శ్రియా, మోక్షసాధనభూత పురుషార్థత్రయరూపయా
సంపదా యుతః శైలః

(మోక్షసాధనమైన పురుషార్థత్రయముతో గూడినది ఉత్కృష్ట సాధనమునకు సాధ్యము అత్యంతసన్నికృష్టము. అందుచేత శ్రీశైలము మోక్షప్రదమగుచున్నదని విశేషార్థము.)

శ్లో॥ శ్రియా, త్రిగుణాశ్రయత్వేన భిన్నత్వమాపన్నానాం,
త్రిమూర్తీనాం, తదాశ్రయ పరబ్రహ్మరూపేణ అభిన్నత్వా
పాదకశక్త్యా యుతః శ్రీశైలః

(త్రిగుణముల నాశ్రయించుటచేత భిన్నులుగా కనుపించుచున్న త్రిమూర్తులకు, వారియుత్పత్తికి స్థానమైన బ్రహ్మముద్వారా అభిన్నత్వమును గలిగించు శక్తితోఁ గూడుకొన్న పర్వతము అని అర్థము.)

శ్లో॥ వేంకటం మేరుమైనాకౌ - శ్రీశైలం గంధమాదనం
పంచశైలాన్ పఠేన్నిత్యం మహాపాతకఘస్మరాన్.

అని పంచమహాశైలములలోఁ బ్రసిద్ధిఁగాంచినది శ్రీశైలము. పాతాళగంగా సోపానముల పైనున్న లిపినిఁబట్టి ఈక్షేత్రము చాల పురాతనమని తెలియుచున్నది. ఒకప్పుడు దీనిని శ్రీశైలసీమ అనెడివారట, ఈ క్షేత్రమును హిందువులేకాక భిన్నమతస్థులుగూడ సేవించినట్లు ఆధారములు కన్పడుచున్నవి

ఈ యాలయప్రాకారములమీద అద్భుతములైన శిల్పములున్నవి. భక్తుల చరిత్రలు పురాణ సాంఘిక గాధలు మనోరంజకముగా నిర్మింపఁబడినవి. ఈ పర్వతశిఖరముమీదనే ఆదిశంకరులు "శివానందలహరిని" రచించెనట.

ఈయాలయములో ఒక విచిత్రాచార మున్నది. అది వచ్చిన భక్తులు పాదప్రక్షాలనము చేయకుండగనే దైవదర్శనముచేయుట దానినే "ధూళిదర్శన" మందురు.

ఉ. ఎక్కడనైన నున్న యదె, ఈశునిదర్శనవేళఁ బాదముల్
చక్కగ నెల్లవారలును క్షాలనమున్ డగఁజేసిపోక, ఈ
యొక్క ప్రదేశమందున, రజోమిళితాత్మ పదంబులన్ జనుల్
మ్రొక్కుటయేల ? దేవున, కపూర్వమె, ఈవిధి కేమి హేతువో.

ఆ.వె. అనుచుఁ, గొంతకాల మాలోచనము సేయఁ
జేయఁ, గల్గె నాకుఁ జిన్నయూహ,

మసన మన్న యింట, మనియెడు వానిని,
జూచువారి, కేల ? శుద్ధపదము ?

ఆ.వె. కన్నుఁ దెఱచిచూడఁ గానుపించెను, ధూళి
దర్శనార్థ, మాత్మ ధన్యకరము,
"నాన్న వోలెఁ, బిల్లి నట్టింటఁగట్టుదు"
నన్న వానిపనికి నర్థమున్నె ?

ఉ. పూర్వము, వంశమెల్ల పదముల్ పగులన్ నడ పోడియాడి యా,
శర్వనివాసమున్ గదిసి, స్వామికి ధూళిపదంబులన్, నిజా
ఖర్వపథిశ్రమన్ దెలుపుకర్మమె, యారయ, ధూళిదర్శనం,
బుర్వరఁ గారునుండి దిగ, నుండునె? ధూళి పదంబులందునన్.

ఆ.వె, అనఁగనర్థమేమి ? యధిక ప్రయాసముఁ
బడినగాని, శివుఁడు పట్టుబడడు,
దీనిభావమేమొ, తెలియక, కార్లు, నే
తేర, భవుడుమెచ్చి దీవనిడునె

పరమేశ్వరుఁడు కరుణామూర్తి, ఆయనకున్న యనంతనామములలో అచ్చటినామము మల్లికార్జునుఁడు.

పూర్వము చంద్రగుప్తునికుమార్తె శివభక్తురాలు, శివుఁడామెకుఁగన్పించి "తాను శ్రీగిరిపై వెలయుదుననియుఁ దనకు గుడి కట్టించుమనియుఁ గలలోఁ జెప్పినాడట, పిదపనామె ఆ స్వయంభువునకు గుడి గట్టించి నిరంతర మాదేవుని మల్లికాకుసుమములతోఁబూజించెడిదఁట, అందువలన సహజ ధవళమైన ఆ భవునిశరీరము మల్లెపూవులచే అతిధవళముగాఁ బ్రకాశించెడి దఁట, అందువలన ఆస్వామికి "మల్లికార్జునుఁడు" అనుపేరు వచ్చినదట.

మల్లికార్జునస్వామి భక్తవత్సలుఁడు- భక్తుఁ దేజాతివాఁడైనను ఆయన కరుణించును.

ఆ క్షేత్రమున శివలింగము చిన్నది. భరతదేశమునఁగల ద్వాదశ జ్యోతిర్లింగములలో నదియొకటి. అది శుద్ధస్ఫటికమయము.

మేము ఆ పరమేశ్వరుని దర్శనమునకై ధూళిపాదములతోనే దేవాలయము లోనికిఁబోయితిమి.

అక్కడ మఱియొక విశిష్టాచార మున్నది. ఏ జాతివాఁడైనను ఎకాయెకి గర్భాలయములోనికిఁబోయి, స్వామిని చేతులతోఁదట్టుచు "చెవిటిమల్లయ్యా! నీ సేవకై వచ్చానయ్యా" అని బిగ్గఱగా అఱచును. ఇట్టి యాచారము మఱియెక్కడఁగనుపించదు. చాల దేవాలయములలో భక్తులకు గర్భాలయ ప్రవేశముఁ, భగవంతుని స్వయముగా స్పృశించుట, ఉండవు. ఇక్కడ అవి రెండునున్నవి.

తె. బ్రహ్మ నే నౌదు, వీరు జీవాత్మ లౌదు,
రిచట వారికి నాకును నేలదూర ?
మనుచు, భక్తుల గర్భాలయమ్ముఁ జేఱ
ననుమతించెనొ స్వామి లే కట్టిదగునె ?



తె. ఎప్పుడైనను జీవాత్మ, తప్పకుండ
చేరుఁబరమాత్మ, నిదిగదా సృష్టితీరు,
కాన, జీవుల నడ్డుట కానిసేత,
అనుచు, శివుఁడిచ్చెనో, యేమొ ? ఆజ్ఞ మున్న.

అందువలననే భక్తులకు గర్భాలయ ప్రవేశముకలిగినదేమో ?

శివునిఁ జేతితోఁదట్టి మేల్కొల్పి అఱచుటలోని భావము నిట్లూహించితిని.

ఉ. సర్వజగంబులన్ దిరిగి, సంతతమున్ నిజభక్తవర్గ, మీ
యుర్విని నాల్గు ప్రాంతముల నుండిన దానినిఁ బ్రోచుదీక్ష, నా
శర్వుఁడు, ఆ, సుదూర విదిశాంతరసీమకు నేగియుండు, నా
పర్వత కన్యకాపతినిఁ, బాలికిఁబిల్చు టె, యీ విధానమా.

లేకపోయినచో సర్వాంతర్యామి జగన్నేత్రుఁడు జగత్కర్తుఁడు అయిన భగవంతుని తట్టి లేపుటయేమి ? ఇదియంతయు సగుణోపాసనాంగమైన గౌణ భక్తివిధానమే.

విచారించగా భగవంతునిఁ దట్టిలేపుటలో అర్థమొకటియు నంతరార్థమొకటియు గోచరించును. అర్థములౌకికము. అనగా గౌణము అది ఉక్తపూర్వమే. ఇఁక అంతరార్థమేమనగా.

ఆకాశగతము సర్వవ్యాపి నిత్యమైన శబ్దము వాయుతరంగములలో లీనమై సర్వగతమైయున్నను సామాన్య కర్ణగ్రాహ్యముకాక విశిష్టమైన యంత్ర శక్తిచే (రేడియో) తనే యెట్లుగ్రహింపఁబడుచున్నదో అట్లే సర్వకార్యోపాధులలోఁ జేతనారూపము, పరమకారణోపాధి, సర్వాంతర్యామియైయున్న (బ్రహ్మము) భగవంతుఁడు గూడ సామాన్యేంద్రియములకు గోచరుఁడు కాఁడు. ఆయన నాకర్షించి దర్శింపఁజేయఁగల యంత్రము శుద్ధచిత్తము. కాఁబట్టి భక్తుఁడు భగవంతుని విషయపరాఙ్ముఖము, పరిసరవిషయ వాతావరణ దోషదూషితము కానిది నివాతదీపమువలె నిశ్చలమైనది "సర్వంఖల్విదం బ్రహ్మ" అను సమత్వ యోగయుక్తమైనది. అగుశుద్ధచిత్తముతో, మకరంద పానాసక్తమై సర్వమును మఱచి, దనను దానేమఱచి, సూర్యాస్తమానసమయమునఁ దనకాశ్రయమైన పద్మము ముకుళించుకొనిపోవుచున్నను తానందు బందీ కాఁబోవుచున్న విషయమునుగూడ గమనింపక మధుపానాసక్తచిత్తమైన మధుపము మర్యాదతో అంతర్ముఖుఁడై చిద్రూపుఁడైన భగవంతునిఁ జతుర్దశభువన పరిపూర్ణునిఁ దట్టి, అనగాఁదద్గతచిత్తుఁడై ఏకనిష్ఠుఁడై ధ్యాన యోగబలముతో స్పందింపఁజేసి, అట్లు స్పందితుడైన పరమాత్మని, "మల్లయ్యా వచ్చానయ్యా" అను ఆర్తితోఁగూడిన సంబోధనముద్వారా- అనగా తైలధారవలె అవిచ్ఛిన్నమైన నిరంతరసంలగ్నమైన భావనాబలము ద్వారా అభిముఖునిఁ జేసికొని దర్శింపవలెను. ఆ బ్రహ్మములో లీనుడు కావలెను. ఇదియే జీవబ్రహ్మైక్యభావమైన యద్వైతసిద్ధాంతము. నిర్గుణోపాసనము.

ప్రతిజీవికి అంతటి ప్రత్యాహారము (ఇంద్రియనిగ్రహము) అసంభవము కదా, అందువలనఁ బరమేశ్వరుని సన్నిధిలోనున్న ఆ రెండు నిమేషములైనను నిశ్చలభావముతో దేవుని ధ్యానింపవలెను. అనిబోధించుటయే ఈ యాచారముయొక్క యాశయము.

దైవము సర్వవ్యాపిగదా! అట్టి దైవసేవకై తీర్థక్షేత్రములకేల పోవలెను. అనునది ఒక ప్రశ్నము. దానికి సమాధానము.

ఉ. అంతట దైవముండెనుగదా? మఱిక్షేత్రములేల? ఏల య
శ్రాంతము తీర్థయాత్రలని చాలనిపలుకుల్ పల్కఁజెల్లునే?
అంతటఁబొంగుచున్న నదియందున రేవులు వ్యర్థమందువా?
చెంతకుఁజేర్చు విగ్రహముచెంతకుఁ బోవుట నేరమందువా।

ఉ. వారిధరమ్ములన్ వెడలివచ్చెడు, విద్యుదనంతకాంతినిన్
నేరవుచర్మచక్షువులు, నేర్పునదానిని. సాధనాంతర
ద్వారమునన్, సమీపితపథంబుననిల్పరె? సర్వపూర్ణుఁడో
వారిజనేత్ర సంగ్రహితభావము రూపము సర్వసేవ్యమే.

అందువలన తీర్థక్షేత్రాది సందర్శనము సగుణోపాసనాంగమై మానవ శ్రేయస్సులను గలిగించుచున్నది.

ఉ. కర్మలు చిత్తశుద్ధికని జ్ఞానులుపల్కరె? చిత్తశుద్ధియే
వర్మము జ్ఞానసిద్ధి. కటువంటిసుకర్మలె తీర్థయాత్రలా
ధర్మమె యట్టియాత్రల యథామతి చేయుట, కాని వానిలో
మర్మము గుర్తెఱుంగుటసుమా! అతిముఖ్యము పైర్థికాళికిన్

ఇట్లు భావనా గగనములో విహరించుచు దైవదర్శనముకొఱకై భక్తుల వరుసలో కొంతముందునకుఁబోతిని. నేను ఆ గగనకేశుని,ముందు, దూరము నుండియే దర్శించితిని. నాకాదైవము.

ఉ. సీమలకావలెక్కడో వసించిన బిడ్డఁడు, దర్శనార్థమై
బాములలెక్కచేయకయ వచ్చి పదంబులవ్రాలఁ ప్రేమతో
నీమములన్నిదూరముగనెట్టుచు నక్కునఁజేర్చు తండ్రిగా,
నామహనీయదైవ మట నాకుఁగనంబడెఁ ప్రేమమూర్తియై.

ఆ పశుపతినిఁ జూడగనే భక్తసంఘములో భక్తి యుప్పొంగిపారినది. స్తోత్రములు భజనలు ప్రారంభమైనవి. అపు డాలయాంతర్భాగమునందు.

ఉ హేపరమేశ! సాంబశివ! హేగిరిజాపతి! భక్తబాంధవా!
హేపురవైరి! శూలి! వలయీకృతశేష! ప్రభో! మహేశ్వరా!

హే పతితార్తబంధు! మృగహింస్రక! దేవ! గిరీశ! పాహి మాం
హే పరదేవతా యని ధ్వనించెను భక్తుల కాంస్యకంఠముల్

భక్తులబారు కొండచిలువవలె మెల్లగ ముందుకుఁబోవుచున్నది. ఒక్కొక్కరే దైవదర్శనము చేసికొనుచు ముందుకుఁబోవుచున్నారు. అధికారులు దైవసన్నిధిలో ఒక్కొక్కని ఒక నిముసముకంటె ఎక్కువ ఉండనీయరు. అది భక్తులకుఁ గష్టముగానేయున్నది. అయినను అచ్చటమార్గాంతరము లేదు.

ఉ. లక్షలు కోట్లు సంతు నిటలాక్షున కీజగమందు, వారు సా
పేక్షులు, తండ్రిదర్శనము బేర్మినిఁగోరుచురాఁగ నాలయా
ధ్యక్షులు, పొమ్ము పొమ్మనుచు నందఱఁద్రోయుచునుండ్రు, యుక్తమే,
అక్షులకోటు లెట్లుటఁ గృతార్థములౌ? పరమేశుఁ జూచుటన్.

ఆ వరుసలో నావంతు వచ్చినది. దేహము పులకించినది చిత్తామోదముగ నంబికాపతిపాదములను స్వయముగా స్పృశించి నమస్కరించి ఆ భవానీజాని సన్నిధిలో రెండు నిముసములుంటిని, ఆయల్పసమయములోనే ఆ భక్తపశంకరునకు శంకరున కిట్లు విన్నవించుకొంటిని.

ఉ. భూతమయూ! యమాంతక! విభో! కడుదూరమునుండివచ్చితిన్
చేతము చంచలమ్ము, నినుఁజేరెడు మార్గముఁ జేరనీక, నన్
యాతనపెట్టుచున్నది. యహంకృతిచావదు, సైఁచి తప్పులన్,
నాతనుపున్, బునర్భవము నందనియట్లు లనుగ్రహింపవే?

కైలాసనాథుని దర్శనానంతరము జగదంబను భ్రమరాంబా మాతను దర్శింపనేగితిమి, ఒకప్పుడు ధర్మవిద్రోహులు రాక్షసులు పెచ్చుపెరుగగా దుర్గాదేవి తనరోమ కూపములనుండి భ్రమరములను (తుమ్మెదలను) ఉద్భవింపఁజేసి వానిద్వారా వేలాది రాక్షసులను సంహరించినదట, అదిమొదలుకొని ఆ శాంకరికి జగదంబకు భ్రమరాంబయను సార్థకనామ మేర్పడినదట, ఆ తల్లి.

ఉ. "పిల్లలు వచ్చి రిప్పు డెట వీరలు, ప్రాశనమందియుండిరో,
తల్లిని నన్నుఁ జూడఁగ ముదంబున, "నంచును," వారియాకళుల్,
చెల్లఁగ, మంచిభోజనము లీయఁగనుండిన కన్నతల్లిగా,
చల్లని యా నగాత్మజ, ప్రశాంతముఖంబున, నాకుఁగన్పడెన్.

తే. ఆమె యురమునఁగల హారమందు, మూడు
రత్నముల్ గాంతులీనుచుఁ బ్రగాలుచుండె,
ముగురు మూర్తులయట్లె - ఔ, మూలమామె
కద! త్రిమూర్తుల శక్తుల కదలికలకు.

పరమేశ్వర దర్శనానంతరము పాతాళగంగా స్నానమునకు బయలు దేరితిమి - ఆగంగ శ్రీశైలేశ్వరునకుఁ జాలక్రిందుగా నున్నది ఆనది చూచు వారికి శ్రీశైలేశ్వరుని పాదసన్నిధిని బ్రవహించుచున్నట్లుండును.

తే. హరుని నెత్తికి నెక్కి గయ్యాళినైతి,
సతికి, నిది లక్షణముగాదు, పతిపదాబ్జ
నతియె గతియంచు, గంగమ్మ. నాగభూష
పాదతలమునఁ జేరిన భంగినుండె.

వ. పాతాళగంగకుఁబోవుటకు బస్సు లున్నవి - కాని మేమిద్దఱము మెట్ల మార్గమునే యనుసరించితిమి. మెట్లమార్గము వృద్ధులకు ననుకూలముకాదు. పైనుండి చూచిన గంగ చేరువలో నున్నట్లే కనఁబడును కాని యెన్ని మెట్లు దిగినను జేరువకురాదు

ఉ. అవ్యయమైన బ్రహ్మ మదె యల్లదె, యల్లదె - దానిఁ జేరుటే
భావ్యమటంచుపాసకులు, భావనచేయఁగ నంతకంతకా।
ద్రవ్యము దూరమైనటుల, ధైర్యముపీడక. యెంతయేగినన్,
సేవ్యము కాదు, పాపహర శీకర. శ్రీకర. చేతికందునే?

అయినను నిరాశచెందక లేనిఓపికను దెచ్చుకొని గంగాస్నానాభిలాషయే మమ్ము వెన్నుఁదట్టి నడువగా మెట్లుదిగుచుంటిమి.

చ. దిగిదిగి యెన్నొ మెట్టుల, నిదేయిదె గంగ యటంచునేగి, యూ
పగను, రసాతలాధ్వగను, బాపకుధారను, జేరఁగల్గితిన్
మొగిచి కరంబులన్, సకలభూతహితైషిణి, కాత్మఁబొంగితిన్,
బుగబుగఁబొంగు, నా యభవమోహిని ముగ్ధతరంగభంగికిన్.

## "పాతాళగంగ"

శ్రీశైలములో నున్న కృష్ణానదిని "పాతాళగంగ" అని వ్యవహరింతురు. యథార్థముగా నక్కడ నున్నది కృష్ణగదా! దానికి, "పాతాళగంగ" యనునామము ఎట్లు సమంజసమగును.

గంగా శబ్దము ఒకప్పుడు నదీ విశేషవాచకము. ఉదా॥ "గంగానది కాశి యందున్నది- ఒకొప్పుడు జలసామాన్యవాచకమగును - ఉదా॥ "ఇక్కడఁ త్రా"గుటకుఁ గుక్కెడు గంగయైనా దొరకదు - "వారు గంగాపుత్రులు (పల్లెవారు) కనుక "పాతాళగంగ" అనుసమాసమందని" గంగా శబ్దము నదీ సామాన్యవాచకమగును - నదీ సామాన్యవాచకమైన గంగాశబ్దము ప్రకరణ బలమువలన - అనగా శ్రీశైలమునకు ముందు తరువాత ప్రవహించు నది కృష్ణయేగావున ఆ సంబంధమునుబట్టి కృష్ణానదినే బోధించును - కనుక పాతాళగంగ యనగా కృష్ణానదియే గాని గంగానదికాదు - ఇచ్చటఁ బాతాళమందు - అనగా చాలలోతున ఉండుటచేత కృష్ణ పాతాళగంగగా వ్యవహరింపఁబడుచున్నది.

పాతాళగంగలో నఘమర్షణ స్నానములను జేసి సంతృప్తులమై తిరుగు ముఖము పట్టితిమి. మాకు సోపానావరోహణమే కష్టమైనది - ఆరోహణము కష్టతరమైనది - ఏ విషయములోనైనను పైకిపోవుట చాల కష్టము కదా!

ఉ. దారసుతాదిబంధముల, ధాన్యధనాధిక మోహపంక సం
చారములందు మగ్నుఁడగు జాల్ముఁడు, పొందినజ్ఞానబోధచే,
ఆరసి తత్త్వమున్, శ్రమలనంది తుదన్ గనునట్లు సాధ్య, మా
దారిని మెట్లనెక్కుచు, నెతల్ పడి, చేరితి మోక్షగమ్యమున్.

గంగాస్నానానంతరము తిరిగి దైవదర్శనము చేయుట అచ్చటి ఆచారము. అందువలనఁ దిరిగి శ్రీశైలేశ్వరుని దర్శించి యిట్లు విన్నవించుకొంటిని.

తే. ధూళి దర్శనమున, దేహ దోషచయము,
తొలఁగిపోయెను. గంగలోపల మునుంగ
చిత్తతాపంబు తీఱె,నో చిన్మయాత్మ!
రెంటశుద్ధుఁడనై నిన్నుఁ గంటినిపుడు.

శా. బాహ్యాభ్యంతర శుద్ధులన్ సతతమున్ బాటించు శక్తిన్, బుధ
గ్రాహ్యా! నాకునొసంగవే, యఘము నా కంటంగ నీకయ్య-యీ
మోహ్యంబౌ కలికాలపాశమున నన్నీడ్వంగనీకయ్య - నా
కూహ్యంబే? భవదీయతత్త్వము,దయాకూపార! మృత్యుంజయా

శా. వాగర్థంబులవోలె నైక్యతను సంపాదించి, భక్తార్థమై,
యోగాతీత! విభిన్నమూర్తులుఁగ నీ యుర్విన్ బ్రకాశించు, మీ
ప్రాగౌన్నత్యము, సృష్టి సంస్థితి లయవ్రాతాత్మకం బో మహా
భాగా! నన్ గరుణించి యీచరమభావంబందు రక్షింపవే.

క. ఏనాఁటి పుణ్యలేశమొ
ఈనాఁటికిఁ బండియిచ్చె, శ్రీశస్తుత! ఈ
శా! నాకంట్లకు మీ రూ
పానూనార్థప్రసిద్ధి భవభయహరణా!

ఉ. ఇప్పటి కండఁగల్గితి, మహేశ్వర! మీపదముల్, మఱెంక నే
నెప్పటికిన్ గనంగలనె? ఈశ్వర! మామనవుల్, మనస్సులోఁ
దప్పకయుంచి, మమ్ముల, సదా పరిపాలనఁ జేయుచుండు మో
యప్ప! యనుజ్ఞనిమ్ము నుచుఁ బ్రాంజలినై వరమేశు వేడితిన్.

తే. పోయి వచ్చెదమయ్య శంభో! పురారి!
కరుణయుంచుమ! మామీద ఖలవిదారి
పారమున్ జేర్పుమమ్ము సంసారజలధి
నోడుదుడుకులేని జీవిత మొనరఁ జేసి.

వ. సాధారణముగ దైవదర్శన మొకమాఱే చేయఁబడుచుండును. శ్రీశైలములో మొదట ధూళీదర్శనము పిమ్మట స్నానానంతర దర్శనము రెండు దర్శనములు విహితములు - వాని భావమిది.

ధూళిదర్శన సమయమున మానవుఁడు అపవిత్రుఁడు. అనంతరము ఆ పవిత్ర వాతావరణ పాతాళగంగాస్నానాదులవలనఁ బవిత్రుఁడై జ్ఞానియై పరతత్త్వము నర్థము చేసికొని మోక్షము పొందును.

శ్రీశైలేశ్వరుని దగ్గఱ సెలవుతీసికొని బయటకు వచ్చితిని. అక్కడ నున్నది కేవలము దేవాలయ ప్రాంగణముకాదు. పరమశివుని ప్రాజ్యసామ్రాజ్యము. ఆరకూట ఫలక నిర్మితములైన ద్వారబంధములు సువర్ణమయములా! యన్నట్లున్నవి. అతివిశాలమైనది ఆలయ ప్రాంగణము. చుట్టు పరమ శివుని చుట్టుకొని యున్న సర్పరాజ భ్రాంతిని గలిగించు ప్రహరీగోడ, భక్తులకు విశ్రాంతి మందిరములా యన్నట్లున్న మహావృక్షములు, అచటి పవిత్ర శైవాచారములు, ఇవి యన్నియు శ్రీశైలమును అపర కైలాసమును జేయు చున్నవి.

పూర్వ మాప్రాంతమున నరభక్షక సంచారమేకాని నరసంచారము లేదట. ఒక్క శివరాత్రినాఁడు మాత్రమే యచ్చటకు నల్పసంఖ్యాకులు భక్తులు వచ్చుట. పశుపతికిఁబూజాపురస్కారములు జఱుపుట యుండెడిదట, మరల శివరాత్రి వచ్చువఱకు నన్నిరాత్రులు ఆ శివునకు శివరాత్రులే (పస్తులే)

కాలము మాఱినది,మార్గసౌకర్యము లేర్పడుటవలన భక్తులసంఖ్య యధిక మైనది. శివునకు ఆదాయము పెరిఁగినది సంవత్సరమంతయు నాలయద్వారములు మేల్కొనియే యుంటున్నవి. కృత్తివాసుఁడు దుకూలవాసుఁడైనాఁడు. రాజభోగములేర్పడినవి. ఇపుడాయనకు ప్రతిరాత్రి శివరాత్రియే (ఉత్సవ రాజరాజసఖునకు దినము) అహా! కాలప్రభావమెంతగొప్పది. భోగిని జోగిని చేయఁగలదు. జోగిని యోగినిఁజేయఁగలదు.

ఉ. భావము మాననీయ మిది, భాసురుఁడై యణిమాది సర్వభా
గ్యావృతుఁడైన శంకరున కౌనె? యకించనతత్త్వ, మెట్లు? స
ర్వావనిభర్త కోగిరము నన్యులు పెట్టుట, యీ విధాన, మా
కేవలుఁ జేరఁ జేయు, వరకృత్యమె, శైవము నిర్వికారమే.

ఆ ప్రాంగణములో నొకచోట ఒకే కుదురునుండి యుద్భవించిన రావి జువ్వి మేడి వృక్షములున్నవి, అవి మూలవిరాట్టు నుండి ఉద్భవించి రజస్సత్వ తమోగుణములతో స్వస్వవ్యాపారముల నేమఱక చేయు బ్రహ్మవిష్ణుశివులను జ్ఞాపకముచేయుచున్నవి.

ఆ వృక్షత్రయమునకుఁ "త్రిఫల" అనిపేరు, అనగా ధర్మార్థకామములకు సాధ్యమైన ఫలమును, ముక్తిని ఇచ్చునది యనిభావము. ఆ వృక్షము కొన్ని వేల సంవత్సరములనాఁటిది. ఆతరురాజముక్రింద దత్తాత్రేయులు తపస్సు చేసెరట, అందువలన నా వృక్షమునకు "దత్తాత్రేయవృక్షము" అని నామాంతరము. ఆ తరువుచుట్టు విశాలవేదిక కట్టఁబడినది. ఆ చెట్లను త్రిమూర్తులనుగా భావించి భక్తులు వానికిఁబూజలు చేయుచుందురు. సంతానార్థులు ఆ చెట్టు కొమ్మలకుఁ జిన్నచిన్న ఉయ్యాలలను గట్టుచుందురు. ఎన్నియో చిన్న చిన్న ఉయ్యాలలు ఆ కొమ్మలకు వ్రేలాడుచున్నవి.

ఆ దేవాలయములలోఁబూజాపాత్రలు పాత్రలు విగ్రహములు సర్వము రజతమయమే. వెండికొండపై నున్నవానియింటిలో వెండికేమితక్కువ ?

ఒకచోట అద్దములగదియున్నది. అందుగోడలు కప్పు దర్పణమయములు. చిత్రము ? ఆ గది మధ్యమందు నిలఁబడినవ్యక్తి పరిసర భిత్తికానిబద్ధ దర్పణాంతరములందు అనేకవ్యక్తులుగా గోచరించును. ఆ సన్నివేశము.

తే. బ్రహ్మ మొక్కఁడె, కార్యములంద నేక
రూపముల నందినట్లు, వే, రూపములను
దర్పణంబుల నొకఁడూపె తనరు నచట,
ద్వైతమందునఁ దోఁచు నద్వైతమట్లు

ఆ గది మధ్యమందు వెండియూయల యొకటి యున్నది. ఆ యూయలలోఁబార్వతీ పరమేశ్వరులకుఁ బవ్వళింపుసేవ చేయిదురట.

అక్కడకుఁ గొంతదూరములో నొక మహాచూత వృక్షమున్నది. అది నాలుగు శతాబ్దములనాటిదట, ఆ చెట్టునకు చాల యెత్తువఱకుఁ గొమ్మలు లేవు. ఆ పై భాగమున శాఖలున్నవి.

ఉ. బంధము లొక్కటొక్కటిగఁ బాయఁగ, డెందము గండఁ జేయు సం
బంధము లన్ని రోసి, భగవత్పదపద్మము, నింద్రియాలు పు
ష్పంధయరీతిఁ గొల్వ, నిండి భాస్కరుపైఁ దనచూపు, సర్వ శ
క్తిం, ధృతిఁజూచు యోగివలె, దృష్టికి నాక్షితిజమ్ము కన్పడెన్.

అక్కడ నొక కళ్యాణ మండపమున్నది: దానియందు శివపార్వతులకు నిత్యకళ్యాణములు జరుగుచుండుసు. ఆమె సర్వ మంగళ, ఆయన సర్వ మంగళుఁడు. వారికిఁ గల్యాణములకు (శుభములకు) ఏమితక్కువ.

ప్రతి దినమచ్చట నాముష్మిక సోపానములైన పుణ్యకథా పురాణాది కాలక్షేపములు జరుగుచుండును.

ఆ ప్రాంగణమందే, వీరభద్రుఁడు, పంచమఠములు, గంగాధర మండపము, నందిమండపము, సాక్షిగణపతి విగ్రహము, కైలాసద్వారము మొదలైన యనేకదృశ్యములు కనుపించొనర్చును

ఈ విధముగ ఆ శ్రీశైలేశ్వరుని రాజధానిఁలోగల విశేషములను యథాశక్తిగ దర్శించి, రాత్రి. 2 గం, నిరంతర ముఖోద్గత వాసిధారుని దుష్టవిదారుని శివాధారుని నందికేశ్వరుని ధామమునకు బయలుదేరితిమి.

## మహానంది

మా త్రినేంత్రుఁడు (బస్సు) సకలజీవప్రబోధముగా శంఖారావముచేయుచుఁ జీకటినిఁజీల్చుకొనుచుఁ బ్రయాణము చేయుచున్నాడు.

శ్రీశైలము పర్వత శిఖరాగ్రమున నెలకొన్న దివ్యక్షేత్రము. మహానంది నేలపైఁ దావుకొన్న పుణ్యతీర్థక్షేత్రము. పర్వతాగ్రమునుండి భూమికి సాఁగుచున్న మా ప్రయాణము.

ఉ. చేసిన పుణ్యకర్మములచేతనె, శ్రీగిరియెక్కి, తత్ఫలం
బా, సకలేశు సన్నిధిని హాయిగఁబొంది, యనంతరంబు, భూ
మీసతి యంకమందు, మలిమేనుకు, దోహదమైన చెయ్వులన్,
జేసికొనంగఁబోవుగతిఁ, జిత్తమునందునఁ దోఁచె నాయెడన్

శ్రీశైలమునుండి మహానందికిఁబోవు బాట కిరుపక్కల నిబిడారణ్యములు నిండియున్నవి. అం దధికముగానున్న వెదురుపొదలు అరణ్యమునకు గహనము, అనునామము నన్వర్థము చేయుచున్నవి. ఆయడవి.

తే. త్రిగుణశక్తి నమేయమై, జగములెల్ల
నిండి, యజ్ఞేయమై, బ్రహ్మకంపమైన
ప్రకృతి మాయా స్వరూపమువలెనె, యెరి
కనుగుపెట్టఁగ, సాధ్యము కానిదయ్యె,

అరణ్యములు భయంకరములైనను, అత్యంత ముపయోగకరములు కూడ, మేలుగీళ్లు కలిసియుండుటయేగదా సృష్టిరహస్యము. అరణ్య మహిమ వరేణ్య మనుటలో సందేహము లేదు.

సీ. కళకు గుండెలనుండి, కమనీయ కావ్య మా
యడవి నుండియెగాదె యవతరించె
పంచమ వేదమై పరఁగు భారతగాథ
విపిన మధ్యమునందె వెలసెగాదె
వెన్నముద్దల బిడ్డ కన్నయ్య కతలెల్ల
కానయందే గాదె కన్ను తెఱచె
జమిలి తొమ్మిది ప్రాఁతచదువుల చిగురులు
వనమునందే గాదె వన్నె కెక్కె.

తే. చీఁకువాలున కావలఁ జేరియున్న
సుషమ మొగసాలగడప యిచ్చోటనెగడె
తనువుపెనుపున కేత మీ వనముగాదె
హిందుసంస్కార బీజము లిందె మొలిచె.

శ్రీశైలమునుండి ఏడు గంటలు ప్రయాణముచేసి, 28-9-84 ఉదయము 9 గంటలకు మహానంది చేరితిమి, మహానందికి చుట్టును వృక్షలతాదులతో నిండి పచ్చని కాంతుల నీనుచున్న కొండలున్నవి. అక్కడ

చం. కురియని నీలమేఘములగుంపులు పైకొనునట్లు శ్యామలాం
బరముల చాందినీవలె, నభంబున నిశ్చల ధూమ్యయోయనన్,
తరు నికరాభ్ర చుంబన విధాన వికీర్ణ విశాలశాఖికా
పరిగతమై దివమ్ము, కనుపట్టును నిచ్చలు నందియందునన్

మహానంది గొప్పతీర్థము క్షేత్రము. కాని యచ్చటిస్థలమునకు, శుచిత్వమునకు జాలదూరము. ఇటువంటి స్థలములలోఁగూడ అధికారులు శ్రద్ధవహింపరు. వారినేమనవలెను.

ఉ. లాతిమతంబులందు గొరలందఱు తన్మతదేవభూములన్
భూతల నాకముల్ వలెనె పూనికఁ జేయుచునుండ, నాంధ్ర భూ
నేతలు, క్షేత్రతీర్థముల నించుక శ్రద్ధను జూపరైరిసీ!
జాతికిఁ బ్రోదిచేయుటకుఁ జాలని రాజ్యము రాజమెట్లగున్.

ఇందువలననే అతివిశాలమైన యద్వైతమతము తగినంతవృద్ధిని పొందలేకపోయినది. మహా వటవృక్షచ్ఛాయలఁ దలఁదాచుకొనవలసిన అంకురము ఆ వటవృక్షమునే అధిగమింపఁజూచుట ఎంతవిడ్డూర్యము.

ఆ క్షేత్రములో ఒక స్వచ్ఛజలాయ మున్నది. దానిలోనికి నీరు నందీశ్వర ముఖాంతర్గతమై నిరంతరము బహిర్గతమగుచుండును. ఆనీటిచేతనే అ ప్రదేశము సస్యశ్యామలమై శోభిల్లుచుండును.

ఉ. ఈశునినెత్తినుండి పయనించినగంగ, స్వవాహనంబు, నం
దీశుని నోటినుండి, తన యేలుబడింగల నేల, నేల, భ
క్తాశయముల్ ఫలింప, నిరతంబుఁటఁ బాఱుచునుండె, లేక యా
కాశసకాశగంగ పరుకంటికి నానక యెట్లు వచ్చెడున్.

ఉ. "ఏఱుల జన్మముల్, దెలియ నేరికి శక్యముకా" దటంచుఁ బ
ల్మాఱులు చెప్పలేదె బుధమండలి, నందిముఖ ప్రభూతమై
పాఱుచునున్న దీ యమరవాహిని పుట్టుక, యింతదాక, యె
వ్వారు నెఱుంగరైరి, గిరివాసుని జాయగతుల్ దురూహ్యముల్,

క్షేత్ర తీర్థములలో జలపుష్పములెక్కువ, అవి స్నానముచేయువారి పాదములకు గిలిగింతలుపెట్టుచు నవరోధము కల్గించుచుండును. చిత్రము! ఆ సరస్సులోని జలము ఎంత దవ్వేగినను గంతదఘ్నముగానే యుండును.

ఉ. స్థూలము సూక్ష్మమై పఱఁగుచుండు, నుపాధులయందు, సంతతో<br>ద్వేల దఖండరూపమున, బృంహితమై, పురుషాంశ, మొక్కటే<br>లీలఁగ, నొప్పుచున్నటుల, లేశము మాఱక, నంది తీర్థమం<br>దోలిగ నొక్కలోతె, కల, దొక్కఁడు నేర్పునఁగూర్చినట్లుగన్.

తే. అచటి చేపలు నల్లని వాటఁదోఁచు,<br>స్నాతకాంఘ్రిగ కలుష భక్షణముచేత<br>మాఱియున్నట్లు లేకున్న మచ్చెము గుమి,<br>తెల్లనిదిగాదె జగములో నెల్లయెడల

తే. లోన వెలుపల, స్వచ్ఛమై, కానఁబడెడు,<br>నంది జల మొప్పు, నిహపరానందములను,<br>సహముగాఁ బొందఁగలయట్టి, సజ్జనాత్మ<br>వలెనె, సర్వత్ర శుభ్ర మభ్రమువలెనె,

ఉ. అచ్చటి గంగలో, జలకమాడినఁ, బాపములన్ని, గాలిలో<br>రెచ్చిన ధూళివోలెనె, పొరింబొరి రూపఱు. మంచిచేఁతకున్<br>జెచ్చెర నడ్డువచ్చి, తుదిఁజేర్పని, విఘ్నములట్లు. మాకటన్<br>మచ్చెము గుంపులెన్నొ నఘమర్షణకృత్యము నడ్డగింపగా

మేము వాని రాయిడిని సహించుచు యథావిధిగ స్నానాదుల నాచరించి పరిశుద్ధులమైతిమి.

అచటి జల మతిస్వచ్ఛముగా నుండును. గట్టున నిలఁబడి నీటియడుగున నున్న గుండుసూదినైన గుర్తింపవచ్చును. అందులకు జలమహిమనే కారణముగాఁ జెప్పుచుందురు. కొంచెము పరిశీలించినచో కారణాంతరముకూడఁ గన్పించును.

ఆ వఱవ పుట్టుకనుండి, శైలాంతర్భాగములనుండి అసూర్యంపశ్యమై ప్రయాణించినది. గండశిలలను ఒరిపిడిచేయుచు నడచినది. అందువలన రజో మాలిన్యములేక స్వచ్ఛమైనది. మఱియు ఆ జలాశయాధోభాగమున నాఁపరాళ్లు పఱువఁబడియున్నవి ఇఁక ఆ జలము స్వచ్ఛముగా కెట్లుండును? మన యిండ్లలో సిమెంటుతొట్లలోని జలము స్వచ్ఛముగా నుండుటలేదా, ధూళీ ధూసరిత, మైనపుడేగదా, జలమునకు ధూసరవర్ణము వచ్చునది. స్వచ్ఛమైన ఆ జలమే బహిర్గతమైనపుడు మలినమగుటలేదా, అనగా నచటిజలమునకు నుపాధి కారణ మగుచున్నదియని తేలుచున్నదిగదా.

తే. మొయిలు నీరము, స్వాశ్రయ భూమివలన
రూప రుచిభేదములనందు. రోయ. మూల
జలము శ్వేతమె, మధురమే, జలమునందు
మార్పు భ్రాంతియె, బ్రహ్మమై మనును జలము.

తే. పాపులెల్లరు తమలోని పాపములను
గడిగివేయఁగ, నానీరు కలుషమగుచు,
ధరణిఁ బ్రవహించుఁ గాలుష్య మరయఁ గలదె?
కృష్ణవేణికి, దివిజాత కీర్తిఘనకు.

స్నానానంతరము మేము శైవదర్శనమున కేగితిమి. ఆ దేవుని నామము మహానందీశ్వరుఁడు. ఆ క్షేత్రమునుబట్టియే ఆ దేవున కానామము వచ్చియుండును.

నామనిర్వచనము :

మహాంశ్చాసౌ ఆనందశ్చ మహానందః (అవ్యయానందః) స చ అస్మిన్ వర్తతే ఇతి మహానందీ. (అఖండ బ్రహ్మానంద స్వరూపుడు) స చ అసౌ ఈశ్వరశ్చ మహానందీశ్వరః. అవ్యయానంద స్వరూపుడైన మహాప్రభువు. అని ఫలితార్థము. లేక భక్తరక్షణ జనిత మహానందవాన్ సర్వేశ్వరః (భక్తులను రక్షించుటవలనఁ గలిగిన గొప్ప సంతోషముకల జగదీశ్వరుఁడు) అనియుఁ జెప్పవచ్చును.

ఆ దేవాలయములో శివలింగము పానువట్టముపై కాక నేలమీదనే యున్నది ఆ లింగము శిరస్సుమీద ఒక నీలముద్ర కనుపించినది. పరిశీలింపగా నది గోవు పాదాకారముగా నున్నది. దానిని గురించి యచటివారి కథన మిట్లున్నది.

మ. ఒక గోసాధ్వి, మహాటవీపథమునందున్నట్టి, మృత్యుంజయున్
సకలాత్మున్ గని, "ఈ పినాకి క్షుధతో సంభ్రాంతుఁడైనాడు. వీ
నికిఁ, బాలిచ్చెదనం చు, నా మృడునిపై నిల్చెన్, స్రవించెన్,
జమిన్
మకరందామృత" ధార, మిన్నుదిగు నా మందాకినిన్ బోలఁగన్.

శా. ఆ గోవట్లు నిరంతరమ్ముగఁ, దన క్షీరాసార మందీయఁగా,
త్రాగున్ శంకరుఁ డొక్క నాఁడది, గనెన్, దత్పోషకుం, డందు చే
నా గోస్వామి జ్వలించి ముష్టిధరుఁడై యాధేనువున్ గొట్టఁబో
గాఁ, గంగారున గోవు త్రొక్కె శివు, నా యంకమ్ము ముద్రించెనెన్.

ఇటువంటి కథలే శ్రీశైలాది క్షేత్రచరిత్రలోఁ గూడఁ గన్పడుచున్నవి. ఇవి సత్యములైనను న సత్యములైనను ఇచ్చట మనకు ముఖ్యమైనది కథ కాదు కథవెనుకనున్న యొక సందేశము. ఆ సందేశము మేధావులకే గోచ రించును. ఆ సందేశమునకు దోహదములే ఈ కథలు, వీనినే "యర్థవాదము" అందురు. అర్థం అంతర్గతార్థం, విశేషార్థం వదతీతి అర్థవాదః, (వాచ్యార్థము నేకాక తత్కథాంతర్గతమైన విశేషవిషయమును తెలియఁజేయునది అర్థ వాదము).

అర్థవాదములు మహోత్తమ భారతీయ సంస్కారరత్నములను దాచఁ దగిన పేటికలు, మన సమస్త పురాణేతిహాసాదులకు శరీరస్థానములు.

ఉ. వేదములందుఁ గూడ, నొక భేదము కన్పడు, నర్థవాదమం
చాదర మెంతొ పొంది, యనగా, నొకధర్మము బోధచేయఁగా,
నేదియొ యొక్క గాథను రచింతురు మూదలగా, మనీషు, లా
మాదిరి గాథలన్ని జగమందునఁ బేర్గనె నర్థవాదలై.

తే. మన పురాణములన్నియు మునుపు నేఁటు
నర్థవాదమయమ్ములై యలరుచుండె
వాని నన్నిటిఁ గాదన వశమె మనకు,
లోకక్షేత మేదియైనను రూఢిఁగనదె?

ఉ. పొల్లది, తండులంబులకుఁ బూర్తిగఁ బ్రోవెనిఁజేయు, దాన సం
ధిల్లును, వానికిన్ దగిన తేఁకువ. భక్షణమందుఁ, దీసి, యా
పొల్లును, దండులంబులనె భుక్తికిఁ జేకొనుచుండునట్లుగా,
నల్లన నర్థవాదముల నాంతరభావమె, గ్రాహ్యమై తగున్.

ఆ.వె. చెఱకు నమలి, త్రాగి, చిక్కని రసమును,
బెరడు వదలునట్లె, పరమభావ
ములను, దెలిసి, విడువవలయును, నర్థవా
దముల, ధర్మపోషకముల, నెపుడు.

ఆ.వె. బెరడులేక రసము, పెరుగునే గడయందు?,
బెరడె రసమునకును, బెద్దరక్ష.
అట్లె యర్థవాద మంతయు, ముఖ్యార్థ
మునకుఁ గవచమగుచుఁ బ్రోచుచుండు.

భగవంతుఁడు భక్తవత్సలుఁడు- తనభక్తుని చరితార్థునిగాచేయుటయే అయన లక్ష్యము. కావుననే తనకుఁ బాలిచ్చిన గోవుపాదముద్రను శిరమున ధరించి తన చరిత్రతోఁబాటు ఆ గోవుచరిత్రగూడ చిరస్థాయిగాఁ జేసెనాఁడు. యాదృచ్ఛికముగా బాలిచ్చిన గోవునే శంకరుఁ డాదరించినాడు. ఏకనిష్ఠుఁడై నిరంతరము త్రికరణశుద్ధిగాఁ దనను సేవించిన భక్తుని భగవంతుఁడు ఇంకెంత గానో ఆదరించును అను పరమార్థమే ఈ యర్థవాదమునకుఁబరమార్థము. కేవలము అర్థవాదమందలి బాహ్యార్థమునే గ్రహించిన అజ్ఞుఁడు పతితుఁడగును. గాని బాగుపడడు. మహానందీశ్వరునకు స్వయముగా నభిషేకము చేసికొంటిమి.

చం. స్వయముగ దైవసన్నిధిని, భాగ్యముచే, నభిషేకసత్క్రియన్
నియమవిధిన్, మహేశ!భువనేశ్వర! యంచును జేయుచుండ, నిం

క్రియములు, సర్వమున్ మఱచి, దేవుని పాదములందె నిల్చె, స్వా
మియె మనసంత నిండెఁ, గుసుమించెను జీవిత మాక్షణంబునన్.

ఉ. ఒక్క క్షణమ్మె చాలు, విషయోద్ధతిఁబాసిన చిత్తశుద్ధితో
మ్రొక్కులుతీర్చువాని పదముల్ దరిసించుచు, సర్వసంసృతిన్
జిక్కులఁ బెట్టుదానికడఁ జేరక, ఈశ్వరుఁ గొల్చునట్టి, దా
దృక్కె తిరమ్ముగానయిన, దేవుడె తట్టును, నింటితల్పున్.

అభిషేకానంతరము. ఆప్రాంగణములోనే యొకచోట శ్రీ ఆంజనేయ
స్వామివారిచే సేవింపఁబడుచున్న సీతారాములను దర్శించితిమి.

ఉ. తెల్లనిపాలరాతిపయిఁ, దీర్చిన సుందర భూసుతా మనో
వల్లభవిగ్రహంబులను, బాదముచెంతను, భక్తినమ్రుఁడై,
ఉల్లము పల్లవింపఁగ, రఘూద్వహుఁగొల్చెడు నాంజనేయు, ను
త్ఫుల్ల విలోచనంబుల, నతుల్ పొనరించితి చూచి భక్తితో.

తే. దాసరక్షణకై యవతారమెత్తి
నట్లు యుండిరి, జానకీనాథు లచట,
ఆంజనేయుఁడు, నుండె, దాసాంజనేయుఁ
డనఁ, బ్రసన్నాంజనేయుఁడు నగుచు నగుచు,

ప్రయాణసమయ మాసన్నమైనదని మాత్రినేత్రుఁడు చేయు హెచ్చరికలను
విని యచటి త్రినేత్రున కభిముఖుఁడనై.

ఉ. తప్పులు చేయుటే నరకదంబమునైజము. కాన మే ము తెం
దెప్పులతప్పులన్ బరగ నెప్పుడు చేయుచునుందుమయ్య మా
తప్పులనెంచి, సూర్యమణి ధర్మముతో, మముఁ జేరఁదీసి, పెన్
దెప్పవునై, భవార్ణవము తీర్ణముఁ జేయుము, నందికేశ్వరా!

తే. బాల్య కౌమార యౌవన వయసు లాతె
గండుపిల్లిగ ముప్పు మాదంత దమికె,

దశలయందున ముదిమి దుస్తార్యముగద
సుఖ వితార్యముఁ జేయుమా, సోమచూడ !

తే. వ్యాధి యాధుల బాధల నంటనీకు,
క్లేశములఁబాపు మల్లికార్జునేయ ! ఈశ,
సెలవునీయుము ! అంబికాచిత్తచోర !
అనుచు నుతియించి, శివునకుఁ బ్రణతులిచ్చి

నందికేశ్వరుని యనుమతినిఁ బొంది. 28-9-84 సాయంకాలము మంత్రాలయమునకు బయలుదేఱితిమి.

## మంత్రాలయము

మాబస్సు మహానందిలో 28-9-84 సాయంకాలము 4 గం॥ బయలుదేరి 7 గం॥ మంత్రాలయము చేరినది మంత్రాలయము కర్ణాటక ప్రాంతములోనిది

మంత్రాలయము ఒక పవిత్రక్షేత్రము, ఈనాఁటికిని అక్కడ ప్రాచీన సంప్రదాయములు కొనసాగుచున్నవి. పాదరక్షలను చొక్కాలను విడిచి ఉత్తరీయమును వేసికొని దేవాలయములోనికిఁ బోవలయును. అక్కడి వారందఱు విభూతిరేఖలధరించి వానిపైఁ కుంకుమను బెట్టుకొందురు. శివకేశవ భేద మచ్చట నున్నట్లులేదు.

అచ్చటదైవము రాఘవేంద్రస్వామి- అచటి స్వామివారి విభూతిని, భక్తుల యనుభూతిని, మహిమల సంభూతిని గమనించిన, నా స్వామి.

ఉ. భక్తుల రక్షణార్థము, నభంబును గాదని, రాఘవేంద్రుఁడై
రక్తినిఁ దన్నుఁగొల్చెడు నరావళిఁ గాచుచు బ్రోచుచున్ మహా
శక్తుల నెల్లఁ జూపె నిట, సాగరజాపతియే. యధర్మమే
వ్యక్తమునైనచోట భగవంతుఁడు పుట్టఁడె ధర్మరక్షకై.

ఉ. మంత్రమనంగ, వేద మొకమాన్యుఁడు వేదపవిత్రమూర్తి ని
ర్యంత్రితచిత్తుఁడై యిట ధరాంతర దేహమునందుఁ జొచ్చి దు

స్తంత్రుల రోసి, తన్ గొలుచు సర్వజనావళిఁ
ప్రోచుచుంట చే,
మంత్రమహాలయమ్మగుచు, మాన్యతమంబగు నా ప్రదేశమున్.

ఉ. "రాఘవులన్న, నా రఘుకులాన్వయజాతు లె,యింద్రుఁడన్న నా
రాఘవ సింహాసనమై వెలయు రామవిభుండగు- భక్త సంఘ స
ర్వాఘములన్ హరింప, రఘురాముఁడె యిచ్చట,
రాఘవేంద్రుఁడై
మోఘ కలిప్రభావుఁడయి పుట్టె"నటందురు, కొందఱావిభున్.

చ. "ఎవరెవ రెట్లు నన్ను భజయించెదరో, యటె, వారి, కేను, పె
క్కు వరములిచ్చి ప్రోతు"నను గోపవరోక్తము, నామనంబులోఁ
దవిలెను, రాఘవేంద్ర బహుధాగత తన్మహిమావలోకన
శ్రవణజ భావనాబల నిరంతర మేదుర బుద్ధివేద్యమై.

క. నాకును నా భక్తులకును
స్తోకము భేదంబుకూడఁ దోచదు, భక్తున్
జేకొని, నావానిఁగ న
ప్రాకృనిగఁ జేతునంచు, భగవంతుఁడనెన్.

ఆవాక్యప్రకారము శ్రీకృష్ణపరమాత్మయే రాఘవేంద్రస్వామిగా నవతరించెను. అని కొందఱు.

ఆ ప్రాంగణ మధ్యమం దొక తులసీ బృందావన మధ్యమందు ఆస్వామి వారి సమాధి యున్నది. ఆ స్వామి లోకమును ఉద్ధరించి

ఉ. వచ్చినకార్యమెల్లఁ గడవన్, దనజన్మము సార్థకమ్ముగా,
నిచ్చట నింక నేమిపని, యేగెద నంచును, రాఘవేంద్రుఁడే
యెచ్చటలేని పద్ధతిఁగఁ బృథ్విని జీవసమాధినందె, నా
సచ్చరితోన్నతాత్మ యట సాఁకును నేఁటికి భక్తకోటులన్.

గోపాంబ తిప్పణ్ణ యను దంపతులకు వేంకటనాధుఁడను బుత్రుఁడు పుట్టెను. అతఁడు సుధీంద్రుల శిష్యుఁడై సకలవిద్యలను పఠించి అన్ని మతములలో మాధ్వమతమే యుత్తమమని సిద్ధాంతముచేసెను. ఆయనకు "బరిమళాచార్యుఁడని బిరుదమున్నది. పిమ్మట ఆ పండితుఁడు గురుని యాదేశమువలన" సన్న్యసించి రాఘవేంద్రస్వామియను పేరుతో బ్రసిద్ధిఁగాంచెను.

తే. భిన్నమతముల హృదయ సంపన్న భావ
పారిజాతము, లొక్కటై, పాదపూజ
సలిపెఁ, దీర్థుల, కెంతటి సత్వమూర్తి
రాఘవేంద్రుల వారవిరామయశులు.

వ. కలవును బోఁగొట్టుట, మృతబాలుని బ్రతికించుట హోమగుండములో దగ్ధమైన రత్నహారమును రప్పించుట మొదలగు మహిమల నెన్నింటినో స్వామి చూపించెను.

తె. మాంస ఖండములన్, పరమాన్నముగను,
దాశరధి కాదృతిన్, నివేదనముచేసి,
లక్షమహిమలఁ జూపిన, రాఘవేంద్ర
తీర్థమహిమల, వర్ణింపఁ దీఱుభవము (భయము).

సీ. తను గొల్చువారి నందఱఁ బ్రోవ సమకట్టి
సేతుశీతనగాంత సీమయందు
సంచార మొనరించు చా రాఘవేంద్రులే
ఆచరించి ప్రజాహితార్థములను
బాపజగమ్ము లోపలఁ బుణ్యకాంతులఁ
బఱపి యజ్ఞానముఁ బాఱఁద్రోలి
అక్షరంబులు నక్షరాశ్రయగ్రంథముల్
రచియించి మించి సురాళిగురువు,
వేదమయమూర్తి తులసీ పవిత్రవనము
నందు జీవసమాధినిఁ బొందిరపుడు

మూడువందల వత్సరములు గతించె,
నింక, నిరువెండువందల యేండ్లు, మహిమఁ
జూపి యావల నాస్వామి శుద్ధపథముఁ
జేరఁగలఁడని పెద్దలు చెప్పిరచట.

తే. "అన్నివేళల, భోజనమ్మన్న సూక్తి
కాప్రదేశమే, నిలయ"మై, యలరుచుండు.
అన్నపూర్ణమ్మ చిఱుగజ్జె యచటమ్రోఁగు,
రెండుపూఁటలఁ బ్రతిరోజు దండిగాను.

ఈ విధముగా నాల్గుగంటల కాలము రాఘవేంద్ర తీర్థస్వామిని సేవించి ఆరోజు రాత్రి 10 గం. హంపి విజయనగరముల దర్శింప బయలుదేరితిమి.

## హంపి

ఉ. రాత్రి పదింటికిన్, శకటరాణ్మణి, షట్పదగామి, మంత్రమున్
యాత్రికబృంద భారవహుఁడై వడి పీడి, జలేజమిత్రుఁ డా
మిత్రుఁడు, రాకముందుగ, గమించి శ్రమించి హరించి చేరె, సా
ర్వత్రిక సచ్చరిత్ర కరపాత్రముఁ, దెల్గుల కీర్తిగోత్రమున్.

ఉ. హంపినిఁజేరి మారథ, మహంకృతి నిల్చెను, నాంధ్రజాతికిన్
బొంపిరివోని కీర్తి మణిభూషగనిచ్చిన దైవమూర్తి వా
చాంపతిముఖ్య సంస్తుత విశాల విశిష్ట మహత్త్వపూర్ణుఁ డా
కంపితమృత్యు,వా నుదురుకంటి, నివాసగృహమ్ము ముండటన్.

ఆ ప్రాంతమునకు "హంపి, యను నామ మున్నది, అనగా - హం, శత్రూణాం. అహంకారం, పినష్టి చూర్ణయతీతి హంపి, అనగా శత్రువుల యొక్క గర్వమును నాశనము చేయునది యని వ్యుత్పత్త్యర్థము

మా బస్సు విరూపాక్షస్వామి గుడిముందాగినది. ఆ మహాలయ మతిప్రాచీనము. అయాలయ ధర్మకర్త విద్యారణ్యస్వామి. ఆమహానుభావుని పేరుతోనే ఆంధ్రరాజధాని విద్యానగరము నిర్మింపఁబడినది - విద్యారణ్యుని తపోబలము

చేతనే విద్యానగరము విజయనగరమై 250 - సంవత్సరములు శత్రు దుర్భేద్యము కాఁగలిగినది.

ఉ. కూప జలంబులన్ దరిసి, గొబ్బున నీరములాడి యష్టల
క్ష్మీ పరిభ్రంపోతుంపయి, భజించెడివారల కెల్లకాలమున్
ప్రాపగువాని గొల్వ, భయభక్తులు ముప్పిరిగొన్న చిత్త స
ద్వ్యాపృతి సందడింప నిటలాక్షుని కంజలిసేయ నేగితిన్.

శ్రీవిరూపాక్షస్వామి యాలయమును సమీపించుచు నొకమాఱు పరిసరములఁ బరిశీలించితిని. ఒకప్పుడీ మహాక్షేత్ర మతి విశాలమై అపరవిశ్వామిత్రుఁడైన విద్యారణ్యమహర్షికి నివాసమై ఆంధ్రమాత స్వేచ్ఛగా నూపిరిఁ బీల్చుకొనుచు సుఖముగా నివసించుటకు ననురూపమైన దివ్యమందిరముగా విలసిల్లినదిగదా. నేఁడది చిన్నపల్లె. స్మరణీయ శిథిల దివ్య కళాఖండములకు నిలయము. అలనాటి హంపిపెంపులను నెమరు వేసికొని నేఁటి శిధిలహంపిని దర్శింపగా.

ఉ. సుందర దేహదార్ఢ్యమునఁ జూపఱ చిత్తము నాహరించి, భూ
మిం, దొలలేని స్థైమమున, మేటియటన్న మహాప్రతిష్ఠ రూ
పందగఁ, గాలచక్ర దశనాహతి, దేహము శీర్ణమై, జరా
నిందితుఁడై కృశించు మహనీయుఁడు, నాయెదఁ దోఁచె, నా
యెడన్.

క. ఆఱడుగుల ప్రాంశువు, బల
మాఱఁగ, ముప్పున, వికుంచితాంగుఁడునై, మై
జాఱఁగఁ, దక్కుచుఁ దాఁటుచు,
కాఱియ నందినవిధమ్మఁ గంటిని హంపిన్.

తే. హంపిదేశము చూచినయంత నాకుఁ
దోఁచె, నానేల, ప్రాచీన దూరచరిత
చలనచిత్రము తెరపైన, సాఁగిపోవు
చిత్రగమివోలె, బాధితచిత్తమగుచు.

తే. అంతలో, హంపి మొగముపై, నద్భుతముగఁ
గుంకుమాంకము దిద్దిన గొప్పవాఁడు,
ఆంధ్రజనతకు, స్మరణీయుఁడైనవాఁడు,
వెలిగె నామది, విద్యాటవీబుధుండు.

శా. విద్యారణ్య మహర్షికిన్, దెలుఁగు నిర్వీర్యత్వమున్ బాపఁగా,
ప్రద్యోతించిన దివ్యమూర్తికిఁ, దపఃప్రజ్ఞాప్రభా నిర్మితాం
ధ్రోద్యానాంతర పుష్పవాసిత దిశా స్తోమాంత సత్కీర్తికిన్
సద్యస్స్ఫూర్తికిఁ జేసితిన్ వినయ విశ్వాస ప్రణామంబులన్.

సీ. ఆముష్మికమునకు నైహికంబగు మూల
మనుచు దేశమ్మును మనుచువాఁడు
జనవిరూపాక్షులన్ జంప విరూపాక్ష
ధనము సాధనమని తలఁచువాఁడు
పదుగడియలు తా నీశ్వరకోశము
దేశహితార్థ మందించువాఁడు
విజయనగరమును వేయేండ్లు నిల్పఁగా
శాయశక్తులఁ గృషి సలుపువాఁడు
మానవత్వమునందునఁ గానఁబడెడు

తే. దైవతత్త్వమువాఁడు విద్యావనుండు
అట్టివానిని మఱచినయట్టి యాంధ్రు
డాంధ్రుఁడా! ప్రాణమున్న గుండ్రాయిగాని,

వ. అట్లు ఆంధ్రసామ్రాజ్య సౌధనిర్మాణమునకుఁ బునాదివేసినవాఁడు మహాభాష్య కర్తయునైన విద్యారణ్యస్వామి నభినందించుచు ఆలయాంతర్భాగములోని కేగి విరూపాక్షస్వామిని దర్శించితిని.

ఆ.వె. నీరుపాప నుదుటినేత్రములో దుష్ట
శిక్షసేయ, శిష్టరక్షసేయ

నీరుపాపయుండు, నిర్నిద్రుఁడాతఁడు
పాపశిక్ష, భక్తపాలనముల.

స్వామి దర్శనానంతరము బయటకు వచ్చి యచటి విశేషములను జూచుచుంటిని. అక్కడ గోడపైభాగమున శ్రీకృష్ణదేవరాయల, చిత్రపటమున్నది.

ఉ. సాహితియందు, భీకరరసార్ద్రరణాంగణమందు మిన్నయై
ఈహిత రాష్ట్రసిద్ధికయి, యెన్నియొ కష్టములన్ భరించి ని
ర్వాహిత లక్ష్యసిద్ధియగు, రాణ్మణి కృష్ణమహీపు రూపు నా
యూహల రూపమైనిలువ నొయ్యనఁ జూచితి నాదరంబునన్.

శా. పాగామధ్యమునుండి జాఱు, చరి భూభాగంబు, నుజ్జ్వలతఁగా
నూగం జేసిన కుచ్చు, కత్తి కల మనోన్యంబుఁ దుల్యమ్ముగాఁ
దూఁగన్ జేయు నహంకృతిం దెలుపు కాంతుల్ జిమ్ము
మీసమ్ములున్,
ప్రాగౌన్నత్యముఁ జాటు రాచసిరి, ఆ రాజేంద్రుకున్ భూషతో.

తే. విజయలక్ష్మికి విడిదియా, వెడదయురము
న్యాయలక్ష్మికిఁ దాపులై నట్టికనులు
కావ్యలక్ష్మికిఁ గాణాచి, దివ్యరసన
కృష్ణరాయుని కీ పృథ్వి నెవఁడు సముఁడు.

ఆ మహాపురుషుని శాంత గంభీర రూపమును దనివోవఁజూచుచున్న నాకు ఆ సార్వభౌముఁ డేదియో చెప్పుచున్నట్లుగఁ దోఁచినది. ఆ యవ్యక్తభాష, తొలుత నా కర్థముకాలేదు. అందులకు నేను నిర్విణ్ణుఁడనయి యుండగా ఆ కవివాగీశుని యనుగ్రహమున నాభావము, దెలిసికొనుశక్తి నాకుఁగలిగినది. ఆయన ఆంధ్రభోజుఁడుగదా!

ఉ. ఓయీ! సోదర! నన్నుఁ జూచితిగదా ఓనాఁటి నీ యాంధ్రదే
శీయౌన్నత్యము నూహచేయగలవా? క్షేత్రాక్షి
యొక్కండు మా

ధ్యేయంబెంచి ,పురాతదీయ విభవాధిక్యంబు గుర్తించి "యూ
హూ" యంచున్, గనుబిందు వొక్కటి విడిందా! యంచు
నే నెంచెదన్.

ఉ. చీమలబారువోలె, దరిసింపఁగ నీధర, వచ్చు చంద్రుఁడు కా
నీ, మనుజుండొకండు నెదనిండఁగ నూపిరిపీల్చి నాఁటి యూ
ధామముఁ జూడలేఁడు, కవితాసుతుఁడే యది చూడఁగల్గు నీ
వేమయినన్, రచింపఁగలవే? యలనాటి మహావిభూతులన్.

ఉ. నా కొనయూపిరిన్ మెలఁగు నాఁటి యనన్య తెలుంగు రాజ్యల
క్ష్మీ కమనీయ వైభవము, క్రిస్సి నశించినదయ్యె నేఁడు, సు
శ్రీకము నాఁటి తెల్గులఁ విశిష్టమహత్త్వము, తెల్గునాఁట, నెం
దాకనునుండు, నంతకు, ముదంబును బొందుదు స్వర్గవాసినై.

క. కావున నీవు రచింపుము,
నా వసుధా మహిమ నెల్ల, నా కవితా శ్రీ
భావము నీకందింతును,
బోవిడిచి భయంబుఁ, జేయుమోయీ! రచనన్.

తే. ఎందఱెందఱో, వర్ణించి రీ మహాధ
రణిని, నల్పుఁడనంచు నిరాశపడకు
ఎన్నిమాఱులు చదివిన నెంతవిన్నఁ
దనివితీఱునె? మాతృ సుధాచరిత్ర.

ఉ. అన్నటు తోఁచె, నాంధ్రవసుధాధిప నేత్రము లాత్మ భాష, నా
తెన్నకుఁ బొంగిపోయితినిఁ దీయని యూహలు మొల్కలెత్తె నే
మన్ననుఁ స్వేదమోడ్చి తెలుగన్నలు కట్టిన రాజధాని సం
పన్నతఁ గొంతనైనఁ, దెలుపన్ గమకింతును, శారదాకృపన్.

ఆ ఆలయాంతర్భాగమున నొక విచిత్రమున్నది. అక్కడ ఎత్తైన గోడపైభాగమున నొకయద్ద మమర్పఁబడి యున్నది. దేవాలయ గోపురము,

దానికెదురుగ నెక్కడనో యమర్పఁబడిన ఆదర్శమునఁ బ్రతిబింబించి యటనుండి ఈ యద్దములోఁ గన్పడుచుండును. అది యొక యద్భుత దృశ్యము.

ఆశిథిలముల మఱుఁగున మాయమైన అపూర్వ పూర్వకళా సంపదను దలఁచుకొన్న సహృదయ హృదయము చెమర్పకమానదు.

ఆ ప్రదేశములో ఎక్కడఁ జూచినను ఖండిత కళాఖండములే, అంగ వికలములై భయంకరములైన సుందర విగ్రహములే, నష్టప్రాయములైన దేవాలయ భాగములే, ఛిద్రుపలై రూపఱియున్న మహాసౌధ శకలములే, ఏ కఠోర రాక్షసుఁడు ఈ ఘాతుకమున కొడిగట్టినాడో-ఏ మహాభూతము మతమదిరాపాన మత్తమై పవిత్ర దేవాలయముల నేలమట్టమగునట్లుగ వికటాట్టహాసముతో తాండవముచేసినదో-ఏ మహాక్రూరుని అసూయా పిశాచము పిచ్చిపట్టినదై ఈ సుందరతర హంపీ మానససరోవరమును గల్లోలముచేసి నామమాత్రావశేషము కాలించినదో-ఏ మతదురహంకార ఝంఝూవాతము విచ్చలవిడిగా విజృంభించి సర్వ మాన సోల్లాసము గావించు నీ హంపీసుందరోద్యానమును రూపురేఖలు లేకుండఁగ విఱిచివిఱిచి వ్రయ్యలుచేసినదో, ఆ మహాదుష్ట భయంకర దమన శక్తినిఁ దలఁచుకొని కలతపడితిని, క్రుంగిన మనస్సు పొంగినది. చలిలో వేఁడిపుట్టినది. ఆఱువదివత్సరముల నాలో నిరువదివత్సరముల యావేశము ప్రకోపించినది.

చం. ఎవఁడురా ! వాఁడు కంచుకమునెత్తిన, పీఠఫణీంద్ర మస్తకో
ద్భవ, మణికాంతి,మాపఁ దలపందిన మూర్ఖుఁడు,మానసదాఁటదా?
పవనభు గంగసంగతము, వ్రాలదె ? యీ కుఱుసంబు, నిన్న నాఁ
డెవఁడును, గావఁడేఁడురా ! యహీనుని దంష్ట్రిలనుండి, యేడ్చె నన్

చం. ఎవఁడురా ! వాఁడు, పూజ్య తెలుఁగిందిర, ముక్కుచెవుల్
హరించి, యీ
భువి కమరత్వమిచ్చెడు, నభూతమహోన్నత శిల్పగేహముం,
దవమతియై, రగిల్చెను హుతాశనకీలల, వానిచేయి, కా
లవశమునన్, దునాతునకలై, పడిపోవదె ? ధూళియందు నన్

చం. ఎవఁడుర! వాఁడు, భూమిసతినేలెడు, ధర్మము కాలువిర్చి, మా
నవతను మంటఁగల్ప జతనం బొనరించినవాఁడు, వాఁడు, ముం
దు, వగలలో మునింగి కడుదుస్థితినంది, నశించితీఱు నీ
కవివచనంబు తప్పునె? యొకండును దీసినగోతఁ గూలడే?

సీ. జిలుఁగు పల్కులఁ బల్కి, చెవిబండుగన్ జేయుఁ
జిలుక యే దోషంబు చేసియుండె
పురివిప్పి నాట్యముఁ బొనరించి రంజించు
నెమలి యేతప్పుఁదా నెఱిఁగిచేసెఁ
అడవికే యందమై నడగూడు హరిణము
కానికర్మల నెటఁ బూనిచేసె
క్షీరపీయూషముల్ చేతికందించెడు
గోసాధ్వి చేసె నే ఘోరకర్మ
పరసేవలోఁ బ్రాణపంచక మర్పించు
మంచివాఁ డేపాప మెంచి చేసె
నీడను ఫలముల నిచ్చి సంతోషించు
చెట్టే మిదోసఁగును జేసియుండె
తే. కాని, వానినె క్రూరుఁడు కరుణలేక
బూడిదను జేయుచుండును బొట్ట నింప
కారణములేక త్రిభువనోదారమైన
ఆంధ్రలక్ష్మిని ధరఁగల్పి రసురు లట్లు

ఆవల నొకచోట సమున్నతమైన వినాయకవిగ్రహమున్నది. అది ఒకే శిలలో మలచఁబడినది. జీవకళ తొణికిసలాడు ఆ విగ్రహము సాక్షాత్తుగా అక్కడఁగూర్చున్నట్లేయుండును. ఆ విగ్రహము చాలపెద్దది. దానిని జమత్కారముగా సెనగగింజ వినాయకస్వామి విగ్రహ మందురు. ఇచ్చట సెనగగింజ పదమునకు వ్యతిరేకార్థమును జెప్పుకొనవలయును. సెనగగింజ ఎంత చిన్నదో ఆ విగ్రహమంత పెద్దదని ఫలితార్థము.

ఇంకొకచోట విశాలమైన పానువట్టముపై పెద్ద శివలింగ మున్నది. ఆ పానువట్టము. 12, చదరపుగజముల వైశాల్యమున్నది. దానిపై శివలింగము ఆఱడుగుల యెత్తు, అంతే వైశాల్యము కలిగియున్నది. దానిపైనున్న గుడి పడఁగొట్టబడినది. "శూన్యలింగస్య పూజనం. అశ్వమేధఫలప్రదం" అను సూక్తిని స్మరించి ఆ కొండవీటిజంగమునకు ప్రణామ కుసుమపూజ చేసితిని.

ఆ ప్రక్కనే మహోన్నతమైన ఉగ్రసినరసింహస్వామి విగ్రహమున్నది దానియెత్తు 22, అడుగులు, వెడల్పు సుమారు 7 అడుగులు అవిగ్రహముఖములో దుర్మార్గులపైన ఆ దేవునకున్న జుగుప్స ద్వేషము స్పష్టముగాఁ గనుపించుచున్నవి.

ఆ విగ్రహము రాయలవారి కాలములో చెక్కఁ బడినదటఁ మత దురహంకారులు ఆవిగ్రహము చేతులు విఱగఁగొట్టిరి. ఆ ప్రక్కనే జగన్మాత శ్రీమహాలక్ష్మి విగ్రహమున్నది. ఆ తల్లి కాలు సేతులనుగూడ దుర్మార్గులు విఱుగఁగొట్టినారు. ఆ యుగ్రనరసింహస్వామిని మానవ స్వభావముతో నిట్లు ప్రశ్నించితిని.

శా. ఏమయ్యా ! భగవానుఁడా ! అసుర దండింపంగ, నుగ్రాకృతిన్
భూమీమాత భరమ్ము డింపఁగ, సముద్భూతుండవై నీసటల్
వ్యోమంబందునఁ బర్వ రక్కసుని నీ యూరుప్రదేశంబునన్
భూమింగల్పిన నీ మహోద్ధతి యెటుల్ పోల్లయ్యె, వమ్మయ్యెనో

ఉ. అంతటి యుగ్రమూర్తికి భయంకరశక్తికి నింతయోర్పు ? ధ
ర్మాంతకు లిట్లు నిన్ను యమయాతన పెట్టఁగ నోరువిప్పవే ?
చెంతఁగలట్టి యాలిని స్పృశించిన దుష్టు సహించి తెట్లు ? మా
కంతునుబట్టవే ? భవదఖండ నిగూఢ విధానపద్ధతుల్.

చ. పరమనిధాన ! కర్మ పరిపక్వముకానిదె ! యెట్టి ధూర్తునిన్
నరకము పిల్వఁజాలదు, తనంతనఁ బోవును గర్మపక్వమై
నరుఁడని, యూరకుంటివ ? వినాశన మెక్కడిదయ్య ! నీ జగ
ద్భరముగ నున్న యాత్మ, కదిబాధ్యమె ? యేప్రళయంబు వచ్చినన్.

చ. శిథిలము దేహమౌ. నది నశింపక తప్పదు. సర్వకారణ
ప్రథితము బ్రహ్మ నిత్యమని పార్థునకిచ్చిన దివ్యగీత నీ
విధముగఁ జెప్ప నెంచితివ ? భిన్న నిజాంగ శరీరధారివై.
అధరిత సర్వశక్తియగు నవ్యయు నిన్ను నెఱుంగశక్యమే ?

కం. మానవమాత్రుఁడ దేవా !
మానవ భావమున నిన్ను మదినెంచి యిటుల్
గౌణముగా నూహించితి
శ్రీనిలయా ! నిన్నుఁ దెలియు చిత్తము నీవే.

అక్కడకుఁ గొంతదూరములో బలిష్ఠమైన వీరభద్ర విగ్రహమున్నది. అదిమాత్రము సంపూర్ణావయవములు కలిగియే యున్నది, ముష్కరులు ఆ స్వామి ప్రచండరూపమును జూచి భయపడిరేమో.

ఉ. క్రోధము పుంజమై యిరవుకొన్నద ? లేక, మహోగ్రకాలమే,
సాధుల బాధపెట్టు పరుషాత్ములఁ గూల్పఁగ రూపమెత్తెనా ?
మేధకుఁ గానరాక, గడిమించిన రుద్రుని, వీరభద్రునిన్
సాధితలక్ష్యుఁ గాంచితిని, సభ్రమ సంభ్రమ లోచనంబులన్.

అయినవారియొక్క అకారణ వైరోద్భూత క్రోధాగ్ని కింధనమైపోయినది మహాసాధ్వి సాధ్వీమతల్లి సతీదేవి. ఆమెకుమారుడే వీరభద్రస్వామి. తల్లి నవమానించినవారిని హతమార్చి తల్లి ఋణమును దీర్చుకొన్న ధన్యుఁడు.

శా. ఓ కర్తవ్యపరాయణా ! పరమసత్కోవ్పార్జిత ప్రాభవా !
నీకన్నన్ మఱి యెవ్వఁడయ్య ! జననీ నిర్వేదమున్, దీర్చుటే
నా కర్తవ్యమటంచు నెంచి, రిపులన్ నాశంబుఁ బొందించు వా
డీ కర్తవ్యము హొందువందినఁ బరుండీనేలఁ గాల్వెట్టునే ?

ఉ. తల్లిని రూపుమాపిన కథన్ విని, యందుకు బాధ్యులైన వా
రెల్లరు, దండ్యులేయనుచు నెంచి, దయారస ముజ్జగించి, నీ

యుల్లము వచ్చినట్లుగ, నొక్కొక్కనిఁబట్టి వధించి, యింక నే
ప్రల్లదుఁ, డిట్టి కానిపనివైపునుఁ జూడకయుండఁ, జేయ వే.

చం. పితరుని గానఁబూని, యరివీరుల మట్టముచేయ నెంచి, యూ
ర్జిత బల విక్రమంబులను రెచ్చి, విరోధుల మట్టిఁగల్పి, నీ
మతమును బూర్తిచేసికొను, మాన్యవరుండవు వీరభద్ర! నీ
జతనము శ్లాఘ్యమైన, దది, జాతిని నిల్పు ఘ జీవగఱ్ఱయే.

వీరభద్రుని మాతృభక్తికి విస్మయమంది, సోమరియై ఆలనా డలసభావముతో నమూల్యమైన మాతృదేశసంపదను ధ్వంసము చేయుచున్న దుర్మార్గుల యకృత్యములను సహించిన యాంధ్రు నుద్దేశించి కాగుచున్నగుండెతో నిట్లంటిని.

తే. వీరభద్రుని గాథను వింటివిగద,
సిగ్గుగల్గద, నీబీద చెయ్దమునకు,
కార్యవిముఖుఁడ వానినిఁ గాంచియైన
మేలుకొమ్మర! నీదేశ మేలుకొనర!

ఉ. ఈశుని సూనుఁ డెట్లు, మదినెంచక, యీతఁడు మిత్రుఁ, డీతఁడో
ఆశలనేలువాఁ, డితఁడె యయ్యకు నమ్మకు జుట్టమంచు, ను
గ్రాశయుఁడై వధించె రిపుకాండము, నీవును, నట్లె, దేశర
క్షాశయబుద్ధివైన, మనసంపద ఈవిధి నాశమందునే?

ఉ. హింస, యకృత్యమే, పరుఁడు హీనుఁడు నీయిలుసొచ్చి, పొంచి, నీ
యంశమునందు నున్న ధనమంతయు దోచఁగ, నూరకుంట, వి
ధ్వంసకు నూపిరిచ్చుటగదా! నిజదేశము బ్రోవ, వట్టి మీ
మాంసలఁ జేయనేల?, బలమంతయు దేశముకోసమే కదా.

ఉ. నెత్తిననెక్కి కూర్చొనడె? నిత్యము చాపు, నరుండు వెండియున్
మిత్తినిఁబొందునే?, అసువుమించునె? మాతృధరాగరిష్ఠసం

పత్తిని- ఓయి!ఆంధ్రుఁడ!అభాగ్యుఁడ! మేల్కొని, నాఁడు నీవు నీ కలిసి వ్రేలగీసిన, నొకంఁడును బుట్టునె? కాని దీభువిన్.

చం. నరునకు దేవదేవు డలనాఁడు రణాంగణమందు నిచ్చు, నా
పరమ హితోపదేశగత భావము, దేశవిదేశ పండితుల్,
శిరమునఁబూన దాని నిరసించి, యకించన! తెల్గుతల్లి పె
న్నురమునఁ, జిచ్చు పెట్టితి వహో! అపకీర్తిని మూఁటఁగట్టుమన్.

హంపి ప్రాంతమంతయు కదళికా వనమయమై యున్నది. అచ్చటి ఆ పచ్చని అరఁటితోటలు భూదేవి హృదయములోఁ జల్లారుచున్న సంతాపాగ్ని ధూమపుంజమువలె నున్నవి. ఆ పరిసర విశేషముల నవలోకించుచు హంపి సరిహద్దులను దాఁటి విజయనగరములోఁ బ్రవేశించితిమి.

## విజయనగరము

అది విద్యానగరము. అదియే కృష్ణరాయ విజయానంతరయు విజయనగర మైనది. అది సాహిత్యసమరాంగణ సార్వభౌముని రాజధాని, పేరులోనే పెలలకు హడలెత్తించు వీర మహానగరము. హంపినుండి విజయనగరము వచ్చుట కైలాసమునుండి వైకుంఠమునకు వచ్చినట్లున్నది.

ఆంధ్రచరిత్రకు స్వర్ణయుగత్వమును సంపాదించిన ఆ మహనీయ భూభాగమును జూచినంతనె చూపులు నొడలు జలదరించును మనసు విహ్వల మౌను. సాహిత్య సమర సార్వభౌముని యనితరసాధ్యములైన కత్తిగలములు మనస్సులలో విద్యుల్లతలవలె మెఱసి ఆనాఁటి దివ్యవైభవమును స్ఫురింపఁజే యును. సకలభువన విజయ మా భువనవిజయము చిత్తములలో హత్తు కొనును శత్రువులకుఁ ద్రాఁచుల బుసలు, మిత్రులకు హరిచందనము పసలై, నిమ్మలను దానిమ్మలను నెమ్మిగా నిల్పుగొనగల్గి మోముసొమ్ములైన యా కవితారణవీరుని మీసలపసందు మదిలో కదిలి ముదమును గలిగించును- అష్ట దిగ్గజముల కవితా ఘీంకారములు మయూర క్రేంకారములవలె కర్ణరసాయన ములగును వందల వత్సరముల చరిత్రభారమును భరించుటచేత మందము లైన యచటి పిల్లతెమ్మెరలు శరీరమునకు సుఖము కలిగించును. ఆనాఁడు రసికాగ్రణులు ప్రాణముకంటె మిన్నగాఁ బెంచుకొన్న పూఁదోటల గుబాళింపు

ఘ్రాణతర్పణము చేయును. కవిరాయుడు రాయఁడు వర్ణించిన (ఆయుక్త మూల్యదలో) భోజ్య పదార్థములరుచి రసనలను రసవంతములు చేయును. ఈ విధముగా నా దివ్యదర్శనము ద్రష్టలకుఁ పంచేంద్రియ సమారాధనము చేయును.

హంపిలోపలనే విజయనగరములోఁగూడ శిధిల శిల్ప కళాఖండ సహస్రములు ప్రత్యక్షములైనవి. ఒకప్పుడు అఖండకళాఖండము. అమూల్య సాహిత్యరత్న ఖాండము. ఆంధ్రసామ్రాజ్య వృద్ధికొఱకై కరవాల స్రువముతో విద్వేష పశువసను వ్రేల్చిన హోమకుండమునైన ఆ తెలుఁగుఖండ మిట్లైనదేమా ! యను మూక బాధ కలుగకమానదు.

ఆ విజయనగరములో శిధిల శిధిలమున దాని పూర్వపుటౌన్నత్యము స్ఫురింపుచునేయున్నది. ప్రతి శిధిలాంతర్భాగములో విద్యారణ్యస్వామి స్వార్థ రహిత ఆంధ్రౌన్నత్య సహితమైన అపూర్వ కృషి చాటుగనో మాటుగనో కన్పడుచునేయున్నది.

ఉ. ఆ మహనీయ దివ్య మహిమాన్విత శక్తిఫలమ్ముగా, ధరా
సీమకు డిగ్గినట్టి, త్రిదశేశ్వర పట్టణమా !, యటన్న భా
వామృతధారలన్, మనసునందున నిల్పెదు, నాఁటిపీటిశో
భా మహిమాదు లెంచి, తలవంచితి, నా యెదనిండ పెన్నెలల్.

శా. ఆ వాగ్భాణుని దీవెనల్, హృదయమం దావిర్భవంబందుచున్,
ద్రోవల్ సూపఁగ, రాయయుగ్మము, బలస్తోమంబులన్ గూర్చి, యాం
ధ్రావేశమ్మది, పొల్లువోనిదని, యా ప్రాంతంబునన్ జాటదే,
ఆ వాసిన్ దులకించె నా కనులు, భవ్యానందబాష్పాకృతుల్.

మా గోత్రపూజ్యులైన మహాత్ముల సత్కృషి ఫల మీవిధముగా ఛిన్న భిన్నమై పోగా మాకే యింతబాధ కలిగినదే మఱి తత్కర్తలు భోక్తలునై యిపుడు మహేంద్రున కతిథులైయున్న ఆ మహితాశయులు ఈ వైపరీత్యమును విని యెంతగాఁ దల్లడిల్లియుందురో.

సీ. తన తపశ్శ క్తిసాధ్యము, భేద్య మాటను
విన్న యతీంద్రుఁ డే వెతలఁ బడెనొ
తన భుజార్జిత సంప దంతరించుట విన్న,
రాయయుగ్మం బెంత రాటుపడెనొ
తన సుధీఘటిత సౌధము కుప్ప కూలగాఁ
అప్పాజి యెంతిగా నడలు గనెనొ
తన చేతిపంటలు దగ్ధమాటను విన్న
కృష్ణరాయం డెంత ఖేదపడెనొ.

తే. తనదు టంకము ప్రాణము ధారపోసి
జీవ మిచ్చిన శిల్పలక్ష్మి గృహమ్ము
ఊరుఁబేరును లేకుండ నుర్విఁగలియ
శిల్పి మనసెంత ముక్కలుచెక్కలగునొ!

ప్రయాణముచేయుచున్న జంఘాలుఁడు ఒకచోట నాగినాడు అక్కడకు రెండువందల బారల దూరములో సంస్కార రహిత వ్యక్తివలె నొక కట్టడము కనిపించినది.

ఆ కట్టడములో ఒక సరస్సున్నది. అది రాణివాసము జలక్రీడలాడు సరస్సట, ఆ జలాశయము నిర్మాణ మపూర్వము, ఆ సరస్సునకు చుట్టును బన్నెండు గుఱ్ఱపుఁదలలున్నవి. ఒక కీల నొక్కగానే ఆ పరిసర నదీగర్భ జలము, ఆ ద్వాదశాశ్వముఖములనుండి జాలువాఱి క్షణములో నా విహార దీర్ఘికను నింపివేయునఁట, నదీగర్భమునుండి ఆ సరోవర గర్భమువఱకు భూగర్భ ప్రణాళిక లున్నవఁట, ఆ యంత్రమును మఱియొక పైపునకుఁ ద్రిప్పినచో సరోగతమైన జలమంతయు క్షణములో బహిర్గత మగునఁట, ఎంతటిది! ఆనాటి విజ్ఞానగరిమ! రాయలవారి హృదయవీణను సుస్వరముగాఁ బలికింపఁగల మహాపైణికురాలు చెన్నమ్మ, ఆ రాజ్యమునకుఁ జిన్నమ్మయైన చిన్నమ్మకొఱకై నిర్మింపఁబడినదఁట యీ సరస్సు.

ఉ. కమ్మని కావ్యగానములఁ, గాలముఁ బుచ్చెడు, తెల్గుతేనికిన్
గొమ్మవు, రూపురేఖల సుకోమల కామల జాతివల్లికిన్

గొమ్మవు, నేలనుండి వెలుఁగొందిన యావత దివ్యశోభకున్
గొమ్మవు, నీపదార్ద్రిరసగుంఫితి, మీ తల మంత, చిన్నమా.

తే. నీదు నీరాట నెలవుగా నెగడినట్టి
ఈ సరోవర మెక్కాలే యింతవఱకు
చెప్పుచున్నది నీయొక్క సిరి గరిమను
మెల్లమెల్లఁగ, చిన్నమ్మ ! యుల్లమునకు

మేము రూపురేఖలులేక ఎగుడుదిగుడు త్రోవకలిగి అతివిశాలమైనను బాటకాని యా బాటపై పోవుచుంటిమి. అది యొకనాఁడు విజయనగరమునకు ప్రధాన వీధియఁట. ఆ బాట ఆనాఁట వరహాలమూట. తెలుఁగు రాసిరి యల వోకగా విహరించు పూలతోఁట తెలుఁగుల యున్నతిని దేశదేశములకుఁ దెలియఁజేయు శ్రావ్యమైన పాట. దగద్ధగాయమానమైన నవరత్నకాంతిచ్ఛటల కూట.

ఆ విశాలరథ్యలో ఆనాఁడుగజఘటలు బరాబరులు చేసినవి. అవి నడ గొండలు, అశ్వరాజములు వల్గత్ పంచగతివిశేషములతో సంచరించినవి. అవి జలధి తరంగములు, కాలుపెట్టరాని కదలికలతోఁ గ్రిక్కిరిసి జనకదంబము లఁట నడయాడినవి. అవి అపార పారావారములు.

ఆ దొరహట్టము నట్టేచూచి అమరావతి ఆశ్చర్యపడినది కుబేరపట్టణము క్రుంగిపోయినది. విదేశయాత్రికులు విస్తుపోయినారు.

ఆనాఁటి రత్నాలనిలయము. ఈనాఁడు గులకరాళ్ళకు సదనము. ఆనాఁడు సుగమ్యపథము ఈనాఁడగమ్య నివసథము. నరసంచారములేని యొక యెడారి

ఆ భూతపూర్వ మహాంధ్ర రాజధానిలో రాజవీధిలో ప్రయాణించు చున్నాము. అంతలో కాలు కలుక్కుమన్నది బాధ చురుక్కుమన్నది. ఏదియో ముల్లు గ్రుచ్చుకొన్నదనుకొని గాలినిఁ దడవితిని, చిన్న రాతిశకల మొకటి చేతికిఁ దగిలినది. దానినిఁ జేతిలో నుంచుకొని చూచితిని, దానిలో నా కొక చిఱువెలుఁగు కనుపించినది. ఇంకను బరిశీలనగాఁ జూచితిని, అది

మిణుగురు పురుగువలెఁ గన్పించినది. ఆ వెలుఁగులో నొక అస్పష్టధ్వని వినిపించినది.

కం. ఓ యాత్రికుఁడా నా కథ
ఆయత భిమవిజయనగర మద్భుతమయ్యా
ఏ యొకఁడు, నా చరిత్రకు
"ఊఁ"యనఁడా యనుచు నిచట నుంటిని ఓర్మిన్.

ఉ. వందల వత్సరంబు లిలపైన గతించె, గతించె, దెల్గురా
జ్యేందిర చెల్లె నావయసు, చిక్కితి మానన తాపబాధచే
నెందఱో, యీ పథంబుపయి నేగుచునుండిరి, కాని, నన్ను జూ
షం, దమకింకఁ డొక్కఁడు, జడాత్ములు నేఁటి తెనుంగు
మానవుల్.

తే. గుండెలోఁ జేరి కంతియై, కొఱకుచుండె
నాఁటి తెల్గుల వైభవ పాటవంబు,
ఆంధ్రులకుఁ జెప్పకొన్నచో, నది కఱఁగును,
బాధ శమియించు, వినెడు దౌర్భాగ్యుఁ డెవడు.

తే. ఎంతకాలమొ కన్నుల నెల్ల విప్పి,
చూచి చూచియు విసిగితి, వేచియుంటి,
ఒక్కఁడైనను రాఁడ! నాయొక్క కథను,
వినెడు వాఁడు, యథార్థము కనెడువాఁడు.

తే. మందలోఁ బోక, పరిసరమందుఁ జూపు
లానఁజేయుచు, మెల్లగ నడుగు నిన్నుఁ,
జూడ నా కాశ కల్గెను, వీఁడు దేశ
భక్తుఁడై యుండు, నాకథ రక్తుఁడగును

తే. నిన్ను మేల్కొల్పి. యీ తెల్గునేలగాథ
తెలియఁజేయఁగ, నామదిఁ గలిగెఁ గోర్కె

అందుకే నేను నీ పాదమందుఁ జిక్కి
దృష్టి మరలించి తిట్లు ఓ తెలుఁగువాఁడ

తే. నిజమ? నాయూహ, నీ తెల్గునేలచరిత
వినెడు సంస్కారమున్నదా ! వేడ్క కలద ?
యాత్రికులలోన నొకఁడవై యఱుగు నీకు,
తీరికున్నద ? ఎఱుఁగలదే, తితిక్ష.

ఉ. ఓపికయున్నచో విను, మహోన్నతరాంధ్ర సముజ్జ్వలత్ ప్రభా
దీపిత సర్వభూమి మణిదీప పవిత్ర చరిత్ర, నాకు సం
తాపము వాయు, నీకు నొకనాఁటి, త్వదీయ విశాల దేశసం
వ్యాపృత భవ్య భాగ్య,మనుఁగా! వినుభాగ్యము కల్గు నిత్తఱిన్.

ఉ. నాకథ చాలయున్నది వినన్ బహుకాలముపట్టు, నీకు నం
దాకను దీరికెక్కుడిది, దానిని నే వడఁబోసి చెప్పెదన్,
జేకొని దీని, నీ తెలుఁగు నేస్తము వారికి, గుర్తుచేయుమా !
వాకొన నూఁకొనన్, మనకు బాధ్యతయున్నది తెల్గు తోటచే.

కం. అచ్చెరు వందకు మీ శిల
అచ్చముగా వాగ్మివోలె నై పల్కును, ఇం
కెచ్చట నిట్టిది కలదే ?
పొచ్చెం బేదైన, దీనఁ బుట్టదె యంచున్

శా. ఆ విద్యావిపినాధి నాథుని. కృపా యత్తుండనై, ఫాలనే
త్రావిర్భూత దయాప్రసారమున, నింతై యుండినన్, సోదరా !
నా వాక్యంబుల స్పష్టతల్, మనసులోనన్, బొంగు భావప్రకా
శావిర్భూతియుఁ, జెక్కునుంజెదరవయ్యా నేఁటి కేయల్పతన్.

కం. మదిలోఁ దెలుంగు దీధితి
మెదలిన, నా మోముపైన, మెఱయు వెలుఁగిదే,

ఇదిగో ని, న్గనినంతనె!
ఎదకదలెను, మెఱుపులోలసె, నింగితమందున్

కం. కావున సందేహింపకు,
నావాక్యులఁ దేటపడెడు, నాంధ్రచరిత్రన్
నీవైనను విని,యీ యాం
ధ్రావని తేఁకువను జాటవయ్యా జగతిన్.

తే. కఠిన పాషాణ వదన సంగళిత సూక్ష్మ
రవము వినుటను గలుఁగు, సంభ్రమమువలన,
మునిఁగి, యాశ్చర్య జలధిలో, ముందు- పిదపఁ
దేరుకొంటిని, యీ శిలాధీరుఁ జూచి

కం. అనవుఁడు, నే, ననుకొంటిని
మనమున" వెదుకంగఁబోవ మంచి లతయిదే,
పెనఁగొనెఁ గాలికి" రాయల
యనుమతి కిది, దివ్య సాధనాంతరము కదా!

వ. అని సంబరపడుచు అ శిలామిత్రునితో నిట్లంటిని.

ఉ. ఓసఖ! పూర్వ తెల్గు నగరోన్నత హట్ట మహార్ఘ రత్న సం
వాస విభూతియోగ నముపార్జిత దివ్యచరిత్రఁ జెప్పుమా!
వాసిని రాశిపోసి, తలవంచకమించినవారి, కావ్యల
క్ష్మీ సరసాపలోక సరసిన్ విహరించినవారి, గాథలన్

ఉ. రాయలవారి శౌర్యమును, రాణులయొక్క కళావిలాసముల్,
వ్రాయఁగలేని, యీ విజయరాజ్యరమాసతి వన్నెచిన్నె, లా
హా! యలసానివాని జిగి, యంచులమించిన, తెల్గువీర దీ
ర్ఘాయన, మా, సుధీయతి మహాత్ముఁడు తిమ్మరుసయ్య
త్యాగమున్.

ఉ. వారికి నేను వారసుఁడ, వారి మహాద్భుత భవ్యగాథలన్
గోరుదు నే వినంగఁ, గనుగొంటిని, వానిని, జెప్పఁగల్లు, నిన్,
భూరి యదృష్ట మియ్యదియు, భూత మహాంధ్రచరిత్ర వింట, యె
వ్వారికి లభ్యమా! యిది, యభంగుర బాంధవ బద్ధచిత్తుఁడా.

శా. ఓ పాషాణవరా! స్వదేశగత రాగోద్దీప్త సర్వాంగ! నీ
తాపంబాఱుఁ, బురా రహో వివిధవృత్తాంత ప్రశంసన్, మన
స్తాపప్రశాంతిని నేను బొందఁగ, మహాంధ్రశ్రీని వర్ణింపుమా!
ఈ పాథేయము, నైతబాటపయి, నా కింకెంతో సాహాయ్యమా

కం. అని యారాతినిఁ దమితోఁ
గనుచుండఁగ మెఱసి యదియుఁ గఱఁగెను, స్మరణో
న్మనమునఁ, బుర్వాంధ్రకథా
ప్రణయంబునఁ, బారవశ్య భావముచేతన్,

కం. ననుఁ గని, మెల్లఁగ, నా, పా
వనదివ్యజ్ఞాని, యిట్లు పలికెన్ దమితో,
ఘన విజయనగర కథవిను,
తనువులు పులకింప, మనసు తన్మయమై, పోన్,

కం. ఏవక్త పలుకఁజాలని,
నా విషయ విశేషవిషయ నాదంబుల, నే
నావిషయ దర్శి నగుటను,
వేవిధముల, వాని నీకు, విన్పింతు సుఖా!

తే. సన్న నఱచేత నెత్తి, యో యన్న! కర్ణ
సవిధమందున నుంచుము! శ్రవణపేయ
మైన, తెల్గుల కథను, నీ మానసంబు
కలుగ వచియుంతు, నఱవ నా కలవికాదు.

కం. అనగ, నటుచేసి, తమితోఁ
గనుచుండఁగ, దానినుండి, కల్గెను, సువ్య
క్తనినాదము, హృదయవిదా
రణ, మనిలాపూరితాంతరాళము, నగుచున్.

ఉ. ఓయి! తెలుంగ! నీవు పదముంచినచోటనె, గండశాయిఁగా
నే, యొకవేళనుంటి, మహనీయము, పూర్వతమాంధ్రకీర్తి, నా
మే, యొదుగన్. మనంబున సమృద్ధిగనున్న, సువర్ణకాల, సం
ధ్యాయుగ, రక్తరేఖలకు, నన్నిటికిన్ నిజమైనసాక్షిగా.

చం. హరిహరరాయ భూవిభుఁ, డహార్య భుజాబలశాలి, తెల్గురా
జ్యరమకు, యోగ్యపట్టణము, సంతరణం బొనరించునాఁడు, నన్
ధరను బునాదియందున, ముదంబున నుంచెను, నాఁడు గల్గు, సం
బరము, వచింపశక్యమె, యభావ్యము, భవ్యసుధీ విధేయమున్.

కం. నాకథ, నాకథ, నీ, కొఱ
కై, కథనముచేయువాఁడఁ, గథిత చరిత్రన్,
జేకొని, మనమున నిడుకొని,
నీ కవనములోన, దీని నింపుము విపులన్.

చం. తెలుఁగులరాజ్యలక్ష్మి, కరదీపిక లేక, మహాంధకార భూ
తలమున, మాటుపడ్డ, కడుదైన్యదినంబులు, కల్గెఁ దొల్లి, దు
ష్టుల వెనుపాటునన్, దెలుఁగుశూరతకున్ గొడికట్టె, నాంధ్రకీ
ర్తులు మసివారె, దుర్మత విధూమ నిరంతర జృంభణంబునన్.

ఉ. ఆ విషమస్థితిన్, హరిహరాహ్వయశూరుఁడు, బుక్కరాయలన్
ధీవరు లిద్ద, ఱీధరను, దెల్గులరాజ్యము నిల్పఁగోరి, వి
ద్యావను నాశ్రయించి, రతఁడట్టి మహాత్మ గవేషణార్థియై,
భూవలయంబునన్ విసుగుఁబొందక, చూచుచునుండెఁ గాంక్షతో.

తే. బాహుశక్తియు, దివ్య తపఃప్రభావ,
మొక్కయెడఁ జేర, నరునకుఁ జిక్కదేది ?
అభవు ధనమును, నిచ్చె మహర్షి, దాన,
నమరె బలములు, రాయద్వయంబునకును.

తే. తెల్గురాజ్యరమాదేవి తిరుగఁ దగిన,
రాజధానిని నిర్మింప, రాయయుగము,
పూనె, దానికిఁ, బెట్టెను మూర్తము, ముని,
శిలగ నేలఁగ స్థిరముగా నిలువఁగలది.

తే. ప్రకరణంబునుబట్టి, నేఁ బలుకు దిచట,
ఆర్యభారత శాస్త్ర మహాప్రశస్తి,
జ్ఞానధాయ్యా మహార్య విజ్ఞానధనము
"పూజ్య చరితను దపవుట పుణ్యమెకద"

కం. కొందఱు పెద్దలు, మతిలో
మందులు, పల్కుదురు, శాస్త్రమర్యాదల యే
చందము తెలియక, జ్యోతిష
మందున నమ్మకము లేని మాటలనెన్నో.

ఉ. శాస్త్రము సర్వగూఢ, మది, శాస్త్రికిఁ, జేతిఫలంబు, లాతి, కా
శాస్త్రము చెట్టుకొట్టకొన స్థానముఁగొన్న ఫలంబు, మూర్ఖుఁడా
శాస్త్రఫలంబు నందికొనఁజాలక, పుల్లనిదంచుఁ బల్కు, ది
వ్యాస్త్రముశక్తి భీరువునకంచునె? వీరున కందకుండునే.

ఉ. భోజకుమార జాతకము బూటకమయ్యెనె, విక్రమార్క స
ద్రాజకుమారజాతకము రాణకునెక్కదె, దానిచేత వి
భ్రాజితకీర్తి కాఁడె మిహిరాఖ్యుఁడు, బుద్ధుని జాతకమ్ము, ని
ర్వ్యాజఫలంబునీయదె, గ్రహమ్ములయానము కుంటువోవునే ?

ఉ. మూఁడునుమూఁడు నాఱగును, మూఢునకయ్యెనె తొమ్మి
దానుగాఁ
గూడికతప్పినన్, దోసగుకూర్చుట న్యాయమె,యం కెలందునన్,
వాఁడిమికల్గువాని, కొకనాఁడును గూడికతప్పిపోవునే ?
పాడినెఱుంగ, కొక్కఁడెదొ, వాగిన శ్రావ్యమె ? సజ్జనాళికిన్.

ఉ. భౌతికశాస్త్రి, భూభువనభాగ, దిశాంచల సంచల ద్గ్రహో
ద్భూత, మహావిశేషకృతబుద్ధి వినిర్మిత యంత్రసాధనుం
డై, తనలక్ష్యసిద్ధిఁ, దరియం జనఁడే, యదికానిదానె ? సత్
జ్యోతివెలుంగుచుండగనె యొప్పునె? చీకటిత్రోవ త్రొక్కఁగన్.

ఉ. నేఁటి ఖగోళశాస్త్ర పరినిష్ఠిత బుద్ధియుఁ, బల్కు, నిట్టు, లీ
నాఁటి, నభస్స్థల, స్ఫురదనంత గుహాస్థ, రహస్యజాల, వి
స్ఫోటనశక్తి గల్గినది, జ్యోతిషశాస్త్ర విశేషధారణా
పాటవ మొక్కటే, యదియె భాగ్యము, భారత సర్వజాతికిన్.

శా. వేదాంగంబులు రెండుమూఁ, ళ్ళవి జగద్విఖ్యాత
షట్శాస్త్రముల్,
వేదాంగంబులలోన జ్యోతిషము, భావిం దెల్పదక్షమ్ము, త
ద్భేదంబౌను ముహూర్తభాగ, మది, తద్వేత్తృ ప్రభాదీప్తిచే,
నేదంపూర్వ ఫలప్రదాయి యను వాణిన్ గాదనన్ జెల్లునే.

చం. తెలియని దెల్లఁ గాదనుట, ధీవరలక్షణ మౌనె? మొండిగాఁ
బలికినఁ గార్యసిద్ధి తనవంతగునే ? యెదియైనఁ జక్కఁగా
నిలకడఁజర్చ చేసి యొకనిర్ణయ మేర్పడఁ జేయఁగావలెన్,
కల చలపాదిమార్గము సకంటక గండశిలామయమ్మగున్.

తే. నేఁడు, విజ్ఞాన శిఖరము నెక్కి పెఱలె,
భరతదేశపు జ్యోతిష్య పటిమ మెచ్చ,

భారతీయుఁడె, కాదనువాఁడు నేఁడు,
అరయ, మందుకు రాదుగా, పెరటిచెట్టు.

కం. ఆ విద్యార్ణవమునిని, తగ,
భావించిన, మూర్తి మధిక బలముకలయదే,
తావును దప్పుటఁ బూర్ణఫ
లావిర్భవ మందలేక, లయగతినందెన్.

వ. అట్లు విద్యారణ్యస్వామి దివ్యమైన ముహూర్తము నిర్ణయించి.

తే. హరిహరునితోడఁ బల్కె, మహర్షి, బిడ్డ!
రాత్రి మూడింటికే ముహూర్తంబు, నీవు
అట్టివేళఁ బునాదిలోఁ, బెట్టవలెను,
శిలను వైదిక బరిషదాశీస్సులంది.

చం నెనరున, నేను, దెల్గుధర, నిత్యము నిల్వ, మహేశ్వ
రాంఘ్రులన్
మనమునఁ గొల్చుచుందును. సమంత్రముగా, శిలనుంచు,
మెప్పు. దే
ఘనముగ శంఖమూదుదు, నొకండు నిమేషము వేళ, తప్పరా,
దనితరలభ్య, మా, సమయ, మట్టిముహూర్తము, నేను
బెట్టితిన్.

చం. హరిహయరాయ బుక్కవసుధాధిపతుల్, కనుఱెప్ప వేయ కా
దరమున రాత్రిమేల్కొనిరి, తప్పకయంత ముహూర్త,
మా మునీ
శ్వరుఁడును, నిష్ఠతో హరుని పాదములన్ భజియించుచుండె, నం
దఱు సుముహూర్తవేళకయి, ధ్యానముతో, గమకించు
చుండఁగా.

ఉ. మ్రోఁగెను శంఖ మొక్కపరి "భుంభుము, భుంభు" మటంచు, మంత్రముల్
సాఁగెను గర్ణపర్వముగఁ, జయ్యన వేసేఁ బునాదిరాయి, భూ
భాగయులోన, నాంధ్రుల శుభంబును గోరుచు రాజు, సర్వమున్
బాగుగ నయ్యెఁ, గోరికలు పండె నటంచును, బొంగిరెల్లరున్.

ఉ. దైవము సర్వశక్తి, యది దాటఁగ నొక్కఁడు నేర్చునే? యహం
భావముతోడ నజ్ఞుఁడరు, "మానవశక్తి కతీతమైన దే,
తావున లేదటంచు, ఫలదంబగు దైవము వేళ, లేక స
ర్వావసరమ్ములన్ జయమురాదె? మనుష్యున కద్ది భావ్యమే?

ఆ.వె. అనును విజ్ఞుఁ డట్లు ఘనముగాఁ జర్చించి,
శాస్త్ర సంచయముల సర్వగతుల,
పల్లవాగ్రములను, భక్షించు పక్షికి,
ఆఁకులోని శక్తి, యర్థమగునె?

ఉ. వచ్చె మహర్షి రొప్పుచు, నుపద్రవమేదియొ నెత్తికెక్కిన,
ట్లుచ్చటికిన్. శిఖాంతర జటావళియూఁగగ, స్వేదమూరఁగా,
ఇచ్చిన యే నిధానమొ గతించినయట్లు, నిరాశ మోమునం
దచ్చుపడంగ, రూక్ష నిటలాక్షుని డెందము పొంగినట్లుగన్.

ఉ. వచ్చి, పునాదిరాతి నతిబాధఁగఁ జూచి వచించె, నాంధ్రసం
పచ్చయ జీవితంబు నొకపాటిఁగ నిల్పఁగఁట్టిదాని, నా
సచ్చరితుండు మానివర చంద్రుఁడుఁ శంఖ నినాద మెవ్వరో
యెచ్చటినుండిచేసిరో ఫణీంద్రుని భీకర ఫూత్కృతాకృతిన్.

ఉ. ఇంకను బాపుగంటె కల దీశుభకాలమురాక, కింతలో,
వంకర కూఁత వచ్చి, మిము వంచన చేసెఁ బునాది యేర్పడెన్
సంకునినాదరూపమున, నావిధిమోసము చేసె, దైవ మే
వంక బలంబుగాదె?, మనువంశ్యుఁడు, దానిని మీఱనేర్చునే.

ఉ. ఐనసు, మీ ముహూర్తబల, మాయువు నిచ్చుఁ, దెలుంగు రాజ్యల
క్ష్మి నవరాజధానికి, విశేష మహావిభవమ్ము, సర్వస
మ్మానము, మానమున్, గతముమర్చి, భవిష్య భవిష్య మెంచి, మీ
పూనికపూనుఁడయ్య! కృతపుణ్యము, మీఱుఫలంబు నిచ్చునే?

ఉ. ఆ ఋషివాక్యముల్ వినఁగ, నందఱిమోము లమాసరాత్రులై
తేరకయుండెఁ. గొంతతఱిఁ దేఁకువనంది క్రమక్రమమ్ముగా
మాఱె ద్వితీయ చాంద్రసుషమాసరణిన్, దృఢచిత్త చిత్తముల్,
పారము ముట్టుఁగాని పఱవంబడి పోవునె ? విఘ్ననిఘ్నముల్.

ఆ వె. సంకు సవ్వ డెట్లు, సరిప్రొద్దు వచ్చె, న
టంచు వారు రోయ, నపుడు తెలిసె,
విఘ్నకారణమ్ము, నిఘ్నితకార్యము
"బ్రహ్మ విలసనమ్ము, ప్రబలతమము."

ఉ. జంగమువాఁడొకండు, కొనసాఁగఁగ నెంచి నిజప్రవృత్తిలో
నం, గడియించెశంఖమును, నచ్చినగంటను, నభ్యసించి యా
జంగము వాసిఁ, బండెను నిశన్ నిదురింపఁగ, నర్ధరాత్రి పో
వంగను, మేల్కొనెన్, దగిలెఁ బ్రక్కన శంఖము, వానిచేతికిన్.

తే. "క్రొత్తజంగము తెలియఁ డే ప్రొద్దు ననెడు,
సామెతకు దానుబూర్తిగా సాక్ష్యమగుచు,
లేచి జంగము, కూర్చుండి, సాఁచి మెడను,
శంఖమొత్తెను, జీల్చి విశ్శబ్దజగతి,

తే. ఆ నినాదమె, యాంధ్రదేశాభివృద్ధి
శిఖర పతనమ్ము నకు, నిచ్చెఁ జేతి యూఁత,

నిజము తెలిసినవారెల్ల, బుజముఁగలిపి,
విధివిధానముతోఁ దమ విధులఁగనిరి,

ఉ. వందలు కర్మకారులు, దివానిశమున్, నృపధాని నిర్మితిన్,
మందముకాని పద్ధతిని, "మాయదె! యీపనియంచు" నైపుణుల్
చిందఁగఁ, జేయుచుండిరి విశిష్టపుభక్తిని, నెల్లఁగార్యముల్,
మందికలట్టిచోట, నగమైనను, జూర్ణముగాదె ప్రేర్మిడిన్,

ఉ. ఏ తొలినాఁటి, పుణ్యకృతి యేర్పడియుండెనొ, తత్ఫలమ్ముగా
నాతఁతి, నేను గొండశిలనై యట నుండుటచేతఁ, గోటకై
పాతినరాళ్ళలోన నిరవందితి, నా భుజమందు నిల్పితిన్,
ఖ్యాతిగలట్టి కోటబరువంతయు, జన్మము సార్థకమ్ముగాన్,

చం. హరిహాయభూమిజాని విజయంబుల, మాని తపఃప్రభావ పీ
వర వరసంపదన్, గడచి బాల్యమునందలి దెబ్బలన్ని, యీ
పురము, క్రమమ్ముగా వెలసె, భూవలయమ్మున, శుభ్రకీర్తి గో
పురముగ, శాంతశూరహరిభూపతి, పాలనపోషణంబులన్,

కం. తొలి విద్యానగర, మ్మా
వల విజయనగరమగుచును, భాసిల్లెను, దె
ల్గులనగరము, మాయని వె
ల్గుల నగరమ్మగుచు, నెల్లగోత్రకు భూషై,

సీ. హరిహాయభూజాని, యాహవపాండిత్య,
పాలనావిధుల, శోభలనుగంటి,
బుక్కరాయల మహాభుజఖడ్గ దంతుర,
కుంభముక్తములఁ జేకొంటిఁ దమిని,
సాళువనరసింహ సామ్రాజ్య గరిమను,
గన్నులారఁగ నేను గాంచినాను
తుళువనరసరాయ దోర్బల విస్ఫురిత

తెలుఁగుదేశముఁ గంటి, వెలుఁగుకనుల
షష్వర్షములె యేలి, చను, వీరనరసింహ
దమనశక్తినిఁ గాంచి, దద్దరిలితి
అప్పాజి శిక్షలో గొప్పశిష్యుండైన
తెల్గురాయల, శౌర్యదీప్తిఁ, గంటి.

తే. అష్టదిగ్గజ ధృతమైన, యాంధ్రభువన
విజయమునుగంటిఁ, ద్రిభువన విజయదక్షు
మైనదానిని, శారదావీణయైన,
గీతశాలనుగంటి, వాగీశుశాల,

తే. వీరనరసింహరాయుని వెనుక, కృష్ణ
దేవరాయలవారు, దేదీప్యమాన
సరణి రాజ్యమునేలిరి. సార్వభౌముఁ,
డాయనకుసాటి, జగమల్లుఁ, డాయనగును,

సీ. ఉదయాద్రి శిఖరమ్ము, నదయుఁడై పెకలించె,
కొండవీటి శిరమ్ము, గుండుచేసె,
కొండపల్లి యురమ్ము, ఖండంబులన్ జేసె,
రాణ్మహేంద్రముఁ జేసె, మృణ్మయమ్ము,
అల విశాఖముఖమ్ము, నలవోకమూయించె,
ధ్వజమెత్తె, నరసింహధామమెదుట,
కటకమ్మునకు, నయఃకటకమ్ముఁ దొడిగెను,
వరదరాజేశ్వరి, కరముఁబట్టె,

తే. ఇంతదేశము, గజపతి, సొంతమట్లు,
వాడుకొన్నాఁడు, రాయలు వచ్చువఱకు,
ఏన్గుదొర కుంభమునుగొట్టి, యించు, మంచి,
ముత్తెముల, రాయ లఱుతలో, నెత్తుఁజేసె.

ఉ. దక్షిణయాత్రకై వెడలి, తన్నెదిరించిన, శత్రుపక్ష ప
క్షక్షయ మాచరించియుఁ బిజాపురమాది, తురుష్కముష్క రా
ధ్యక్షుల, యుక్కడించి, దరియన్ జని కాన్యకుమారిఁ, దల్లసత్
చక్షువు రక్షనంది, సరసాంపతిలో, జలకంబులాడుచున్.

చం. తెలుఁగును గన్నడంబు కడుతీయనిభాషలు, వాని యక్కయై
లలితగతిన్ మెలంగుఁ దమిళంబని, యా త్రితయంబు నేఁబు, రా
యల, చతురత్వధీరత, లహార్యములంచును, నాంధ్రసత్కవుల్,
కలముల కా చరిత్రఁ, గలకాలము, మాయని భూషచేయరే,

చం. కటకము నోరునొక్కి యఱకాలునఁ, దీవ్ర కఠోర ఘోర సం
కట, రణమత్త శత్రుగణ ఘస్మర, తీవ్ర కృపాణధారపై,
ఘటిత కవోష్ణర క్తమును, గడ్గెను, దక్షిణవార్ధిలోనఁ దొ
ల్లిట, మన కృష్ణరాయలు, బలే! తిరుగున్నదె ?

రాయలయ్యకున్.

ఉ. తిమ్మరుసయ్య మానసము దీప్తికి, భాష్యముచెప్ప శిష్యుఁడై
నమ్మినవారియింట రతనంబుల కుప్పలుపోసి గేహముల్
గ్రమ్మినవారియింటను, రగుల్కొన నాఱని చిచ్చుపెట్టి, యాం
ధ్రమ్మును నేలినాఁడు, మనరాయలు, తెల్గులతల్లియుల్లమై,

చం. తెలుఁగు సరస్వతీ పదవిధేయుఁడు, రాయలు, తెల్గువాణికిన్,
విలువనుబెంచు భూషణము, వేడ్కరచించెను ముక్తమాల్యదన్,
తులఁగనలేని, యాకవిత ధోరణికిన్, బులకించెఁ, గావ్యలో
మల లలితాంగియంగము సమస్తము, సత్కవిలోకమంతయున్,

ఆ.వె. "కంఠగలుఁగు భాష, కలకంఠ మధురము,
అమరభాషబోల్కి, నమరుబాష,
ప్రాచ్యభాషలందుఁ, బరువుకల్గినభాష,
దేశభాషలందుఁ, దెలుఁగులెస్స,

ఆ.వె. అనుచు బ్రామ్మ వితిచి, తెనుఁగుభాషాంతర
ఘనతఁ, జాటినట్టి, ఘనుఁడు, కృష్ణ
దేవరాయ, లతని చేవయే, తెల్గు స
రస్వతికిని, మాపిరయ్యె గాదె.

తే. వాణివీణయుఁ, గింకిణీ, వాయులీన,
సరళ నిస్వన, మారాజు, సభకునగలు,
శిల్పలక్ష్మికి, నాతేడు, చెలిగనట్టి,
భద్రముద్రాంక మిచ్చిన, భావుకుండు.

ఉ. బంగరు టక్కరంబులఁ, బ్రబంధము వ్రాయఁగలట్టి సచ్చరి
త్రం గలిగించె నాదినము, రాయలు సర్వకళాభివృద్ధికిన్
ముంగిటి కల్పకంబగుచు, భూపతి యాతఁడు, ధన్యజీవి, యే
వంగడమందుఁబుట్టె, నిటువంటి మహాత్ముఁడు, సిద్ధకార్యుఁడై.

వ. ఆ మహాప్రభువు తెలుఁగురాజులలో నగ్రగణ్యుడై, వాసికెక్కినాఁడు. ఆ ధరాధినేత, పాలనములోఁ, దెలుఁగునేల మూడుపూవు లాఱుకాయలుగాఁ దామరతంపరఁగా, వర్ధిల్లినది. ఆ చక్రవర్తి పాలనములో, బొడవందిన, విజయనగర విశేషవిషయములను, నీకుఁ బరిచయము చేయుదును, మందముగా ముందుకు నడుపుము.

సీ. ఈ పునీతావని, యెపు మీఱిననాఁడు
కటక కన్యలు, నొక్క కడుపువంట,
ఓ వీరధర, తలయెత్తి నిల్చిననాఁడు,
నూఱు మొనలవాలు, నీరుగారె
ఈ భూమి, మంత్రము, లెగసి రేగిననాఁడు,
నీతిశాస్త్రంబుల, నెమకు, గురుఁడు,
ఈ నేల, శేషను, లెదిగి పర్విననాఁడు,
వాగ్దేవి యొడలంత, బంగరయ్యె,

ఈ మహీ, గజ్జెల యెలుఁగు నిండిననాఁడు
కదలనేరదా రంభ కాలిగజ్జె

తే. ఈ యనంతకుక్షి, యేపుగాఁ బండిన,
మానవాళి, "త్రేపు" మంచుఁ, ద్రేఁచు,
గోట మీటిన, నిట, దేఁటతెల్లము, నిధుల్,
తగఁగ వినుము, విజయనగరచరిత్ర,

తే. నాల్గుతరముల మంత్రియై, నాగమాంబ
సుతుని కీర్తికి, నూఁతయై బ్రతికినట్టి
నయ వినయశాలి, మాని, చాణక్యనిభుఁడు
శీలి, తిమ్మరుసీ, పురి జీవగఱ్ఱ.

ఉ. అప్పటి రాజ్యవైభవము, లప్పటి కావ్యకళా వినోదముల్
తెప్పల నెక్కి, నింశి జగతిన్ విలసిల్లిన, స్వచ్ఛకీర్తులున్,
తెప్పల నెత్తి చూడఁగల నిత్యవినూతన శిల్పసంపదల్
చెప్పినఁ దీఱునే! మనసుఁజేర్చిన అందునె తెల్గుపౌరుఁడా.

ఉ. ముందుకు సాగుమయ్య! ఇట, ముత్తెములన్ నవరత్నరాశులన్
వందల వేల యంగళులపై సమకూరిచి యమ్మ, రష్హా, డిం
కెందుకు, నాఁడు నింగిపయి, నెప్పుడు నింద్రశరాసనప్రభల్
గ్రందుగ వెల్గుచుండు, నవరత్న వినిర్గత నైకరోచులన్.

అదుగో! అల్లంతదూరములోనే జగత్ప్రసిద్ధమైన భువన విజయ సభా భవన ముండెడిది. అది ఈనాఁడు జిల్లేడు తుమ్మ మొదలగు చెట్లకు నిలయమై యున్నది. ఒకప్పుడు సర్వోన్నతములుగా నుండి యిప్పుడు మట్టిదిబ్బలుగా మిగిలిన భువన విజయమును, దత్పదస్థ విశేష విషయములను మనోనేత్రము లతోఁ జూచు చుండుము. నేనా విషయములను వివరించు చుండును.

తే. ఓయి! పాంథుఁడ! ఇక్కడనుండి చూడు
తెలుఁగువాణికి నిలయమై, తేజరిల్లు

భువనవిజయాఖ్య గోష్ఠినిఁ, బుల్కరించి
తనువుతనువెల్లఁ గాదంబతరువుగాఁగ.

సీ. పెద్దనార్యుని కావ్య పీయూష మధురిమ
లిచటఁ బండెను, నాత్మ లెల్లఁ బొంగ
తిమ్మనార్యుని యొక్క, తీయతీయని కైత
లీబుగ్గలోనుండి మొగసి వచ్చె
తెల్గురాయలకావ్య, దీధితి కిరణాలు
జగమంతఁ బ్రాకె, నీ జగతినుండి
రామకృష్ణుని వచఃప్రౌఢి, యీకాశ్యపి
శాఖోపశాఖా ప్రచారమయ్యె.
అతులిత మాధురీ స్థితిగల్గు ధూర్జటి
కోకిల గొంతెత్తి కూసెనిచట

తే. మూర్తి వసువు నిల్చె, మూర్తమై యుట, మించె
భువన విజయగోష్ఠి, భువనకీర్తి
ఇచట నెత్తుకత్తి, యిచటి వాఁగఅయును
దలను వంచలేదు తలపునందు.

తే. బట్టఁగట్టిన పరకవి, పండితుఁడును,
భువనవిజయమ్ములోఁ బరాభూతి దప్ప
పొందలేఁడొక్కఁడున్ బరాభూతి నెపుడు
దానిఁ దలపోయ, నాగుండె, ద్రవతనందు.

కం. ఆనాఁటి యాంధ్రవైభవ,
మీనాఁటికిఁ జిత్తమందు, దృశ్యమగును, నా
వైనము సంగ్రహముగ, నీ
మానసమున కిత్తు, బుద్ధిమంతుఁడ! వినుమా !

ఉ. బంగరు రాజమానసము బంగరు పౌరుల చిత్తవృత్తి స
ర్వాంగము బంగరే విజయరాజ్యరమామణి కాదినంబులన్
బంగరు మంత్రితిమ్మరుసు బంగరు భారతిమందిరమ్ము, మేల్
బంగరు సర్వహూటు, నది, స్వర్ణయుగంబుగ, నందెకీర్తులన్.

మఱియు నా కాలమునకు స్వర్ణ యుగ ప్రశస్తిని సమకూర్చిన ఆంధ్ర ప్రశస్తులను వినుము.

సీ. సాటి భాషలయందు మేటియై యాంధ్రము
మార్గమయ్యెఁ బ్రబంధ వర్గమునకు,
కిరుసుకత్తులవైనఁ, గీలించి యంగుళిన్,
మగటిమిన్ వీరులు, పగటినారు
తనయింటి పంచఁ, గిమ్మనకుండ, గీష్పతిన్
చదివించినార లొజ్జలు, మనీష
రాతిలో నాతిని, రమ్యముగా నిల్పి,
కాసీంద్రుఁ, మయశిల్పిఁ గడచినారు

తే. నందనమ్ములలో మహానందమంది,
రసికు లావీట, నమరులై మసలినారు
అరసికత్వంబు, కాల్పెట్ట, వెరపునందు
గ్రామ సీమలనైన, నా రాజ్యమందు.

సీ. తొడఁగొట్టి మెడఁబట్టి పడఁగొట్టి శత్రులన్
బుడమినిండెను దెల్గు కడిమి వెలుఁగు
పరుగెత్తి చిగురొత్త పరచిత్తవల్లరుల్
మెప్పుఁబొందిన, దాంధ్రు, గొప్పతనము
రంగారు పొంగారు శృంగార కలితమై
చెలఁగి మించెను, దెల్గు శిల్పలక్ష్మి

మెఱనిక్క చదలెక్క, జఱముక్క, లదర, నా
టాడె, నాంధ్రులబాపుటాపసందు
సుమబృంద మధుబిందు సుందరేందీవర,
మధుమాస కమనీయ, మాంధ్రకవిత

తే. దాన మాన గాన, ధర్మ కర్మలయందు
సౌరి రాజ మాని శమనసుతుల
మించియుండె నాంధ్ర మియ్యది యూనాఁడు,
పరుల కెపుడు తలను వంచలేదు.

వ. ఇట్లు పూర్వాంధ్ర చరిత్రజలధినిఁ కడుపులోఁ దాచుకొన్న యాఁశిలాశకల కుంభసంభవుఁడు పొట్టపట్టక బాధించుచున్న తద్విశేషతరంగములను ఒక్కొక్కదానిని వెలికిఁగ్రక్కుచు ముంచుకుఁబోయిపోయి నన్నాగమని యాదేశించి యిట్లన్నాఁడు - బాబూ !

ఉ. చూడుము చిన్నతమ్ముఁడ! వసుంధరఁ గల్గిన గొప్పరాజులన్,
వాఁడిమి కల్గువాఁడు నిరవగ్రహుఁడై భువి నేలువాఁడు, మో
మోడక ధర్మరక్షణకు ముందుకు దూకెడు కృష్ణరాయ డీ
మేడనె చేయుఁ దిమ్మరుసు మేధఫలింప, రహస్య మంత్రముల్.

సీ. అల బృహస్పతిమేధ యదరంగ నీమేడ
షాడ్గుణ్యమంత్రముల్ సాఁగియుండె
చాణక్యచిత్తము సంభ్రాంతి నందఁగ
నీమేడ రానీతి నెలవుకొనియె
కామందకుని నీతికమనీయ సుమములీ
మేడఁదావులనెల్లఁ గూడఁబెట్టె
మంత్రి యుగంధర మంత్రతంత్రములన్ని
ఈసౌధవీధి నివాసముండె.

తే. తెలుఁగు తల్లి మనసు కలఁతల విడనాడి
సాటికాంతలందు మేటియగుచు

దిశల వెలుఁగగల్గు, దివ్యచరిత్ర కీ
మేడ నీడయగుచు, మించెనాఁడు.

ఉ. అట్టి మహాగృహమ్ము తనయందము చందము నేలపాలుఁగాఁ,
దిట్టినయట్లు, కూలినది దృప్తమతాంధుల దుష్టచేష్టఁ గన్
గుట్టెనయేమొ దుర్మతులకున్, బరుసొంపు సహింపకుంట, యా
కట్టిడిమూఁకకున్ బ్రతుకు కాదె? శ్వపుచ్ఛము వంకపోవునే?

అదిగో అటుచూడుము. ఆకనఁబడునది విజయనగర రాజుల ప్రతిభను దెలుపు వేయి స్తంభముల మండపము.

తే. వేయి యూఁతల నిలఁబడి, విన్నుదాఁక
భవనరాజము, తోఁచె, వేపాదములను
విశ్వరూపిఁగ నాఁడు భావింప నేఁడు
ఒక్కపాదము దానికి, నూఁతనీదు.

ఉ. కర్మముచాలకో, మనుజఖండమునందలి శ్రద్ధచేతనో,
యర్మిలి, విశ్వకర్మ ధరయందునఁ బుట్టెను దొల్లి, యాతఁడే
మర్మమువీడి, యీ నగరమందునఁ గట్టెను బట్ట, మెంతయో
యార్మిని శిల్పలక్ష్మి, కిది, యొప్పునె? కాక, జగత్ప్రశస్తమై.

అదిగో, అటుచూడుము అక్కడఁగొన్ని సన్నని స్తంభములున్నవి. అవి సంగీత స్తంభములు ఆ స్తంభములు లోకప్రసిద్ధినిఁ దల్లక్రిందులుచేసినవి.

ఉ. గానముచేతనే కఱఁగుగాదె, శిలా హృదయంబటంచు వి
జ్ఞానులు చెప్పుచుందు, రిట, నాశిల, గానముచేత లోకమున్,
దాన కఱంగఁజేయు, వసుధన్ గలదేయిది, శిల్పదేవతా
ధ్యానము చేయు భక్తులకుఁ, దావల, మీ, నగరమ్ము
మిత్రమా!

సీ. ఒక రాతి కంబము నొయ్యనఁ దట్టిన
సరిగమ పధనిసల్ సరిగఁబలుకు

విగ్రహ మొకదాని వేడ్కతోఁ దాఁకిన
వెలయించు నులియొక్క విలువ కలిమి
భవనము నొకదాని భక్తితో స్పృశియింపఁ
బలుకు నెన్నో శిల్పపరమగతుల
గోపురం బొకదానిఁ గోర్కెతోఁ బరికింపఁ,
జెప్పు, శిల్పరహస్య సృష్టినెల్ల.

తే. ఎచటఁ జూచిన, శిల్ప సాహిత్యలక్ష్మి
నఖశిఖాంతముఁ గై సేయు, నాభరణ వి
శేషసంపదే, కనుపించుఁ జెవ్వికన్ను
లున్న వారికి, భావనాభ్యున్నతులకు.

ఉ. కొండను దొల్చి తొల్చి, యనుకొన్న మనోహర రూప చిత్రమున్
నిండుఁగ బండఁజేసి, భువి నిండినఁ గీర్తినిఁగొన్న, యామహా
పండితశిల్పి చేతికి, స్వభావకఠోరము, బండరాయియున్,
మొండిదికాక, మైనమగు- భూమిని శిల్పి కసాధ్యమున్నదే.

తే. జలతరంగిణి, డిండాంగు, మురజరవము,
లాఱునొకటి స్వరమ్ముల, అల్ల రాతి
లోనఁ, దాఁచిన, యా శిల్పిలోనఁ గలుఁగు.
శక్తి గుర్తింప, నేరికి శక్తికలదు ?

ఉ. తూరుపు మశ్చిమంబు లొక దొడ్డదినంబున నాంధ్రశిల్పి, శి
ల్పోరువిలాస భాసుర మహోన్నత రమ్య కళామతల్లికిన్
హీరమయాంజలుల్ పరఁగ నిచ్చెనుపో. జగమంత నాసికా
వార నిబద్ధ, హస్తరుహ, బంధుర, తన్మయమగ్నమై, చనన్.

వ. మఱికొంతదూరము పోయి ఆ శిలోపదేష్ట యిట్లన్నాడు.

ఉ. ఆవలఁ గాంచుమా! యదె, వియత్తలచుంబి, మహీధరాధర
గ్రావముఁ, దంకటంకృతుల, రంజిలఁజేసి, యపూర్వ హస్తవి
ద్యావిభవంబునన్, మలచి, ప్రాణముపోసిన రాతితేరు, నాం
ధ్రావని శిల్పకీర్తి, సురధామముఁ జేర్చినదాని, మక్కువన్.

ఉ. చుక్కల నిక్కు శైలసతి, చూపు బడాయిని, బుజ్జగించి యా
ప్రక్కకునెట్టి, దాని యెదపైన, నఖంపచ పత్రచిత్రముల్,
చెక్క రసజ్ఞశేఖరుఁడు, శిల్పి కళాజ్ఞుఁడు వానిసోఁకునన్,
ఫక్కన నవ్వుఁ గోపనయు, భావమునన్ గిలిగింత లేర్పడన్,

తే. కొండగుండెను బాధలేకుండఁ జెండి,
దానియంగము సాంగమై తనరఁ జేయు,
రాతివెజ్జు చికిత్సలో, రాతిపల్లె,
నగరమై యొప్పె, శిల్పి విజ్ఞానమెంతొ!

ఉ. మాధవుఁడం, చుమాధవుఁడు, మాయిలువేలుపటంచు, నజ్ఞులా
ప్రాథమి కాల్పభావములఁ బొల్పడి, పొత్తులఁబాసి, భిన్నులై,
బాధల నందుచుండు రొకపాటునఁ, జూడ, నదంతమాధ్యమే,
క్రోధము వీడి చూడ, నొకత్రోవయె తోఁచు మంతబులన్నిటన్.

ఉ. ఇట్టి, విశాలభావము లనేకము, లా, ఘనశిల్పసృష్టిలోఁ,
గొట్టఁగవచ్చినట్లు, లెదఁ గొల్లగఁగొట్టక వచ్చినట్లు, లూఁ
కొట్టఁగఁ దట్టినట్లు, శతకోటిగళంబుల నైకమత్యమున్
గట్టడఁజేసినట్లు, మనకంటికిఁ గన్పడు, నీరమూరఁగన్.

ఉ. రాముని గుండెలోతు, బలరాముని తమ్ముని కొంటెచేష్టలున్,
కామవిజేత బుద్ధుని, యకల్మషచిత్త, మహత్త్వ భావనల్,
హైమవతీమనోహరుని, యద్భుత, తాండవ నృత్యఖేల, లా
ధామమునందు, జీవకలితంబులువోలెనె, యుండు నేఁటికిన్.

తే. నరునివలెనుండు, నొకవైపునుండి చూడ,
నన్యదిశనుండి తోఁచు, వానరునివలెను,
కోఁతిచిత్రము, పండెను గోటిగతుల
శిల్పివిజ్ఞాన, మీ మహాక్షేత్రమందు,

ఉ. ఇంచుక ముందుకేగ వినిపించెను మిత్రునివాక్కు, నేస్తమా !
ఇంచుక యూఁగు, మిచ్చట, మహీశుఁడు రాయలు, దానకర్ణుఁడై
కొంచక, తూఁగి స్వర్ణమున, గొప్పఁగఁ జేసెను, దానధర్మముల్.
క్రించు కుబేరుఁడయ్యెఁ బులకించెధరాసతి, యీవి, తావికిన్.

తే. ఆ తులాభార, మఖిల దేశాంచలముల.
కన్నుఁగప్పెను, దెలుఁగుల కాంతిఁబఱపి,
కామధేనువు పొఁదుగెండెఁ, గల్పవృక్ష
పల్లవము వాడె, నా యీవి, వాఁడి, తగిలి.

ఉ. ముద్దుగఁ బెద్దనార్యుని, సమున్నత పాదమునందుఁ, బెండెరం
బొద్దిక కింకిణీరవ సముద్ధతి మ్రోసినదయ్య ! నాఁడు, ని
బ్బద్దిగ, నాధ్వనుల్, జలధిపై నటియించు తరంగజాతమా
సద్దులతో శ్రుతిన్ గలిపి, సాఁగిన, వా దిన, మింకవచ్చునే ?

చం. అడుగడుగందు, నాకసము నంటెడు మేడల, స్వర్ణవీథులన్,
పొడవడగించి నందనముఁ, బొంగెడు తోఁటల, నొప్పె నీపురం,
బొడయని, ధర్మ శౌర్య గుణపుంజ, సముజ్జ్వల, పాలనంబునన్.
గడనకు నంద వీపురి, యగాధచరిత్రలు ధర్మనేత్రముల్.

తే. రెండువందల యేబది రెండు వర్ష
ములు, వెలింగెను, నల్లై, యాంధ్రులపురమ్ము,
విజయనగరమ్ము, నిర్ఘాత విమతపథము,
స్వమతకవచమ్ము, సర్వసంపత్ప్రదమ్ము,

ఉ. చెల్లె, మహర్షి పెట్టిన ప్రసిద్ధ ముహూర్తబలంబు, దేశమం
దెల్లెడఁ గారుమబ్బు, నినదించుచు నాంధ్ర విశాల భూములన్
బెల్లుగ ముంచివేసె, గడిమించె, నధర్మము, తగ్గె, తెల్గుభూ
వల్లభులందు శక్తి, పరిపాలనదక్షత, ముప్పునం బడెన్.

తే. రాజులందు, ననైక్యత, రాజుకొనెను,
కన్నుఁగప్పె, నసూయ, భూకాంతులకును,
పరులపాదముఁ బట్టె నిర్భాగ్యుఁడొకఁడు
కొంపలన్ ముంచె, నది, తెల్గుగోత్రయందు.

తే. రాజమార్తాండుఁడై, యలరారు, రాయ,
లస్తమింపఁగఁ, దదుపరి, యస్తమించె,
రామరాయల రాజ్యపాలనమునందుఁ,
దెల్గురాసిరి, చేయిచ్చె, దిక్కులేక,

మ. కలలోఁగన్పడి, శాత్రవద్విపములన్, గంపిల్లఁగాఁ జేయు, స
త్యాలఘు ప్రాభవమూర్తి, కృష్ణనృపహర్యక్షమ్ము, రూక్షాక్షమై,
వెలుఁగన్, గుంటలదాఁగు దర్దురము, లా, వీరుండు, కన్మ్రూయు, వీ
థులలోఁ గూయఁగసాఁగె, సాధుజనముల్ థూ, థూ, యనన్ సోదరా!

ఉ. ఇంక, విచిత్రశిల్పము లనేకము, లా విజయాఖ్య పట్టణా
భ్యంకమునందుఁ, జూపులకు నందని యద్భుత రూపురేఖ, లా
బింకమువీడకే, నిలచి పెద్దరికంబును జాటుచున్న, వే
వంకయులేక, నేఁటికిని, వాని తొలిస్థితి, ఎంతగొప్పదో?

ఉ. అంతటి సాహితీవిభవ, మంతటి నాట్యకళావిలాస, మా
యంతటి చండవిక్రమము, నంతటిరాసిరి, ఈజగమ్ములో

నంతకుఁ జాలినట్టి, దిట, నయ్యయొ ! శాశ్వతనిద్రపోయె, నేఁ
డెంతటి దుర్దినంబనుచు, నెంతయొ క్రుంగెను, బ్రస్తరేశుఁడున్.

తే. రెండుజాములు, రాయల యెండచూపు,
అరిపురమ్ములఁ, గారగ్గియయ్యె, నపుడు
అప్పయెత్తక, చల్లనై, కుప్పకూలె,
నిప్పుడది, కాలపురుషున కెంతబలము ?

ఉ. రాయలు మాతృభక్తుఁ, డిట, రమ్యముగా, నొకపేటకట్టె, నం
టా. యమపేర, నాగమపురాఖ్యము, ముఖ్యము రాజధాని, నా
పోయగముల్ విలాతులు, నసూయఁగ మెచ్చిరటంట,
అయ్యొ, యూ
యాయత పౌరలక్ష్మి, యణగారెను, దుష్టుల దుష్ట చేష్టలన్.

చం. తనమత మెంతొ, యన్యుల మతంబులు నట్టివె యంచు,
మెచ్చి, యూ
ఘనుఁడు, మతాంతరమ్ములకు గౌరవమిచ్చెను, గాని,
వారి నే
మనవలెఁ, దిన్నయింటి, గడలన్నియు లెక్కలఁబెట్టినారు, భూ
మినిఁ, బ్రభుకీర్తి ప్రక్క, మసిమేయును, వారి, యకీర్తి నేఁటికిన్.

ఆ.గీ. మాయదారి శంఖ, మానాఁడు మ్రోగక,
యున్న విజయనగర, ముండియుండు,
నేఁటిదాక, పూర్ణ నిత్య నూతనవృద్ధి,
నెగడుచుండు దిశలనేలుచుండు,

తే. సర్వమతముల నొకటిగా, సాఁకినట్టి,
ఈవిచెట్టును, మొదలంట, నిగురు లిగురఁ,
గాల్చి వైచిన పాపి, దిక్కైన లేక,
పురుగులంబడి చావడే, పోవ దఘము,

ఆ. వే. రక్తబలము తగ్గ, శక్తి నశింపంగ,
వ్యాధివృద్ధిపొందు నట్లు, రాజ
బలము, తలముపీడ, బరబల ముప్పొంగి,
ముంచె, విజయనగరమోడ, బట్టి,

తే. విమత, నరాంతకుల్, కపటవిద్యలఁ దేరినవార, లొక్కటై,
యమితబలంబుతోడఁ, దెలుఁగమ్మ గృహమునఁజిచ్చు
పెట్టి, యా
క్రమణముచేసి రీ విజయరాజ్యము, వారి నికృష్టచేష్ట, లో
కమునిరసించె, నంధునకుఁగన్పడునే? కనుముందు తత్వ మున్.

సీ. కోశములందున్న గుప్తధనమ్మును
బస్తాలకెత్తి చేఁ బట్టినారు
కన్నమాయని కళాకమనీయ లక్ష్మికిఁ
జూపునుబాపి పస్తుంచినారు
ఉన్నతభవనముల్ మన్నులోఁబడవైచి
పేరులేకుండఁ గప్పించినారు
వాఁరబ్బసొమ్ముగా వాడవాడలఁగల
సిరిసంపదలను గా జేసినారు

తే. అన్యదేశీయ సంస్తుతమైన కోట
నేలమట్టముచేసి దున్నించినారు
వారి యాగడమెన్న నెవ్వారితరము
వారికంటెను నయమె క్రవ్యాదపశువు

ఉ. తీఱక కోప, మా విసుతధృష్టులు, కోట పునాదియందు, నే
నేరముఁ జేయకున్న, నను, నింద్యునివోలెనె, పట్టికొట్టి, యా
తీరున, ముక్కచెక్కలుగ, దిక్కునుమొక్కును లేకయుండగా,
మాఱిచిరయ్య! రూపమును. మత్తుఁడెఱుంగునె, మంచి
చెడ్డలన్.

కం. నాదేహము, ముక్కలు, భూ
మీదేవత గుండెపైన, మిగిలెను, నే, నీ
మాదిరి పడియుంటినయా !
ఈ దైవచరిత్రమిూకు, నెఱుకపఱపగా.

చం. నరపతి కృష్ణరాయ పరిపాలనమందునఁ, దెల్గువెల్గు, లం
బరమునఁ బర్వ, నేత్రయుగమందున నింపితి, శీతవారి, నేఁ,
బరసుతనేత, ధర్మవును బాదనఖాగ్రముచేతఁ జీల్చ, యీా
ధర తలఁ బాదముంచఁ, గనుదమ్మిని, నింపితి, నుష్ణవారిచే,

చం. గడిచె శతత్రయాధికముగాగ శరత్తులు, క్రూరకర్మ నా
యొడలు చెడెన్, మనోవ్యథల నొందితి, చిక్కుచు
శల్యమాచు, నె
న్నడు, నొకఁడున్, ననున్ దరిసి, నాయునికిన్ గమనించు
వాఁడు ని,
క్కడఁ గనుపించలేదె, యని, కందెను, గుందెను, నాదు
డెందమున్,

ఉ. రాయలనాఁటి యాకథ, నరాలను బీకుచునుండెఁ, జెప్ప, నా
కా, యలనాఁటి స్వర్ణయుగ గాథలు, గుర్తుకువచ్చ, ధారణల్
పోయిన బాధలేదు గద, పోవునె ? నెత్తుటిలోన లీనమై,
పోయిన యాస్మృతుల్, కలసిపోవు, శరీరముతో డమట్టిలో,

తే. విజయనగర చరిత్రము, వింటివిగద,
మోడులేకార్చుఁ గన్నీటి, రోదనమ్ముఁ
జేయుఁ బ్రకృతియు, నీకథ, చెవినిసోఁక,
ఇది రచింపుము, కవితలోఁ, బదిలపఱచి.

తే. ఒక్కతటియందు, నావేశ, మెుులికి నన్నుఁ,
బరవశునిఁజేయు, నెదనింప బరువుపెట్టు,

వెళ్ళఁబోసిన నాకథన్, వెనుక, బరువు
తగ్గు, నామీఁద, మౌనముద్రను వహింతు,

తే. భూమిలోపల, ముక్కలై ప్రోగుపడిన,
గున చరిత్రను, స్మృతిపథమందు, నిలుపఁ
దగినశక్తిని నిచ్చె విద్యావనుండు,
గానఁ, జెప్పితి, నీ మహాగాథ, నీకు,

వ. ఆ మహాత్ముని యనుగ్రహముచేతనే నా కీ కథనశక్తియుఁ గల్గినది. తెలుఁగు దీధితి వ్యాపనము, ఆ దేశోద్ధారకుని మానసోద్దీపనము కదా!

తే. అనుచుఁ జాలించెఁ గథనము తెనుఁగుదేశి,
కాంతిఁ గోల్పోయె రాయిగా నంతమిగిలె,
వానిఁజూడఁగ, నాగుండె, బావురుమనె,
జాతిబంధము, సర్వాతిశాయికాదె,

ఉ. కప్పిన కప్పునెల్ల, నెడగాఁ దొలగించుచు, వెల్ల కాంతులన్
గుప్పన నాఁటఁబోయుచు, వినూతన చిత్రచరిత్రలెన్నియో,
విప్పి, నెఱుంగఁజేయుచును, వేడుకచేసె, శిలాల్పమిత్రుఁడు, దే
రొప్పులు, కుప్పలై, అమరియుండెనొ, యీ, యమర
స్థలమ్మునన్.

ఉ. ఉన్నతమైన, ప్రాక్తన శుభోదయగాథను, త్రవ్వితీసి, నా
సన్నిధినుంచి, నాయెడద సంద్రములోనఁ దరంగ మాలిగా
భ్యున్నతిఁ గూర్చి, యూవల సమున్నతి నాపి, ప్రశాంతిఁ
గూర్చుచున్,
మిన్నకయున్న, యీ కఠినమిత్రుని, మార్దవమెంచి, పొంగితిన్

కం. మన్ననతో నామిత్రునిఁ,
గన్నులకును నద్దుకొనుచుఁ, గన్నీటను బై

నున్న రజస్సును బాపుచు,
వన్నియఁబెట్టితిని, వానిపై దేహమునన్,

ఉ. అంతట, నూత్న మిత్రుని, నొకానొక మంచిప్రదేశమందు, నే
వంతయులేక నిల్పి, తలవంచి, శ్రుతమ్మును, పద్యమాలగా,
సంతరణంబుచేయు, దను, చానలువెట్టి, పురోగమించి, యా
చెంతనెయున్న, యాత్రికులఁ జేరితి,ఁ బండిననిండు గుండెతో

తే. వందయేడుల యాపుని,ఁ బాసినట్లు,
విలవిలంబోయె, నాడెంద మలమటించి,
ఎన్ని జన్మలనుండి, శేషించినదియొ,
తెలుఁగు రక్తపు బఁధ, మీదేహమందు,

కం. ఆవల నా విషయంబును,
కావింతును నేర్చినట్లు కవితా ఫణితిన్,
నావలని దోషమెంచక,
చేవల గ్రహియింత్రుగాక, భావ, రసజ్ఞుల్,

వ. ఇట్లు 250 సం,, అఖండజ్యోతిగాఁ బ్రకాశించి తైలమింకుటచేతఁ గొడిగట్టి ఆరిపోయినది. విజయనగరము. ఆకొడి వాసనయైన నేఁ డచ్చటలేదు. కేవలము కాలి మాడిపోయిన వత్తిమాత్రమే యున్నది. మాడిపోయిన వత్తికిఁ బునఃప్రకాశము దుర్లభముకదా !

తరువాత శిథిలములైన గజశాలలను నశ్వశాలలను జూచి ఖేద మోదముల నంది సాహిత్య సార్వభౌమునితో నిట్లంటిని,

చం. తెలుఁగు చరిత్రకున్, విమల తేజముఁగూర్చిన కృష్ణరాయ! మీ
చలువను, నానతిన్, వినయ సాహసభావము, నన్నుఁబట్టి ముం
గలకునుద్రోయ, వ్రాయుదును, గమ్యముఁ జేర్తునో లేదొ, మీ సము
జ్జ్వలచరితన్, దయామతి నొసంగుము, తావిని, నాదుకైతకున్,

అనంతరము మేము. 29-9-84న గోకర్ణమునకు బయలుదేరితిమి. మధ్యే మార్గము తుంగభద్ర ఆనకట్టయున్నది. ఆ మహాజలబంధనమును జూచుట కటు పోతిని.

## తుంగభద్ర

తుంగభద్ర ఆనకట్ట ఒక అద్భుతనిర్మాణము. అది కృష్ణబ్యారేజికంటె పెద్దది. ఆ మహాధుని ఆవలియంచు దృష్టికందుటలేదు. ఆ నదినిఁజూడఁగా నది యపారపారావార మనిపించినది. దానిపై జీఱాడు నీలమేఘములు ధూమ రాజినిఁ బోలియున్నవి. కావ్యలింగానుమాన ప్రమాణముచేత (కావ్యలింగాలంకారముచేత) నా యేఱు, అంతర్గత బడబాగ్నియైన జలనిధిగా నాకు భాసించినది. దాని నిట్లనుమానించితిని యథా తుంగభద్రా అంతర్గత బడబాగ్నివతీ, ఉపరి సంచారిత నీలమేఘరూప ధూమవత్వాత్, అతఏవ దృష్ట్యగోచర పారవత్వాచ్చ, అపార జలనిధితుల్యా, సా మహానదీ, ఇదిశాబ్దబోధః,

(ఆ తుంగభద్ర గర్భమందు అగ్ని (బడబాగ్ని) యున్నది. అది పొగల గుంపువలెఁ బైన సంచరించుచున్న నీలమేఘసంఘాతముచేత ఊహింపబడు చున్నది మఱియు ఆ యేటి యావలిదరి చూపునకందుటలేదు అందువలన ఆమహానది సముద్రమే, అంతటి జలరాశిని కట్టిపడవేసిన మేధావులను ప్రశంసించితిని.

తుంగభద్ర శాస్త్రజ్ఞు లేర్పాటుచేసిన జలమార్గములనుండి దుముకుచుఁ బరుగులెత్తుచున్నది ఆ పరుగెత్తుఁట పరతంత్రుఁడైన యభిమాని స్వతంత్రుఁడై గమ్యమును జేరుటకై పోవునట్లున్నది.

ఆ గమన వేగములోఁదూముల దగ్గఱ ఫేనపుంజము పేరుకొన్నది. ఆ నుఱుగు చకచకలు, తాను బంధమునుండి విడిపడి స్వేచ్ఛగాఁ బ్రవహించుచుఁ గట్టుకొమ్మ కావలఁ దనను బంధించిన విజ్ఞాన శాస్త్రజ్ఞుల నపహసించుచు న్నట్లున్నది.

ఆ నది తాను క్షోభపడుచుఁ దననుండి పుట్టిన తేజస్సుతో (కరెంటు) జగదంధకారమును బోగొట్టుచున్నది. అదియేగదా ఉత్తమ వ్యక్తి లక్షణము.

తూములనుండి ప్రవహించు నా ప్రవాహము ఎండలో రంగురంగులుగఁ గన్పించుచు శృంగార నాయికలను స్ఫురణకు తెచ్చుచున్నది. ఆ నదీమతల్లి

యనుగ్రహమువలన నచ్చట లక్షల యకరములు సస్యశ్యామలములగు చున్నవి.

తే. తుంగభద్రను, బరహితోత్తుంగభద్ర,
పుణ్యముద్రను, శ్రీతసముద్ర, పాప
జాల, నాశ వినిద్రను, సంస్మరించి
నిర్ణయించితిఁ, బోవ, గోకర్ణమునకు.

## హంబ్లి

వ. హంబ్లీ తుంగభద్రకు గోకర్ణమునకు మధ్యనున్న నగరము అచ్చట భోజన భాజనములు మాకు కఱవైనవి. ఉడికీ ఉడుకని గోధూమపిష్టమును (ఉప్మా) బస్సువారు నివాసయోగ్యముకాని ఆవాసములో మా కాహారముగానిచ్చిరి, "కాలేకడుపునకు మండే గంజి"యన్నట్లుగా నా యన్నమునే మేము పరమాన్నముగా స్వీకరించితిమి" "క్షుధాతురాణాం నరుచిః నపక్వం" (ఆకలి కలవాఁడు ఉడుకుటనుగాని రుచినిఁగాని గమనింపఁడు) అనిగదా యనుభవోక్తి. ఆ యాత్రలో మేము- అధ్వాన్నము (త్రోవలోని భోజనము) (అదియే యిపుడు వాడుకలో అధ్వాన్నమని వాడఁబడుచున్నది) అను పదము యొక్క విలువను. అర్థమును గ్రహింపఁగలిగితిమి అయినను మేము తట్టుకొనఁ గలిగితిమి, కష్టసుఖములను సమముగా ననుభవింపఁగలుఁగుట ప్రతివ్యక్తికి నావశ్యకము. ఆ శక్తి తీర్థయాత్రాదులవలన లభ్యమవుతుంది. దేశాటనము జీవితములో నొకభాగము.

ఉ. పుట్టినచోటనే నరుఁడు, పొందికగా నివసించి యున్నచోఁ,
బుట్టిన యట్లెయుండి, యనుభూతి విశేషముఁబొందకుండనే
గిట్టును, అట్టిపుట్టువు నికృష్టము, పుణ్యము పూరుషార్థ, మె
ప్పట్టున. లేని పుట్టువు, నివాసము పాశవిక, ప్రవృత్తికిన్.

ఉ. జీవితమన్నఁ, గష్టసుఖసృష్టికిఁ దావల, మందు సౌఖ్యమే
భావనచేయువాఁడు, తనభావినిఁ, జిక్కులలోనఁ జిక్కు, సం

భావనచేయఁ గష్టమును, బంధును జన్మము నిండు కుండగా,
ఈ విధి నందు మానవుడు, హెచ్చుగ, యాత్రలు
చేయఁగల్గినన్,

కం. ఢక్కా మొక్కులుతీన, కే
యొక్కండును, దీర్ఘయాత్ర లొనరించునె, యా
ఢక్కా మొక్కులె, బ్రతుకులఁ,
జక్కఁబఱచి, యిచ్చు, శాంతిసౌఖ్యములోర్వ్వల్,

తరువాత ఆ రాత్రి 1 గంటకు బయలుదేరి మా బస్సు

తే. అంధకారమూలోమున్గి, యలమటించి,
కన్నులుండియు లోకముఁగాంచలేక,
కమిలిపోయిన కాకులు, కూయిపెట్టు
కాలమందున, నిల్చె, గోకర్ణమందు,

## గోకర్ణము

గోకర్ణ మొక పుణ్యక్షేత్రము - ఇది కడలి యొడిలో నిమిడియున్నది. ది. 30-9-84 ఉదయమునకు మా బస్సు గోకర్ణము చేరినది.

గోః, ధేనోః, కర్ణస్య ఆకార ఇవ ఆకారః యస్యక్షేత్రస్య ఈశ్వరస్యవా, అస్తి తత్ గోకర్ణం నామక్షేత్రం తస్య ఈశ్వరః, ప్రభుః- గోకర్ణేశ్వరః.

అని విగ్రహసమాసములు (ఆవు చెవియొక్క ఆకారమువంటి యాకారము ఏ క్షేత్రమునకు- లేక ఏ ఈశ్వరుని పానువట్టమునకు కలదో ఆ క్షేత్రమునకు ఆ పానువట్టము నకు 'గోకర్ణ' మని పేరు. అచట దేవుని పేరు గోకర్ణేశ్వరుఁడు, ఈశ్వరుఁడే ఆ క్షేత్రమునకు గోకర్ణమని పేరు పెట్టినట్లు పురాణ ప్రసిద్ధి. ఆ క్షేత్రమునుబట్టి ఆ దేవునకు గోకర్ణేశ్వర నామముకలిగినది.

గోకర్ణములో నున్న పురోహితులకుఁ బండాలని పేరు - వాఁరందఱును భాగ్యవంతులే. పండాలు మకుటములులేని మహారాజులు పండాశబ్దము పండితశబ్దమునకు వైకృతరూపమై యుండులు. కాని అక్కడనున్నవారిలో

ఎక్కువమంది పండిత పుత్రులేగాని పండితులయొక్క పుత్రులుగారు అనగా వారు విద్యాహీనులేగాని విద్యావంతులు కారని భావము ఆచారవ్యవహారములు పౌరోహిత్యము - అనునవి వారిలో లేవు.

గోకర్ణము సముద్రతీరముకదా - స్నానార్థమై మేము సముద్రము దగ్గఱకు వెళ్ళితిమి ఆ నదీశ్వరుఁడు

ఆదివిష్ణువు, తొలియవతారమూర్తికి,
 నిరవిచ్చు పుణ్యాత్ముఁ డితఁడె, కాదె,
తామేటిమేటినిఁ దనకుక్షిలో దాఁచి,
 కృతకృత్యుఁడైనవాఁ, డితఁడు కాదె,
తనయింటఁ బెనఁగొన్న, ధనరాశి నంతయు,
 దానముచేయు, వదాన్యుఁ, డితఁడె
తనబిడ్డ హరికి, నాతనిబిడ్డఁ దనకుఁగా,
 మామ మామను, నామ మందు, నితఁడె
దనుజశిక్షకు నేగు, దశరథసుతునకు,
 మార్గదర్శిగనైన, మాన్యుఁ, డితఁడె,
వసుదేవసుతుఁడుండు, ద్వారకానగరికిఁ,
 బరిఖగాఁ, బరగిన, వలతి, యితఁడె,
లోకాంతమున, మఱ్ఱియాకు తెప్పందేలు,
 బాలున, కూయలపడక, యితఁడె

తే. ఎన్నిపొంగులు వచ్చిన, నించుకంత
పొంగకుండెడు, నిర్వికారాంగుఁ, డితఁడె
ఏటిబోటుల మగఁడు, ప్రాయేఱు, పాఱ
నట్టిగంభీరుఁ, డీ బడబాగ్నికుక్షి,

ఉ. నల్లనివాఁడు, సంపదకునాలయ, మూర్జితసత్త్వసారు, డు
ద్వేల్ల, దనంతబాహు, పరివేష్టిత సర్వచరాచరుండు, భా

రుల్లసదంతరంగుఁ, డఖిరోపిత సుందరముద్రధారి, రో
షిల్లినరుద్రుఁ డీకడలి, శ్రీపతి, యవ్యయుఁడో, యనంతుఁడో,

ఉ. ప్రాంతమునందె, భక్తపరిపాలనఁ జేయఁగనున్న, గాఢమో
హాంతక, పాదపూజకయి, హస్తతలంబును నింపి, తెచ్చి, య
శ్రాంతము చల్లుపూవులను భ్రాంతిని, నుచ్చల దూర్మిమాలికా
సంతతజాత ఫేనతతి, సంతరణం బొనరించు నీతడే.

తే.గీ. ఆవులించిన జగముల నాహరించు
బలముకలవాఁడు, ధారయూన, మెలఁగువాఁడు,
అప్పులకుఁగుప్ప, సమయములందు, నబ్ద
ములకు, నప్పుల, నప్పిచ్చు, కలిమివాఁడు.

ఇట్లు ఆ అపాంపతి చరిత్రలను స్మరించుకొనుచు ముందునకు బోయి స్నానాదుల నాచరించితిమి- పిమ్మట విభక్తియాట (భక్తిలేని వాడగుట వలన) విభక్తిజ్ఞానములేని (పథమా దివిభక్తి జ్ఞానము) యా పండా చెప్పినట్లు కర్మల నాచరించితిమి.

గోకర్ణేశ్వరాలయము చాలా ప్రాచీనమైనది. ఇచ్చట గూడ పానువట్టము ప్రత్యేకముగాలేదు. నేలబారుగానే యున్నది - అది గోకర్ణాకారముగా నున్నది దైవదర్శనము చేసుకొని బయటకు వచ్చితిమి.

గోకర్ణప్రాంతము సారవంతమైనది అక్కడ ఉపయోగింపని మొక్క గాని తీగకాని చెట్టుగాని కనుపింపదు. సస్యశ్యామలమైన ఆ ప్రాంతము. ఆకుపచ్చని చీరకట్టుకొని పూలరవికను ధరించి మంచుమేలిముసుగుతో మందస్మితము చేయుచున్న ప్రకృతి సుందరివలెఁ గన్పించినది.

నాగరకత విషయములో గొకర్ణప్రాంతమువారు ఏబది సంవత్సరములు వెనుకఁబడియున్నారు. వారి వేషభాషలు ఆచార వ్యవహారములు మనకంత యింపుగానుండవు.

అచ్చట కొబ్బరి, పోఁక, చెట్లు విరివిగానుండును. ఒకప్పుడక్కడనేలపై నమృతము ప్రవహించెనేమో? వేసిన విత్తనమేదియు నక్కడ వ్యర్థముకాదు.

దినదినాభివృద్ధినంది సంపూర్ణ ఫలవంతమగును. సన్నగా మిక్కిలి పొడుగుగా నున్న పోఁక బ్రమాఁకులు, గగనలక్ష్మి భవనమునకు, దుమ్ముదులుపుటకై, ఏర్పఱచిన, కుంచెలవలె, నున్నవి.

ఆ ప్రాంతము నారికేళమయముగదా! అందువలన అచటివారు కొబ్బరి చాపలను, ఆస్తరణములుగాను, పరదాలుగాను, కిటికీలకు తలుపులకుఁ దెరలుగాను, పైకప్పులుగానూ, గొడుగులుగాను, ఇంకను అనేకవిధములుగా ఉపయోగింతురు వేయిమాటలెందుకు "నారికేళమయం సర్వం గోకర్ణ జన జీవనం" అన్ననుఅతిశయోక్తికాదు.

అచట బంగాళాపెంకుటిండ్లు మిక్కిలియధికము. లేనివాని కుటీరము మొదలుకొని కలవాని భవనమువఱకు బంగాళాపెంకుల, సంపూర్ణావతారము కొట్టవచ్చినట్లు దర్శనమిచ్చుచుండును. అచ్చటి ఇటుకలు మనయిటుకలకు రెట్టింపుండి గులాబిరంగుకలిగి యుండును. అక్కడి గోడలు కట్టుటకు సిమెంటుకుబదులు ఎఱ్ఱని మట్టియడుసు నుపయోగింతురు. ఆ యడుసు సిమెంటుకు తీసిపోదు.

అచ్చటి యావులు చిన్నవిగా నుండును. భారీ ఆవులు అక్కడ కన్పింపవు. ఎక్కువగా ఎఱ్ఱనియావులే అక్కడఁ గన్పించును "పొట్టివాఁడు కడు గట్టివాఁ డన్నట్లు, అచ్చటియావులు చిన్నవైనను క్షీరసంపదలో కామధేనువు సంతతి యనిపించుకొనును.

గోకర్ణమునుండి బయలుదేరి, 30-9-84 సాయంకాలము 4 గం.లకు ఉడిపి లేరితిమి.

## ఉడిపి

ఉడిపి సముద్రతీరమున నున్నది. దానికి నామాంతరము రజతపురము, పరమేశ్వరుని నివాసము కైలాసము, దానికి నామాంతరము రజతాద్రి. మంచుచేఁ గప్పఁబడి వెండికొండవలె భాసించుటచేత కైలాసమునకు రజతగిరియను వ్యహార మేర్పడినది.

ఇచ్చట రజతశబ్దము ఐశ్వర్యమున కుపలక్షకము. ఐశ్వర్యము కలపట్టణ మగుటచేత ఉడిపి రజతపురమైనది.

ఉడిపి అందమైన పెద్ద పట్టణము అక్కడ చాలా దేవాలయములున్నవి, వానిలోఁ గృష్ణస్వామి దేవాలయము సుందరము. ప్రసిద్ధమైనది. ఈ దేవాలయము లోని శ్రీకృష్ణ విగ్రహమును 800 సంవత్సరములక్రితము మధ్వాచార్యులవారు ప్రతిష్ఠించిరఁట అక్కడ, గుడితలుపులు పెద్ద గవాక్షములవలె నుంటాయి. భక్తులు ఆ గవాక్షరంధ్రములనుండియే స్వామిదర్శనము చేయుచుందురు. ఆ పెద్ద గవాక్షము నకుఁ గనకదాసు గవాక్షమని పేరు.

పూర్వము "కనకదాసు" అను భక్తుఁడు స్వామిని దర్శింప వచ్చినాఁడట అతఁడు తక్కువ కులమువాఁడగుటచే నాలయాధికారులు వానిని గుడిలోనికి రానీయలేదు. అక్కడ నుండనీయలేదు.

కనకదాసు గుడి వెనకకుఁబోయి నిరాహారుఁడై నిరంతర ధ్యానముచే వెన్నదొంగ మనస్సును దొంగిలించినాఁడట అపుడు పూర్వాభిముఖుడైన స్వామి పశ్చిమాభిముఖుఁడుగా మాఱి యక్కడి గవాక్షముద్వారా భక్తునకు దర్శనమిచ్చి నాఁడఁట, అది మొదలు స్వామిని గవాక్షరంధ్రములనుండి దర్శించుట యాచార మైనది. ఆ స్వామి పదియేండ్ల బాలునివలె నున్నాఁడు. అపుడు నాకొక సందే హము కలిగినది.

కన్నయ చిన్నవాఁడు, తమకంబున లక్షలుకోట్లు పిల్లలన్
గన్న పసిండితండ్రి, యొకకాలమునందునఁజూడవచ్చునా,న
నెన్నిక చేసి చూచి, గుఱుతించున ? తల్పుల సందునుండి, నేఁ
దిన్నఁగ స్వామిఁజేర, నెదితెన్నగు, ద్వారము మూసియుండెనే.

అని భయమందియు, వెన్నుని
మనమున్ గుర్తించి, ధైర్యమందుచు, మదిలోఁ
బెనఁగొను భక్తియు, రక్తియుఁ
బనుపఁగ, మునుపడితి, భక్తబాంధవుఁజూడన్.

ఇట్లు సంశయాసంశయముల నోలలాడుచు భక్తమందారుని బృందావన మందిరుని గోబృంద సంరక్షకుని ఆనందధాముని నందనందనుని గోపికా సుందరునిఁ బరమానందముతో సందర్శించితిని.

పెదవులఁ జూపు నాపు నెఱిపింఛము, చిక్కని కాకపక్షముల్
గడిచిన కాకపక్షములు, కస్తురిబొట్టు, విశాలఫాల, మూ
యెడద సువర్ణహారము, రహిన్ జగమేలెడు కొంటెచూపులున్,
బెడగగు కుండబొజ్జ, గడిడిమించిన చేతుల, స్వామి ముద్దగున్.

ముగ్ధమోహనమైన యా మూర్తిఁజూచి
వివశుఁడనునైతి, దానిలో వింతయేమి ?
పదియునార్వేల గోపికాభామలెల్ల
నాదమఱవరె, స్వామి యొయ్యారమునకు.

భంగిఁజూచిన వ్యత్యస్త పాదుఁడతఁడు,
గతినిఁజూచిన సుస్థిర గతియుతఁడు,
చరితఁజూచిన జంచలచరితుఁడతఁడు,
భావమునుజూడ, నిశ్చలభావుఁడతఁడు,

ఆ నవనీతచోరుని మహిమలకు ముగ్ధుండనై యిట్లు పలికితిని.

కన్నుఁగప్పి చన్నిడిన, కౌణపజీవముఁ ద్రావి, పండి, ఓ
తన్నిన, బండి గూల్చి, నును దంపతికిన్ గలహంబుపెట్టియున్,
వెన్నను ద్రుచ్చిలించి, నడువీథిని గోపికచీర లాగు, నీ
చిన్నఁదనంబు దాఁచి, బుధసేవ్యుఁడవైతివ ? బాలకృష్ణయా.

వేషాలు వేయువాఁడవు,
కాషాయాంబరులకైనఁ గన్పడవే, పీ
యూషభుగీశార్చిత ! నీ
వేషముఁ గనుగొంటి, జన్మవిలువనుగంటిన్

ఉడిపిలోఁ గృష్ణుఁడు చేతఁగవ్వముధరించి యుండును. ఆ యడియాలము గోపాలకత్వమునకు క్షీరసంపదకు సూచకము. బ్రాహ్మీముహూర్తములో నభిషేక సమయములో మాత్రమే కవ్వము గోపాలుని కలరూపు కన్పించును. స్నానానంతర మా నందనందనుఁడు సర్వాలంకారశోభితుఁడై యుండును.

ఆ ప్రాంతమంతయు శ్రీకృష్ణసామ్రాజ్యము. ఎక్కడఁజూచినను శ్రీకృష్ణ సంకీర్తనము వినఁబడుచునే యుండును– ఆ ప్రక్కనే యొకనాటకశాలయున్నది. అందుఁబ్రత్యహము భగవత్కథలు ప్రదర్శింపఁబడుచునేయుండును.

మేముపెళ్ళినరోజున అక్కడఁ బాదుగా పట్టాభిషేకనాటకము ప్రదర్శింపఁబడుచున్నది. మగవాడేఁ సీతవేషము వేసినాఁడు, అది అనాది నాటకమర్యాద.

భరతముని, మహర్షి, నాట్యశాస్త్రకర్త, క్రాంతదర్శి, ఆమహాత్ముఁడు దూరమాలోచించి పరమ పవిత్రమైన నాటకరంగము కలుషితము కాకుండుటకై స్త్రీవేషమునుఁగూడ పురుషులే ధరించాలని తన నాట్యశాస్త్రములో సూత్రీకరించినాఁడు, శాసించినాఁడు.

పరువములోనున్న స్త్రీపురుషులు నాయికానాయకపాత్రలను ధరించి నటించుచుఁ బరస్పరము ఆశ్లేషించుకొనుచు నున్నప్పుడు వారిలో కళాభిరుచికంటె కామాభిరుచియే కలుగుట కవకాశమున్నది. అపుడు కళారంగ మపవిత్రమగును. నాయికానాయకులు మగవారేయయినచో నా ప్రమాదముండదు. ఈ యుద్దేశముతోనే భరతాచార్యుడు స్త్రీలకు నాట్యరంగములో ప్రవేశమును నిషేధించినాఁడు, "భ్రకుంసశ్చ భృకుంసశ్చ భ్రూకుంసశ్చేతి నర్తకః స్త్రీవేషధారీ పురుషః" అని నిఘంటు నిర్వచనముకూడ పైవిషయమునే సమర్థించుచున్నది. భరతముని హితబోధను బెడచెవినిబెట్టిన ఈనాఁటి కళారంగములో నీతినియమము లెంతగా నున్నవో అందరికిఁ దెలియుచునేయున్నది.

ఋష్యంశములేని వాఁడు మహాకవి యెట్లు కాలేడో అట్లే నటుడు కూడ ఋష్యంశము లేనిదే మహానటుడు కాలేడు, సదాచారము నీతినియమములు శీల సంపద దేవతోపాసన నటు నకత్యంతావశ్యకములు, నాట్యరంగము లోకమునకు నేత్రోన్మీలనముచేయు దివ్యప్రసంగము. దానిలో భంగములు రాకుండుటకే భరతముని యా నిర్దేశము.

భరతాచార్యుని నియమములను ఈనాటివఱకు గౌరవించుచు కళాపోషణము చేయుచున్న కూచిపూడి భాగవతు లభినందనీయులు.

అక్కడ చంద్రశేఖరాలయము మొదలైనవి గొన్ని దేవాలయములున్నవి. వానిలో శ్రీకృష్ణ మఠమొకటి, ఆ మఠములో నిరంతరము ఒక దీపము వెలుఁగుచుండును. ఆ దీపము పూర్వమెప్పుడో శ్రీమధ్వాచార్యులవారిచే వెలిగింపఁబడి

ఈనాఁటికి జాగ్రత్తగా రక్షింపఁబడుచున్నది. ఆ నగరములో జరుఁగు శుభకార్యములకు హోమాది కార్యములకు నగ్నిని ఈ దీపము నుండియే తీసికొనిపోవుట సంప్రదాయమఁట వానిని దర్శించి,30-9-84 రాత్రి 3 గం. ధర్మస్థలకు బయలు దేఱితిమి.

## ధర్మస్థల

ధర్మస్థల యొక పుణ్యక్షేత్రము. దానికి రెండుకిలోమీటర్ల దూరములో "వేత్రవతి" అనునది ప్రవహించుచున్నది. ఇది దక్షిణాది నదులలోఁ బ్రసిద్ధమైనది. దీనివిషయము స్కాందపురాణ పూర్వభాగములోఁ జెప్పఁబడినది.

వేత్రమనగా భయద దండము, మతు బర్థమున వత్ ప్రత్యయమురాగా స్త్రీవాచకమున వేత్రవతియగును అనగా దండివలె, స్నానార్థులను దన తీవ్ర ప్రవాహముతో భయపెట్టునది. యని భావము (లక్ష్యార్థము)

వేత్రవతీనది బహు గడసరి, వేగరి, క్షణికమైన పరువమును నమ్ముకొని యున్మత్తయైన మత్తకాశినివంటిది. గజమునుగూడ కాగితమునువలె నవలీలగా లాగివేయఁగల యానదీదేవితో నిట్లంటిని.

ఎందుకు తల్లి స్నాతులు సహింపగనోపని యింతవేగ మిం
దెందఱో మున్గి పాపముల నీఁగి తరింపఁగ వచ్చినారు. మా
కం దిట నీకు నంటునని కాటియఁజెం దిటుపాఱుచుంటివా?
నందన దేహధూళి వెతనందునె చల్లనితల్లి యుల్లమున్.

జీవనదాత్రి! వేత్రవతి! జీవనహర్త్రివి కాఁగఁజెల్లునే?
పావనమైన, నీ విమలవారిని, మమ్ముల మున్గనిమ్ము, యా
ప్లావముచేసి, నీమహిమలన్, భజియించుచుఁ బోదుమమ్మ, అ
మ్మా! వనరాశి ముద్దుల ప్రియా! సరసామృత జీవసంచయా.

శ్రావణమందునన్, జలధరంబులు, కన్నులఁ గానకుండ, వి
స్రావము చేసియున్న, జలసంచయమంతయు, వీఁగిపోవ, ని
వనతన్, వెతన్ గుడువ, జీవనమిచ్చుచు, నిన్ను, నెవ్వరున్,
బోవరె! ఆయతిం దలఁచి, పొంగులుమానుమ, శాంతినందుమా.

పలుచనై యుండు, జలములోపలనె, యింత,
కఠినభావము భావ్యమా! కనికరించి,
శాంతినందుమ మేమంత, స్నానములను
జేయుదాకను, బాపముల్ బాయదాక,

స్నానానంతరము ధర్మస్థలక్షేత్ర దర్శనమునకై బయలుదేఱితిమి.

ధర్మస్థల :- స్థల శబ్దము నపుంసకలింగము, అందువలన నా క్షేత్రముపేరు "ధర్మస్థలము" అని యుండవలయును. దానికి ధర్మస్య (సంబంధి) స్థలం, అని విగ్రహము, కాని ఆ క్షేత్రమును ధర్మస్థల, యని వ్యవహరించుచున్నారు. సమన్వయము.

ధర్మేతిష్ఠతీతి, ధర్మస్థః, ధార్మికః, ధార్మికాన్, లాతి ఆకర్షతి (స్వమహామ్నా) యా భూమిః, సా ధర్మస్థలా. దాని తత్సమీకరణము, "ధర్మస్థల" అనియగును, అనగా ధర్మాత్ములను దన మహిమచే నాకర్షించు పుణ్యభూమి యని యర్థము.

ఇచ్చట క్షేత్రస్వామిపేరు మంజునాథస్వామి, ఇది పరమేశ్వర పర్యాయి పదముగా వాడఁబడుచున్నది.

మంజుశబ్దము మనోజ్ఞవాచకము, అనగా నందమైనది యనియర్థము అక్కడ పరమేశ్వరుఁడు లింగాకారముగా నుండక సర్వావయవములతో మంజు మూర్తిగా నుండును. నాథ శబ్దమునకు- భర్త ప్రభువు- అనునర్థములున్నవి. మంజు నాథ సమాసమునకు- సుందరాకారుడైన జగత్ప్రభువు- అని ఫలితార్థము.

మంజుశ్చాసౌ నాథశ్చ, మంజునాథః- మంజునాథశ్చ స్వామీచ- మంజునాథ స్వామీ, అనివిగ్రహవాక్యము.

ఈ సమాసములో, స్వామిపదము పూజ్యవాచకమగుటవలన, నాథ స్వామి పదములందు పౌనరుక్త్య దోషములేదు. పూజ్యుఁడైన మంజునాథుఁడని భావము.

క్షేత్ర స్వామినిపేరు కన్యాకుమారి - గుడిముందు విఘ్నేశ్వరస్వామి విగ్రహ మున్నది. ఉడిపియందువలె నిక్కడఁగూడ దేవాలయమునకు గోపురము లేదు. దైవదర్శనమునకుఁ బోవువారు పాద ప్రక్షాళనము చేసుకొని చొక్కావిప్పి ఉత్తరీయము వేసికొని పోవలయును. ఈ యాచారము, మనదేశములో వీతాతిపతుల దర్శన సమయములలో మాత్రమే కనుపించును. దేవాలయములలో కనుపించదు.

అచ్చట నొక విచిత్ర పద్ధతి యున్నది. భక్తులు దైవ దర్శనమునకుఁ బోవు మార్గములో నొకప్రక్క అడ్డముగా బిగింపఁబడియున్న యినుపకడ్డీలు, రెండవ ప్రక్క గోడ యుండును ఆ గోడపొడవునా చిన్నచిన్న గూళ్ళుండును. ఆ గూళ్ళలో భక్తులు తమకుఁదోఁచిన కానుకలనుఁ బెట్టుదురు. అట్టికానుకలు పదిపైసలనుంచి పది రూపాయల వఱకుఁ గన్పించినవి.

చిత్రమేమనగా ఆ గూళ్ళలోని కానుకలను ఎవ్వరుఁ గఁన్నెత్తియైనఁజూడరు- మనప్రాంతములో దేవాలయములలోఁ గూడ దొంగతనములు తప్పవు- అక్కడి భక్తులకు హరదర్శనాభినాషయేగాని హారదర్శనాభిలాష యుండదు. ఆ గూళ్ళలోఁ గొన్నిచోట్ల ఉంగరములు గూడ నున్నవి. రాత్రి దేవాలయాధికారులు ఆ గూళ్ళ లోని వస్తువులను దీసికొనిపోయి స్వామికర్పింతురు అచటి దేవతాదర్శనము చేసి కొని బయటకు వచ్చితిమి. అచ్చటి భక్తులవరుస తిరుపతిలో భక్తులవరుసను బోలి యుండును.

మనము పీచు (శిఖ) తీయని కొబ్బరికాయను దేవునకుఁ గొట్టుదుము అక్కడ పీచు పూర్తిగఁ దీసిన కొబ్బరికాయలనే కొట్టుదురు. రెండు చిప్పలను వారే తీసె కొందురు. మనకుఁ బ్రసాదముగా నొకచిప్పనీయరు కొబ్బరికాయ గుడిలోఁ గొట్ట రాదు బయటనే కొట్టవలయును.

అక్కడ రెండుపూఁటల నన్నప్రదానము చేయుదురు. కాని యీ యన్న ప్రదానము భోక్తలకుఁ దృప్తినిఁ గలిగింపదు. భోజనమునకుఁ గూర్చున్నది మొదలు లేచువఱకు వడ్డించువారు భోక్తను మిక్కిలి తొందరపెట్టుదురు. అచ్చట భుజించు వేలాదిమందిలోఁ గడుపునిండా తిన్నవాఁడొక్కడును లేడన్న నతిశయోక్తికాదు. ఈ విషయములో ధర్మస్థలను నధర్మస్థల యనవచ్చునేమో.

ఈ క్షేత్రమహిమను దెలుపుట కొక కథయున్నది.

పూర్వము వివాదగ్రస్తులు తీర్పులకొఱకు స్వామిదగ్గరకు వచ్చి ఐదురూపా యలు స్వామికిఁ జెల్లించి తమ వ్యవహారములను స్వామిముందు విన్నపము చేసి కొనెడివారఁట స్వామి యెదుట అసత్యమాడుటకు భయపడి యిద్దరు యదార్థమునే చెప్పెడివారఁట- అందుకు గారణము అంతకుముందు అబద్ధమాడిన యిద్దరో ముగ్గురో నెత్తురు కక్కుకొని మరణించుటయే- ఆ స్వామి మహిమ యంతటిది

సదాచారుల పెత్తనమున్నంతవఱకు నీ మహిమ కనుపించుచుండెడిదట- అచ్చట సుందరోద్యానము- వస్తు, జంతు ప్రదర్శనశాలలు- అద్దాల మందిరము- మొద లైనవి యున్నవి. వానిని దర్శించి అక్కడనుండి మేము బేలూరు బయలుదేరితిమి.

## బే లూ రు

బేలూరు జగత్ప్రసిద్ధ శిల్ప క్షేత్రములలో నొకటి- దానికి "వేలాపురి" యను నామాంతరముకూడ నున్నది- ఊరు చిన్నదే.

బేలూరు హోశరాజ్యములోనిది- ఆ రాజ్యాధిపతి విష్ణువర్ధన మహారాజు. ఆయన భార్య శాంతాదేవి ఆ దంపతులకు శిల్పమన్న మిక్కిలి యభిమానము- ఆ యభి మాన ఫలమే బేలూరు శిల్పసంపద.

ఆ మహత్తర శిల్పమును సృష్టించినవాడు మహాశిల్పి జక్కనాచార్యుడు- ఆతని వంశము శిల్పలక్ష్మికిం బుట్టినయిల్లు- జక్కన తండ్రితాతలకు దక్షిణాచార్యులు అను బిరుదముండెడిది. ఆ బిరుదము రూపాంతరమే జక్కనాచార్య అనునది.

శిల్పాలయములో నడుగుపెట్టితిని ఆ శిల్పసౌందర్యమునకు విస్తుపోతిమి.

ఎంతటి శిల్పి జక్కన! స్పృశించినమట్టినిం, బైడిం జేయు న
త్యంతసమర్థుం, డాబుధుని హస్తతలంబునం, గొంతసేపు వి
శ్రాంతినింగొన్న బ్రహ్మ యొకసారి లగించెను సృష్టికుంచె, నా
వంతున శిల్పలక్ష్మి, కతిభాసురభూషలు, చెక్కె, నాతండున్,
శిల్పాధ్యక్షా,! జకనాచార్యా !

ఉండియెయుండు, నీయులికిం నోర్పును నేర్పును మంచికన్నులున్,
బండిన భావసంపదయు, నట్టివిలేకయ, కన్ను లెప్పలన్,
నిండుగ వేఱువేఱుగను నెక్కొని చిక్కనిరోమరాజి యె
ట్లుండును? నీ కరంబున. శిలోచ్చయమంత, చిగిర్చిపూయదే.

జక్కన శిల్పసాగరములో జన్మించిన సుధాభాండము చెన్నకేశ్వరాలయము ఆ సృష్టి, శిల్పవిశేషసమష్టి- శిల్పజీవపరిపుష్టి. శిల్పసుందరీ సుందర మందిరమున కాధార యష్టి. ఆలయమునకు ముందు జయవిజయులను ద్వారపాలకులున్నారు. దేవాలయ ప్రవేశమునకై వారి నిట్లు ప్రార్థించితిని.

జయవిజయులార ! చెన్నకేశ్వరులఁజూడ
లోనికేగుదు, మాకు మీ యానతిండు
దూరమందుండి వచ్చితి, దొరనుజూడ,
ననుచుఁ బ్రార్థించి, యజ్ఞాత, మనుమతిఁ గొని.

వ. లోనికేగితిమి- ఆ ముఖద్వారము మహత్తర మకరతోరణ మండితము- అక్కడ రతీమన్మథుల విగ్రహములు వేఱువేఱుగఁ జిత్రింపఁబడినవి- రతీమన్మథుల బంధము- అవినాభావసంబంధము నిరంతరము కలిసియుండు రతీమన్మథులను వేఱు వేఱుగాఁ జిత్రించుటలో శిల్పిశేఖరుని భావము నిట్లూహించుకొంటిని

పాయని దంపతీమహితబంధము శాంభవ మన్యమెంత యూ
హ్యాయతకల్గియున్న నెడఁబాయకతప్పదు, మారదంపతుల్,
రాయిడిపొందరే యొకతరంబున వేఱయి, లౌక్యసౌఖ్యమున్
ధ్యేయముచేయరాదు, కడఁదేర్చును జీవి విరక్తి యొక్కటే.

ఇరుమూళ్లు పరులు, లోపలఁ
దిరముగనున్నారు, పొంచి, దృప్తులు, వారిన్,
కర మదలించి జయించిన,
కరబదరము, మోక్షఫలము, కాదే యరయన్.

చెన్నకేశ్వరాలయము శతాధిక స్తంభమండితము ఆ స్తంభములలో నొక స్తంభశిల్పమునకు మఱియొక స్తంభశిల్పమునకు సంబంధములేదు. రెండవ స్తంభములో, దేవాలయములో నున్న 867 స్తంభముల శిల్పములు సూక్ష్మములుగా మలచఁ బడినవి. అందువలన దానికిఁ బ్రధాన స్తంభమని పేరు వచ్చినది. ఆ స్తంభములోనే నరసింహవిగ్రహము చెక్కఁబడినది అందువలన నా స్తంభమును నరసింహస్వామి స్తంభమని గూడ నందురు. ప్రధాన స్తంభమునకుఁ బ్రదక్షిణము చేసిన 868 దేవతా మూర్తులకుఁ బ్రదక్షిణము చేసినట్లేయని భావించి భక్తులా స్తంభమునకు ప్రదక్షిణ ములు పూజలు చేయుచుందురు.

ఆ యాలయ మంటపమునకు బైభాగమున గజములు వృషభములు సింహ ములు పద్మములు లతలు మొదలగు హృద్యములైన చిత్రములెన్నియో యున్నవి.

అక్కడ గన్పించు నాట్యభంగిమ, లతిలోక రమణీయములు. అచ్చట, చిత్రరాజములను జూచుచుఁ గొంత ముందునకుఁ బోతిమి. అచ్చట, ఒక విగ్రహమున్నది. దాని దక్షిణహస్తము ఖండితమై యున్నది. రెండవచేతిలో ఉలి యున్నది. దాని చరిత్ర యిది.

కలఁడొక శిల్పి, శిల్పమును గన్నకుమారిగఁ బెంచుకొన్నవాఁ
డులిమొనయందు నామెకుఁ గడుంగడుఁ గూర్చెడు దివ్యసౌధమున్
వెలయఁగఁజేయువాఁడు, పృథివీపతిప్రేమకుఁ బాత్రుడైన, వాఁ
డలసుఁడుగానివాఁడు, కళయన్నను బ్రాణము లిచ్చువాఁడునై.

జక్కనయను జేరునఁ బెం
పెక్కెను నాశిల్పి, వాని పేరును విన్నన్
మిక్కిలి కలతలు బడుదురు,
దిక్కులఁగల శిల్పులెల్ల, దిక్కఱుచు వగన్.

ఆతని కొకపుత్రుఁడు కలఁ,
డాతని మదిలోన వెన్నెలై యుండెడి వాఁ,
డాతని యులిలో, జక్కన,
చేతముఁ గేంద్రీకరించె, శిల్పముఁ బెంపన్.

శంకన పేరున, బాలశ
శాంకునివలె నతని సుతుఁడు, చక్కఁగ బెరిగెన్,
బింకము పొంకము కల మీ
నాంకుని సోయగము, నగుచు, ననుదినవృద్ధిన్,

ఉలితో నాడును, రాతిని
నులితోఁ బలికించుఁ, బూజ యులికే చేయున్,
ఉలితో శయనించును, నా
యులియే సర్వస్వమనుచు నుండును, నతఁడున్,

ఆ తండ్రికొడుకులకు విధినియోగమువలన నెడఁబాటు కలిగినది. పుత్రుఁ డెక్కడున్నదీ తెలియక తండ్రి మంచముపట్టినాఁడు

ఆ సమయములోనే విష్ణువర్ధన మహారాజు చెన్నకేశ్వర దేవాలయము కట్టింపఁ దలపెట్టి యా భారమును మహాశిల్పి జక్కన్న కప్పగించినాఁడు. పుత్రదుఃఖ వివశుఁడై నప్పటికి జక్కన్న రాజాముదల మూర్ధమున ధరించి శ్రమించి దేవాలయమును నిర్మించి యందు ప్రతిష్ఠించుటకై చెన్నకేశ్వర విగ్రహమునుగూడ నిర్మించెను.

విగ్రహప్రతిష్ఠకు ముహూర్తము నిర్ణీతమైనది. విగ్రహసౌందర్యమును జూచి సర్వలోకము ఆశ్చర్యచకితమైనది. ప్రభువు తన సంపద సద్వినియోగమైనదని ఆనందించినాఁడు.

మూర్తము దగ్గరింపగను, భూపతి యానతి, విగ్రహమ్ము, ని
ర్వర్తిత మంగళాచరణ రంజిత, మాగమమంత్ర పూతమై,
వర్తిలుదానిఁ, దెచ్చి, భటవర్గము వేదికనుంచె, నా జగ
త్కర్తను, జూచి రెల్లరు, హృదంబుజముల్ వికసించి వాసిలన్.

ప్రతిమన్ గల్గిన, యందచందములకున్, భ్రాంతాత్ములై చూపఱుల్
నతులన్ జేయుచు సాక్షియుండఁగ, నొకం, డా మూర్తి,
నాద్యంతమున్
శితదృష్టిం బరికించి తప్పుగల, దీ శిల్పాశ్రయ ప్రస్తర
స్థితిలో, నీ ప్రతిమాప్రతిష్ఠఁ, జెడు, నీ దేశమ్ము, రాజం, చనెన్.

పిడుగులమొత్త మొక్కటి గభీమని నెత్తినదూకినట్లుగా,
జలనిధి తుంగభంగములు చయ్యన దేహము ముంచినట్లుగా,
మెఱపయి నూఱుఖడ్గములు మించి మహోత్సవరఁ దాఁకి నట్లుగాఁ,
దడఁబడఁజేసె, శిల్పి వసుధావరులన్, యువకోక్తవాక్యముల్

ఆ తరుణుని పరుషోక్తుల,
నాతపతప్తంబులైన నబ్జంబులుఁగాఁ
జేతములు, శిల్పిరాజులు,
గోతంబడి లేచునట్లు, కుట్టుసురులునై.

కొంత తెప్పరిలిరి, కొంతకాలము పోయె,
రాజు చూపులోన, రాజుకొనియెఁ,
క్రోధవహ్ని, దాని క్రూరత్వమును గన,
రంగుమాఱె శిల్పియంగమందు.

ఎట్టిని రాజుచూపులు దహింపగ నాత్మను, శిల్పవిద్యలోఁ
గుట్టెఁడొకండు, తన్నుఁ దోడఁగొట్టి హసింపఁగఁ, డంకబింకముల్,
జట్టునజాతికూల, దిగజాఱినకీర్తిని లేవనెత్తఁగాఁ,
జట్టునలేచి జక్కన, కృశానువునై, పలికెన్, దయాళునై,

అభము శుభమ్ములన్, దెలియనట్టి యమయికబాల! శిల్పిలో
క భయదు, జక్కనన్, దొసఁగుకాడని యంటివి, పిచ్చియెత్తెనా!
సభ, నిటువంటికానివి, యసభ్యములన్ బలుకంగవచ్చునా?,
రభసలవేలరా! తొలఁగరా! క్షమియింతును, దప్పఁగాచెదన్.

నీ పొరపాటు దొడ్డదిర! నేరమికాద! మఱింక, నేరమిన్
నీ పొరపాటుఁ గప్పుకొన నెంచకు, నింద్యముఁ, గాచువాఁడు, దు
ష్ప్రాపుఁడు, వాని కెక్కడ శుభంబులుగల్గవు, నీవయస్సు, నా
దాపునసెంత, భూపతి పదమ్ములఁదాఁకి, క్షమింపఁగోరరా,

జక్కన మాటలన్ వినుచు, చైత్రరథమ్ము క్షతాంగమై ధరన్
బ్రుక్కినయట్లు, చే యులి యరుఁతుడమ్ము, తలవంచినట్లుగా,
మిక్కిలి బాధనందుచు, సుమించిన యామని, యగ్నిదగ్ధమై
గ్రక్కునమాడినట్లు, మదిఁగందుచు, డంకన, యోర్మి, నిట్లనెన్.

పెద్దలుమీరు, తాలిమిని వీడుచు నిట్లనఁ జెల్లునయ్య! నే
కొద్దినె యే యభమ్ము నొకకొంత శుభమ్ముఁ నెఱుంగనేర, మీ
సుద్దులుచాలు, నేపలుకుఁ జొప్పడనట్టిది నాదునోట నే
ప్రొద్దునురాదు, కోరుదునె? పోయినఁ బ్రాణము నే క్షమార్పణన్.

తప్పును జేయువాఁడుఁ నెఱితప్పిన మాటలు పల్కియున్నచోఁ,
రొప్పక, తప్పు నొప్పుకొని, ఓలక, కోరు క్షమార్పణమ్ము, నే
తప్పునులేని యేఁడు, నిజధర్మముఁదప్పుచు, దానిఁగోరు?ఁ, గ
న్గప్పినఁ, దప్పునొప్పగునె? కల్లవే, పుర్వులు మేడిపండునన్.

దోషజ్ఞత్వము తప్పుఁజెప్పు, టది నిర్ధూతాఘున్మై శ్రేయమైఁ
భూషాప్రాయమునైన, సర్వజగతిన్, బోషించు, నీ జాతిలో
దోషంబున్నది, చెప్పకుంటయది నాదోషంబు, దోషోచ్చల
ద్రోషాగ్నుల్, ధరనెల్లఁగాల్చును, ధరాద్రోహమ్ము కర్తవ్యమే?

కావున, దోషోద్ఘోషణ,
కావలెనని, చేసితయ్య, కావగ మిమ్మున్,
భూపరుని, నాకుఁ సుంతయు,
కావరమేలేదు, తెరచి కన్గవ,ఁ గనుఁడీ.

వయసునుబట్టి కేవలము, పాండితియుండదు, వ్యక్తితత్త్వ మా
శ్రయమునుబొందుఁ గొంత, నిజసంస్కృతి మూలము సర్వవృద్ధిసం
చయమునకౌను, దుర్దమ గజాధిపు, సింహకిశోరమొక్కటే,
రయకరతాడనంబున, ధరన్బడవేయదె? ఈడు ముఖ్యమే?

యువక వాక్యములను, నోర్వక జక్కన
వాదించె, దోషంబు లేదటంచు,
నూఱుపాళ్ళుగనుండె, నీజాతిబొమ్మలో,ఁ
దప్పటంచును బల్కె,ఁ దరుణశిల్పి
నీవెట్లు చేయుదు, నిర్ణయంబని పెద్ద,
తీండ్రించి వాదించెఁ, దిరిగి, యలుక,
రాతి గుండెలలోతు, లధ్యయనముసేయు,
శిల్పి కీవిషయము, చేతిఫలమొ,

యనుచుఁ బలికెఁ బిన్న, యంతకంతకు, వాద
మతిశయించె, సభకు మతులుపోయె,
నోర్పుతగ్గి యిట్లు, తీర్పిచ్చె జక్కన,
కనులనుండి రక్తకాంతు లురుక

ఓరిబాలక! మాటలెందులకురా! ఒప్పైన యీరూపులో,
నేరబొక్కటి యున్న చో, వినుము, తన్నిర్మాయి, యీహాస్తమున్,
ఘోరాసిన్, దెగనేసెదన్, దొసగు లేకున్నవు నీ. సంధ యే
దో, రూపింపుము, మధ్యవర్తి, మనకిందున్, రాజుగారే, సుమా.

జక్కనమాట, నోటితుది సాగకముందె, కుమారశిల్పి, వే
డెక్కిన భావముల్ గదుర, తీలిగఁబల్కెను. జక్కనార్య! నా
పక్కమె యుక్కివంబయినఁ, బిందెమిదే. నిశితాసిధారచే,
గ్రక్కున నామెడం దఱిగి, కానుకవెట్టెద శిల్పలక్ష్మికిన్.

పెద్ద పిన్నల పగ్గెల భీషణతకు
జలదరించిరి సభలోని సర్వజనులు
చెన్నకేశుని నాభినిఁ జీల్చి యందుఁ
గలుఁగు, గుణదోషములఁ, జూడవలసె, నపుడు

పాదములంటి మ్రొక్కి, యదుపాలునిఁ బ్రార్థనచేసి, వేఁడి, ని
ర్వేదమునంది, తప్పక, ధరించెనుసమ్మెట, నొక్కసైనికుం,
డా, దనుజారి, నాభి, ననయంబున, ప్రీల్చఁగ, వెన్నుకుక్షిలో,
నాదిగనున్న లోకములయందున, క్షోభము. పెల్లురేపగన్,

సమ్మెటనెత్తి సైనికుఁడు, సాహసియై. ప్రతిమోదరమ్మునన్,
గ్రుమ్మెను నైకధా, శిల యకుంఠితపూటను, ఖంగుఖంగునన్,
దిమ్మరపోవ గర్ణములు, తీవ్రతరమ్ము ప్రతిధ్వనించె, జి
త్తమ్ములు సంచలించెను, వ్యథాకలితాస్తికనాస్తికాళికిన్.

కొట్టగఁ బదిదెబ్బల, నా
గట్టి ప్రతిమ భిన్నమగుడుఁ గప్పయొకటి, యం
దుట్టిపడి, దూకె, బయటకుఁ,
బట్టున నపకీర్తి శిల్పిపై దూకినటుల్.

శిలాగర్భమునుండి పాషాణదోష నిరూపకంబగు మండూకము, దూకుటను జూచి డంకన యిట్లన్నాఁడు.

శుద్ధ శిలాంతరాళమునఁ, జోటును నిర్మితిచేసె, నిట్లసం
బద్ధముగాఁగ దర్దురము, మాన్యతఁగోల్పడె, దాన, రాయి, మీ
బుద్ధికి రాతిదోష మనుభూతముకామికి, నింతప్పటై, నో
సిద్ధయశస్క ! నా విజయసిద్ధికిఁ, గారణమయ్యె, నయ్యదే,

మీయోటమి, నావిజయము,
న్యాయముగా జఱిగె, నని, నయంబునఁ బలికెన్,
బ్రాయపుశిల్పియు, జక్కన,
న్యాయమునకుఁ, దలనువంచియున్, బెగడొందెన్.

అనూహ్యమైన ఆవిషమ సంఘటనమునకు

పాదును జేసి, ప్రత్యహము వారిని నిండుగఁబోసి, పెంపుకై
స్వేదములోడ్చి, దోహదముచేసి. కనుంగవ వత్తులుంచి, యీ
మాదిరిపెంచినట్టి, యసమాన మనోహర శిల్పవృక్షు, మీ
మాదిరి, నొక్కమాఱుగనె వ్రాల్చ స్థలిఁగూలఁగ, రుద్ధబుద్ధియై,

జక్కన మ్రాన్పడిపోయెను,
ఫక్కున జనమంత నవ్వుభంగిగఁ దోచన్,
వెక్కసమయ్యెను బ్రతుకు, కా
దిక్కరితుల్యునకు, గీర్తి తెగిపడు వేళన్,

తూలి యిరింగణోద్ధతికి దూరముగాఁబడి, యూర్పులంది, హ
స్తాలను నూఁతఁజేసికొని, ధారుణినిల్చిన వ్యక్తివోలె, శి
ల్పాలయ విగ్రహమ్ము, శకలంబుల నిల్వఁగ, జక్కనార్యుడున్,
దూలియు లేచె, ధర్మమరుదుత్థిత, నైజబలావలంబుఁడై,

లేచి జక్కన్న డక్కనను ఆప్యాయముగాఁజూచెను. డక్కన్నయు భక్తితో జక్కన్నను జూచెను. అవిజ్ఞాత రక్తసంబంధమేమున్నదోగాని వారికిఁ బరస్పరము వాత్సల్య భక్తిభావములు హృదయాంతరాళములయందు మెదలినవి.

కాఁకలు తీఱినంతఁ, దొలిక్రౌర్యము నీరయిపోయె, వారిలో
మేకొనె, సానుభూతి, నునుమెత్తదనంబు లెడందలందు ని
ర్మోకమువీడఁ దావుకొనె, మోసులనెత్తెను భక్తి వత్సల
త్వాకర భావముల్, హృదయబంధము, బంధురమయ్యె, బద్ధమై,

గతమును దృష్టిలోనిలిపి, గమ్యపథంబును దూచిచూచి, శా
శ్వతమగు కీర్తికాయమును, సారతరంబగు సత్యదైవమున్,
మతి నుతిచేసి, యీసు, నవమానముఁ గ్రోధముఁ, బాసి, తేఁకువన్
క్షితిపయినిల్చి, నేత్రములఁగీర్ణములై, హిమకాంతులొల్కఁగన్,

కని, సుకుమారు, మారుని వికారుని, ధర్మపు వర్మమైన బా
పునిఁ, దనయాయురర్థములఁబూర్తిగఁగోరు ప్రజాసమూహమున్,
దన కుడిబాహువున్, సుగుణధాముఁడు జక్కన, క్రేటుఁగొంచు, స
ద్వినయము మీఱ, నిట్లనియె, విశ్వము, కన్నుల వెల్లునింపఁగా,

ఓచిరంజీవి ! వసుధకే యుసురువైన
ధర్మభూపతి ! తోడులై తనరుప్రజలు,
ఓడిపోతిని, దండము నొప్పుకొందుఁ,
బ్రతినఁ జెల్లింతుఁ, బెంచెద, వంశకీర్తి.

అనుచుఁ గుడిచేతిఁ జాపి, జక్కనయునుండె,
నూపిరాడక సభయంత, ఊఁగిపోయె,

కదలె డక్కన్నగుండె, జక్కన్నఁజూడ,
చెన్నకేశవు, మది నేమి, యన్న యుదిగొ,

ఒక్కఁడురాడు ముందునకు, నుత్తమశిల్పి కరంబుఁద్రుంపఁగా,
నొక్కొక ఖడ్గిపైన, నృపుఁడుంచినఁ జూపుల, నాత్మహస్తమే
ముక్కలుఁజెక్కలౌచుఁ, బెనుముప్పును దెప్పునఁబొందినట్లుగాఁ,
గక్కరమూపిరైన, యసికాండ్ర, మనంబులు, మూల్గె, మూఁగఁగా,

దయనీయమైన యాపరిస్థితి సభను గలఁచివేసినది. అప్పుడు.

యువకుఁడు, రాజు, పౌరులు, "ననుత్తమశిల్పి, శిలాత్మ, జక్కన
ప్రవరుఁడు, వానిచేయి యజరామరమై విలసిల్లుగాక! యీ
భువి, దోసగింతలేక, తనువుండునె? సర్వగుణాశ్రయంబునౌ,
భవమున, నొక్కతప్పు పరిపాటికిరాదని," పల్కిరార్తితో.

అని యొక్కపెట్టున నా దారుణ కర్మను నిరోధింపవలయునని పట్టుపట్టిరి. అపుడు ధర్మమూర్తియైన దక్షిణాచార్యుఁడు.

పందెము పందెమే, యది యభంగురమై నెఱవేఱనేని, ఁగూ
పందెము కీర్తిదాయకము, పంతము వీఁగినపందెకానిపై
జిందులుద్రొక్కియాడును బచేళిమమై యపకీర్తి, కీర్తికై
బొందిని వీఁడుమానవుడు, పుణ్యతముండని, జక్కనాపగన్,

ధండనాధికారి, ధరణీశుఁడౌటచే,
దండ్యు వదలుఁడెపుడుఁ, దప్పెకనుక
విష్ణువర్ధనాజ్ఞ, వెనుకటిపేరుఁడే
కత్తిచేతఁబట్టెఁ, గరుణవిడచి,

సృష్టికర్తనాభిఁ, జీల్చిన యాతడే,
సృష్టికర్త, కర్త, చేగు, కర్త
నంబుఁజేయుఁ, గారణంబునుగార్యముఁ,
బాడుచేయువాఁడు, బాగుపడున?

పంచాణ శిఖరమై, పరఁగు జక్కన ధర్మ
రక్తికిఁ బులకించెఁ, బ్రకృతిమాత.
శిల్పకళాలక్ష్మి, చెఱఁగునన్ మోమును,
గప్పి, రోదించె, రాల్కఱఁగిపాఱ,
లోకము కనుమూసి, లోలోనఁగుందుచు,
బ్రతుకుచావులమధ్యఁ, బ్రాఁకుచుండె
భారతీదేవి హస్తారవిందసహస్ర
దళములందొక్కటి, దళితమయ్యె,

కాశయులిలోని, వాఁడిమి, కన్నుమూసె,
విశ్వశిల్పికి, నెపదలో, వేఁడిపుట్టె,
జక్కనార్యుని, కుడిచేయి, ముక్కయగుచు,
ధాత్రిమొడిలోన, దీర్ఘనిద్రను, గనంగ

ఛిన్నవాస్తుఁడైన, శిల్పి జక్కనఁజూచి,
యువకశిల్పిహృదయ, ముడికిపోయెఁ
దన్నుఁజూచి బాధఁగన్నట్టి, యువశిల్పి
ప్రేమఁజూచి, పలుకరించె, శిల్పి

యువశిల్పీ! నీవెవరవు, ఇంత గొప్పశిల్పవిద్య నెక్కడ నభ్యసించితివి అని జక్కన్న ప్రశ్నించెను. శిల్పశాస్త్రమందుఁ దనకు మక్కువ మిక్కుటమనియు నాదృష్టితో మహాశిల్పాచార్యుల నెందఱినో యాశ్రయించి శిల్పవిద్యలో రహస్యముల నేర్చితిననియుఁ జెన్నకేశవ విగ్రహప్రతిష్ఠ విని యిచ్చుటకి వచ్చితిననియుఁ దనపేరు డంకన్న యనియు యువశిల్పి చెప్పెను.

తర్జనభర్జన లయినపిమ్మట డఁకన్న తన కుమరుఁడే యని జక్కన్నకుఁ దెలిసెను ఆ సన్నివేశమున నందఱు మహానందమునందిరి. పిమ్మట తండ్రికి బదులుగా డక్కన చెన్నకేశవ విగ్రహమును నిర్దుష్టముగ నత్యద్భుతముగ నిర్మించెను. దాని నా దేవాలయములోఁ బ్రతిష్ఠించిరి. "సర్వత్ర జయమన్విచ్ఛేత్ పుత్రాదిచ్ఛేత్

పరాజయమ్” అనుసూక్తి తనయందు సార్థకమైనందుకు జక్కన్న యమందానంద మందెను,

జక్కనార్యు డా దేవాలయమును నక్షత్రాకారముగ నిర్మించెను దేవాలయము లోని విశేషములను జూచి బయటకు వచ్చితిమి.

ఆ శిల్పసామ్రాజ్యములోఁ గనువిందుచేయు శిల్పము లెన్నోయున్నవి.

ఒక్కశిలాతలమ్మున, నహో! పరమాత్ము దశావతారముల్,
చెక్కెను రాతిచుట్టు మొకచేత నె. సర్వజగత్తులందుఁ బెం.
పెక్కిన దివ్యమూర్తులను, బెద్దశిలన్, గుదిగుచ్చ, సాధ్య మే?
ఒక్కపుమైన నొక్కనికి, నూహకునందునె ?, శిల్పితత్త్వముల్.

ఇంకొకచోట, నద్దమును నింపుగఁగఁదాలిచి, మోమునందమున్
వంకలుతీర్చిదిద్ది, యిరువంకలఁ జెక్కిళులందుఁ బత్రముల్,
సంకు మందబునన్ నిలిపి, సంభ్రమమూనసయైన, పుష్పధ
న్వాంకుశసుందరిన్ గనితి, వాసకసజ్జిక, రాగరూపిణిన్,

దశకంఠుం డొకచోట, నుగ్రవరసంధానార్థమై, యీశ్వరున్,
బశునాథున్, గఱిగింపఁ, బ్రేగులను విశ్వాసంబునన్లాగి, త
ద్వశుఁడై, వీణియవోలెఁ బ్రేగులను దా వాయించిపాడెన్, గిరిం
ద్రశయున్-, దానినె, “రుద్రవీణ” యని మేధావుల్ ప్రశంసింతురే.

అది మహాశిల్ప, మరిది యీ యవనియందు,
భారతమునకే, యది, గర్వకారణమగు,
విశ్వకర్మకు, నేది, యీ విశ్వమందు,
చేతగానిది, ఆయువు, పోత, తక్క,

దేవాలయ ప్రాంగణ మతివిశాలము- అందులోఁగల ననేకమందిరములు శిల్ప లక్ష్మికి విహారమందిరములు) ఆ శిల్పములలో లౌకికములు సాంఘికములు ఆధ్యాత్మిక ములు ధార్మికములు నైన శిల్పములున్నవి. భారత భాగవత రామాయణాది చిత్రము లెన్నియో నచటి మందిరముల కమూల్యాలంకారములైనవి ప్రహ్లాదచరిత్ర సర్వజ

హ్లాదకరమైన యఖండ కళాఖండము అది ఆసురము తొలుత నెంత విజృంభించి నను చివరకు సమూలము నశించును. అను ప్రబోధము చేయుచున్నది ఆ యావరణములో బరమాత్ముని విశ్వరూపమువలె శిల్పశక్తి సహస్రధా వ్యాపించినది. ఏనుఁగుల బొమ్మ లక్కడ 664- విధములు మలచఁబడినవి.

అక్కడ రూపొందింపఁబడిన కేశాలంకరణములు పరశ్శతములు, ఒక్క కొప్పులరకములే రెండువందలవఱకు (200) నున్నవి.

అచ్చట నొకచోట నొక ప్రబోధశిల్ప మున్నది. అది అంతర్గ్రాహకాదర్శము (ఎక్స్‌రే) వంటిది.

కల దొకపండు, దానిపయిఁ, గాలిని మోపెను నొక్కయీఁగ, యా
ఫలము భుజింప, నీఁగపయిఁ బాదిముమోపెను, బల్లి, బల్లిపై,
తలమునఁ దొండగొక్కటి పదమ్ము ను నుంచెను, దొండ మ్రింగఁగా
పిలపిలలాడి దూకె నొకపిల్లియు, వేటరి బొంచెఁ, బిల్లికై

జీవుఁడు, జీవనమూ ప్రతి
జీవికి, నను నమృతసూక్తి, సృష్టిస్థితి కేలి
తో, విలువనిచ్చు మూదల,
ఆ వివరముఁ దెల్పుశిల్పి, యమరుఁడు కాడే.

అక్కడకుఁ గొంతదూరములో బ్రహ్మ చిత్రమున్నది. ఆ విగ్రహమునకు జానెడు గడ్డమున్నది. అది జైనసాంప్రదాయము. కొంతదూరములో బౌద్ధశిల్పము లనేకము లున్నవి. త్రిమతములను నొకే దృష్టితోఁ జూడఁగలి మహాయోగి జక్కన- "సమత్వం యోగ ఉచ్యతే" అని గదా గీతాచార్య ప్రబోధ.

ఆ సమీపములోనే నృసింహస్వామి చిత్రమున్నది ఆ స్వామికి పదునాఱు చేతులున్నవి. మహాబలాఢ్యుఁడైన హిరణ్యకశ్యపుని సంహరించు మహోగ్ర నరసింహస్వామికి పదునాఱు చేతులుండ వలయునని శిల్పి భావించినాడో- లేక అది యొక సంప్రదాయమో.

తూర్పువాకిలిపై నుండెఁ, దొడలమీఁదఁ
జేర్చి కశ్యపుఁ, జీల్చు, నృసింహమూర్తి,

తాఁడిఁ దన్నొడు వాని పెందలను దన్ను
వాఁడు, నుండు నటన్న, భావంబు దెలిపి.

కనఁబడె నొక్క-శిల్ప మటఁ గాంచనవల్లి ధరించుఁ జీర నో
టను బిగఁబట్టి, వానరము టక్క-రిదొక్క-టి లాగుచుండె, దా
నినిఁ గరసంజ్ఞతోఁ, గమలనేత్రయఁ దోలుచునుండె, నెట్టి భా
వన నిదురించెనో యచటఁ, బండిన శిల్పవిశేషమందునన్.

ప్రకృతిసుందరి, చీర యా ప్రకృతిమాయ,
కోఁతి ప్రాకృతలోకము, చేతఁజీర
లాగుట, యవిద్యఁ దనపై పు లాగుకొనుట,
నాతిబెదరింపు, మేల్కొల్పు నారమునకు

అచటి పై కప్పు మోయు, నయ్యారె! ఐదు
కంబముల్, శేషశిరముల పంబు కలిగి
కప్పులోపలి, శిల్పము గొప్పఁదనము,
వక్క-ణముసేయ, శేషుఁడు వచ్చెనేమొ?

అచటి యూఁతకోలలందున, నొకకంబ
మునకుఁ, బేరువచ్చె, మోహినియని,
బమ్మ చేతిబొమ్మ, వమ్ముగు, నాబొమ్మ
వలపు గులుకులకునుఁ దలనువంచి

వీరము సారమంతయును, వేడ్క-గనిల్చినయట్లు, చూపులోఁ
జేరిన శౌర్యముద్ర, నరివీరుల వెన్నుల గ్రుమ్మినట్లు, సం
ధ్యారుణకాంతికిన్, వదనధామము ధామముచేసినట్లుగా,
వీరుని శిల్పమొక్క-టి గభీరము; కన్పడె, నొక్క-రాతిపై

వంచి దక్షిణపాదము. వామపాద
మును నిటారుగ, నేలపై మోపియున్న,

యట్టి, యాలీఢ పాదవిన్యాసమునకు,
ముక్కుపై వ్రేలినుంచును, దిక్కులన్ని,

ఒక్కకోమలి, నీరాడి చిక్కనైన
కేశపాశముఁ బిండగాఁ గ్రిందఁబడెడు,
నీటిచుక్కలు, కందోయి నేలుచుండు,
శిల్పి యులిబోన, నేశక్తిఁ, జేర్చినాఁడొ,

పిండిన జుట్టునుండి, ప్రభవించిన బిందువులందుఁ, గొన్ని, యా
దండనెయుండె, నంతరపథంబున నిల్చెనుగొన్ని, కొన్ని నే
లం దటిసెన్, భువింపడియె లాతుల్లుగొన్ని, యమోఘశిల్పి, చే
యందున, విశ్వశిల్పి హృదయంబు, లయంబయి, శక్తినిచ్చెనో

ఒకచోట. నంగన భుజముపై నొక చిలుకయున్నది- ఆ చిలుకకు ఆ చిలుకల
కొల్కి మాటలు నేర్పుచున్నది.

కలికి పలుకులచాలు, నా చిలుకకిచ్చె,
చిలుక పలుకులతీపి, నాకలికి కిచ్చె,
"విద్యయా విద్య" యన్నట్టి, విమలసూక్తి,
నాదరించిరి వారు, మర్యాదనెంచి.

పడతియొకర్తు నిల్చెను త్రిభంగిగ, నొక్కశిలాంతరాళమం,
దోడయని పత్నియట్లుగను, నొప్పులుకుప్పలు పోసినట్లుగా,
మెడనడుముల్ కుచంబులును, మిక్కిలివంపుల సొంపులీనగాఁ,
గడుకొని వచ్చె వృశ్చికము, కంజదళాక్షి పదంబుఁ జేఱఁగా,

కాలికిఁజేరువన్ గదలు, క్రౌర్యమునెంచక, నాట్యభంగికా
పాలనమందునన్, వివశభావమునందిన, నాట్యకర్త్రె ప్ర
ఝాలితదీక్ష కన్పడును, జక్కగ, నాశిలశిల్పమందునన్,
లీలగబోధసేయు, కళలెందును, నుత్తమభావసంపదన్.

అదియుఁగాక, తోఁచు, నన్యభావము, శిలా
శిల్పమందు, ఁగన్ను చెదరకున్న,
మంచిచూచినన్ సహించఁడు దుష్టుఁడు
పరుల, హింసతత్ స్వభావమగును.

నల్లపూసమొదలు, నరపతి మకుటమ్ము
వఱకు, గలుఁగు నగల, మఱువకుండఁ
జెక్కినట్టి శిల్పి, చేతిపరాకాష్ఠ,
జరయు మృతియు లేక, శాశ్వతమ్ము.

మఱియొకచోట నొక శిల్పమున్నది- దానిపేరు భామినీ శుక మయూరము ఆ శిల్పములో నెదురునుండి చూచిన శృంగార నాయికయు కుడిప్రైవునుండి చూచిన పురివిప్పియాడు మయూరము, ఏడమ ప్రక్కనుండి చూచిన మధురభాషి శుకపోతము కనుపించును. అనఁగా ఆ శిల్పసుందరి శృంగారరసాధిదేవత. నాట్యమయూరి శుక వాణి-అను మూడు మనోజ్ఞభావముల నా శిల్పములో శిల్పి బ్రహ్మ పొందుపఱచినాఁడు- ఎంతటి భావనా శిల్పమది

ఓయీ జక్కన శిల్పిరాజ! అజుఁ డెంతో నేర్పునన్ జేసె నీ
మాయామేయజగమ్ము కాని యది సామాన్యంబెం సద్భావనా
జ్ఞేయంబైన మయూరకీరయువతీ నిర్వాహకప్రాప్తమా
నీ యత్యున్నత సృష్టి కీడదియు నౌనే? ముప్పు చేవందునే?

జక్కనార్యుఁడు ఔచిత్యవేత్త. సంఘమును జెడుత్రోవపట్టించు శిల్పముల జోలికిఁ బోవలేదు. కామశాస్త్రమునకు దృష్టాంతముల నాతఁడు శిల్పీకరించినాఁడు. కాని యందనౌచిత్యము లేదు. అచట ఒకేవిధముగఁ గన్పించు చిత్రములున్నవి. సామాన్యదృక్కుల కవి యొకేవిధములు. శాస్త్రదృక్కులకు నన్నియుఁ బ్రత్యేకములు.

మఱియొకచోట విచిత్రపద్ధతిలో నిర్మింపఁబడిన కొన్ని స్తంభములున్నవి. వానిని దీప స్తంభములందురు. ఒకప్పుడా స్తంభాగ్రములు దీపములవలె వెలిగెడివఁట ఆ స్తంభములు నిరాధారములు. ఎంత విడ్డూర్యము ?

అక్కడిశిల్పము మూడువిధములు 1. నాగరశిల్పము, 2. వేసరశిల్పము 3. ద్రావిడిశిల్పము. ఆ మొత్తము శిల్పమును స్థూలముగా హోయసలశిల్ప మను చుందురు.

శాస్త్రవేత్తలు ఆ శిల్పమును మఱియొక విధముగాఁగూడ విభజించిరి. 1. నాట్య శిల్పము- ఇందులో వివిధ నాట్యభంగిమలు తదంతర్గతవిశేషములు చేరును. 2. దేవతాశిల్పము- ఇందులో బ్రహ్మ విష్ణు మహేశ్వర నృసింహ- మొదలైన దేవతామూర్తులుందురు 3. ప్రబోధశిల్పము- అనగా నుపదేశము చేయునవి. బౌద్ధ శిల్పములు ఆధ్యాత్మిక శిల్పములు ఈ తృతీయభాగాంతర్గములే.

ఆ మహాశిల్పసముద్రములో నేను గొన్ని బిందువులను మాత్రమే గ్రహింపఁ గలిగితిని. ఆ గ్రహించినవానిలోఁ గొన్నింటిని మాత్రమే గ్రథస్థము చేయఁగలిగితిని. గ్రథవిస్తరభీతియే యందులకుఁ గారణము.

## హళిబేడ్

కవికలము శిల్పియులి చిత్రకారుని కుంచె విశ్రాంతి తీసికొనచేవు. అందు వలన, డక్కన్న, బేలూరునకు ముప్పదిమైళ్ళ దూరములో నున్న హళిబేడ్‌లో జిత్ర నిర్మాణమునకుఁ, బూనుకొన్నాఁడు. ఈ హళిబేడ్‌నే ద్వార సముద్రమంటారు.

జక్కన్న తన చిత్ర నిర్మాణములో నెంతయో నిగ్రహమును ఔచిత్యమును బాటించినాఁడు. అందులకాతని వయస్సే కారణము కావచ్చును డక్కన్న యువకుడు గదా ఆతని, యులి, వసంత మధుపము. ఔచిత్యమును బాటింపక, రతిలోని నిగూఢ ముద్రలనుగూడ శిలలపై ముద్రించినది. అవి యేహ్యములుగా నుండును. హళి బేడ్‌లో జక్కన్న చెక్కిన శతాధికములైన శిల్పమూర్తులు చూచువారి నిట్టే యాకర్షించును బేలూరు, శిల్పదేవతకు, నివాసభవనము- హళిబేడ్ విశ్రాంతి మందిరము.

జక్కన్న శిల్పము- శాంతగంభీరము- కూలంకషముగ నిండుగ నీరవముగ సాఁగిపోయినది. డక్కన శిల్పము గిరిశిఖరములనుండి జలజల జాలువారు సెలయేఱు. జనకుని శిల్పసృష్టి, పచేళిమమైన. పసుపుపచ్చని పండు. తనయుని శిల్పము, దోర ముగ్గి, కరకరలాడు, ఆకుపచ్చని, ముదురుకాయ. తండ్రి శిల్పభవనము గోపురోన్న తము- (గొప్పతనముచేతఁ బ్రసిద్ధిఁ బొందినది- ఎత్తైన గోపురము కలది) తనయుని

శిల్పము- నిర్గోపురసమున్నతము) గొప్పప్రసిద్ధి చెందకపోయినను- అనంతర శిల్పములలో నగ్రేసరము- ఆ శిల్పభవనము మండపమువలె నుండును. దానికి గోపురము లేదు. జక్కన చేయనిది డక్కన్న చేసినది, విశేషసృష్టి నందీశ్వరద్వయ నిర్మాణము.

ఆ వృషభరాజులు పదియడుగుల యౌన్నత్యము, ముప్పది యడుగుల చుట్టుకొలత కలిగి గంభీరాకారులై యున్నారు. శాస్త్రప్రసిద్ధ, వృషభశ్రేష్ఠ చిహ్నము లన్నియు, రాశిపోసినట్లుగా. సాగిత్తల జంట కన్పించుచుండను- వానిలోనొకటి-

నిక్కినపీనులున్, బెత్తిగి నింగినిఁ జీల్చెడు వాఁడికొమ్ములున్,
నెక్కొను వేఁడిచూపులు, త్రినేత్రునివాహనమైన యుబ్బుఁ గై
పెక్కిన చిత్తమున్, గల వృషేంద్రుని భీకరమూర్తియుండె, నా
కెక్కడ సాటియెవ్వరు ? మహేశ్వరు తేజికి, శృంగ భేదికిన్.

రెండవ నందియుండెను, "గిరీశునిఁ జంద్ర గురి త్వవిత్రు నే
నెంతనకుండ, వానసక, యెప్పుడు మోయుచునుందు, నందు చేఁ
బండెను నాదుజన్మ ననువంటి పవిత్రులు లేరు లేరె, యీ
యండజమెం దటంచు, వినయంబున ధన్యతఁ జెప్పుచున్నటుల్.

ఒకే యులినుండి పరస్పర విరుద్ధభావబంధురములైన. మహోక్షముల, రూపులు రూపొందుట యబ్బురముగదా.

డక్కన్న శిల్పములో నవీననాగరికత సామాజిక పరిస్థితులు వివిధగతులలో ప్రత్యక్షమగుచుండును. హారములందలి సూక్ష్మములైన పూసలను రెప్పలందలి రోమరాజిని సుస్పష్టముగాఁ జెక్కు విద్య డక్కన్నకు వెన్నతోఁ బెట్టినదేమో యనిపించును.

## శ్రావణబెళగొళ

శ్రావణబెళగొళ జైనక్షేత్రము అక్కడఁ గొండపైన 60 అడుగుల గోమటేశ్వర దిగంబర విగ్రహము నిర్మింపఁబడినది దిగంబరత్వమనునది జైనులలో నొకపక్ష సిద్ధాంతము గోమటేశ్వరునకు 60 సంవత్సరముల కొకసారి మహాకుంభాభిషేకము చేయుదురఁట.

బెళగొళలో జైనదేవాలయములతోఁబాటు ఇతర దేవాలయములు గూడ నున్నవి. వానిలో సరస్వతీమాత యాలయ మొకటి.

సరస్వతీ దేవ్యాలయము చిన్నదైనను సర్వకళాశోభితము. విగ్రహము స్వచ్ఛమైన పాలరాతితో నిర్మింపఁబడినది. చిఱునవ్వు వెన్నెలల నొలికించుచున్న యా వాగ్దేవి భక్తాభీష్టముల స్రవించుటకు సిద్ధముగానున్న కామగవివలె నున్నది.

ఆనాఁడు మూలానక్షత్రము. శారదామాతకు శాస్త్రోక్తముగా నచ్చట నర్చన జఱుఁగుచున్నది. ఆ తల్లినిఁజూడఁగానే నా తనువు మనము భక్తినమ్రములైనవి.

తెల్లని మేనిచాయలు మదింగల సత్వరుచిన్ వెలార్పఁగాఁ
జల్లని చూపువెన్నెలలు సాంద్రములై తనుఁగొల్చువారిపైఁ
గొల్లఁగ వ్రాలి వారియెదకున్ రసభోగసమృద్ధినీయ, సం
ఫుల్లసరోజనేత్ర యిరవొందెను శారద కన్నతల్లిగా.

ధాతమోముల మేడఁ, దగినవిశ్రాంతిని,
గనుచున్న యమ్మలకమ్మ, సాధ్వి,
కాళిదాసాది, సత్కవుల లేఖినులందు,
నక్షరాత్మగ, వెల్గు, నమరమూర్తి,
సత్యలోకమురాణి, సాహిత్యసుమవేణి,
నాల్కపైఁగొల్వుండు, నలినపాణి,
ఎడదలోఁ గుసుమించు, నింపైన, భావాలఁ,
బలికించువీణ, గీర్వాణి, జాణ

నెమ్మి జక్కని నెక్కుడు, నెలతమిన్న,
పైడిజవరాలి కోడలు, ప్రాతమినుకు
లందు నర్తించు, నర్తకి, గ్రంథమూర్తి,
తల్లిఁగనుగొంటి విద్దెల మల్లెవల్లి.

కాలిపైఁ, గాలుగదియించి, కేలమాలఁ
దాల్చి, తాఁగద్దెపై, వరదాఖ్యయగుచు,

వీణఁబలికించు, కాంచిసుశ్రోణి, గాణి,
వాణిఁ, జూచితిఁ, గన్నులఁ ఫలముఁగంటి,

తల్లీ! కైతలనల్లు నేర్పును, దయాదాక్షిణ్యమూర్తీ! కృపన్
జెల్లన్, నాకు నొసంగితమ్మ! కవితన్ శ్రీగంధమున్ గూర్చి, యో
యల్లా! దాని పరీమళంబులను, విఖ్యాతంబులన్ జేసి, నా
యుల్లంబున్ వికసింపఁజేసి, కవిమాన్యున్, జేయుమా, మాతరో!

ఇట్లు నలువరాణికి నమోవాకంబులర్పించి బెంగుళూరును దర్శింపనేగితిమి.

## బెంగుళూరు

ది. 3-10-84న ఉదయము గం. 9 లకు మేము బెంగుళూరు చేరితిమి.

కంటిని, బెంగుళూరు, నతిగచ్ఛ, దనంత, విచిత్రసౌధమున్,
కంటికిఁబంటయై వెలయు, క్రమ విశాల సుదీర్ఘ రథ్యనున్,
జంటయి తెల్గుపీటికిఁ, బ్రశంసలనందిన, శుభ్రకీర్తినిన్,
మంటినిఁబైఁడిచేయఁగల, మాన్యపురీవర, శీర్షరత్నమున్,

భరతఖండమ్ములోపలఁ, దురీయంబౌచు,
ఖ్యాతిఁగొన్నట్టి విఖ్యాతపురము
కర్ణాటరాష్ట్రి పంకజమధ్యమందున
విలసిల్లుచున్నట్టి బీజకోశ
మధునాత, నానన్య, మహిత నాగరకతల్
నెలవుకొన్నట్టి వెన్నెలపురమ్ము
చలనచిత్ర విశాలశాలా శతమ్ముల
కాకరమైన, కళాశ్రయమ్ము.

తెలుఁగు వెలుఁగుల, సంస్కృతిఁగలుపుకొన్న
మిశ్రసంస్కార సంపత్సమేత, ఘాత,
తెలుఁగుతల్లికిఁ, బక్కింటిచెలువ, మనకు
నరయఁబినతల్లి, బెంగుళూర్పురమతల్లి,

బెంగుళూరు కర్ణాటకరాష్ట్ర రాజధాని, దానియందు హైందవ సంస్కృతి ఎక్కువగా ప్రత్యక్షమగుచుండును. అక్కడ ఫలవృక్షములు ఛాయావృక్షములు పూలతీఁగెల జూంపములు విరివిగానున్నవి. అందువలన నా పురము తల్లియుల్లము వలెఁ జల్లగానుండును.

మాతృభాషావైశిష్ట్యము - తెలుఁగువెలుఁగు :- కన్నడులకు మాతృభాషాభిమానము మెండు. విద్యాలయములలోను బరవీథులందును వారు మాతృభాషకుఁ బ్రథమ స్థానమిత్తురు. ప్రకటన ఫలకములమీద (బోర్డులు) మొదట కన్నడముండితీరవలసినదే, మనదేశ మందులకు విరుద్ధము. క్షౌరశాలమీదఁగూడ గూడ "బార్బర్ షాపు" అని ఇంగ్లీషులో వ్రాయుదురు. ఈ భావదాస్యము తెలుఁగులకు వెన్నునఁబుట్టి ముదిరిన వ్యాధి.

బడులను, వాడిగీములను, బండితగోష్ఠులలోన, త్రోవలో
నడవడియూసులందున, విహారముచేసిన, నమ్మబాస, య
ప్పుడు, నిజమౌ స్వతంత్రతను, బొందును దేశము, లాతితోఁకలన్,
దడవినయంత కాలము, వినాశముతప్పదు, దేశవృద్ధికిన్.

కన్నడదేశవాసులకు, గౌరవమెంతయొ మాతృభాషపై
నున్నది, దానినే మొదటనుంతురు బల్లలమీద, నాంగ్లమున్
బన్నుగ దానిక్రిందుగనె వ్రాయుచునుందురు, మాతృభాషపై
మన్ననఁజూపువాఁడె, బుధమాన్యుఁడు, జాతికిజీవగఱ్ఱయా.

ఇంటను గెల్చి, రచ్చను జయించుటె మేలని ప్రాజ్ఞులాడరే,
తుంటరులైనవారు, తమ తొల్లిటిధర్మము విస్మరించి, ప
క్కింటికిఁ గూరకై పరుగులెత్తెద, రట్టి వివేకహీనులే,
కంటను దుమ్ముకొట్టుకొని. కానరె జాతివిశేషధర్మముల్.

మాతృభాష యెటువంటిదైనను దానిని గౌరవించుట మనవిధి. ఆటవిక పార్వతేయ జనులు, అసంపూర్ణమని తమభాష నీసడింతురా ? వారు నిరంతరము తమ భాషలో నాప్యాయముగ మాట్లాడుకొందురే, వారికి వారి భాష ప్రాణాధికము.

తెలుఁగుభాష 56 అక్షరములు కలిఁగి సంపూర్ణ భాషగా పరిణతి చెందినది. "పశ్చిమభాషలందు నిటలీభాషవలెఁ, బ్రాచ్యభాషలందుఁ దెలుఁగు సుందరమైనదని ప్రసిద్ధి జెందినది. అట్టి సంపూర్ణభాషను. బవిత్రభాషను గౌరవింప లేకపోవుట యెంతయజ్ఞానము.

తేనెను మించి తీయనయి, తేజము నోజముకల్గి, దేవ భా
షా నవజీవమై, సకలసంస్కృతి నిర్మితికాలవాలమై,
ఫేనసితమ్ము, పాత్రము, పవిత్రము నౌ, మన తెల్గు నీడి, పై
వానిదియైన భాషకయి, వాయిని విప్పెడు, వార, లాంధ్రులే.

కుడి యెడమలఁ గలవారల,
నడవడి గుర్తించియైన, నాంధ్రులు తప్పుల్
విడువ రిది యేమిపాపమొ!
చెడువానికి మంచియంత చెడుగై తోఁచున్.

శ్రవణపేయములై మధురాతిమధురములైన మన సజీవపదములను వదలి కేవలము వ్యామోహముతోఁ నిర్జీవమైన (నిర్వ్యుత్పత్తులు - అన్యదేశియములు) పరపదసేవ విజ్ఞతకు చిహ్నము కానేరదు.

అమ్మా, యను పదమెంతో,
కమ్మని దుండంగఁ, దల్లికన్యాయముగా,
"మమ్మి యనిపించు, దౌర్భా
గ్యమ్మున కొడిగట్టినావ, ఆంధ్రమ్మన్యా!

అమ్మపదమ్ము, వీనులకు హాయినిఁగూర్చెడు వాయులీననా
దమ్ము, సహస్రజన్మ సుకృత ప్రభవంబగు దివ్యమైన బం
ధమ్ము పవిత్ర వేదపరతంత్ర మహత్తర భావనా పరీ
తమ్ము, సుధాసమమ్ము, జగదంబకుఁ జిహ్నముఁరా! త్రిలింగజా!

దేశ్యపరిమళ భరితమై, తెలుఁగు వెలుఁగు,
నాల్గుదిక్కుల విరజిమ్ము, "నాన్న" పదము,

ఒంటఁబుట్టినయట్టి, యీ జంటకంటె,
మధురమయ్యెనురా! నీకు మమ్మి, డాడి
ఇంతకంటెను నన్యాయ మేమికలదు.
ఇంటిభాషను, రక్తమందిముడుభాష,
నాదరింపక, పరభాష ! నాశ్రయింతే?,
నునుపు దూరంపుకొంపను, నుక్తివినవె?

అజీర్ణము చేసినవానికి నమృతము రుచించనట్లు పరభాషా వ్యాధిగ్రస్తునకుఁ బరమార్థబోధక మాతృభాష రుచించదు. ఇంతేకాదు. ఇంతకంటె ఘోరాతిఘోరమైన యజ్ఞాన మొకటి నేఁటితెనుఁగు వారిలోఁగొందరిలోనున్నది. అది ఉదరకోశములో జల గ్రంధివలెఁబెరుఁగుచున్నది. అది మాతృభాషను గౌరవించువారి నాక్షేపించుట, ఈవిషయములోఁ దెలుఁగువారు కర్ణాటకులను జూచి సిగ్గుపడవలసినదే. ఒక్క కర్ణాటకులే కాదు. తెలుఁగువారు తప్ప సమస్త దాక్షిణాత్య, ఔత్తరాహు లందఱు మాతృభాషను గౌరవించు వారే. నడుమనున్న వారికే వచ్చినది మానని యీ నాలుకరోగము.

మేము బెంగుళూరు వెళ్ళినపుడు దసరా ఉత్సవములు జఱుగుచున్నవి. దసరా పండుగలను వారును మనవలెనే యుత్సాహముతో చేసికొందురు. కాని వారి యుత్సవములలో భారతీయ సంప్రదాయము, ఆధ్యాత్మిక తత్త్వము, ముఖ్యముగాఁ గన్పడును- గృహములకు దుకాణములకు దేవాలయములకు మామిడితోరణములు గట్టిరి, అరఁటిస్తంభములను, స్తంభములకు ద్వారబంధములకుఁ గట్టిరి. తోరణములతోను అరఁటిస్తంభములతోను అలంకరింపఁబడి తిరుగుచున్న వాహనములు తిరుగుచున్న లతానికుంజములవలె నున్నవి- ఒకచోట

కన్నులపండువై యచటఁ గానఁగవచ్చెను, భూరి గోపుర
ప్రోన్నత, మచ్ఛశిల్పవరభూషిత, మాశ్రిత భక్తనాద సం
పన్న, మదభ్ర సాలనగవర్ధిత, మద్భుత, మగ్రగణ్యమున్,
సన్నుత దివ్యతత్త్వము, విశాలము, కాన్యకుమారిగేహమున్.

ఆ తల్లి ఏ యూరఁజూచినను అనన్యవైభవముతో విరాజిల్లుచుండును. అందులకుఁ గారణము సహజముగా నైశ్వర్యవంతులైన వైశ్యుల కామె దేవతయైయుండుట యేమో "కిమసాధ్యం సువర్ణస్య"

ఆ యాలయములో గన్యకాపరమేశ్వరి ముమ్మూర్తుల వరస్మరణ సంజాత లజ్జా పులకితమైన కన్నెపిల్లవలెఁ గన్పట్టును. కన్నుల పండువుగా నా పరమేశ్వరిని దర్శించి

శతపదంబులు ముందుకుఁ సాఁగి, యచట
కోరికల్ మీఱు బసవన్న గుడినిఁ గంటి,
ఉండె బసవఁడు, నీలాద్రిపండినట్లు,
శివునిగుణమంత యొకచోటఁ జేరినట్లు,

ఇరువదడుగుల యెత్తుగ నెదిగి, పదియు
నాఱుపదముల వైశాల్య మంది, యుండె,
ఋషభసామ్రాట్టువోలె, నా వృషభవృషభుఁ,
డచట, నందికి శిల్పివ్యాఖ్యానమనగ

భక్తుల పాలనార్థము, దివానిశ మా పరమేశ్వరుండు, సం
సక్తుఁడునౌట, సంతతము శ్రాంతిగణింపక వానివెూయుచూ,
శక్తి మనోహరుండు, తనశయ్యనుజేఱఁగఁ గొంతసేవు, వై
యక్తిక శాంతినాద, వృషభాధిపుఁడాయెడఁ, బండినట్లగున్,

ఆ నందికి వెనుక నొకధ్వజస్తంభమున్నది. వాని చిఱుగంటల మ్రోతలకుఁ దన యంకమందున్న కుందేలు పాఱిపోవునేమో యని శశాంకుడు భయపడు చుండును. ఆ నంది ఆ ఆలయము ఆ ధ్వజస్తంభము క్రీ. శ. పదకొండవ శతాబ్దము నాఁటివి.

**లాల్ బాగ్ :-** హైదరాలీ రెండవ కుమారుడు లాల్ ఖాన్. అతఁడు కళా ప్రియుఁడు. అందువలన దేశ, విదేశములందున్న వివిధ వృక్షలతాదులను దెప్పించి వానితో నొకయందమైన యుద్యానవనమును తయారుచేయించినాడు- ఆ తోఁటలో నడుమ రెండువేల చదరపు గజముల నేలలో నొక గులాబీతోఁట యున్నది-అందలి రంగురంగుల గులాబీలు నేత్రోత్సవమును గల్గించుచుండును- సాలార్ జంగ్ మ్యూజి యమువలె నిదిగూడ ప్రసిద్ధమే- లాల్ ఖాను, నిర్మించుట వలనను రెండువేల చదరపు గజముల మేరలో నతి సుందరముగనున్న ఎట్టి గులాబీతోట యుండుట వలనను,

నాతోటకు లాల్ బాగ్ అని పేరు వచ్చినది. లాల్ బాగ్ పై శాల్యము 250 ఎకరములు.

పూలగడియారము :- లాల్ బాగ్ లో మొదటి దృశ్యము గులాబీతోట- రెండవది పూలగడియారము.

ఆగడియారము నేలపై నిర్మింపబడినది మన కచట గడియారము కన్పించదు గడియారము ఆకారములో నున్న పూలమొక్కలు తీగెలు మాత్రమే కన్పించును- ఆ మొక్కల క్రింద ఆ మహాకాలసూచిక (గడియారము) యమర్చబడినదట ఆ గడియారములోనే యంకెలు ముండ్లు సమస్తము పుష్పాకారములోనే కన్పించును. దానిలో బెద్దముల్లు రెండుమీటర్ల పొడవుగలిగి డాబాకమ్మివలె నుండును. చిన్నముల్లు మీటరు పొడవుండును- రెండు మీటర్లదే మఱియొక ముల్లు సన్నని కమ్మివంటిది యున్నది. అది, నిముసముల ముల్లు.

ఆఘటీయంత్రమును- హెచ్. యం. టి. జపాను సంస్థవారు 1983-లో నిర్మించినారట. దాని ఖరీదు రు. 350000. ఆ ఘటికాయంత్రమునకు 5 సం॥ ఒకసారి ప్రాణము పోయుదురు (కీ ఇచ్చెదరు) ఆ గడియారమున్న భాగము చిన్న పూలతోటవలెనే ముందు కన్పించును. పరిలశీనానంతర మది గడియారమని బోధపడును.

యంత్రముకానరాదు, గడియారము చిన్నెలు కానుపింప, వే
మంత్రము పెట్టినారొ యనుమాత్రము తప్పక, కాలమానమున్,
తంత్రము చేసినట్లు కథనంబును జేసెడు, కీలుజీవి, ని
ర్యంత్రణలేనిదానిఁ, గని యచ్చెరువందితి, సంభ్రమించితిన్.

ప్రసిద్ధ చలనచిత్ర దర్శకుఁడు శాంతారాం "లోకమాత" యనుచిత్రములో అప్సరసల నాట్య దృశ్యమును నచ్చట చిత్రీకరించినాఁడు- నేఁటికిని ఆ సన్నివేశము ద్రష్టలనాకర్షించు చుండును.

లాల్ బాగ్ లోనే ఒక అద్దాలమేడ యున్నది. దానిని ఆంగ్లేయులు "గ్లాస్ హౌస్" అని వ్యవహరించెడి వారట. అది చాలా యందమైనది.

బెంగుళూరులో ఒకచోట నాకాశసౌధమొకటి యున్నది. దానికి నిరువది రెండంతస్తులున్నవి. తరువాత కొంతదూరములో మహోన్నతమైన క్రీస్తుదేవాలయ (చర్చి) మున్నది. అది అపూర్వరామణీయక రమణీయము.

బెంగుళూరును దర్శించి 4-10-84 మధ్యాహ్నము మైసూరును దర్శింపం బయలు దేరితిమి.

త్రోవలోం గావేరి సంగమమును దర్శించితిమి. అంతకు ముందెక్కడో రెండుగాంజీలిన కావేరి తిరిగి యచ్చట నొకటైనది.

కలతలవల్లనో, మదినింగాంచిన చెద్దయము పెల్లువల్లనో,
ఇలువిడిపోయి, దేశములనెల్ల పరిభ్రమణంబుచేసి, మే
నులం గల నెత్తురుబల్మి, యింక నొక్కటి చేయంగం దొందరింపం, బ
ర్వ్వులంజని, సోదరుల్ కలియుపోలిక, కన్పడె, నాథునీద్వయిన్,

కావేరి సంగమస్థల మతిపవిత్రము. అత్యంత రమణీయము- అచటి ప్రకృతి మానసోల్లాసకరము.

అక్కడకుం గొంతదూరములో నొక సుందర మందిర మున్నది. అది టిప్పు సుల్తాన్ విశ్రాంతిమందిరమంట- కొంద ఱా కట్టడమును టిప్పుసుల్తాన్ సమాధియని చెప్పిరి.

మఱికొంతదూరములో నింకొక భవనమున్నది- అది టిప్పుసుల్తాన్ వేసవి విడిదియట- దానిలో నెచ్చటను శీతలీకరణ యంత్రములేదు- కాని భవనగర్భము చల్లగానున్నది గోడలలోను నేలమీదను బిగించిన రాళ్ళలోనే ఆ శీతలీకరణ శక్తి యిమిడి యున్నదంట.

ఆ భవనములో నిరువది గదులున్నవి. ఆ గదులలో నానాంటి వివిధాయుధములు, వివిధ వస్త్ర భూషణాదులున్నవి. అవి ప్రాచీన నాగరకతకు విజ్ఞానమునకు ప్రతిబింబములు.

అచటి గోడలమీద సుల్తానుకు ఆంగ్లేయులకు జఱిగిన యుద్ధ సన్నివేశములు చిత్రింపబడినవి.

టిప్పుసుల్తాన్ కోటముందు నిలంబడి యాంగ్లేయులతో యుద్ధముచేయుచుం దుపాకి గుండ్లకు శరీరము తూట్లుపడగా శత్రుభయంకరుండై మెట్లపై నొరిగిపోయిన దృశ్యమొకటి పెద్దదిగ నొక గోడపై కరుణ వీర రౌద్ర రస స్ఫోరకముగం జిత్రింపంబడినది- ఆ సుల్తాను.

మత్తకోకిల :-

చిన్నవాఁడయి, యొంటరీఁడయి, పేర్చి యార్చెడు వైరులన్,
వెన్నుఁ గ్రుమ్మెడు వారి, నెత్తినఁ, బెట్టగాఁ దన యంజ, నా
కొన్న బెబ్బులివోలె, రేఁగుచుఁ, గూల్చుచున్ రిపుసంఘమున్,
మన్నుజాతికఁ, గూలు, నాయభిమన్యురీతిఁ, గనంబడెన్.

ఆ భవనములందున్న శిల్పకళా వైశిష్ట్య మభినందనీయము.

"మహత్త్వం యత్రవర్తేత మాన్యం తత్ సర్వమానవైః" అనునార్యోక్తి బహుదూర పర్యాలోచనోక్తముగదా, మహమ్మదీయులు మతాంతరులైనను వారిలోని విశేషములను మన మంగీకరింతుము. అట్లంగీకరింపకల్గుటయే మానవత్త్వమునకు చిహ్నము. అట్లంగీకరింపలేకపోవుట దానవత్త్వమునకు లింగము.

మహమ్మదీయ ప్రభువులు చిత్ర శిల్పకళలను ప్రాణాధికముగా నారాధించి పోషించిరి. ఆనాఁటి కుట్టిమములలో నీ విషయము తేఁటతెల్లమగును. అందులకు వా రభినందనీయులు పిమ్మట నావరిసముల పరిశీలించుచు మైసూరునకభిముఖులమైతిమి.

## శ్రీరంగపట్టణము

మైసూరునకు కేవలము సుమారు ముప్పది కిలోమీటర్ల దూరములో శ్రీరంగపట్టణమను నొకపల్లెటూరున్నది. అది యొకప్పుడు పట్టణమే యట. కాని "ఉద్ధతుల మధ్య పేదలి కుండతరమే" అన్నట్లు బెంగుళూరు మైసూరు మహాపట్టణములకు మధ్య ఉండుటవలన నా పట్టణము "నానాఁటికిఁదీసికట్టు నాగంబొట్లూ" అన్నట్లు క్రమక్రమముగా క్షీణించి పల్లెయయినది.

ఆ యూరి ప్రక్కనే కావేరి ప్రవహించుచున్నది. అది యంత పెద్దది కాదుగాని మహాతరస్విని, దాని వేగమునకు గండశిలయు గుండుసూదియు సమానమే ఎక్కడనైన గావేరి వేగరియే, దాని స్వభావమే యంత.

శ్రీరంగపట్టణము చిన్నక్షేత్రము. క్షేత్రనాయకుఁడు. శ్రీరంగనాయకుఁడు, క్షేత్రనాయకి శ్రీరంగనాయకి.

రంగడు, రంగనాయకియు, రంగము శ్రీపదమాది, యందుఁజే
రంగను, దివ్యకీర్తి, నవురా! పొలుపొందిరి. ముగ్గు, రొక్కపే
రుంగలవార, లొక్కటు, నెఱుంగమె యుండుట యందుచేత, నా
ప్రాంగణమయ్యె, మాధవుని రాజ్యములో, నొకపేటపాటిగా, (సాటి)

కావేరీస్నానమును జేసి దైవదర్శనము చేసికొని మైసూరునకు సూటిగ సాగితిమి.

## మైసూరు

**4-10-84** సా. 4 గం. లకు మేము మైసూరు చేరితిమి. అపుడు మైసూరులో దసరా ఉత్సవములు జరుగుచున్నవి. మైసూరు దసరా ఉత్సవములు జగత్ప్రసిద్ధములు.

మైసూరుప్రాంతము పూర్వము మహిషాసురునిరాజ్యము. మహిషాసురమర్దని మహిషాసురుని ఆప్రాంతమందే సంహరించినదట. మహిషరాజ్యమే రానురాను మైసూరుగా మాఱినది.

**దసరా పదనిర్వచనము** :- దసరాపండుగలను గొందఱు దేవీ నవరాత్రము లందురు. నవరాత్రపూజ ఆగమ విహిత విధానమున కనుగుణమగుటచేత! ప్రచారము లోనికి వచ్చినది.

కొందఱీ పండుగలనే దశరాత్ర్యుత్సవములందురు. దసరాపదము. దశహర పదోద్భూతమైన వర్ణలోప వర్ణాదేశాత్మకమైన తద్భవపదము.

ఆది శక్తి దుర్గాదేవి జగత్కంటకుడైన మహిషాసురునితో తొమ్మిదిరోజులు యుద్ధముచేసి ఆ దుష్టుని హతమార్చినది. ఆ సందర్భమును బురస్కరించుకొని భక్తలోకము, ఆ జగజ్జననికి తొమ్మిది రోజులు భక్తి ప్రపత్తులతో బూజలు చేయు చున్నది. అవి నవరాత్రులు. దశమ దినము పూజ ఆ తల్లి విజయోత్సవ సూచకము. అందువలననే, ఆ దశమి విజయదశమి యయినది. అది దశరాత్రిపూజ.

"హరతి దుష్టానితి" హరా పార్వతీ (దుర్గా) హరాయాః (దుర్గాయాః) ఉత్సవాః. హరోత్సవాః దశచ, తే హరోత్సవాశ్చ, దశహరోత్సవాః,అని విగ్రహ వాక్యములు.

(హర - అనగా దుష్టులను సంహరించు దుర్గాదేవి యనియర్థము- ఆమెను గుఱించి పదిరోజులు చేయు ఉత్సవములకు దశహరోత్సవములని పేరు. ఆ దశహ రోత్సవములే పూర్వోక్త ప్రకారము "దసరాలు"గా మాఱినవి. ఈ కారణమువలననే దశరాత్ర్యుత్సములు దేవీపూజాపరములైనవి.

దుర్గాదేవి మహిషాసురమర్దినియై మైసూరులో (మహిషాసుర పట్టణము) మహిషాసురుని సంహరించుటచేతనేమో మైసూరులో దసరాపండుగలు మిక్కిలి వైభవముగా జరుపబడుచున్నవి.

మైసూరులో దసరా ఉత్సవమంతయు నొకయెత్తు ఉరేగింపొక యెత్తు, పూర్వము ఏనుగంబారీలో నమ్మవారి నధివసింపఁజేసి రాజే మావటివాఁడై అమ్మవారి నూరేగించెడివాడట, ఇపుడు రాజులు లేకపోయినను. "ఇంగు వకట్టినగుడ్డ" యన్నట్లు ఆయుత్సవమును బాగుగానే చేయుచున్నారు. ఊరేగింపు సా. 4 గం. లకు ప్రారంభ మైనది. సౌధములు వృక్షములు గోడలు నేల సర్వము జనసముద్రమైనది.

నవగొండ్రమై, సాఁగునట్టి, ఏనుఁగపైన,
నంబారిలో, నమ్మ, యలరుచుండె
ఆ ముందు, శ్రవణపేయంబైన, సన్నాయి.
రాగాల లహరిలో, సాఁగుచుండె,
ఆపైన,ఁ గగుబంతరాంతరంబులు, నిండ,
బాకాల చూర్భటి, ప్రబలి మ్రోసె,
ఆవెన్క, చిత్రవేషాలంకృత, నటీన
టాభినయంబుల, షంబు, మీాఱ
గతివిశేషంబుల, మతులనాకర్షించు,
తప్పెట్ల యువివులు, తనరె, వెనుక,
కన్నులు కర్ణముల్, కలఁగిరాపడ, ముందు
గుండు సామాను, ప్రచండమయ్యెఁ
గోలాటముల యాఁటఁ, గొసరి మ్రోసెడు మ్రోత,
లాపైన, వింతైన, హంగు,ఁ గూర్చె
మింటితో జతఁగట్టి, మేలమాడు పతాక,
లొయ్యారమొలికించి, యూఁగుచుండె,
పంచకల్యాణి యశ్వములపై, రౌతుల,
గతిపంచకంబుల, గతులు మెరసె,
విద్యుత్ప్రదీపముల్, వేలువేలుఁగ వెల్గి,
ఖమునుండిజాఱు, రిక్కలను, బోలె.

రెండువైపుల జనములు పిండుగట్టి
చీమ దూరగనీక వసించియుండ
మైలుపొడుగున సాగెను, మహా, మపూర్వ
సంభ్రమంబున, దశహరోత్సవములందు.

గట్టులఁదన్ని పట్టి, యిఱుకాటమునంబడి, నైకజంతు సం
ఘట్టనఁ బొంగి, తీరముల కావలిదేశముఁజూడఁగోరి నాన్,
రట్టును గట్టుకేర్పఱచి, రావముమీఱఁగ,ఁ బాఱు నేరుగాఁ,
బట్టణవీధినున్న, నరవారము, పారములేక, కన్పడెన్.

**5-10-84** ఉదయమే మేము శ్రీ చాముండేశ్వరీదేవి దర్శనము కొఱకై బయలుదేరితిమి. ఆ దేవి బ్రాహ్మీ మొదలైన సప్తమాతృకలలో నొకతె. ఆ దేవి పర్వతశిఖరము నధివసించియున్నది. ఆ కొండపైకి మెట్లదారి, బస్సుమార్గము, నున్నవి మేము మా బస్సుమీద అమ్మవారి గుడిముందుకుఁబోతిమి, చాముండేశ్వరీ పర్వతముపై నొక నంది యున్నది. దాని యెత్తు 16 అడుగులు, వెడల్పు 18 అడుగులు.

ఆలయము ముందు ఇరువది అడుగుల యెత్తుగల మహిషాసురుని బొమ్మ యున్నది. ఆరాక్షసుని యొకచేతిలో భయంకరసర్పమున్నది రెండవచేతిలో మహాఖడ్గ మున్నది. సర్పము వాని క్రౌర్యమునకు, ఖడ్గమాతని జింఘాంసకు, సూచకములు, అచ్చటనే యుత్సవ సమయములలో నమ్మవారి నూరేగించు రథమున్నది. అది చాలపెద్దది.

దీర్ఘముగానున్న భక్తుల వరుసలో రెండు గంటలు నడచి అమ్మవారిని దర్శించితిమి. ఆ తల్లియుఁ గళకళలాడుచు వాత్సల్యముతో మాకు దర్శనమిచ్చినది.

సప్తమాతృకలన్, గడసారిదయ్యుఁ
బ్రథమగా, శక్తులందున,ఁ బ్రబలుచున్న,
నగజ యంశముఁ, గంటిఁ, గన్నాఱ నచట,
ఎడద నిండుగ భక్తి, సందడినిఁ జేయ,

ఆ యాలయమునకు నావల నటరాజస్వామి యాలయమున్నది. ఆ నటరాజే ముమ్మూర్తుల నటరాజుగానేయున్నాడు.

రాజభవనము :- ఆనాఁడు మధ్యాహ్నము రాజభవనమును జూచుటకు వెళ్ళితిమి. ఆ భవనప్రాంగణము పల్లెయూరంతయున్నది.

రాజభవన దర్శనమునకు ప్రవేశమూల్యము మూడుఁరూపాయలు, ఆ యాదాయ ముతో నా మందిరనిర్వహణము జఱుగుచుండును. ఆయములేని వ్యయ మనర్థ హేతువుగదా !

ఆ రాజ భవనము దేవాలయము వంటిది. పాదరక్షల కందు ప్రవేశార్హతలేదు. కూలివానినుండి ఏలువానివఱకు నందఱు నచ్చట పాదరక్షలను విడిచిపోవలసినదే.

రాజభవనము విలువ కొన్ని కోట్లుండును. అందలి సువర్ణ, రజత నిర్మిత వస్తువాహనాదుల విలువ, యెన్ని కోట్లుండునో నిర్ణయించుట చాలకష్టము- ఇపుడా భవంతి ప్రభుత్వరక్షణములో నున్నది- ఆ మహాసంపద సంరక్షణమునకై వందలాది రక్షకభటు లాయుధధారులై రేయింబవ ళ్ళచ్చట కాపలాయుందురు.

ఇంద్రలోకమును. జూచివచ్చి దాని పై భవమును, జెప్పినవాడు లేరుగదా! ఆ సౌధమును జూడగానే, యింద్రలోకములోని, వైజయంతము (ఇంద్రునిభవ నము) ఇట్లేయుండునేమో యనిపించినది. స్థూలదేహముతో నింద్రలోకమందుఁ దిరుగుచున్న ట్లనిపించినది. ఇట్టి దివ్య రాజభవనములను జూచియే, మహాకవులు, దేవలోకవర్ణనములను జేసియుందురేమో యని గూడ ననిపించినది.

ఆ భవనములో వందలాదిగ, గదులున్నవి. పరిచయము లేనివాఁడెవ్వడు' వెళ్ళిన మార్గమునఁ దిరిగిరాలేడు- రాలేకపోవుటయే గాదు మయసభలోని దుర్యోధను లగుదురు.

ఆ లోగిలిలో సుమారు వందమీటర్లపొడవు ఆఱుమీటర్ల వెడల్పుగల వీధుల వంటి వరుస లనేకమున్నవి. ఆ శ్రేణులన్నియు నాకేవిధముగా నుండును. అనే యంతయు ఖరీదైన తివాసీలతో నవకుంఠితమై యుండును. నే ననుకొన్నాను ? రాజ భవనములో స్త్రీలకేకాక స్త్రీలింగ వాచ్యమైన భూదేవికిఁ గూడ ఘోషా యున్నదేమో! లేనిచో నేమాత్రము కనుపించకుండ ధరాసతికి, ఈ తివాసీపరదాలేల ? అని

ఆ భవనము నందంతటను అత్యద్భుతమైన చిత్రములు చిత్రింపఁబడినవి. కళాపోషణమునకై మైసూరు మహారాజు లెంత కృషిచేసినారా ! యనిపించినది.

ఒకచోట విశాలమైన యొకహాలున్నది అచ్చట వలయాకారముగ వరుడ కుర్చీలున్నవి- ఆ కుర్చీలు స్నిగ్ధాతిస్నిగ్ధములు. అమూల్యములు. వానికెదురుగ నొక బంగరు సింహాసన మున్నది. ఆ సింహాసనము రాజుగారిది. ఆ కుర్చీలు రాజకీయ సభ్యులవి. ఆ హాలు రాజసభ. సుధర్మ (ఇంద్రసభ) ఈ సభముందు కుధర్మయే (సభా లక్షణములు లేనిది) యనిపించినది. అది రాజుగారి అంతరంగిక సభా మందిరమంట.

ఆ నిర్నిమేష సభాసౌందర్యమును జూచుచు మేము నిర్నిమేషుల మైతిమి. "యద్భావః తద్భవతి" అని గదా సూక్తి.

ఒకచోట లేడి డొక్క చీల్చి పచ్చినెత్తురు త్రాగుచున్నట్లుగ నొక వ్యాఘ్రము చిత్రింపఁబడినది. పదిమందిలో నున్నాను గాబట్టి సరిపోయినది. లేకపోయిన భయకంపితుడనై పులి, పులి అని అఱచి యుండెడివాడనేమో అంత సహజముగా నా చిత్రమును సృష్టించినశిల్పి యభినందనీయుఁడు. ఇట్లే యక్కడక్కడఁ గోడళ్ళలో మృగములు మృగరాజములు తదితర జంతువు లతిసహజములుగా మలచఁబడినవి.

అక్కడ నొక మందిరమున్నది- అది వైకుంఠసమానము దానికున్న ద్వారబంధములు తలుపులు రజత మయములు- మనోహర శిల్పస్థగితములు- ఆ మందిరములో నెచ్చటఁ జూచినను శిల్పలక్ష్మి పద మంజారములు విరఁబూచినట్లుండును- ఆ భవనము మూఁడంతస్థులది- మూడవ యంతస్థునఁ గొంతభాగమే ప్రవేశార్హము. మిగతాభాగములోనికి నెవ్వరు వోరాదు. అచట రాజవంశీయులు కోరలులేని సర్పరాజులు నివసించుచున్నారట. కోఱలు లేకపోయినను సర్పరాజులు సర్పరాజులే కదా.

ఆ తరువాత నొకవిశాల మందిరమున్నది- దానిలో నొకయున్నతాసన మున్నది. అచ్చటకు టోపీలు తలపాగాలు పోకూడదు అది రాజకీయ న్యాయ స్థానము ఆ స్థానములో రాజవంశీయ దోషులను మహారాజే స్వయముగా విచారించి శిక్షలు వేయునఁట.

ఒకచోట దగద్దగాయమానముగాఁ బ్రకాశించు నొక స్వర్ణ సింహాసనమున్నది. అది యూడిపడిన మేరుశిఖరమా యన్నట్లున్నది. మహారాజు సభలో దాని నధిష్ఠించి సభాకార్యక్రమముల నడిపెడివాఁడట.

ఆ ప్రక్కనే కనకచ్ఛవుల నాఱంటోయు నొక మందిరమున్నది ఆది మహారాజు పూజామందిరమఁట. దాని కావలనే యొక బంగరు టంబారీయున్నది- దసరా యుత్సవములలో నమ్మవారి నా యంబారీలో నూరేగింతురఁట వాని ఖరీదు ఆ రోజులలోనే పదికోట్లరూపాయలఁట.

లోపల ప్రధాన ద్వారమున కటునిటు రెండు పెద్ద గజ శిరస్సులు నిర్మింపఁబడినవి.

తెల్లని దంతకాంతులును, దీర్ఘకరమ్ములు, పీనకుంభముల్,
నల్లని కుంభకాంతి, భవనాంతరగుప్త వినీలదేహముల్,
చెల్లఁగ, "ద్వారరక్షణముఁ జేయుచునున్న మదేభయుగ్మమం"
చుల్లమునందుఁదోఁచె, నఁటఁ, జూడఁగఁ, బార్శ్వగజోత్తమాంగముల్

ఆ మహారాజభవనమునందున్న సర్వ మొకయెత్తు విద్యుద్దీప నిర్మాణమొక యెత్తు. అధిక శక్తిగలవి. వేలకొలఁదిగ బలుపు, లాభవనము నందమర్పఁబడినవి. ఆ దీపములు కొన్నిచోట్ల మాలాకారములు, కొన్నిచోట్ల గోపురాకారములు, కొన్నిచోట్ల పద్మ, చక్రాకారములు కొన్నిచోట్ల శంఖాకారములు, ఆ విద్యుద్దీపమాలికా కాంతులలో ఆభవనసౌందర్యము శతగుణాధికముగా బ్రకాశించుచుండును. ఆదేవిడీలోనున్న లైట్లన్నియు నొక్కగంట వెలిగించినచో, వెయ్యిరూపాయల కరెంటు కర్చగునట. ఆ విద్యుద్వైభవమంతటిది! అందువలన నుత్సవముల యందే యన్ని లైట్లను. వెలిగింతురట సహస్రాధిక విద్యుద్దీప కాంతులలో దేదీప్యమానముగ వెలుఁగు నాభవనము తమోమయ ప్రపంచమధ్యమున దివ్యశోభలతో ప్రద్యోతించు శ్వేతద్వీపమా! యన్నట్లున్నది. ఆ భవన సౌందర్యమును బూర్తిగ జూచుటకు సహస్రాక్షుఁడుగూడ సమర్థుడు కాడు- ద్విచక్షువు లెంత?

క్రొత్తడంబులు, సరిక్రొత్త, డంబులు, గల్గి
శత్రుమారణకర్మ, సలుపనుండ,
గోపురంబులు, గిరిగోపురత్వముఁదాల్చి,
భవనోన్నతత్వమున్, బలుపుచుండ,
కుడ్యంబు, లటఁ, బండు. కొండలాయనిపించి,
నగరరక్షణ, ధురంధరతఁదాల్ప

విద్యుత్సహస్రములల్, వెలిగి, సర్వేశ్వరు.
వేయికన్నుల రూపు, విశదపఱుచ
నాకలోకంబునుండి, విన్నాణమొప్ప,
భువికి దిగినట్లె, స్వర్లోక భవనమనగ,
తేజరిల్లుచు, నామేడ, తెల్పుచుండె,
పూర్వరాజుల, వైభవగర్వ మహిమ,

అసాధాంతర మందొకచోకట మైసూరు చివరి మహారాజు చామరాజఒడయార్ నిలువెత్తు చిత్రపటమొకటి యున్నది. ఆ పటము పూర్వరాజుల ఠీవిని దర్పమును ప్రకటించుచున్నది.

వారమురోజులపాటు చూడదగిన రాజభవన విశేషములను మూడుగంటలలో జూడగలిగినంత చూచితిమి. భవనమునుండి బయటకు వచ్చుట, తేజోలోకమునుండి, తమోలోకమునకు వచ్చినట్లున్నది. తరువాత మేము జంతుప్రదర్శనశాలజూచితిమి. అది బాగానేయున్నది. హైదారాబాద్ జూకంటె చిన్నది. జంతువులు. తక్కువ ప్రకృతి సౌందర్యము మాత్రమంతకంటె నెక్కువ వానిలో సూర్యకిరణములకు ప్రవేశము లేదు.

## బృందావన గార్డెన్

5-10-84 సాయంకాలము. జగత్ప్రసిద్ధము చలనచిత్ర చిత్రీకరణములకు, దోహదము సర్వనేత్రముల కానందపాత్రము అయిన బృందావనవనమును జూడబోయితిమి.

సహస్రాధిక, వివిధవర్ణ విద్యుద్దీపకాంతులతో నా బృందావనము కన్నుల పండుగ జేయుచున్నది. చుట్టు నెత్తైన ప్రదేశము, నడుమ నిమ్నతలమున, నున్నయూ, తోట, ఉత్తుంగ, శిఖరములనడుమ కల, రమణీయమైన, లోయవలె, నున్నది.

బృందావనము మైసూరుకు సుమారు 25 కిలోమీటర్ల దూరములోనున్నది. అయినను నా వనమును మైసూరు బృందావనగార్డెన్ అనుచుందురు. వానికాప్రతీతి. "గంగాయాం ఘోషః" అను లక్షణమును బట్టికాక "గంగాతీరే ఘోషః" అనుదాని ననుసరించి కలిగినది. సముద్రాదుల తీరప్రతిపత్తి కొన్నిమైళ్ళ వఱకు నుండునుగదా! అనగా మైసూరునకు సమీపములోనున్న బృందావనము. అను నర్థమిచ్చుట ప్రతీయమానమగును.

గార్డెన్ ప్రక్కనే కృష్ణరాజ సాగరము (ఆనకట్ట) న్నది. దాని యెత్తు నాలుగు వందల యడుగులు - అదియొక యద్భుత నిర్మాణము.

మేము డామును జూచుచుఁ బోయి యక్కడ నున్న మెట్లమీదుగా గార్డెన్ లోనికి దిగితిమి. ఆ బృందావనములో జలయంత్రములు జలనిర్మాణము లత్యాశ్చర్యకరములు. రంగురంగుల విద్యుద్దీపము లచ్చట సహస్ర సంఖ్యాకములు. ఆ వివిధవర్ణ తేజఃప్రసారములలో నావనము నాకవనమువలెఁ జూపఱకు దిగ్భ్రాంతిని గలుగఁ జేయుచున్నది.

ఆ యుపవనము రామణీయకతను విలోకించుచు ముందుకుఁబోతిమి. ఒకచోట జలయంత్రములు, త్రివర్ణ, జలదృశ్యములను, ప్రదర్శించుచున్నవి. తెలుపు, ఎఱుపు నలుపు రంగులు గల నీరు, స్తంభాకారముగ, జలయంత్రముల ద్వారా, పైకిఁజిమ్మఁబడుచుండును, ఆకాశములో తాడియెత్తున విహరించు ఆ జల స్తంభములు, మనస్సుల నత్యంత, మాకర్షించు చుండును. ప్రతిదినము సాయంకాలము 7 గం॥ ఇది ప్రదర్శింపఁబడును.

జలయంత్రము, త్రివిధ మేఘ పుష్పములతో, మేఘములకుఁ బూజచేయ నారంభించినది- ఆ దృశ్యము కడు మనోహరముగా నున్నది.

ఆజలోపక్షేపకములు- ఒకే మడుగునుండి యుద్భవించినను, భిన్నవర్ణములై, వినువీధిలో విహరించుచు ఒకే తల్లిదండ్రులకు జన్మించిన బిడ్డలు గూడ భిన్న మనఃప్రవృత్తులు గలవారై, యెవరి త్రోవను వారు పోవుచుందురు, అను, లోక ప్రవృత్తిని, స్ఫురింపఁజేయుచున్నవి.

తొలిదశలో నీటియొక్క వర్ణము ధవళమే- కాని యుపాధి ననుసరించి, జలములో రంగులు మాఱుచుండును. ఇక్కడ, తెలుపు ఎఱుపు నలుపు రంగుల బలుపుల సహకారము వలన జల స్తంభములు, త్రివర్ణములుగా భాసించినవి.

అ జలోపక్షేపకములలోఁ దెల్లనిది శుద్ధ సత్వగుణము- ఎఱ్ఱనిది రాగరూపమైన రజోగుణము నల్లనిది అహంకార రూపము తమోగుణము- శుద్ధజలము గల మడుగునుండి యుద్భవించిన, త్రివర్ణ జల స్తంభము, లెట్లు స్వస్వవ్యాపారముల యందు ప్రవర్తించి, చివఱకు, మూలమైన నీటిమడుగునందే, యైక్యమగుచున్నవో యట్లే, శుద్ధబ్రహ్మము నుండి యుద్భవించిన. సత్వరజస్తమోగుణాత్మలైన, త్రిమూర్తులు గూడ, స్వస్వవ్యాపారముల నిర్వర్తించి, చివఱకుఁ, బరబ్రహ్మ

ములోనే, యైక్యమగుదురు. నిత్యము బ్రహ్మమొక్కటే. తక్కనవి యాభాసములే అదియే యద్వైత సిద్ధాంతము. అనుభావములను ఆ జలయంత్రోద్భవ దృశ్యము స్ఫురింపజేసినది. ఆ జలోపక్షేపకములు శ్రావ్యమైన సంగీతమును గూడ ప్రసారము చేయుచుండును. ఆ సంగీతము వినుటకు. అ మనోజ్ఞ దృశ్యములను జూచుట కచ్చటి కసంఖ్యాకముగా జనులు వచ్చుచుందురు. దానిని మ్యూజికల్ ఫౌంటెన్" అని యందురు. అనగా సంగీత జలయంత్రము అని యర్థము.

ఆ తోటలో వృక్షములు, లతాకుడుంగములు, పచ్చికబయళ్ళు, మొదలైనవి, చక్కగాఁ దీర్చిదిద్దఁబడినవి. విద్యుద్దీప తోరణములు. అభ్రంకషములైన, మహావృక్షములు. తీగ గుబురులు లతా పుష్పగుచ్ఛసంఛన్నములైన మడుగులు, సరస్సులు, క్రీడా సరస్సులు, వానిపై మనోజ్ఞములైన వంతెనలు. ఒకటేమిటి? వేయి విధముల యద్భుతావహ సన్నివేశములనేకము లున్నవి యచ్చట.

సరస్సులలో, నడుగున, బలుపుల నమర్చిరి. బలుపులు కనుపించవు, వాని కాంతిలోఁదటాకాంతర్భాగము సుందరముగ గోచరించు చుండును.

నీటికిఁ గ్రింద, నచ్చట. ననేకవిధంబుల, దీపమాలలన్
బాటిలఁ జేయు, నాస్థలము, పాములలోకము వన్నెనుండె, నా
వీటను, సర్పసంఘమున, వేడుకఁగొల్పెఁ, దరంగమాలికో
ద్ఘాటనలోల తామరసకాండచలద్విసదీర్ఘసంహతుల్,

అడుగుననుండి, పైకి నడయాడుచు వచ్చెడు, మీన సంఘముల్,
కడఁగి, రసాతల ప్రభుని, కార్యమునన్ జనుదెంచు, దూతలై,
యెడదకుఁదోఁచె, నా యడుగులెల్ల దలాతలదీప్తులట్లు, క
న్పడెను, లతా వితానపరిణద్ధ గృహావళి హాళినందుచున్

బాటల ప్రక్క వృక్షక విభాగములో, నమరించి, రెన్నొ, య
చ్చోటు, ధ్వనించు యంత్రముల, సూక్తుల, గీతల, యాత్రికాళికిన్
తేటఁగఁ దెల్పుచుండె నవి, దృశ్యోడు కానటువంటి, గాణ, య
ప్పాటను బాటలన్ వెనెడువారి కవారిగ జెప్పుచున్నటుల్.

ఒక్కమాట- ఆ తోఁట సర్వవిధముల హృద్యము కాదన్నచో, నాగరక జనత, సంస్కారానభిజ్ఞము, హేళన చేయక మానదు- సర్వవిధముల హృద్య మనుటకు, పూజ్య, భారత సంస్కార విధేయమైన, నామనస్సు, అంగీకరింపదు.

బృందావన గార్డెన్‌లో, ఆద్యంతము, పాశ్చాత్య సంప్రదాయమే రాజ్యము చేయుచున్నది- ఆ తీగల కత్తిరింపులు, వివిధ రూపములుగా నమరించిన యా నికుంజముల నిర్మాణము- ఆ, కృత్రిమ కుల్యల వంకర నడకలు- అన్నియు కృత్రిమములే- అందువలన నా వనము పంజరబద్ధ మయూరముపలె, నున్నదే కాని, విస్తారిత కలాపమై, స్వేచ్ఛానృత్యత్ మత్తబర్హివలె, లేదు. స్వేచ్ఛా మయూరలాస్యమే కదా! సర్వమనోహరము. పరిశీలింపగా నా కృత్రిమోపవనము పరమ పురుషుని త్రిగుణాత్మికయైన మాయగా నాకు భాసించినది- మాయ అనాత్మ వస్తువులైన దేహాదుల యందు నాత్మభావమును గలిగించినట్లే యావనము అసహజములైన కృత్రిమ లతాకుడుంగాదులయందు సహజ భావములను గలి గించుటయే యందులకుఁగారణము.

ఆ యుపవనములోఁ బరిమళవంతములైన ప్రసూనములకు స్థానము చాల తక్కువ- మన సంప్రదాయ సంస్కారములలో- తావులు లేని పూలకు తావులు లేవు గదా!

"వాసన లేని పుష్ప, మెటువంటిదియైనను, మెచ్చరానిదే,
వాసవముఖ్యపూజలకుఁ, బాత్రముకాదది, కేశభూషగా
వీసరమైనఁబోలదది, వీటిడియైనను, దానిఁబూన, వి
శ్వాసము చేయరాదనుచుఁ." బ్రొజ్ఞులుపల్కరె, ధర్మదృష్టితోఁ.

లక్షలు కోట్లుఁరూకల, విలక్షణ పద్ధతిఁ గర్చుపెట్టి, బల్
వృక్షలతా కుడుంగములఁబెంచిరి, చాక్షుష తోషణార్థమై,
రక్షకవర్గ, మొక్కటియు, ఘ్రాణముఁదన్పఁగలేదె యందు, పూ
జార్హ సుమపత్రపుష్ప విరహంబగుతోఁట, యరణ్యమేకదా.

క్షేత్రము పుష్పరూపమగు, జీవుఁడువాసన, జీవశక్తియే
మాత్రము లుప్తమైన, నణుమాత్రము శ్లాఘ్యముకాదు మేను, సా

ర్వ త్రిక, సత్యమీ పరమభావము భారతతత్త్వమందునన్,
కృత్రిమ రూపపోషణము, కేవలుఁజేర్చునె ? ముక్తినిచ్చునే ?

నింగికి రంగు వేసెడు, ననేక మహామహిజమ్ములున్న, వా
ముంగడతోటఁ, గాని, ఫలభూజము కన్పడదొక్కటైన, స
ర్వాంగ మనోహరాంగమున, నక్షివిహీనతయున్న, దేహమే,
భంగుర మానుగాదె, ఫలవంతము కానివనంబు, మాన్యమే,

దేవతోపహారములకు నతిధి సంతర్పణములకు ముఖ్యములు గదా ఫలములు. భారతీయ సంస్కృతి ఫలములకుఁ బరిమళ పుష్పములకు నంతటి పూజ్యభావ మీయఁగా. బృందావన గార్డెన్‌లోనవి పూజ్యములై పోయినవి. మరియు నాయుప వనమునకు "బృందావనము" అనునామము గూడ, నాకు సమంజసముగాఁ గన్పడ లేదు.

బృందయనన్ దులసీలత,
చెందును, బృందావనమ్ము చేకుఱుఁ దులసీ
బృందముచేతనె, కానీ
మందున కొక తులసియైన, మన, దా బృందన్.

కన్నయ బృందావనమున
నెన్నిగొ తులసీ వనాలు, నెలకొనియుంటన్,
బన్నగ, బృందావనమని,
సన్నుతిగడియించె నదియు, జగతీచరితన్.

కస్తూరియింటి పేరఁట,
ప్రస్తుతమునఁ దిరుగుఁ దైలపాయికలఁట, నా
నిస్తులలోకోక్తి, కిదే,
వాస్తవ దృష్టాంతమగు, నభంగుర భంగిన్.

ఈ కారణములవలననే ఆ గార్డెన్ సర్వదాహృద్యము కాదంటిని.

అయినను ఆ కృత్రిమారామము విరామములేని చాక్షుషప్రీతిని మాత్రము కలిగించుచున్నదనుటలో సందియమందఁ బనిలేదు. అందులకు ననుదిన మచ్చటకు వచ్చు జనకదంబములే ప్రమాణము. మేమాతోఁట, మల్లోకములను దర్శించితిమి. ఎట్లనగా

ఎత్తైన పట్టణ, మెత్తైనవారధి,
స్వర్గమ్మె, యందుండి జాఱు కృష్ణ,
మందాకినియ, తోఁట యందమ్మె భూలోక,
మందున్న హ్రదము గంగమ్మతల్లి,
నీటిలోపలనున్న, నేల పాతాళమ్మె,
భోగవతియగు, నాపుషమిఁజలము,
ఒకటిరెండు జగమ్మె, లొకచోటఁజూపించె,
బృందావనవనమ్మె, విష్ణువగుచు
మూడుగంటలు, నేత్ర సమ్మోహకరము,
నింగితుల్యము కృద్ధ ఘోణేంద్రియమ్మె,
నైన బృందావనమ్మును, నీక్షచేసి,
వచ్చితిమి మేము, బయటకు, మెచ్చుకొనుచు

మైసూరు మహమ్మదీయ రాజులకు రాజధాని యగుటచేతనేమో యచ్చట మహమ్మదీయ సంప్రదాయ మెక్కువగా, నున్నది మైసూరు విశేషములనుజూచి, ది. 6-10-84 ఊటీ బయలు దేరితిమి.

## ఊటీ
## ఉదకమండలమ్

మా యంత్రజీవి, ఉదక మండల పర్వతారోహణమునకు నుపక్రమించి నాఁడు, ఆ ప్రాంతముకూడ గాఢారణ్య దుర్గమమే. ఆ పర్వతోపత్యకయందు. "ఇది వ్యాఘ్రారణ్యము జాగ్రత్త" అనియొక బోర్డుమీద వ్రాయఁబడియున్నది. ఆ బోర్డుమీద పెద్దపులి చిత్రము కూడవేయఁబడియున్నది.

ఒకచోట హరిణములమంద యొకటి కనుపించినది. బస్సు దగ్గఱింపగానే యా, లోలాక్షులు, విలోలాక్షులై, బెదరి, పగిలిన కుండపెంకికలవలె, నలువలంకు

లకు బరుగులెత్తినవి, వాని, యా, బిత్తరి చిత్తములు, ముగ్ధత్వము, చూడ ముచ్చటైన "గ్రీవాభంగాభిరామం" అను శాకుంతల శ్లోకము.

నా మదిలో మెదలినది. మహాకవి కాళిదాసుని లోక జ్ఞానమునకు, వస్తుగత నిశిత పరిశీలనా దక్షతకు నమోవాకము లర్పించితిని.

ఇంకను గొంతముందునకుఁబోతిమి. అచ్చట మాకొక యింద్ర ధనుస్సు కన్పించినది. దివి పైనుండు నింద్రధనుస్సు భువిపైకెట్లు దిగినదా యని నిదానించి చూచితిని. అది యింద్ర ధనుస్సుకాదు నృత్యన్మత్త బర్హి బర్హారింఛోళి, వేల్పు దొరవెనకనుండు ప్రభావ పటలివలె నున్న పురివిప్పుకొని గొండ్లిసేయు నా నట్టువపిట్టల తెట్టువ మామది గిలిగింతలు పెట్టినది. గ్రమాను బాటపై స్వేచ్ఛగాఁ దిరుగాడు వికల్ప మానవులు (వారనరములు) ఎంచిపొంచి వంచనముసేయు వంచకములు చెవుల పిల్లులు మొదలగునవి యెన్నియో యా భూధరముపై మాకుఁ గన్పించినవి. పులులు మాత్రము మాకుఁ గనుపించలేదు. అవి పగలు కాన కడుపులో నొదిగి నిద్రించునట, నిశీథమునందు మాత్రమే బయట ఆహార సంపాదనార్థమై యవిసంచరించునఁట.

ఊటీకి ఉదకమండలము నీలగిరి యను నామాంతరములుగూడ నున్నవి.

ఆ కొండ నిరంతర బహుళ నీల తృణ వృక్షాది సంఛాదితమై, నల్లఁగఁ, గన్పడుచుండుటచేత, నాపర్వతమునకు, నీలగిరి (నల్లనికొండ) అని పేరు వచ్చినది.

ఉదక మనగా జలము. మండలమనగా దేశము, అనగా నీటికి స్థానమైన ప్రదేశము అని యర్థము. లేక ఉద+కమండలము=నీటికి పాత్రము, ఆ కొండ యొక్క ఉన్నత శిఖరములందు దట్టముగా మంచుపేరుకొని యెండకుఁ గఱుగు చుండుటచేత ఆ పర్వతము అమ్మయమై (నీటితోనిండినదై) పర్వతారోహణా నంతరము "అమ్మయ్య" అనిపించును.

మచిలీ పట్టణమును "వసూలా" గానూ, హేలాపురమును ఏలూరుగానూ పాటలీపుత్రమును "పాట్నా"గాను నిరూపములనుగాఁజేసిన, తెల్లవారే, ఉచ్చరించలేక ఉదకమండల నామమును, ఊటీగా మార్చియుందురు. ఆంగ్లేయులు చేసిన దురాగతములలో నిది యొకటి.

అచ్చట దట్టముగాఁ దెల్లని పొగమంచు కురియుచుండును. మార్గము కనుపించదు. మా షట్చక్రము, గ్రుడ్డివానివలెఁ దడవు కొనుచు, బోవుచున్నది. దారి కనబడక బస్సు ఆగినపుడు, మాగుండెల్లో బస్సులు పరుగులెత్తినవి- తెమ్మెరల యూపులతోఁ, గదలాడుచున్న మంచుపొగలుగల, యా, ప్రదేశము, పొంగుచున్న, పాలవెల్లి ననుకరించినది.

తెల్లని పొగమబ్బులు మా బస్సును దూసికొనిపోవుచున్నవి, ఆ మబ్బుల పైఁజేయి పెట్టితిని పొగలోఁజేయిపెట్టినట్లే యున్నది.

అప్పుడు నాకు "ధూమజ్యోతిస్సలిల మరుతాం సన్నిపాతః మేఘః-" అని మేఘస్వరూపమును నిర్వచించిన కవికుల తిలకుని కమ్మని నిర్వచనము గుర్తుకు వచ్చినది.

"సౌధాగ్రాణి, పురస్యాస్య, స్పృశంతి, విధుమండలమ్‌, అను నాలంకారిక దృష్టాంతము, అతిశయోక్తికి ఉదాహరణ కావచ్చును, గాని, "స్పృశంతి, పర్వతస్యాస్య, శిఖరా, ణ్యభ్రమండలమ్" అను నా మాటమాత్రము స్వభావోక్తికే యుదాహరణము, ఆ ప్రాంతము హిరువంతుని దక్షిణ "రాజధానియా" అను నట్లున్నది.

ఒకచోట నొక యున్నత భూధరాగ్రమునుండి, మఱియొక నిమ్ననగ శీర్షముపైన, దట్టముగా మంచు పడుచున్నది. ఆ దృశ్యము.

కెరలి, తపస్సుఁ జేసెడు, భగీరథ, కాంక్షిత దివ్యగంగకై,
పరమశివుండు, పూనుకొనఁ, బాటలవర్ణ, జటాటవీ, లసత్,
శిరమున, నింగినుండి, పటుజృంభణ, నిప్పత్, దభ్రదీర్ఘికా,
ఝరముపలెన్, గనంబడెను, క్ష్మాధర, శీర్ష, పతల్, హిమాంబువుల్.

మఱియొక చోట నొక మనోహర దృశ్యము కన్పించినది.

ఒక, తెలిమబ్బుచాలు, కుధరోన్నత, కంధరమందు, బారుగా
చకచకఁబోవుచుండె, నది, సర్వమహీధర, సార్వభౌను, కం
ఠ, కలిత, వజ్రహారమన, డంబు వహించెను, గొంతసే, పటన్,
ప్రకటితమయ్యె, జాత్యె, కటిభాగ, లస, న్మణిమేఖలాకృతిన్.

ఒకచోట నా కొండ శిఖరము ప్రాలేయాచ్ఛాదితమై కైలాసము వలెనున్నది. ఇంతలో నిరువైపులనుండి, నీలారుణాభ్రములు, కొండచరియ నాక్రమించినవి. అపుడా కొండ శిఖరము, సత్వము రజస్తమోగుణదూషితమైనట్లైనది, ఇంతలో, మారుతాహతిచే, నాజలదములు, తొలఁగిపోయినవి. తిరిగి, యా, భూధరాగ్రము, స్వచ్ఛమూర్తి, యైనది, నిశ్చలమైనది. శిఖరము మాత్రము హిమచ్యుతిచేత జటాజూటమువలె నీలమై భాసిల్లినది ఆ సన్నివేశము.

ఒకచోఁగన్పడె, నూటికొండ, జనిలో, నుత్పన్నమైనట్టి, మో
హాకృతాజ్ఞానముఁ, బాఱఁద్రోలఁ, దనయర్ధాంగిన్, సుతున్, గేహమున్,
సుకముల్ వీడి, మహాటవీతలమునన్, సుశ్లోకుఁడై, తెల్వి ప్రా
ప్తికిఁ, బద్మాసన సంస్థితిన్ వెలయు గోపీనాథ భక్తాకృతిన్

ఒక చఱియన్ నిలంబడెను, ఊపిరిఁబీల్చుకొనంగ బస్సు, మె
ట్టకు నెగఁబ్రాకుటన్, దటతటాతట, గుండెలు కొట్టుకొన్న, బా
ధకు నడువంగలేక, యట, ధారుణి, శీతలబాధ నోపఁ, బై,
నొకతెలివల్వఁ, గప్పుకొనెనో, యనఁ, దోఁచె, హిమానిపూర్ణమై.

చుట్టు, హిమాభ్రజాల, మొకచోటను, మానిలయమ్ము మెట్ట, యీ
పట్టొక, దీవిగా, విపులవార్ధిగ నా హిమసంవృతాద్రి, య
ప్పట్టున మాకుఁగన్పడెను, భావము భీతమునయ్యె, గండ్లకున్,
గట్టినయట్లు చూచి, తట, క్ష్మాధరరాజ్య, రమావిభూతులన్.

చల్లని, భారతాంబ మనసాయనునట్లుఁగ, నీలశైల, భా
స్వల్లలిత ప్రదేశ, మతిచల్లఁగఁ, దెల్లఁగనుండె నుండె, సం
ఫుల్లము జాజితీగ విరఁబూచినయట్లుగ, వెండికొండగా,
నల్లని వాని దీవియన, నారదనీరదగానగంగగా.

తేయాకచ్చట గొప్పపంట, యది యీదేశమ్ము కాపంట, యీ
ధ్యేయంబందఱికుంట, పంటయభివృద్ధిన్ గోరుచుండ్రంట, ప్రాం
తీయావాసుల బంగరంట యది, యీతేనీరు లేకుంట, స

ర్వాయుస్సారము క్రుంగునంట, కుదురంటా కొంప జీవింప, దే
శీయౌన్నత్యముఁ బెంచునంటయది, పోషించంట యారాష్ట్రమున్.

పంటపండింప, మలచి రా పర్వతమ్ము,
నౌఅవలౌఅవలుగా, నదియొప్పుచుండెఁ,
జుట్టలుగఁజుట్టి మెయిని, శేషుఁడు, శ్రమాప
నోదినార్థము, శయనించు, మాదిరిగను.

నగములైన (కదలాలేవి) నగములను గూడ (కొండలను) గడగడ వణ
కించు నా యతి శిశిర ప్రాంతములలోఁగూడ చిన్నచిన్న గుడిసెలలో గిరిజనులు
నివసించుచున్నారు. వారు గిరిజనులు గదా! నాలుగు గంటలు ప్రయాణముచేసి
మా జంఘాలుఁడు ఉదయము 10 గంటలకు ఊటి చేరుకొన్నాఁడు- అచ్చట ఆడ
వారికిఁ దేయాకు గోయుట ముఖ్యవృత్తి.

ఉదక మండలము పట్టణము- సహస్రాధిక భవనములచ్చట నున్నవి-
నిదాఘతాపమున కోర్వలేని శ్రీమంతులు వేసవిలో కొంతకాలమచ్చట నుందురు.
ముందుగా నేర్పాట్లు చేసికొన్నగాని యచట వసతి లభింపదు.

ఉదకమండల ప్రకృతి నిసర్గరమణీయము- చుట్టును నాకాశమంటుచున్న
నీరంధ్ర, నిబిడ, వృక్షసముదాయము, మధ్యభాగమునఁ జిక్కని చక్కని పచ్చిక
బయళ్ళు, మృదువులైన పచ్చని తివాసీలు పఱచినట్లున్న శాద్వలములు, చిఱు
కాలువలు, వానిపై వివిధవర్ణలతా పుష్పపరిశోభితములైన వంతెనలు, ఆ వంతె
నలపై నిలఁబడిన, దశదిశలఁ బులకించిన ప్రకృతి, ఎంతటి సుందరము, ఆ నీల
గిరి సౌభాగ్యము.

నీలగిరి భోగిలోకము, సిరిగల వారి కక్కడ సమస్త భోగము లందు
బాటులో నుండును- నౌకా విహారములు, వివిధ క్రీడాస్థలములు నచ్చట నున్నవి-
యూక్లిప్స్ వృక్షములా ప్రాంతములో నమితముగా నున్నవి. అక్కడ వేయించిన
జీడిపప్పునకుఁ బ్రాముఖ్యమెక్కువ- దాని రుచి మఱుపునకు, రాదు. సరిగాఁ
జూచిన, ప్రతివ్యక్తిచేతిలోను, జీడిపప్పు పొట్లముండును. జీడిపప్పును నూనెలో
వేయించి తగుమాత్రముగ నుప్పుకారములను గలుపుదురు.

నాలుగు గంటల కాలము నీలగిరిపై విహరించి తిరుగు ముఖము పట్టితిమి దిగుటకు రెండు గంటలే పట్టినది- ఆ స్థితి ప్రకృతి సహజమేకదా !

పైకిఁబోవుట కష్టము, పైననుండి,
పడుట తేలికయౌను, నా, పడినవాఁడు,
నిలువ నేరడు, పాతాళతలము వఱకు,
కాన, దిగుటకు, మెలకువఁ బూనవలయు,

అవరోహణ మార్గములోఁబల్లెలు, గ్రామములున్నవి, ఆ మార్గము పాప మెలికలవలె నున్నది- డ్రైవరు ఏ మాత్ర మేమరినను ప్రమాదము తప్పదు ఒకచోట మా బస్సు రోడ్డు చివరకు బోయినది, ఒక్క గజము ప్రక్కకు జరిగిన చాల ప్రమాదము సంభవించెడిది- దైవానుగ్రహమువలన నా గండము తప్పి పోయినది.

అధోగామియైన మా రథము ఉన్నత పద భ్రష్టునివలె క్రిందకు జారిపోవు చున్నది. మేము ఇరు పార్శ్వములందుఁ గల వనరాజి యందములను, కొండలు క్రక్కినట్లుగ లోయలనుండి గలగలఁబాఱుచు బాటప్రక్కగా దొర్లిపోవుచున్న నీటి చాలులను నాగరకతకు నాలయములైన జనపదములను ప్రాచీనతకుఁబట్టు కొమ్మలైన పల్లెలను పాతాళములకు మార్గములా యన్నట్లున్న అగాధములైన లోయలను- ఇతః పూర్వము కనివిని యెఱుగనివి యచ్చట చక్షుర్గ్రాహ్యములగు చున్నవియైన సుందర సుమలతా పుంజములను- విశ్వశిల్పి విన్ననువుతో చిత్రించిన ప్రకృతి దృశ్యములను జూచుచు- రాత్రి- 7 గంటలకు నుదక మండల గిరీంద్రసీమల నవతరించి భూమాత యొడిలోనికిఁ జేరితిమి- అక్కడ నొక పల్లె యున్నది- దానిపేరు మెట్టుపల్లె.

## మెట్టుపల్లె

ఇది నీలగిరి పాదమునందున్నది- ఇచ్చట నుండి ఉదక మండలమునకు రైలుమార్గమున్నది- సాధారణముగా రైలుపట్టాలు రెండుంటాయి. ఈ మార్గములో మూడు పట్టాలుంటాయి- మధ్యనున్న పట్టాపై సుమారు జానెడు పరిమాణము కల ముండ్లుంటాయి- ఆ మధ్యనున్న పట్టాపై నడిచే చక్రమునకు గొలుసువంటిది (చైను) ఒకటి యుండును. రైలు పైకి పోవునప్పుడు చైను ముళ్ళల్లో ఇరు

క్రొంటూ ఉంటుంది. కనుక బండి జారదు. ఇది చూచుటకు సైకిలు చైను సైకిలు పళ్ళ చక్రముపై తిరుగుచున్నట్లుండును. ఇటువంటి రైలుమార్గము దక్షిణ దేశములో నిది యొకటేనట. ఈ చైను మార్గము లేకపోయినచో రైలుపై నీలగిరికిఁబోవలసినవారు కాలగిరికిఁబోవుదురు.

నీలగిరియన్న కోటకు, మేలమీఁది
ద్వారమే, మెట్టుపల్లియు, పాంథులచట,
దిగుచు నెక్కుచుఁ గొండను నొగులువారు
విశ్రమింతురు, మఱియొక వెరవు లేక

ఊటికొండకు, నడుగున నుండె, మెట్టు
వోలె, నాయూరు, కానఁ బెంపొందె నదియు
మెట్టుపల్లియ పేర, నామేర, యొదిగి,
పృథివి మాతకుఁ, గడు చిన్న బిడ్డవోలె;

మెట్టుపల్లె యందు, మెట్ట పంటలె పండు,
చుట్టుపల్లులెల్ల, చిట్టడవులె,
పట్టుపట్టిచూడఁ బట్టున, మరమరాల్
పావలాకు మించి, పడయు మచట.

అరాత్రి యచ్చట గడిపి వేగుచుక్క మార్గదర్శికాఁగాఁ బొపగళనిగళమైన పళని కభిముఖముగా యాత్ర సాగించితిమి.

## పళని

ది. 6-10-84 ఉదయము 7 గం. పళనిఁజేరితిమి. పళని దాక్షిణాత్య పుణ్యక్షేత్రములలో నొకటి. అది చిన్న పట్టణము.

పళనిలో దైవము సుబ్రహ్మణ్యేశ్వరస్వామి. ఆ దేవుని మనము కుమారస్వామియని కూడ నను చుందుము. తమిళులా దేవుని మురుగన్ అని యనుచుందురు, ఆ గుడిలోఁగూడఁ జక్కని శిల్పములు నిర్మింపఁబడినవి.

దేవసేనాని దేవలోకమునకు దగ్గఱఁగా నుండవలయునని కాఁబోలు, తన యాలయము, నున్నత పర్వత శిఖరముపై, నిర్మింపఁజేసికొన్నాఁడు.

నాలుగు గంటల కాలము నీలగిరిపై విహరించి తిరుగు ముఖము పట్టితిమి. దిగుటకు రెండు గంటలే పట్టినది- ఆ స్థితి ప్రకృతి సహజమేకదా !

పైకెక్కఁబోవుట కష్టము, పైనుండి,
పడుట తేలికయౌను, నా, పడినవాఁడు,
నిలువనేరడు, పాతాళతలము వఱకు,
కాన, దిగుటకు, మెలకువఁ బూనవలయు,

అవరోహణ మార్గములోఁ బల్లెలు, గ్రామములున్నవి, ఆ మార్గము పాము మెలికలవలె నున్నది- డ్రైవరు ఏ మాత్ర మేమరినను ప్రమాదము తప్పదు- ఒకచోట మా బస్సు రోడ్డు చివరకు బోయినది, ఒక్క గజము ప్రక్కకు జఱిగిన చాల ప్రమాదము సంభవించెడిది- దైవానుగ్రహమువలన నా గండము తప్పి పోయినది.

అధోగామియైన మా రథము ఉన్నత పద భ్రష్టునివలె క్రిందకు జాఱిపోవు చున్నది. మేము ఇరు పార్శ్వములందుఁ గల వనరాజి యందములను, కొండలు క్రక్కినట్లుగ లోయలనుండి గలగలఁబాఱుచు బాటప్రక్కగా దొర్లిపోవుచున్న నీటి చాలులను నాగరకతకు నాలయములైన జనపదములను ప్రాచీనతకుఁబట్టు కొమ్మలైన పల్లెలను పాతాళములకు మార్గములా యన్నట్లున్న అగాధములైన లోయలను- ఇతః పూర్వము కనివిని యెఱుగనివి యచ్చట చక్షుర్గ్రాహ్యములగు చున్నవియైన సుందర సుమలతా పుంజములను- విశ్వశిల్పి విన్ననువుతో చిత్రిం చిన ప్రకృతి దృశ్యములను జూచుచు- రాత్రి- 7 గంటలకు నుదక మండల గిరీంద్రసీమల నవతరించి భూమాత యొడిలోనికిఁ జేరితిమి- అక్కడ నొక పల్లె యున్నది- దానిపేరు మెట్టుపల్లె.

## మెట్టుపల్లె

ఇది నీలగిరి పాదమునందున్నది- ఇచ్చట నుండి ఉదక మండలమునకు రైలుమార్గమున్నది- సాధారణముగా రైలుపట్టాలు రెండుంటాయి. ఈ మార్గములో మూడు పట్టాలుంటాయి- మధ్యనున్న పట్టాపై సుమారు జానెడు పరిమాణము కల ముండ్లుంటాయి- ఆ మధ్యనున్న పట్టాపై నడిచే చక్రమునకు గొలుసువంటిది (చైను) ఒకటి యుండును. రైలు పైకి పోవునప్పుడు చైను ముళ్ళల్లో ఇరు

క్కొంటూ ఉంటుంది. కనుక బండి జారదు. ఇది చూచుటకు సైకిలు చైను సైకిలు పళ్ళ చక్రముపై తిరుగుచున్నట్లుండును. ఇటువంటి రైలుమార్గము దక్షిణ దేశములో నిది యొకటేనట. ఈ చైను మార్గము లేకపోయినచో రైలుపై నీలగిరికిఁబోవలసినవారు కాలగిరికిఁబోవుదురు.

నీలగిరియన్న కోటకు, నేలమీది
ద్వారమే, మెట్టుపల్లియు, పాంథులచట,
దిగుచునెక్కుచుఁ గొండను నొగులువాయ
విశ్రమింతురు, మఱియొక వెరవులేక

ఊటికొండకు, నడుగుననుండె, మెట్టు
వోలె, నాయూరు, కానఁ బెంపొందెనదియు
మెట్టుపల్లియ పేర, నామేర, యొదిగి,
పృథివి మాతకుఁ, గడు చిన్న బిడ్డవోలె;

మెట్టుపల్లె యందు, మెట్ట పంటలె పండు,
చుట్టుపట్లులెల్ల, చిట్టడవులె,
పట్టుపట్టిచూడఁ బట్టున, మరమరాల్
పావలాకు మించి, పడయుచట.

ఆరాత్రి యచ్చట గడిపి వేగుచుక్క మార్గదర్శికాఁగాఁ బాపగళనిగళమైన పళని కభిముఖముగా యాత్ర సాగించితిమి.

## పళని

ది. 6-10-84 ఉదయము 7 గం. పళనిఁజేరితిమి. పళనిదాక్షిణాత్య పుణ్య క్షేత్రములలో నొకటి. అది చిన్న పట్టణము.

పళనిలో దైవము సుబ్రహ్మణ్యేశ్వరస్వామి. ఆ దేవుని మనము కుమార స్వామియని కూడ నను చుందుము. తమిళులా దేవుని మురుగన్ అని యను చుందురు, ఆ గుడిలోఁగూడఁ జక్కని శిల్పములు నిర్మింపఁబడినవి.

దేవసేనాని దేవలోకమునకు దగ్గఱఁగా నుండవలయునని కాఁబోలు, తన యాలయము, నున్నత పర్వత శిఖరముపై, నిర్మింపఁజేసికొన్నాఁడు.

పర్వతాగ్రముపై నెలకొనియున్న స్వామిని దర్శించుటకు మెట్లమార్గ మొకటి యున్నది- రెండవది రైలుమార్గము- మెట్లదారి విజయవాడ కనక దుర్గమ్మవారి మెట్ల మార్గమునకు రెండురెట్లుండును.

యాత్రికులలో మూడువంతుల మంది రైలుపై వెళ్ళినారు. వెళ్ళుచుఁ "నడచి వెళ్ళుట చాల కష్టము- మీరు చాలా యిబ్బంది పడగలరు" అని భయ పెట్టినారు. అపుడు నాకు "నహి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి" (మంచి పనిచేయు వాఁడెవడు దుర్గతినిఁ బొందఁడు) అను గీతాచార్యుని బోధ గుర్తుకు వచ్చినది. ఆ ధైర్యముతోనే మే మిద్దఱము మెట్లమార్గమున బయలు దేరితిము.

మెట్లమార్గము నధిరోహించుట మాకుఁ గష్టమే యయినది తోటిప్రయాణీ కులు వయసులోనున్న వారగుటచేత చకచక సాగిపోయినారు. నేను, మాశ్రీమతియు నెమ్మదిగఁ బరస్పర సహకారముతో మెట్ల నెక్కుచున్నాము.

గృహ పుత్రాది బంధములు, నడుమవచ్చి, నడుమనే పోవును. జీవితాం తము, నీరక్షీరన్యాయముగ, నవిచ్ఛిన్నముగా నుండునది పవిత్ర దాంపత్యబంధ మొక్కటే-

కన్నులందమృతముఁ, గలపోసి భాగించి,
యమరత్వమును బొందు, నదియు, నదియె,
రాజుగా రాణిగా, రాణించి యింటిలో,
నింటిధర్మముఁదీర్చు, జంట, యదియె,
సుఖకష్టములనెల్ల, సూటిగా, నొకటిగా,
ననుభవింపఁగఁజాలు, నదియు, నదియె
ఉదరమన్గూటిలోఁ, బదిలంబుగాదాఁచి,
తనరూపు సృష్టించు, ధర్మమదియె,
తిరిగివచ్చెడు, బాల్యమందిరము, మాయు,
నూఁతకోలల, జంటయై, యుండు, నదియె,
అదియె, దాంపత్య, మాధార సఖిల ధరకు,
ప్రకృతి పురుషమె, యరయ, దాంపత్యగరిమ

ఏ దాంపత్యము, ధర్మబద్ధమయి, వాసించున్ బుధుల్ తాపులై,
ఏ దాంపత్యము నిత్యనూతనముఁగా నేపారు, రాగాత్మమై,
ఏ దాంపత్యము, తోడునీడలుగ జీవించున్, శరీరాంతమున్,
ఆ దాంపత్యము, జన్మజన్మలకు, నేకాకారమై యుండెడున్.

అమృతమైనను, దాంపత్యమం దెపుట్టు,
నామృతంబైన, దాంపత్య మం దెపుట్టు,
మధురదాంపత్య ధర్మము, మమతపంట,
నాల్గుపురుషార్థముల కదే, వెల్గుబాట,

ఊర్ధ్వగమనము ఒక్క ఊర్ధ్వగమనమునికిఁదప్ప నన్యులకు, నందున వృద్ధుల కసాధ్యముకదా- శక్తిధరుని (కుమారస్వామి) దర్శనమున కేగుచున్న మా కా శక్తిధరుఁడే శక్తినిచ్చినాఁడు. మెల్లగ సోపానముల నధిరోహించి స్వామి సన్నిధిఁజేటితిమి.

అక్కట గుడిలోఁ బూజారులున్నారు వారికి జందెములు లేవు-వా రే కులమువారో తెలియదు. అరవమంత్రము లెవ్వియో చదువుచున్నారు. వారిచేతనే భక్తులు పూజలు చేయించు కొనుచుందురు. మంత్రపుష్పము (డబ్బు) చెల్లింపనిదే, వారు, మంత్రపుష్పము (ప్రసాదము) పెట్టరు.

అచ్చట క్షేత్రస్వామికి "దండాయుధపాణి" యనిపేరు చేతిలో దండము (బాణము) ఉండుటచేత నాస్వామి కాపేరు వచ్చినది. ఆ దేవుని ప్రసిద్ధనామము బాలసుబ్రహ్మణ్యస్వామి. ఆ స్వామి బాలునివలె నుండుటయే యా పేరునకుఁ గారణము ఆ స్వామి కరమున శరమును గీలించి, శిరో లంకారములతో, బొజ్జ క్రిందుగ వ్రేలాడు మేఖలతో, పాదమంజీరములతో, కరుణారసభరితములై బరువెక్కిన, మందావలోకనములతో, సర్వ మనోజ్ఞముగానున్నాఁడు. ఆ స్వామి సన్నిధిలోనే, వాహనమైన, మత్తమయూరమున్నది.

దేవాలయము 500 అడుగుల నెత్తుననున్నది స్వామి గుజ్జముపైనున్నట్లుగ దేవాలయమున నుత్తరభిత్తిపైఁ జిత్రింపఁబడినాఁడు గుజ్జము చెరరాజులచిహ్నము.

మ్రొక్కుబడులున్నవారు మౌనధారులై, భుజముపైఁ గావడినిధరించి, యందుఁ బూజాద్రవ్యములనుంచుకొని, తమవారు, భజనలు చేయుచు వెంటరాగా,

స్వామి సన్నిధికేగి, మ్రొక్కులు చెల్లింతురు, స్వామికి తేనె పంచదార అరటి పళ్ళ గుజ్జులతో నభిషేకము చేయుదురు. దానినే ప్రసాదముగా నిత్తురు. భస్మముతోఁగూడ స్వామికి స్నానముచేయింతురు. పరిమళవంతమైన యా భస్మమే భక్తులకు సరఫరా చేయఁబడుచుండును.

పళని విభూతి జగత్ ప్రసిద్ధము. ఆ కుమారుడు విభూతి ధరుని కుమారుఁడు గదా! కావుననే మహాభూతినిచ్చు నా విభూతి స్వమహిమ సూచకముగా నిరంతరము ఘుమఘుమలాడుచుండును.

వరుసలో వెళ్ళి స్వామిని దర్శించినాము. ఆ యగ్గిచూలినిఁ జూచియిట్లభినందించితిని.

తారక ఘోరరాక్షస వధార్థము పుట్టువునంది, యా శునా
శీరుని నోర్చి, లోకములఁ జిచ్చురగిల్చిన యట్టి తారకున్,
బోర వధించి, యింద్రుని విభూతిని నిల్పిన, శూర యో, మహా
వీర! కుమార! షణ్ముఖ! పవిత్రచరిత్ర శివాంకవర్ధితా!

దేవసేనకుఁబతివి, యా దివ్యబాల
దేవసేనకుఁ బతివె, భూతేశపుత్ర !
క్రౌంచ కుధరము, నీశర క్రూరహతికి,
గుండె పగులఁగ దారిచ్చె, బెండుపడుచు,

నెలయును దప్పలేదు, రసనేంద్రియ దోషములేదు, గర్భమం
దలజడిలేదు, వేవిళుల దందడి యేమియులేదు, లేవు, నొ
ప్పులు, ప్రసవమ్ము లేదు, కనె, భూమిధరేంద్రుని పట్టినిన్ను, భూ
వలయమునందు, నిట్టి, ప్రసవమ్మొకటున్నదె? తారకాంతకా !

శక్తి యైశ్వర, మంబశర్వాణి, యగ్నిలో
వాసము, గంగలోపలను నునికి,
శరవణంబున జన్మ, షట్ కృత్తికాస్తన్య
పానము, రాముని వద్ద విద్య,

వర్ధిల్లితివి నీవు, బాహులేయా! శర్వ
శక్తి, శైలజదీక్ష, జ్వలనకాంతి,
గాంగ పావిత్ర్యమ్ము, ఘనశర స్వచ్ఛత,
పరశు తీక్ష్ణత, నీకుఁబట్టుపడియె,

తల్లులార్గుర చిక్కని స్తన్యబలము
కలుఁగుతన్, నీవు గంధర గంధవవయి,
తారకుని కంఠమొక దెబ్బ,ఁ దతెగినావు
బ్రహ్మవరమది, నీ ముందు, బ్రమానుపడియె.

లేని శక్తిని మాకిచ్చి, యీ నగమ్ము
నెక్కఁగాఁజేసి, మమ్ములనేలినట్టి,
నీకు జోతలు, శిఖివాహ! నిరుపమాన!
ధన్యుఁడనునైతి, స్వామి! నీ దర్శనమున.

బాలసుబ్రహ్మణ్య స్వామిని దర్శించి తీర్థప్రసాదములను స్వీకరించి యనంతరము. ఆ సాయంకాలము దుష్టశిక్షణ దక్షయైన మధురమీనాక్షి దర్శనమునకు బయలు దేరితిమి.

**తిరుపైకుంద్రము :** ది. 7-10-84 రాత్రి "తిరుపైకుంద్ర" మనుక్షేత్రములో బసచేసితిమి.

ఆ క్షేత్రము పరిమాణమునకుఁ జిన్నదియైనను పరమానుభావమునకుఁ బెద్దదే, సీమమెరపకాయ చిన్నదియైనను దానిలోఁ గారమెక్కువయున్నట్లే యీ చిన్నక్షేత్రములోనే యుపాసకునకుఁ గావలసిన హంగులన్నీ యున్నవి. ఆ క్షేత్ర విశిష్టత యేమనఁగా.

కనులెత్తన్ గనుపించు శక్తిధరుఁడే, కాలూన గంగాజలం,
బనువైయుండెడు దేవళంబు, పరమాహ్లాదంబు చేకూర్చు నం
దన వాతావరణంబు, మోక్షపదవీద్వారంబుగా నున్న, యీ
ధుని తీరంబు, తిరుప్పకుంద్ర, మది, విందుల్ సేయుఁ, గందోయికిన్.

క్షేత్రాంశము లన్నియు నున్న యా క్షేత్రములో నా రాత్రి యానందముగా గడిపి మధురకు బయలుదేరితిమి. స్వామి సన్నిధిలో మాకా క్షణద క్షణదగానే గడచిపోయినది. తిరుప్పెకుంద్రము మధురకు నీవల పదికిలోమీటర్ల దూరములో నున్నది.

## మధుర

ది. 8-10-84 ఉ. 6 గం. మధురఁజేరితిమి. మధుర యను పేరుగల పట్టణ ముత్తరభారతములో నొకట యున్నది. ఆ నగర మష్టమావతారముచేత నలంకృతమైనది.

వెన్నెలడొంగ యాగడము, వీథులనేలిన గొల్లపల్లెకున్,
గొన్నిమయిళ్ళ దూరమున నుండెను, నా మథురాపురమ్ము, గో
వన్న భుజించు, మృద్గత సువాసన, లీ పురవీథులందు నన్,
వెన్నెల వన్నెలంది, మరపించును, గమ్మనిపిండివంటలన్.

మధురవీథుల. నవనీత మధురిమలును,
వన్నెలాడుల, క్రీగంటి భ్రమరరుచులు,
పుష్పలావుల, వక్రోక్తి పూల తావు,
లహరహమ్మును, విక్రయ మగుచునుండు.

ఆ మధురా నగరము, గో
స్వామి పదాబ్జాత చిహ్న బంధురమై, యీ
భూమికె, యాభరణంబయి,
యోమెను, ధర్మమును, రాక్షసోన్నతి యుడిపెన్.

ఈ మధుర దక్షిణ భారతములో నున్నది. శైవసంప్రదాయమునకిది నిలయము.

ఈ మధుర, సంతతంబును,
స్వామిని మీనాక్షిమాత, సదయాలోకో
ద్దామ, సుఖ శాంతి నిలయం
బై, మాకెందైన లేక, వరలుచు నుండున్.

ఈ మధురను పాండులు పల్లవులు చోళులు మహమ్మదీయులు విజయ నగర రాజులు పరిపాలించిరి. తరువాత నాయకరాజులేలిరి. అందువలన నా నగరము వివిధ సంస్కృతుల కాశ్రయమిచ్చి ప్రసిద్ధికెక్కినది.

మధుర కథ మధురము. చరిత్ర మధురము. నగరము మధురము శిల్పము మధురాతిమధురము. మహిమయు నతిమధురమే. మధుర శ్రీకృష్ణ దేవరాయల కాలములో విజయనగర మహా సామ్రాజ్యములో నొకభాగము. ఆనాడు తెలుంగు వెలుంగులు మధుర నతిక్రమించి శ్రీరామలింగేశ్వరస్వామి పాద పద్మములకు నీరాజనములెత్తినవి. రాయల యనంతరము నాయకరాజులు మధుర కేలికలైరి. వారిలో రఘునాథ నాయకుండు ప్రథమగణ్యుండు.

రఘునాథ నాయకుని కాలములో మధుర మూడు పూవులు, ఆఱుకాయలుగ నభివృద్ధి చెందినది. సంగీతసాహిత్యములు పందెములు వేసికొని పరుగులెత్తినవి. పదకవితకుం బట్టాభిషేకము జఱిగినది. యక్షగానములు, అక్షయములైనవి. శిల్ప లక్ష్మి యనల్ప విలాసములతో నందల మెక్కినది.

మధురలో నుత్సవములెక్కువ. అందువలన నానగరమునకు, నుత్సవముల నగర, మని నామాంతరము. ఉత్సవము లన్నింటిలో ఏప్రిల్ మాసములో జఱుగు మీనాక్షీ సుందరేశ్వరుల కళ్యాణ మహోత్సవము ప్రధానమైనది. ఈ నగరము నానుకొని "వైఘా" నది ప్రవహించుచుండును.

మధుర, "గెడ్డెన్" మొదలగు పాశ్చాత్యుల ప్రశంసల నందుకొన్నది. ఇది సముద్రమట్టమునకు 440 అడుగుల నెత్తునసున్నది. మీనాక్షీ దేవ్యాలయము భారత ప్రసిద్ధ దేవాలయములలో నొకటి, ఇది చాల విశాలమైన యాలయము.

దేవ్యాలయమునకు ముదు ముఖగోపురమున్నది. అది అత్యున్నతము, అది భారతదేశౌన్నత్యమునకుం జిహ్నము. ఆ గోపురము.

దివమునం, బుష్పవంతులు, విధిన్ నెఱవేర్ప, నిరంతరంబు, ప్రా
భవమున నేగుచుంద్రము, శ్రమవాయంగ, వాగలు, నిల్వ,
బ్రహ్మ. యీ
భువిపయి, నిల్పినట్టి నగమోయన నుండెను, భూరిగోపురం,
బవిరళ, తారహారరుచి, భాసిత, భూరితరాత్మమూర్ధమై.

కనఁబడె గోపురమ్ము, తన కాయమునంగల, రంధ్రికా సహ
స్రనయన, భూషితంబగుచు, శర్వసతీపదసేవకై, సహ
స్రనయన దేవుఁడచ్చటికి బ్రశ్రయుఁడై చను దెంచి, దేవి, యా
జ్ఞను బడయన్, నిలంబడె, ననన్ మొగసాలను నమ్రశీర్షుఁడై.
నఖశిఖభాగముల్, ఘన నినాదములన్ బులకింప, నుద్గమత్
ముఖముకురోల్లసత్ రుచులతోఁ, జెలువొందు కదంబవృక్షమై;
నిఖిలశరీర దృశ్య గణనీయమహత్తర శిల్పసంప దా
నఖశిఖ సుందరంబగుచు, నాగిరి, గోపురముండె హృద్యమై.

ఆ దేవ్యాలయ ప్రాంగణములోఁ దొమ్మిది గోపురములున్నవి, వానిలో నీ గోపురమే యున్నతము, దానియెత్తు 152 అడుగులు, దాని శిల్పము జగత్ప్రసిద్ధము. అంబారీతో గజరాజు తలపూవు కందకుండ నా గోపురములోఁ దిరుగవచును.

ఆలయమునకు ముందొక పెద్ద మంటపమున్నది. దానికివేయి స్తంభము లున్నవి. అంత విశాల మంటపములు చాల అరుదగనుండును ఆ మంటపము మహా శిల్పస్నిగ్ధములైన శతాధిక స్తంభమండితము. గర్భాలయమునకు ముందు బంగరు ధ్వజస్తంభమున్నది.

ఆమె మీనాక్షి, యందుచే, నచటికొలఁకు
లందు, మీనములెన్నియో, యలరుచుండు,
బాదరాయణ సంబంధబాంధవంబు,
నాఁడు నేఁడుఁ, బ్రచారమునందుఁగలదు.

ఆమె, మీనాక్షి నామమే, యామె కనుల
యందచందములకును, వ్యాఖ్యానమగును
అర్థపతి యింటి అర్థమున్, వ్యర్థమగును,
వివరణము చేసి చెప్పుట, వెలితియగును.

కొనేరు గట్టున నొకమండపమున్నది. ఆ మండపము గోడలు మృత్యుంజయ విలాసమును బ్రదర్శించు నాటక శాలలవలెనున్నవి.

తన తపోగ్నినిఁ, బుష్పధారలన్ జల్లార్చు,
కందర్పదర్పమున్ గాల్చునదియు,
తపము చేఁగఱగించు, ధరణీధరాత్మజన్,
ప్రేమ చూపుల, రంగరించునదియు,
కన్నుఁగానక, నింగి గంతులువేసెడు,
గంగ యార్భటి, గంగఁగలుపునదియు,
అద్రిజతోఁగూడి, యద్రులు చెదరు, భం
గిని, యాడుతాండవ కేళి కళయు.

హాలహాలము ద్రింగు, లీలా విలాసము,
మిత్తినెత్తి మెత్తు చిత్తరువును
అచటి గోడలందు నగపడు, నీశ్వర
సంప్రదాయమంత, చఱచినట్లు.

అమ్మవారి యాలయమునకు ముందు నష్టలక్ష్మీమంటపమున్నది. ఆ మంటపములో నెనిమిది స్తంభములమీద నష్టవిధలక్ష్మి చిత్రములు చెక్కఁబడినవి- ఆ లక్ష్మల శిరస్సులే మండపముయొక్క కప్పునకు స్తంభస్థానీయములు- ఆ స్తంభములమీద మీనాక్షీమాత చరిత్ర చిత్రింపఁబడినది. అక్కడ ఒకే మండపములో స్తంభములపై శ్రీలక్ష్మి విగ్రహములు మీనాక్షీదేవి చరిత్ర చెక్కఁబడినవి. లిఖింపఁబడినది. ఇది శైవ వైష్ణవాభేదసూచకము.

ఉత్తర గోపురమువద్ద, నొకేరాతిలో, నటురెండు, నిటురెండు నన్నని, స్నిగ్ధస్తంభములు, నిర్మింపఁబడినవి- వానిని సంగీత స్తంభములందురు. మీటినచో వాని నుండి, సప్తస్వరములు వెలువడును. ఆంధ్రశిల్పుల కీవిద్య రక్తములో బుట్టి రాణకెక్కినది.

ఇతరుల యంగమున్ దివిచి, యేర్పడ, నన్యుల దేహమందునన్,
జతపడఁగూర్చి, వారినిఁ, బ్రశస్తశరీరులఁ జేయుచుంద్రు, సాం
ప్రతము భిషఙ్మణుల్, దివికిఁ బ్రాకెను, భారతజాతిమేధ, యా
ప్రతిభ మహత్తరమ్మ, యది భారతకీర్తికి గీటురాయియే.

ఇది వైద్యము, ప్రాణిలో నన్యప్రాణ్యంగమును, సమారాధము చేసి విజయము సాధించినది. శిల్పము మఱియొక మెట్టుపైకిఁ బోయినది.

జీవములేని యొక్క శిలఁజెల్చి తదంతరమందుఁ, బ్రాణిధ
ర్మావృత గానశిల్పము సరాగముఁ గూర్చిన, శిల్పివైద్యు డిం
దే వసియించి, కర్మధర, దేవనివాసముఁ జేసినాఁడు, పుం
భావకళాసరస్వతి- సమానుఁడు వానికి యొక్కఁడుండునే ?

బండరాళ్ళకు, మనసిచ్చి, పలుకులిచ్చి,
అంతరాయ్యకుఁ జక్కిలిగింత పెట్టి,
జీవమే లేని దానికి జీవమిచ్చు
శిల్పిధాతకు, సర్వము, చేతిరేగు,

ఈ శిల్పము ఆ ప్రాణిలో ప్రాణిధర్మము నారోపించి సాధించిన మఱియొక అపూర్వ చికిత్సా విధానమే.

ఆ సమీపమందే యొక మంటప ద్వారమున కిటు గజముఖుఁడు, అటు షణ్ముఖుఁడు, చెక్కఁబడినారు. వారు,

పితరుల పెంపకంబునను, వృద్ధులఁబొంది, స్వకార్యదక్షులై
జతలుగరూపులంది, యనుజాగ్రజ బంధుర భావపూర్ణులై
గతమును, భావిఁ, జర్చలముఖంబున, నిర్ణయముంబొనర్చ న
న్వితులయి, యున్నయట్లు, కనుపింతురు, స్కందగణేశులచ్చటన్.

పొట్టివాఁడొకండు, పొడుగువాఁడొక్కఁడు,
గట్టివారె యెల్లఁ బట్టులందు,
పొట్టిపొడుగు, లొక్కపట్టున, నున్నచోఁ,
గొండకోతి దిగును గుతలమునకు,

వెనుకయ్యను, వెనుకయ్య వెనుకయ్యను దర్శించి ముందునకు బోతిమి. అక్కడ దేవాలయ గోపురమున్నది. అది బంగరుపూఁత కలిగి యరుణకిరణ కాంతులలో ధగధగ మెఱయుచు.

నాకలోకమునకు, ప్రాకటాధారమై,
రవికి శశికి నిలువ, రమ్యమైన
విడిదియగుచుఁ, గాంతివిసరముఁ జిమ్ముచు
నున్న, మేరువనఁగ, నొప్పుచుండె.

అచ్చటనున్న యొక మంటపము గోడలపై, దేవాలయ చరిత్ర అరవము లోను నమరభాషలో, వ్రాయఁబడినది. అక్కడకు దగ్గఱలోనె మఱియొక శత స్తంభమండమున్నది. ఆ మండపములోనున్న శివునకు సభాపతియని పేరు.

## సభాపతి పద నిర్వచనము.

ఇచ్చట సభాపతి పదము పరమేశ్వర పర్యాయ పదముగాఁ బ్రయోగింపఁ బడినది.

"న సా సభా యత్రనసంతి, వృద్ధాః" అనునది యొక సుభాషితము(అనగా వృద్ధులు లేనిది సభ కాదు అని యర్థము) ఇచ్చట "వృద్ధ" అనుపదము ఉత్తము లైన జ్ఞానులకుపలక్షకము– ఆటువంటి జ్ఞానులు లేనిది సభకాదని యర్థము. దీనిని బట్టి సభయన నుత్తములైన జ్ఞానుల సమూహమగుచున్నది. సభా = ఉత్తము లైన జ్ఞానుల సమూహమునకు = పతి ప్రభువు - అని సభాపతి సమాసమున కర్థము. అనగా ఉత్తములైన జ్ఞానులకు మాత్రమే గోచరుఁడై సాయుజ్యము నొసగి వారినిఁ బాలించు మోక్షాధిపతి పరమేశ్వరుఁడని విశిష్టార్థము. ఈ మార్గ మునే జ్ఞానయోగ మందురు.

కుమారులలోఁ గొందఱు మహామేధావులైన కొందఱల్ప మేధావులునుందురు. తండ్రి మహామేధావులైన పుత్రులకు జ్ఞానగమ్యమైన మార్గము నుపదేశించును- అదియే నిర్గుణోపాసనము. ఆచరణ, కసాధ్యము-కాని భగవంతుని దగ్గఱకు జేఱు టకు దగ్గఱ మార్గము.

ఆ తండ్రి అల్ప మేధావులైన పుత్రులకు యత్న- సులభ సాధ్యమైన మార్గము నుపదేశించును. దానినే కర్మయోగ మందురు. అదియే సగుణోపాసనము భగవంతుని సన్నిధియైన సన్నిధిఁజేరుటకు నది దూరమార్గము ఈ కారణము వలననే చిదబరములో గనుపించని, నిరాకారస్వామి (ఆకాశలింగము) నిర్గుణో పాస్యుడు, ఈ మంటములో సామాన్య భక్తరక్షణార్థమై సగుణోపాస్యుడై సాకార ముగ సభాపతిగా (శివుడుగా) దర్శనమిచ్చినాడు.

ఆ యాలయములో శిల్పములేని స్థల మంగుళమైనను లేదు. అచటి స్తంభములు అరకూట కంచుకావృతములై సువర్ణ స్తంభముల వలెఁ గనుపించును.

పైనశిల్పము, క్రిందను, ప్రక్కలందు,
మూలమూలల శిల్పమే, మొలకలెత్తె
ననగ, గుడియొక, శిల్పవృక్షాకృతిఁగనె,
దాని నీడయె, నీడ, శిల్పాని, కవని,

జగదంబను మీనాక్షీదేవిని సందర్శించితిమి. ఆతల్లి మోమున దయాచంద్రికలు వెల్లివిరియుచున్నవి. ఆమె బాలశశాంకధారిణికదా ! ఆతల్లి వరదముద్రతో నొప్పుచున్నది. భారత దేశమందలి యష్టాదశశక్తి పీఠములలో మూడవది మీనాక్షీ పీఠము.

ఉన్నత పీఠము నధిష్ఠించిన, యాజగజ్జనని,

గంభీరాకృతి యొక్కచోటఁ గుదురై, కందోయికిన్ వేడ్కగా,
శుంభద్రూపముఁ గొన్నయట్లు, లటఁదోచున్, గాని, యాచూపులో
నంభస్సారము చల్లనై నదిగఁ గానన్‌వచ్చుఁ జూచాయ'గా,
డంభంమన్నది యుండునే, జననిపుత్రప్రేమ, నెప్పట్టునన్,

మాకుఁ గన్పించె, మీనాక్షిమాత-అష్ట
విభవ, భవరాజ్ఞి, భూధరప్రభుతనూజ
చెలఁగి కొల్వున్న రాజరాజేశ్వరమ్మ
వలెనె, చాక్షుషభాగ్యము, పండినట్లు.

తరువాత నయ్యవారైన సుందరేశ్వరుని దర్శించితిమి. మీనాక్షీదేవ్యాలయమునకుఁ గుడిప్రక్కన సుందరేశ్వరాలయ మున్నది.

వామపార్శ్వము వధువుది, వరునిపార్శ్వ
మమరు వామేతరమ్ముగా, నదియొధర్మ
మౌను, నెయ్యదిి, వైష్ణవమందు మాఱె,
శైవమందున, మాఱు, దీభావ మిచట,

సుందరేశ్వరాలయము కూడ బంగరు రేకులతో నాచ్ఛాదింపఁబడి ధగధగ మెఱయుచుండును. అవి

పెద్ద మేరువు ప్రక్కన, పిల్లమేరు
వున్నయట్టుల గనుపించుచుండు, దేవి
యింటి ప్రక్కననున్న, సర్వేశగృహము,
భాగ్యమందున, స్త్రీలదే, పైఁగరమ్ము,

సుందరేశ్వరుఁడు సహజ సుందరుఁడు. నగజాతయు సహజసుందరియే. ఆ దంపతి పరస్పరాశ్రయముచే నతి సుందరమైనది.

సుందరదేవుఁడామె గళసూత్రముఁ, గట్టకయున్నయప్పుడే,
సుందరుఁడయ్యె, మీఁద, నతిసుందరుఁడయ్యెను. చంద్రధారికే
లంది, త్రిలోకసుందరిగనయ్యె, భవానియు, స్వర్ణరత్నముల్,
పొందిక చేఁ, బరస్పరము, పొందవె, నూత్న మనోజ్ఞశోభలన్.

అర్ధనారీశ్వరుఁడు అనుసమాసములో నీశ్వర ప్రాధాన్యము గోచరించును. శ్రీశైలము. అమరావతి మొదలగు శైవక్షేత్రములో నది నమన్వయమగును.

మధురలో దేవీ ప్రాధాన్యమే గోచరించును. అందువలన దేవీ ప్రాధాన్యము ధ్వనించునట్లుగా. అర్ధపురుషేశ్వరి (అర్ధం పురుషః యస్యాంసా) (అనగా తన సరీరములో సగము భాగము పురుషుడు గల దేవత అనియర్థము.) అనిన సమంజసముగా నుండునేమో.

ఆ ప్రక్కనే యొక భవనమున్నది. దానివి తిరుమలనాయకుడు (మధుర రాజు) తంజావూరు రాజకన్యకమైన తన భార్యను మెప్పించుటకై కట్టించినాడట. అందువలన ఆ భవనమును దిరుమల నాయకుని భవనమందురు. దానిలో దర్బారు మహల్ ఉన్నవి. వాని ప్రక్కనే యొక శయన మందిరము మొదలైనవి యున్నవి అ భవనములలో స్తంభములు లేవు. చెక్కసామాను లేదు. దోములు లేవు. ఇనుప దూలములు లేవు. కేవలము రాయి ఇంకను నేవియో వస్తువులతో నా భవనములు కట్టబడినవి. ఇది హిందూదేశ శిల్ప నైపుణ్యమునకు బరాకాష్ఠ. ఈ కట్టడములు చూచి విస్తుపోనివారు లేరు.

భారతంబున మహిమలోఁ బ్రాభవమున
ఇద్దఱుండిరి, యిద్దఱూహింపఁదగిన
శక్తు, లిద్దఱుఁ, గాశీవిశాలనేత్ర
యొకతె, మీనాక్షి మధురలో నొకతెయగును,

మీనాక్షీదేవి యనుగ్రహ ప్రసాదమును బదిలముగా హృదయములో భద్రపఱచుకొని కవుల, భక్తుల దృషిలో పుత్తడి పురముగా హత్తుకొన్న 'విల్లి పుత్తూరు' న కభిముఖుల మైతిమి.

## విల్లిపుత్తూరు

8-10-84 సాయంకాలము 3 గంటలకు మధుర నుండి బయలుదేరి 4 గంటల 30 ని॥కు శ్రీ విల్లిపుత్తూరు చేరితిమి. అచట నడుగు పెట్టగానే యాంధ్ర పంచ కావ్యములలో నగ్రగణ్యమైన, ఆముక్త మాల్యద, నా మదిలో మెదిలినది.

విల్లిపుత్తూరు వైష్ణవ పుణ్యక్షేత్రము-చాలమంది వైష్ణవ స్వాములకు జన్మ నిచ్చిన పవిత్ర భూమి.

'విల్లిపూత్' అను పేరుగల యాటవికుఁడు-ఆ గ్రామమును కట్టుటవలన నా పల్లెకు "విల్లివుత్తూరను" నామ మేర్పడినదఁట.

పండితులు దానిని విల్లుపుత్తూరుగా వ్యవహరించి-దానినే "ధన్విపుర" మని సంస్కృతీకరించిరి.

విల్లుపుత్తూరులో రాయల ప్రబంధనాయిక-ఆముక్తమాల్యద గోదాదేవికి ప్రత్యేకాలయమున్నది-ఈమెకే తమిళనామము "ఆండాళ్". మఱియొక యాలయములో నచ్చటనే రంగనాథస్వామి గోదాదేవి నిలబడి యున్నారు-ఎదుట వినమ్రుడయి గరుడాళ్వారున్నాడు- ఆళ్వారు గౌరవసూచక పదము- అక్కడనే శేషశాయి విగ్రహమొకటి యున్నది- అది యిటుకలతోఁ గట్టఁబడినది- ఆలయమున కెదుట నెత్తైన గాలిగోపురమున్నది.

గోదాదేవి శ్రీరంగములో శ్రీరంగనాథునిలో, నైక్యమైన పిమ్మట విల్లిపుత్తూరులో వెలసినదఁట. ఆ గ్రామ, మామెకు పుట్టినిల్లు గదా!

పుట్టినింటి ఘనతం బొట్టుమేసియు, నంద
లమున కెత్తు, యోగ్యురాలు, ప్రేమ
కన్న వారిపై పె, కొన్న వారెంతగా
నున్న వారలైన, యువిదలకును.

శ్రీరంగనాధస్వామియు, నర్ధశరీరముతో, నెంతయో కాలముండలేక, పూర్ణశరీరి యగుటకై, విల్లిపుత్తూరులోనే, శ్రీరంగనాధుఁడుగా నవతరించినాఁడు- ఆ యాలయముకూడ నతి విశాలమే- యద్భుతావహమే-

గోదాదేవి ప్రేమరాశి- ఆమె వదనము ప్రసన్నతా సదనము. ఆమె శ్రీరంగనాథుని తన హృదయ రంగనాథునిగాఁ జేసికొన్నది- ఆమెను జూచి నంతనే నాలో గత చరిత్రలోని మొదటి పుటలు మెఱసినవి. ఆమెను దర్శించి నంతనె, నాలో, నీయూహలు, కలిగినవి.

జడలోఁదాల్చిన పూలమాలను, జగజ్జాలంబు, గర్భంబులోఁ
గడ గాఁదాల్చినవాని, కంఠమునఁ గాన్కన్ జేసి, ప్రేమించి, రం
గడునావాఁడని, చాటినట్టి, జగతీకల్యాణసంధాయినీ !
పుడమిన్, నీ సుమమాలవాసనలు, పెంపుంగాంచె, గోదాంబికా!

రాయల, కావ్యభూరుహధరాతలమై, రహిమించె, నీ సుధా
ప్రాయలసచ్చరిత్ర. ఫలవంతము, తెల్గుసరస్వతీయశో
దాయకరూపురేఖ, భవదాయత సుందరమందహాస శో
భాయుతమై, ముకుందరసభాసుర మానస రాజహంసికా !

ధన్యుఁడు విష్ణుచిత్తుఁడు, సుతన్నినుఁగాంచుట- పూలతోఁట స
మ్మాన్యము, నీ పదాంబుజ సమాదరణంబున, విల్లుపీడు నీ
కన్యతనమ్మ చెయ్యాల నిగారము, తియ్యని తెల్గుతెని లే
ఖిన్యురమ్ము, నీ మధురగేయము వ్రాయుట, తోఁటపుట్టువాఁ

ఉపవనమ్మునఁ, బుట్టువోందు, నయోనిజ
వమ్మ ! గోదమ్మ ! సీతమ్మవోలె,

ఆటలోఁబాటలో మాటలందునఁగూడ,
ధ్యానించితివి, రంగధాము, విభుని,
లోకనాథునకు. సమీకరించినదంత,
సిగఁదాల్చి, లక్ష్మివై చెలఁగినావు
ఎత్తులోహత్తిన, యెలకేశపఙ్క్తిచేఁ,
బరవశింపడె, విష్ణువంతవాఁడు.

కొడిమలెన్నియొ, నీ మీఁదఁబడినయపుడు,
స్వయముగా వచ్చి శ్రీరంగశాయి, నీకు
నెదఁదావిచ్చి, తావిచ్చెఁ బుడమినిండు
నీదుకీర్తికి, గోదాంబ! స్వాదుచరిత!

ఎంతటి తీపి, నీయెడ రమేశునకుండెనొ లేక యా పురిన్,
జెంతటి చుట్టపక్కముల, సేవకులన్ విడి, "సర్వమీవ" యం,
చింతటి మామయింటికడ, నిల్లరికంబుననుండె, యానులే
అంతటివారలైనఁ, బ్రియురాండ్ర చెఱఁగులఁబట్టియుండరే!

జగములనేలు మాధవ విచారము గొప్పది, దానికంటె నా
ఖగపతి తేని సన్నిధి యఖండము, దానిని మించియుండు స
ర్వగతుని మెప్పునందుట, యవర్ణ్యమె యింక, యధోక్షజాత్మలో
సగముగనుండఁగల్గుట, విశాంపతిసేవిత పాదపంకజా!

అని యయ్యాంధ్ర మహాప్రబంధ ప్రబంధ సంధాయిని కంజలి బంధము నిబంధించితిని- అట్లు ఆకావ్యపాధేయ ప్రదాత్రిని పందర్శించి బహిరాలయము చేరితిని అక్కడనొక పూలతోఁట- దాని సవిధమందొక తులసీవనము ఉన్నవి. అవి యానాఁడు విష్ణుచిత్తుడు భగవత్కైంకర్యమునకై స్వయముగఁ బెంచిన వనయుగళమున, కౌరస్యములఁట- ఆభక్తుఁడు.

కంఠఁగఱగించి, సుమజాతి కనులువిప్పి,
మనసుఁగఱగించి, దేవుని మనసుఁదన్ని,

తులసి, విరులను దోమాలెగలిపి గ్రుచ్చి
విష్ణుచిత్తుడు సేవించె విష్ణుమూర్తి,
తులసి యిందిరయంశమై చెలగుకతన,
తులసిప్రాణము లక్ష్మికిదోల్లి, నాడు
గోద శ్రీప్రసూత, కాపునగూర్చెదులసి,
మూల్యదకు నెంతయో జీవతుల్యయగుచు,

గోదా దేవి జని యాశ్చర్యఖని.

సంతతిలేక, జీవితము సార్థకమా? యని, విష్ణుచిత్తుడు,
శ్రాంతము కుందుచున్, జలధిశాయికి సేవలుచేయ, దద్ద యా
క్రాంతుడు రంగజీవి కనరాళిచరిత్రలభించె బిడ్డ యా
చెంతనునున్న పుణ్య తులసీవనమందున, బంధభాగ్యముల్,

ప్రతిదినమచ్చట దులసీ వనమునుండి, తెచ్చిన, తులసిమొక్కను, దేవి ముందు నాటుదురు, ఆ మొలక వాడక మఱుదినమునకే, నూత్నదళముల ప్రసవించుచుండును, ఆ దినమున నా నూత్నదళములతో నమ్మవారి నర్చించి, యామొక్కను దొలగించి, యాస్థానమున, మఱియొక మొక్కను, నాటుదురు- ఇది యచ్చటి పూజావిధానము. కీర్తివంతములైన ఆ పూలతోట, తులసీవనము లీనాడు, కీర్తిశేషములు కాలేదు, కాని నామమాత్రావ శేషములైనవి.

సాధారణముగా గర్భాలయములలో విద్యుద్దీపములుండవు- తైలదీప కాంతిలో దైవప్రతిమ స్పష్టముగ గనుపింపదు. హారతియిచ్చునపుడామూర్తి, స్పష్టాస్పష్టముగ గనుపించును.

ఆ దేవి విష్ణుపత్నియైనను, ఆదిభిక్షువు పత్నివలె నిరలంకార- అమూల్య వస్త్రాంచితికావలసినయామె యమూల్య వసనాంచితయై, పేదముత్తైదువవలె నున్నది- ఆయాలయ, ఆదాయమే యంతటిదో! ఆ యర్చకుల స్వాత్రయాశ యత్వ ప్రావీణ్య, మంతటిదో. ఆ దైవమునకే యెఱుక.

## కుర్తాళము

దిః 8-10-84 రాత్రి 10 గం॥ మా బస్సు కుర్తాళము చేరినది. పదము వినగానే యర్థము స్ఫురించినట్లుగానే కుర్తాళము పేరు వినగానే జలపాతము గుర్తుకువస్తుంది. కుర్తాళ జలపాతముల కంతటి సాన్నిహిత్యమున్నది.

ఉదయము కాకముందే జలపాత స్నానార్థము యాత్రికులు గుంపులు గుంపులుగా బయలుదేరిరి. నేను మా శ్రీమతియు నట్లే బయలుదేరితిమి. త్రోవ తప్పితిమి. ఏమి చేయవలెను ?

అక్కడకు జలపాత ఘోష స్పష్టముగా వినఁబడుచున్నది. దీపగృహమున కభిముగాఁ బ్రయాణించు నౌకవలెనే మేము ఆ ఘోషకు ఎదురుగా నడక సాగించితిమి. నౌకకు ప్రమాణము చాక్షుపము. మాకక్కడ శ్రావణము.

జలపాతమునకుఁ బరిసరమంతయు శిలామయము. జలము ఆ కొండల మధ్యమందుండి వచ్చుచున్నది. ఆ ప్రవాహమునకుఁ "జిత్రానదియని" పేరు. ఆ ప్రవాహము ఏబది యడుగుల యెత్తునుండి క్రిందఁబడుచున్నది." ఆ దృశ్యము గంభీర సుందరము. క్రిందఁబడి యతి పలుచనై పల్లమునకుఁ బరుగిడుచున్నది యా కూలంకష.

శీలమునుండి భ్రష్టుండయి, శీర్ణచరిత్రుఁడు, మందదృష్టి, య
శ్లీల మనః ప్రవృత్తియయి, లీలఁగజాటిన కాలి, నాపగా
జాలక, జాతిజాతియు, రసాతలమందునఁగూలులీల, నా
భీల జలప్రవాహము, కుభృచ్ఛిరమున్, విడిభూమిపైఁబడెన్.

శృంగమునుండి, నేలకతిశీఘ్రముగా దిగు, నా ధునీఝరం
బుం, గమనింప, వాతహతిఁబొంగుచుఁ గ్రుంగుచునున్న, చీర, ది
వ్యాంగన యూఱవైచినది, యచ్చుగ మానసవీథిఁదోఁచు, నా
నింగిని, నేలనుం, గలుప, నేర్పడు, వారధిలీల, నొప్పుచున్.

కొండమూర్ధమున ఘూర్ణిల్లుచుఁ బొంగుచున్న, జలౌఘము, కొంత క్రిందకు వచ్చి రెండు పాయలుగాఁజీలినది. ఆ జీలుట

క్ళతయుగమునందు, నొకటిగాఁ గెరలినట్టి,
ధర్మ మాయాత, కాల సిద్ధాంతములను,
"ద్రోసిరాజ" నకే, రెండుత్రోవలందు,
సాగినట్లుఁగ, నా, నీరసరణి, సాఁగె

ఆ రెండుపాయలలో నొకపాయ మరల చతుర్విధమైనది. ఆ పద్ధతి.

పర్వతాకారమై, నేర్వ వలను పడక,
యున్న వేదము, మానవాభ్యున్నతికయి,
నాల్గుభాగములై, ధర, వెల్గినట్లు
చీలె, నాల్గుగ, నా ఝరీ శ్రేష్ఠ, మచట.

రెండవపాయ మహోద్ధతముగా నేలపైఁ బడుచున్నది. ఆ ప్రవాహము-అఘమర్షణమునకుఁగాక, ప్రాణఘర్షణమునకుఁ గూడ ననుకూలము, అందువలన దానిక్రింద నెవ్వరు స్నానముచేయరు. నాల్గుగాఁ, జీలి, పడుచున్న, పాయల క్రిందనే, స్నానము చేయుదురు. ఆజలము మలినాపహారి.

అతిధవళమ్ము స్వచ్ఛమును నైన, నదీఝర, మాత్మవారి, స్నా
తతతి, మలమ్ము, దూరముగఁ దద్దయుఁద్రోయు, పటాళిలగ్నమా
యతిమలినమ్మునైనను, రయంబున నాశముఁజేయు,స్వచ్ఛతా
యుతమతి సంగ, మన్యవృజినోన్నతిఁ బాప, సమర్థమెయ్యెడున్.

కొండపైనుండి గతిభేదములతో దిగుచున్న యా స్రవంతి.

అభినయవేళ, హస్తచరణాది, విలాసవిలోల భంగికా
ప్రభలు, చెలంగ, నుద్ధతతరంబుగ నాట్యముచేయు, భామినీ
నిభముగ, నా స్రవంతి ధరణీధరు నొవలనుండి, భూమిపై
రభసగతిన్ దిగెన్, దరగలన్, రసరాగము. గొంతువిప్పగన్.

చలిమల. ప్రేగునుండి, చలచల్లగ జాఱెడు గంగవోలె, మి
న్నుల నలయించి రేగు, పవనోద్ధతపా, తెలిమబ్బువోలె, భూ

తలదురితమ్ముఁ బాపఁ, గడు దవ్వున నుండియు, వచ్చు భాస్కర
జ్వాలదతి మాత్రరోచివలె, సాగరగామినియుండె, నాయెడన్

ఒడలున భాగమిచ్చెఁ, గుధరోన్నతపుత్రికి, నస్వతంత్రయై
యడలుచు నుండె నామె, మఱియాదకులోఁగి, శిరస్సుమీఁద, నె
ప్పుడు, నెలవిచ్చి, తన్నుఁ, గడుముద్దులుసేయు, గిరీశుఁ, డంచు, బొం
గెడు, తొలికొండచూలు నగవేయనిపించెను, ఫెనపుంజముల్

నతోన్నతములైన, గండశిలలపై, నొడుదుడుకులుగాఁ, బరుగులెత్తు, నా వాహినీ తరంగకలకలధ్వనులు, నట్టువనాతి, యందెల రవళులపలె, వీనులవిందు చేయుచున్నవి. కొండకడువులోఁ, బట్టని, యాపెన్నీట, క్రిక్కిరిసి, పర్వత వివిధ రంధ్రముల నుండి, బహిర్గతమగు చున్నది.

ఘోరతపస్సుచేత నెడఁగూడిన సాత్త్విక తేజ, మందులోఁ
బారముముట్టె, నిల్వనను వైన ప్రదేశము లేక, పొంగి, చ
క్షూరస నేంద్రియాదుల, ముఖోద్గతమై ప్రసరించునట్లు భూ
ధారిసమస్తరంధ్రముల, దారుల, వారి, బహిర్గతంబగున్,

ఆప్రవాహము దారిలో నెన్నియో మూలికలతో స్నేహము చేసివచ్చుటచేత, దివ్యౌషధమైనది, అందువలన నా నీటిలో స్నానము చేసినవారికి నాధివ్యాధు, లుప శమించును. ఆరోగ్యము కోరు వారెందఱో, నచ్చటికి వచ్చుచుందురు.

అచ్చట వ్యాధిగ్రస్తులు సూర్యోదయాత్పూర్వమే యచ్చటకు వచ్చి శరీ రమునిండ నూనెను బూసికొని ఒక యర్ధగంట నాని యా జలధారలక్రింద స్నాన ములు చేయుదురు. ఆ నీటియందున్న లవణముల ప్రభావముచేత సబ్బుగాని శీకాయిగాని యవసరము లేకుండగానే నూనె జిడ్డంతయు తొలఁగి శరీరము శుభ్ర పడును. ఆ నీటివలన నూనె జిడ్డు మాయమైనట్లే శారీరక వ్యాధులుగూడ కఱఁగి విఱిగిపోవునఁట ఇంతేకాక యచటి వాతావరణము కూడ మహారోగ్యప్రదము. అందువలన జూన్ నుండి అక్టోబరు వఱకు వ్యాధిగ్రస్తులెక్కువగా నచ్చట నుందురు. ఎంత మఱికి వస్త్రమైన, నానీటిలో ముంచగానే, పరిశుభ్రమగును.

అంహోజృంభణ సంభృతాత్ముఁడు, మహాహంకారి, స్వార్థప్రభా
రంహోవార్ధి, నిమగ్నచిత్తుఁడు, తపోరైక్రేకేయ చిత్సన్నిధిన్,
బంహీయస్ దురితంబుఁబాసి యతి శుభ్రస్వాంతుఁడైనట్లుగా,
బృంహన్మాల్యముఁబాసి, వస్త్రము, లటన్, శ్వేతంబులౌ వెంటనే

జలపాతమునకు సమీపమందే దేవాలయమున్నది. ఆ దైవముపేరు కుర్తాలేశ్వరుఁడు— ఆ దేవుని నామమే యాగ్రామమునకు జలపాతమునకు సంక్రమించినవి.

అ స్వామికి— వేణువాగ్వాదిని— రాజరాజేశ్వరి—యని యిద్ద ర్ధాంగులున్నారు వారిలోఁ బ్రథమజాయ గానమునకు రెంటవయామె ప్రాభవమునకు చిహ్నములు.

పరమేశ్వరుఁడఖిలలోకాధీశ్వరుఁడగుట వలన తత్ప్రాభవశక్తి శ్రీ రాజరాజేశ్వరియందును— పశుపతి గాన (సామ) లోలుఁడగుట వలన ఆ ప్రతిభ వీణావాగ్వాదిని యందును సంక్రమించియుండును— "పురుషార్థం స్మృతా జాయా" అని గదా శాస్త్రవచనము— మఱి వారలకు భర్తృగుణము లెట్లు సంక్రమింకయుండును?

కుర్తాలేశ్వరాలయము చాలపెద్దది— అచట శిల్పము సామాన్యము— అలయమునకు ముందు, గణ దేవ సేనాపతుల విగ్రహములున్నవి— ఎంత యుద్యోగియైనను ఆగి గణపతికి నమస్కరింపకుండఁబోవడు— అచ్చట నిద్దఱు తల్లుల ముద్దుల బిడ్డకు, నమస్కరించి, యిట్లు విన్నపము చేసికొంటిని.

జగమున, భూమినాథునకు సాఁగిలి మ్రొక్కిన, నాతఁడిచ్చు, నిం
పుగ క్షితిఖండమున్, ధనికు ముందర నంజలిచేయ, నర్థమున్
దగనతఁడిచ్చు, విఘ్నగణనాయక ! నిన్ భజియింప, వేయిమా
ర్లుగ, నతులన్ ఘటించితు, నఘరోధక ! కార్యములన్ ఘటింపుమా !

మేము కుర్తాళము అక్టోబరులో వెళ్ళితిమి— ఆ సమయములో మన ప్రాంతములో మామిడి పూతకూడ ప్రారంభముగాదు— కాని యచ్చట ఆపాదశిఖము చూతములు కాచి యున్నవి— శలాటుకా భారముచేత నా యామ్రమభూరుహములు కొమ్మలువంచి నేలకు వంగియున్నవి— ఆ వంగుట.

"కొమ్మకుఁ గాయ భారమగు, గ్రుంగిలఁ జేయునె"? యన్న సామెతన్
రెమ్మలఁగూడఁ,గాయల భరించుచు, నేలకువంగె, బిడ్డ లా
కొమ్మలనుండి, జాతి, ధరఁగూలుదురన్న, భయంబుచేతనే,
అమ్మయినట్టిచెట్టు, తనయంతట, వంగిన భంగి, కన్పడెన్.

మన ప్రాంతములో నూర్పిళ్ళు పొలములలోఁ జేయుదురు- అక్కడ రోడ్లమీదఁ జేయుదురు- పైరుల మోపులను రోడ్డుమీద బారుగఁబఱచి యుంచుదురు- బస్సులు లారీలు మొదలగు వాహనములు పైరులమీదినుండి పోవుచుండుట చేత ధాన్యము మొక్కలనుండి రాలిపోవును. అదియే నచ్చటి నూర్పిడి.

అక్కడఁ గొబ్బరితోటలు విరివిగానున్నవి- అయిననూ అక్కడ ముక్కంటికిఁగంటే, ముక్కంటిపండ్లకే, విలువయెక్కువ- ఆదేవాలయాంతర్భాగములో నుండి ఒక యోడిక సజీవనమై జాలువాఱుచు జలపాతనీరములోఁ దలదాచుకొనుచున్నది- ఆ నీరెచ్చటి నుండి వచ్చుచున్నదో తెలయదు.

ఈ విధముగఁ గుర్రాళ విశేషముల దర్శించి సాయంకాలము 3 గంటలకు అనంత పద్మనాభుని పదపద్మ దర్శనార్థమై కేరళ కభిముఖుల మైతిమి.

మా యూర్జిత గమనుఁడు, కేరళలోఁ బ్రవేశించినాఁడు- మార్గనిరోధనము (చెక్‌పోస్టు) దగ్గఱ ఆగిపోయినాఁడు- "మంచిలోనైనను చెడులోనైనను" హద్దుల నతిక్రమించి పోయిన ననర్థము తప్పదు గదా.

మాబస్సువారికి రాష్ట్రాంతరములలోఁ బ్రవేశించుటకుఁ గావలసిన యనుమతి పత్రము (పర్మిట్) లేదు. అందువలన నధికారులు మాబస్సు నడ్డగించిరి. అయినను మా బస్సువారు అధికారులకు లంచమిచ్చి యిబ్బందినిఁ దొలగించుకొనిరి. లంచముననకే "బరువుపెట్టుట" అనునది వ్యావహారిక నామము.

బరువుపెట్టకున్న, స్వార్థవాతముచేత,
నెగిరిపోయి పత్ర, మెచటొపడును,
బరువుపెట్టవలయు, బల్లకుఁగ్రిందుగా,
నవలఁ, గార్యసిద్ధి, యదియె యగును.

తేరకూడుతిన్నఁ, దీపిగానుండును,
గాని, యది విషమ్ముఁ కనుర ! మూర్ఖ
లంచమందు వాఁడు, మంచమెక్కఁకపోఁడు,
కూడు నీళ్ళు లేక, మాడగలఁడు.

కేరళారణ్య ప్రాంతమంతయు సారవంతము. అక్కడ మొలచిన మొక్క లన్నియు ఫలవంతములే.

పుణ్యముపంటగా, నుదరభూమి ఫలింప జనించువారు, ప్రా
గ్గణ్యతఁ నందఁగాంచి, నిజకాయము పొంగిన తల్లివోలె, నా
రణ్యధరిత్రి, సార్థక, ధరాజ, లతా, బహుగుల్మ, మూలికా
పణ్య సమస్త వస్తువయి, పావనజీవన, ధన్యజన్మయా.

అది యథార్థమే యనిపించును. కనుకనే ఆ ప్రాంతములో నెక్కడఁజూచి నను పోఁక నారికేళ చూత అంశుమత్ఫలాది సార్థక వృక్ష సంచయమే కాన వచ్చును.

పూయని తీగగాని కాయని చెట్టుగాని యక్కడఁ గనుపించదు. దానికిఁ గారణము కేరళ ఋతుపవనములకు మొదటి విడిది యగుట. అంతియేకాదు వర్షర్తువు సంవత్సరములో నక్కడ నెక్కువభాగము విశ్రాంతి తీసికొనుట.

అచ్చటి కృషీవలులు వంధ్యను గూడఁ బ్రజావతిగా జేయఁగల నేర్పరులు. భూమాత యెదలోని, పదునును అదనున గుర్తింపఁగల, మేధావులు. కోపగించిన భూమాతను బ్రతిమాలి బామాలి, తగిన యుపాహారము (ఎరువు) లిచ్చి, యను గ్రహింపఁ జేసికొనఁగల చదురులు. కనుకనే ధరణీమాతకు వారియందంత వాత్సల్యము. కనుకనే యానేల యంత సారవంతము.

కేరళలో కొన్ని గ్రామములలో నిండ్లు, రోడ్డుమట్టమునకు మిక్కిలి యెత్తుగా నుండును. ప్రతి గృహము చుట్టూ తోఁటయుండును. ఆ దృశ్యము తపో వనములను గుర్తుకుఁదెచ్చును,

అధివిపినమ్ము, ప్రాముసుల యాశ్రమరాజి విరాజమానమై,
ప్రథితినిఁగాంచెనంచును, పురాణములందున నున్న, మాన్యసం

కథలముఖంబుననన్ వినుటకగ్గెను, గేరళనట్టి దృశ్యముల్,
వ్యథలఁదొలంగఁజేయునవి, యాత్రమతుల్యములెవ్వొ గన్పడెన్.

## కేరళ

త్రివేంద్రము కేరళ రాజధాని. దానికే "తిరువనంతపురము" అని మఱి యొక నామధేయము.

కేరళరాష్ట్రము వన్యమృగ సంకీర్ణములైన యడవులతోను, నారికేళ పూగ చూతాది వనములతోను, క్రిక్కిరిసియుండును. ఆ రాష్ట్రమున కొకప్రక్క, అరేబియా సముద్రము ఘోష పెట్టుచుండును. మఱియొక ప్రక్క పడమటి కనుమలు ప్రహరీగోడవలె రక్షణ నిచ్చుచుండును. ఈ రాష్ట్రమునకుఁ బూర్వము "చేర" దేశమని వ్యవహారముండెడిది.

క్రీస్తుకుఁ బూర్వము ఈ రాజ్యమును అప్పటి రాజైన మహారాజమార్తాండ వర్మ తమకులదైవతమైన అనంతపద్మనాభస్వామికి సర్వాధికారములతో సమర్పించుకొని

తనహృదయాలయంబున, సదా నివసించెడు నన్నగారి భ
క్తినిఁ, దృణమట్లు రాజ్యమును ద్యప్తిగవీడి, తదీయపాదుకల్
ఘనమగు సింహపీఠినిడి, కైకతనూభవుఁ డన్న పేరఁ బా
లనమును జేసినట్లుగ, నిలాపతియేలెను, స్వామిపేరిటన్.

ఆనాటి రాజ్యచిహ్నము రాజచిహ్నము శంఖము. నాణెములపైన నా చిహ్నమునే ముద్రించెడి వారఁట. కేరళ ప్రకృతి యత్యంత మనోహరము. అచ్చట నేతికి బదులు కొబ్బరినూనెను వాడుదురు. ఆ ప్రదేశము నారికేళ మయముకదా.

మేము కేరళలో నడుగుపెట్టగానే యొక పుణ్యాంగన మాకు స్వాగత మిచ్చినది. తన యవ్యక్తస్వరముతో మా యోగక్షేమములను విచారించినది. ఆమె రసహృదయ. తనను గౌరవించినవారి నాదుకొనుట, అవమానించినవారి యంతము చూచుట, ఆమె సంప్రదాయము. మే మడుగకున్నను మాతోఁబాటు పది కిలోమీటర్ల దూరము మార్గదర్శినిగా వచ్చినది.

అడుగకున్నను, నడిగినఁ, గడఁగిపరుల
కుపకృతుల్ చేయువార లొక్కొక్కరుందు,

రచ్చటచ్చట, వారె, యథార్థభవులు,
యోగ్యతన్నది, గతజన్మ భాగ్యముగదఁ

స్వామివారి యాలయము వఱకు మాకుఁ దోడునీడగవచ్చి యచట మమ్ము లను విడిచి తనదారినిఁ దానుపోయినది. పోవునప్పుడు సహజ మంజుల కలకల ధ్వనులతో మాకు వీడుకోలు, చెప్పి ముందుకుసాఁగినది- ఆపగయయ్యు, బస్సుతో సమానముగ వచ్చిన యామెశక్తికి, అతిథులపై నామెకుఁగల రక్తికి, భగవం తునిపై నామెకుఁగల భక్తికి. స్వదేశమందామెకుఁగల ఆసక్తికి, నాశ్చర్యము కలిగినది-ఇంతకూ నామె యెవరనుకున్నారు? నిత్యజీవన- జీవనదాయిని- జీవన హారిణి, మధుర జీవన, కుటిల గతియయ్యు నకుటిలగతి, మాబాట ప్రక్కనే మాతో వచ్చిన యొక యేఱు.

గాంధి మహాత్ముఁడు కేరళను గుఱించి యిట్లు వ్రాసినాఁడు నేనుత్తర భారతములో ననేక దేవాలయములను జూచితిని- కాని నా మనస్సు స్పందింపలేదు. కేరళలోని బ్రహ్మాండ గోపురాలంకృత దేవాలయములు నన్నుఁ బ్రబోధించినవి- నాలో జ్ఞానజ్యోతి వెలిగినది- పుణ్యక్షేత్ర దర్శన ఫలితము లభించినది- అని

కేరళలో నక్షరాస్యుల సంఖ్య చాల యెక్కువ- పుష్పఫల లతా వృక్షములే గాక యక్కడ- జాజి ఏలకి పునుగుజవ్వాది కస్తూరి లవంగాది పరిమళద్రవ్యముల యుత్పత్తి యెక్కువ.

"తామ్రపర్ణి" నది యచ్చటఁ బ్రవహించుచుండును- ఆ మధురాంబువు తన తామ్రపర్ణములతో స్వర్ణపర్ణములను బండించుచుండును. మంచిముత్యముల యుత్పత్తికే బంగరుటాకుఁ బుట్టినిల్లు, అందువలననే యాదేశమంత భాగ్యవంతము.

కేరళమునకే పూర్వము మళయాళ దేశమని గూడ పేరుండెడిది. అక్కడ ప్పుడు మాతృస్వామ్యమెక్కువ- అనగా నచ్చట పెత్తన మాడువారిదేయన్నమాట అది యొకనాఁటిమాట- కేరళలో

జీవుఁడు బ్రహ్మయంశమయి, చేతనమూర్తిగ దేహరాశిలో,
నేవల నొక్కటైమను, ననిత్యము దేహము, బ్రహ్మనిత్య మన్,
భావనచేయఁగల్గిన, నభావము భావము రెండునేర్చినన్,
బావలమానుముక్తి, యను న్యాయముఁ, జెప్పిన, యోగివర్యుఁడున్.

ఆదిలోనంతము నందఁగల్గిన, యసా
ధారణ జ్ఞానవిద్యాధనుండు
గురువులన్ మించిన, యరుదైన శిష్యుండు,
వేద వేదాంగాది విత్తముండు
బౌద్ధపర్వత భిదావజ్రము, జైనకా
పాలాదిమత భేది, పండితుండు
వ్యాసనిర్మాణ, విఖ్యాతుఁడౌ వ్యాఖ్యాత,
త్రైగుణ్య వేత్త, నిస్త్రైగుణుండు,
సరసవాఙ్మయ రచనా విశారదుండు,
ద్వాదశశ్లోక ఘటిత వేదాంతసారు,
డఖిలభారతదేశ, కోణాంతరములఁ
హిందుమతములనిల్పు, మహేశ్వరుండు,
ఓటమిఁజూడనట్టి విబుధోత్తముఁ డార్యుఁడు, వేదగూఢభా
వాటవి భాష్యరూప సుమవల్లరిఁ బెంచిన తోఁటమాలి, మో
మోటము లేక, హిందుమతమున్ నిరసించెడి వారియొక్క, యా
ర్భాటము నేలఁగల్పిన ధరామరశేఖరుఁ, డగ్నికల్పుఁడున్.
శంకరాచార్యుఁ, డా కేరళాంకమందుఁ
గాలడిగ్రామరత్నమై, గ్రాలుకతన,
నిలచియుండును, లోకము నిలుచువఱకు
కేరళముయొక్క కీర్తి, ప్రాగ్దేశవర్తి.

ఆ దేశములో గీత సంగీత చక్రవర్తి స్వాతితిరునాళ్. చిత్రకళా సరస్వతికి దుశ్శాలువలు గప్పిన కళా విశారదుఁడు రవివర్మ మొదలగు వారెందఱో జన్మించి యాదేశ ప్రసిద్ధికిఁ గారణ భూతులైనారు.

## త్రివేంద్రము

త్రివేంద్రము గొప్ప పుణ్యక్షేత్రము. అ క్షేత్రజ్ఞుఁడు అనంత పద్మనాభ స్వామి. ఆయన మూర్తి అత్యంత దీర్ఘము. మూడు ద్వారముల నుండి చూచినఁ

గాని యాస్వామి పూర్ణగోచరుడుగాడు- ఆయన త్రిభువన వ్యాపిగదా- ఆ ప్రభువు ఒకింత యోరగిలి శయనించి యున్నాఁడు.

మొదట ద్వారము త్రిదివము- అందు శ్రీ స్వామివారి మూర్ధరాజము కిరీట విరాజమానమై యుండును- ఆ యుత్తమాంగము ఉన్నత ప్రగ్రీవముపై, నీలాద్రిపైఁ బొదిగిన నీలమణివలె, శోభిల్లుచుండును.

మధ్యమ ద్వారము విశ్వంభరాచక్రము- అక్కడ నా పరంధాముని, కటి, యురములుః ప్రర్యోతించుచుండును. ఆ గోవిందుని, యావర్తనాభి నలువ నిలయమై యొప్పుచుండు.

వందలు వాహినుల్ఁ కలసివచ్చి, యెకాయెకి! గుక్షియందూనన్,
చిందులువేసినన్, బొరలిచేవ దలిర్పగనెత్తి కెక్కినన్,
స్పందుడుగాని నీరనిధి చాడ్పున, లోకములెల్ల మోయు, గో
విందుని కుక్షియుండెను, గభీరవిశాల మహాగుహాభమై.

మూడవద్వారము రసాతలము- దానినుండి చూచిన ఆ దేవతాసార్వభౌముని, శ్రీ లక్ష్మి మృదుహస్తపద్మ రాగరంజితము- భక్తమనోరధ పూరకము, త్రయస్త్రింశత్కోటి దేవతా సమారాధితమునగు పాదపద్మ ద్వంద్వము నేత్రపర్వముగఁ గనుపించును.

ఆదేవదేవుఁ డా దేవళమున అత్యంతము దీర్ఘ దేహుఁడుగను నాభియందుఁ బద్మము కలవాఁడుగాను రూపొందింపఁబడినాఁడు- అందువలననే యా వైకుంఠ వాసునకచ్చట ననంత పద్మనాభస్వామియని నామధేయము చేయఁబడినది.

పద్మం నాభౌ యస్యసః- పద్మనాభః అనంతశ్చాసౌ పద్మనాభశ్చ- అనంతపద్మనాభః అనంతపద్మనాభశ్చ స్వామీచ- అనంతపద్మనాభస్వామీ.

అతిదీర్ఘదేహుఁడు పద్మము నాభియందుఁ గలవాఁడైన దైవము- అని విగ్రహార్థము- ఇచ్చటఁ బద్మపదము పద్మోద్భవుఁడైన బ్రహ్మకుపలక్షకము- అచ్చట నాభిపద్మ మధ్యస్థితుఁడై బ్రహ్మగోచరించు చుండును.

అచ్చటఁ గూడ పాదప్రక్షాలనమును జేసికొని, కంచుకమును వదలి ఉత్తరీయముతోఁ గటిని బంధించి, దైవసన్నిధికిఁ బోవలెను.

అక్కడి యధికారులు, పైనచొక్కాలు లేకపోయినను, సంచులను గూడ వెదకుచుండిరి- ఆ స్తనశల్యపరీక్ష, యసంగత, మనిపించినది.

కైస్తవ బోద్ధ, లాత్మ ధన గౌరవముల్ విరజిమ్మ, కాలమున్
బస్తులఁబుచ్చువారిఁ, బరవంతులఁ జేసెడివేళ, నుంచిఁ, జా
దస్తమటంచునెంచి యెగతాళినిఁజేయు విపత్పరిస్థితిన్,
ప్రస్తుతమెంచ, కిట్టినియమంబులు చేయుట, పోలుసేతయే

తొలి, తురీయ, యుగంబుల త్రోవలందు
భేదమెంతయొ కన్పడ, వేత్త లెల్ల
నిట్టిమార్పులఁ జేసిరి, యెంచి సంఘ
వృద్ధిఁ, గాదన, భక్తిలోపించు జనుల

దైవభావముఁబెంచగాఁ దలపు పెరుగఁ,
గాలగమనముఁ గనిపెట్టి, యాలయముల
సర్వ సామాన్య నియమ ప్రచారములనె
యమలుచేయుట యెంతయో సముచితమ్మ.

క్షేత్రములయందు నయ్యవారు అమ్మవారు వేఱువేఱుగ నుందురు- ఈ క్షేత్రములో నయ్యవారి పాద సన్నిధిలోనే యమ్మవారున్నది- ఇంకను నక్కడ వేణుగోపాలస్వామి- ఉగ్రనరసింహస్వామి దేవాలయములున్నవి. అచ్చట చిత్రవిచిత్ర దీపస్తంభములు మఠాధిపతులు పూజాసమయములందిచ్చు చిత్ర నీరాజనముల, పొరు, కలిగియున్నవి- అంత పెద్దవిగ్రహము మఱెచ్చటలేదు.

అచటి స్త్రీలు, జుట్టు విరియఁబోసికొని, చివర వేలుముడి వేసికొని తిరుగుచు స్వామి సేవార్థము, దివినుండి భువికేతెంచిన, యనిమిష కాంతలా యన్నట్లుండురు.

కేరళకు, నాదాయము తెచ్చునవి, నారికేళవనములు- తరువాత సుగంద ద్రవ్యములు. ఏలకులు లవంగములు మొదలగు సుగంధి ద్రవ్యముల పరిణతరూపమే మనకు పరిచితము- అక్కడమేము వాని పూపఁదనమును పిందెతనమును గాయతనమును పండుతనములను (బాల్య కౌమార యౌవన వార్ధక్య దశలను) గూడఁ

జూచితిమి- ఇవి లతలు- చెట్లకల్లుకుని ఫలించుచుండును- కేరళలో మఱియొక యాదాయ ద్రవ్యము, రబ్బరు, వందల యెకరములలో నచ్చట రబ్బరుచెట్లు పెంచఁబడుచుండును.

మనదేశములోఁ గల్లుగీయుటకై, తాటిమట్టలను నఱికి, యామొండెములకు ముంతలను దగిలింతురు. ఆ, ఖండితశాఖలనుండి. బిందు బిందువులుగా ద్రవము స్రవించుచుండును, దానినే మద్య (కల్లు) మందురు. అట్లే కేరళలో రబ్బరు చెట్లకుఁ, గత్తితో గాట్లుపెట్టి యాగాట్లకుఁ గ్రిందుగా ప్లాస్టిక్ సంచులు, లేక పెద్ద కొబ్బరి చిప్పలను, (కొబ్బరిలేనివి) గట్టుదురు- అక్కడి కొబ్బరికాయలు చాల పెద్దవి- స్వాములవారి కమండులువు- అక్కడి కొబ్బరికాయలతోనే తయారు చేయుదురు- క్రమముగా రబ్బరు ద్రవము ఆ చిప్పలలోను సంచులలోను నిండి పోవును- ఆ ద్రవముతోనే రబ్బరును తయారు చేయుదురు.

ఆ విధముగ మేము- అనంతుని యనంత మహత్త్వ సౌందర్యములను కేరళవధూటి యందచందములను జూచి 9-10-84 సాయంకాలము 8-గం. జగన్మాన్యను సర్వధన్యను నిత్యకన్యను గన్యాకుమారిని దర్శించుటకై యమంద ముగా ముందుకు సాఁగితిమి త్రోవలోమాకు "నాగర్‌కోయిల్" అను క్షేత్రము తటస్థపడినది.

## నాగర్‌కోయిల్

నాగర్‌కోయిల్, కేరళనుండి కన్యాకుమారి పోవు మార్గములోనున్నది- ఇది యొక చిన్న పుణ్యక్షేత్రము- పట్టణము.

ఇక్కడ నాగేశ్వరాలయమున్నది- దానిని నాగేశ్వరకోయిల్ అందురు- ఆనామమే నాగర్‌కోయిల్‌గా మాఱినది- అదియే, గ్రామ నామమైనది.

దేవాలయ నిర్మాణము విచిత్రముగా నున్నది- మండపము బెంగుళూర్ పెంకులో గెబుల్‌గా వేయఁబడినది- గర్భగుడి గుండ్రముగా నున్నది- దానిపై బంగారు కలశమున్నది- గుడిపై గోపురములేదు- ఇక్కడ గంధము, ఇసుకతోఁ, గూడిన, తడి విభూతినిఁ బ్రసాదముగా నిత్తురు- ఆలయ మంతయు నాగేశ్వర శిల్పమయమై యున్నది- నాగేంద్రుఁడచ్చట స్వయముగా వెలసినాఁడట.

ఈ యాలయములో నొక విచిత్రమున్నది. గర్భాలయములో స్వామి ప్రక్కన, ఒక నీటి బుగ్గ ఉన్నదట- ఆ నీటియూఁటనే స్వామి యర్చనకుపయో

గింతురట. దానినే తీర్థముగానిత్తురట. ఆయూటనుండి, వచ్చు, నిసుకతో గంధమును విభూతినిఁ గలిపి ప్రసాదమిత్తురట- ఆయూటనుండి సంవత్సరములో మొదటి యాఱుమాసములు ఇసుక తెల్లగాను, జివరి యాఱుమాసములు నల్లగాను వచ్చుచుండునట.

మా యాత్రికులలో నెక్కువమంది ఉపాహారప్రియులు. అందువలన వారి యవసరములను బూర్తిచేసికొని మా బస్సు నాగర్‌కోయిలఁ జేఱునప్పటికి నాగేశ్వరాలయ ద్వారములను నర్చకులు మూయుచున్నారు. అప్పటికి రాత్రి 8 గం॥ అయినది.

తలుపులు వేయవలదనియు దైవదర్శనము చేయింపుమనియు నెంత ప్రార్థించినను వారు మా ప్రార్థన మంగీకరింపలేదు.

దేవతయిచ్చినన్ వరమదేమొ పుజారి వరంబునీయఁడే
తావున! నన్న సామెత యథార్థమె- యెంతగ వేడికొన్న దు
ర్భావులు దేవపూజకులు ద్వారము తీయక మిన్నకుండిఁ రా
భావము దూరమౌను గిరివాసున కంచునెఱుంగకుంటచే.

దైవదర్శనము కాకపోయినను- నా క్షేత్ర విశేషములను స్థానికుల వలన వింటిమి.

దైవదర్శనమం దలక్ష్యము చేసిన పాపఫలము మా బస్సువారికి సద్యః ఫలితమునే యొసంగినది.

ఎవ తెలపిలేని యానము- బహలికలను
గూర్చదే జీవులకు- ననుకూలమగునె ?
ఎంతోకాలము మాబండి ఏగియేగి
గుండెబాధను గదలలేకుండె స్రుక్కి-.

వ్యాధిగ్రస్తమైన శకటమును యజమానులు శకట చికిత్సాలయములోఁ జేర్చిరి. ఆ చికిత్సకులు రాత్రి సమయమని వెనుకాడక శకటములోని దుష్టాంగములను (అఱిగిపోయిన మరలను) తొలగించి పరిపుష్టాంగముల నమర్చి యా జంఘాలు నారోగ్యవంతునిఁ జేసిరి- వారు పరమార్థకాములుగదా- ఆ చికిత్సకాఱు వందల రూపాయలైనవి. చేసికొన్నవారికిఁ జేసికొన్నంత మహాదేవ.

పిమ్మట మా బస్సు నాగర్‌కోయిల్ నుండి, సుమసుకుమారి, సౌందర్యజిత కామారి, హరశిరశ్చంద్రచంద్రికాచకోరి, అయిన, కన్యాకుమారి కభిముఖమై కదలినది.

## కన్యాకుమారి

కన్యాకుమారి భారతదేశమునకు దక్షిణపు సరిహద్దు, భారతమాత పాద స్థానీయము- కన్యాకుమారినే, కన్యాకుమార్యగ్రమందురు- గ్రామము చిన్నదే కాని దాని మహిమ జగత్ప్రసిద్ధము— ఆ గ్రామమంతయు, గ్రావమయము- కావుననే సాగరుని తాకిడికిఁ దట్టుకొనఁ గల్గుచున్నది. ఈ మహాక్షేత్రమునకు భారతదేశమున భౌగోళికముగాను పౌరాణికముగాను జారిత్రకముగాను మహా ప్రసిద్ధియున్నది-

కన్యాకుమారి త్రిసాగర సంగమము- బంగాళాఖాత, హిందూమహాసముద్ర-అరేభియా మహాసముద్రములు, మూడుదిశలనుండి, వేఱువేఱుగ ఘోషలుపెట్టుచు ముందునకు దుముకుచుండును. ఈ వారిధిత్రయము, సదా తమతరంగ హస్తములతో దేవికిఁ బాదాభివందనము చేయుచున్నట్లుండును- ఆ తీరప్రాంతముతోఁ జిన్న చిన్న కొండలున్నవి.

మూడు సముద్రముల్ కలిసి, ముప్పిరిరజ్జువు వోలె నేకమై,
తాడిత పారభూములయిఁ ధ్వంసముచేయును, దీరభూమి, నా
దాడిని నాపనెంచి, భువితాలుపుఁబిల్లల, నచ్చటచ్చటన్,
బాడిగనిల్పె దేవి, యవి, వార్ధికరంబులఁగట్టి, యాపెడున్.

అను భావము నాకొండలు కలుగఁజేయును- అచ్చట సముద్రతరంగములు కొండలకు గుద్దుకొని గగనమున కెగయుచుండును.

సుకృతవిశేషసంపద, వసుంధరవీడి, సుఖానుభూతికై,
చకచకస్వర్గలోకమును, జక్కఁగఁజేరఁగ బోవునట్టి సా
త్వికమునిబృందమోయనఁగఁ, దేజమునన్ గనుపట్టె, నభ్రస
న్నికటముఁజేరు, శైలతల నిర్గతపాండు తరంగ ఫేనముల్.

అపుడచటి విష్ణుపదమంతయు, ఫేనపుంజ కబళితమై, విష్ణుపదభ్రాంతిని (వైకుంఠ) గలుఁగఁజేయును- ఆ భయంకర జలధితరంగములపై, కైవర్తులు,

చిన్నపడవలపైఁ జేపలను బట్టుకొనుటకుఁ బోవుచుందురు. వారి సాహసము వర్ణనాతీతము.

కన్నులానని, ప్రాయోటి తెన్నునందు,
క్రిందుమీఁదాచుఁబోవు, నాక్రించుతరణి,
మాయ నిర్జింపఁదివిరెడు, మహితయోగి
వర్యు పోలికనంది, చూపట్టునందు.

ఆనావలు తరంగోద్ధృతములై నాకలోకమును దాఁకుచుండును. తరంగాపకర్షకములై నాగలోకమును స్పృశించుచుండును. ఆ దృశ్యము.

దివికి నిచ్చెన వేసి, యాదివిఁజేర,
బారలన్‌జాచి, యాసలపై విఁదేలి,
కూల నిచ్చెన, చేలపైఁగూలిపోవు,
స్వార్థపరువలె, నావ లా, జలధినుండు,

పెచ్చుపెరిగిన నుఱుగుల గుంపులలో నదృశ్యములై క్రమముగాఁ దేప్పరిల్లిన యానావలు.

నీరముపొంగుచే మునిఁగి, నిల్వని ప్రబ్బలి, వంచి శీర్షమున్,
గాఁతియనంది, యా ఝురము కాలముచేయఁగఁ బూర్వవైఖరిన్,
మాఱక నిల్చినట్లు, చిఱునావలు, ఫేన విజృంభణంబు, చ
ల్లారఁగ, వార్ధిపైఁ బొలిచె, నందుదయించిన, బుద్బుదంబులై

ఆ క్షేత్రమున కధిదేవత కన్యాకుమారి యనుదేవత. కన్య, కుమారి, యను రెండుపదములు. అవివాహితయైన యువతినే బోధించుచున్నవి. ఒకే యర్థమును బోధించుటకు రెండుపదము లక్కఱలేదు. అందువలన వానిలో నొకపదము వ్యర్థమై "ఈమె జీవితాంతము కన్యగానే యుండును గాని గృహిణి కాలేదు" అను విశేషార్థమును బోధించుచున్నది. వ్యర్థమైన పదము విశేషార్థమును బోధించుట వ్యాకరణ శాస్త్ర సంప్రదాయము.

కన్యాకుమారి క్షేత్రమును గుఱించి, కథలు పలువిధములుగా నున్నవి. అందొక కథ, నిందుఁ బొందుపఱచెదను. పార్వతి యపరావతారమే కన్యాకుమారి.

ఆమె యాజన్మమునఁగూడఁ బరమేశ్వరుని భక్తిప్రేమపాశములతో బంధించినది. శ్రీ కంఠుఁడు సర్వమంగళకు మంగళసూత్రము కట్టుటకు సమ్మతించి సూర్యోదయాత్ పూర్వమే వివాహము జఱుగవలెనని యొక కట్టడి చేసినాఁడు-కుమారియు

వచ్చు మనోహరుండిదిగో ప్రాంగణభూమికి, వాని కంఠమం
దుచ్చతరార్ద్రి గంధసుమధూర్వహ మాలిక వేయగావలెన్,
మెచ్చగనాతఁడంచుఁ, బరమేశ్వరదర్శనలాలసాత్మయై,
ముచ్చట మీఱనుండె, గిరిమూర్ధజ కన్యక, చేతిదండతో

నిత్యము, ప్రత్యుషస్సున, వినిర్ణయ బంధమువీగ, దేవతా
స్తుత్యుఁడు రాడె! యేమనుచుఁ, జుక్కయుఁ ద్రుక్కఁగ, కన్య
యూర్పులున్

నృత్యముచేయఁగా, మరల యింటికిఁ జేరు, దినత్రయంబు,బల్
ప్రత్యయశక్తి, నామె, యఱురాకలుపోకలుసేయు, దీక్షతో,

మాలికతోడ, బాల, తనమార్గముఁ జూచుచునుండునంచుఁ, గా
పాలిక భోక్తగు ర్తెఱుగుఁ, బర్వతపుత్రి గ్రహింపనెంచుఁ, గా
నీ, లయకారి, భక్తజననీరధిదాటెడు నంతలోనఁ, బూ
ర్వాలయ, మందు, భాస్కరుఁడు, ప్రత్యహమిల్లె, తదీయకృత్యముల్

ఆతని భక్తపాలన మహత్తరదీక్షకు, నామెభర్తృసే
వాతతభక్తి దీక్షకును నాకథ, మూడల, వారిచేరికల్,
భూతహితార్థమైనయెడ, భూతవిభుండు, సకాలగామికా
డే! తెలియంగశక్యమె ? మహేశ్వరకార్యగత ప్రభావముల్.

కన్యాకుమారి భర్తరాకకొఱకై నిరీక్షించుచు నచ్చట మూడు దినములుండుటచేత, యాత్రికులచ్చట మూడు రాత్రులుండవలయును, మూడుదినములు ప్రతీక్షించినను బరమేశ్వరుఁడు వచ్చి తనను స్వీకరింపక పోవుటచేత, నామె, విసిగి విరక్తయై, శిలావిగ్రహముగా మాఱిపోయినదఁట.

అక్కడ నమ్మవారు పూర్వాభిముఖముగా నిలఁబడియున్నది. అమ్మవారికి ముందు సముద్రమున్నది. అమ్మవారిభూషణములలో "నాగమణి" యను పేరుగల ముంగరయున్నది. రాత్రిపూట సముద్రములోని నావికులు అమ్మవారి ముంగరను జూచి దీపగేహము (లైట్ హౌస్)గా భావించి వచ్చి యిబ్బంది పడెడివారఁట అందువలనఁ దూర్పుద్వారము మూసియుంచుదురు. భక్తులు ప్రక్కగానున్న యుత్తర ద్వారమునుండి వెళ్ళి దేవీ దర్శనము చేసికొందురు.

కన్యాకుమారి షోడశవర్షయైన ముగ్ధవలెఁ గన్పించును. ఆ దేవబాల.

పరికిణికట్టి, ఓణివలెవాటుగఁదాల్చి, కరద్వయంబునన్,
వగ గళసీచు నుంచఁగల, భాసురమాలికఁబట్టి, తన్మనో
హరహరుఁజూచు, చక్కఁడి శిలాలయమంటపమందుఁదొల్లి, భూ
ధరవరపుత్రి యుండెనఁట, ధన్యముఁ జేయుచుఁ దత్ప్రదేశమున్,

కన్యను ధారపోయు తమకంబున, ముంగరఁబెట్టె, నద్రిరా
జన్యుఁడు, కన్య, దాని, వరసన్నిధికేగుచు ముక్కుమీద, స
మ్మాన్య విభూషగానిలిపె మాయురె! దాని వినూత్నకాంతిలా
వణ్యము, ముజ్జగంబులనుభాండము, నింపు నిమేషమందునన్,

అట్టి ముంగర పెట్టంగ, గట్టుఱేని
భాగ్యమెంతటిదో! ఏతియోగ్యుఁడగునె ?
కట్నమైచ్చిక మొకనాఁడు - కాని - నేఁడు -
ప్రాణసంకటమయ్యె, దౌర్భాగ్యగరిమ

ఆ దేవాలయము చాల విశాలమైనది. గంభీరభద్రముద్రా ముద్రితము అనల్ప శిల్పవల్లీవేల్లిత వృక్షరాజము. దానికెదుట నపారపారావారము. ప్రక్కన సమున్నత శిఖరి శిఖరములు. వానిమధ్య ఆలయము. తన్మధ్యవేదికపై నపూర్వ శోభావిభాసితమైన దేవీ విగ్రహము. ఆ దృశ్యము సర్వహృదయ రంజకము.

కన్యాకుమారిలో నెక్కువ చక్షుఃప్రీతి కలిగించునవి సూర్యోదయ సూర్యాస్తమానములు. ఆ సమయములలో నచ్చటఁజేరిన జనసముదాయముపై నిసుక వేసినను రాలదు.

మనగృహపార్శ్వభూమినడుమన్గల, భూరుహపంక్తి చాటుఁ బా
సినయదివోలె, సర్వముని శ్రీకరబింబము పుట్టువందుఁ, దోఁ
చును నిజధర్మసాధనకు సూర్యుఁడు వేగరియాచు వచ్చు చో
ప్పును, దనుజేంద్రకృద్ధముఖమున్, గనుపట్టును వాని మూర్తిలో

తూరుపు కొండవీడి, రయదుర్దమ నిర్దయ తీవ్రవేగుఁడై
తీరముఁజేరుతొందర, నదేపనిఁ బర్వులనెత్తి యెత్తి, యా
వారిధియంచునన్గల, నివాసముఁ జేరుచునున్న, భాస్కరుం
డారయ, నింటిదగ్గరి, వనాంతరగామిగఁ జేరువయ్యెడున్.

ఈ దృశ్యము లోకమునకొక యుత్తమమైన యుపదేశ మిచ్చుచున్నది.

పుట్టుమలన్ దివాకరుఁడు, పుట్టిన యప్పుడు, రక్తవర్ణుఁడై,
గిట్టుగిరిన్నతంటటులె, కెంపుల చాయను బొంది, చేయుఁ, జూ
పట్టు, మహాత్ముఁడాపదలఁ, బండిన సంపదలందు, నొక్కచే
కట్టడినంది, యన్న, మెరుగా యుపదేశము, సార్వదేశమున్,

చేతికందునట్లు, చేఁబట్ట బ్రాతియై
నట్లు, తోఁచుచుండు సర్వముండు,
పుట్టుగిట్టుగట్లఁ బొందెడు నప్పుడు
చదురు కరము బంతి సరణినంది

ఉదధి యుదరమందు నొదిగినమేల్ కెంపు
నీటిమీఁద నాడనెంచి వచ్చి
నట్లు తోఁచె నచట నరుణార్కబింబము
జలధియందు శోణజలజమనఁగ

ఆ దృశ్యమతి మనోజ్ఞము- అచటి యా యప్రాకృత ప్రకృతి దృశ్యము కన్యాకుమారి క్షేత్రమునకు మఱియొక యనర్ఘ వజ్రభూషణము.

చైత్రశుద్ధ పూర్ణిమనాఁడు సూర్యాస్తమాన చంద్రోదయములకట నొకే సారి జలధిలోఁగనుపించి చూచువారి నాశ్చర్య జలధితో ముంచును.

కన్యాకుమారి పాదాబ్జముల ముద్దిడుకొన ముద్దెసనుండి యహమహమికతో ముందునకు వచ్చుచున్న సాగరత్రయ భయంకరాట్టహాసములు లోకమునకుఁ గొన్ని సందేశము లిచ్చుచున్నవి.

అట్టులుసాచి పర్వముల, హద్దులుదాటి, పరాయిభూములన్,
చట్టున నాక్రమించి, యటుఁ జాలక, భీతినిఁబాతిపోవు, నా
కట్టిజలాలతేని తరగల్ వచియించెను, నన్యభూములన్.
వెట్టిగనాక్రమింప, నదిపెంపతిపోవక, నిల్వనేర్చునే

మింటినినంటి, యాక్షణమె మేదినిఁగూలు, తరంగపంక్తి, మా
కంటికివెల్గునిచ్చు, నణగారిన ఫేనధనమ్ము, పైడివా
ల్గంటెనిఁ, దప్పుత్రోవల, బలాత్కృతిఁదెచ్చిన నామె యిల్లె, మి
న్నంటెయు, నంటు నేలను నసన్, జనునీతిని, వాక్కిచెప్పుచున్.

నడమంతరసిరి, ముంగల
వడివడినుప్పొంగుఁ, గడకుఁబడియణగాఱున్,
దడఁబడి తరఁగలవోలె, న
నెడు, సందేశమ్ము, నీరనిధి, యందించెన్,

రక్కసిచేతిపిల్లలుగ, రాయిడిఁజెందిన పిల్లతెప్ప, లే
దిక్కునులేక, వార్ధి, జగదీశుని ప్రేమకుఁ బట్టులౌచు, గ
ట్టెక్కి స్వకార్యసిద్ధిఁగను; నెవ్వఁడు దైవము నమ్మికొన్నచో,
దక్కక పెంపునందు, హరిదంబర భక్తునకేడఁగీడగున్

దేవుఁడనెక్కడోలేఁడు, దివ్యశక్తి
విహితకర్మమె, కులధర్మ వీరువెన్నుఁ,
గాచుదైవము. సోమరికానివాని
బ్రతుకు ఫలియించుఁ, గడలిఁ గైవర్తియట్లు,

తెల్లనికాంతికల్గి పొలదిండితనమ్ము మనమ్ములోపలన్
నల్లనిడాలునిల్పుఁ బయినన్ దులకించెడు మోసగాని మో

మొల్లను నిండు నవ్వువలె, మించి నశించెడు డీనపుంజముల్
కొల్లలుకొల్లలై జలధికూలమునన్ ఘటియించునాట్యముల్.

ఆ ప్రాంతమందే యొక శ్వేతభవన మున్నది. అది స్వచ్ఛములైన క్షీర శిలాఖండములతో నిర్మింపఁబడినది. దానిలో గాంధిమహాత్ముని విగ్రహమున్నది. అందువలన నా పర్వతమునకు గాంధిపర్వతమని పేరువచ్చినది. తెల్లని యా కొండ.

పాలవెల్లినురుగు పాతరపోసిన,
ల్లాలమందపండినట్లు, శివుని
సూలయమ్ము వోలె, బూలరాశివిధాన,
గాంధికొండ యచటఁగానుపించు.

ఆ భవన మొరిస్సా శిల్పకళాపద్ధతిలో రూపందినది. ప్రతిసంవత్సరము అక్టోబరు 2న (గాంధి జన్మదినము) మధ్యాహ్నము మాత్రమే సూర్యకిరణములు గాంధి విగ్రహముపైఁబడునఁట ఇది యాశ్చర్య విషయము. ఇక్కడ పెద్ద లైట్ హౌసు. పెద్ద చర్చి యున్నవి.

గాంధి భవనములో గోడలమీద నహింసావీరుని యమరచరిత్ర మనోజ్ఞము గాఁజిత్రింపఁబడినది. ఆనాఁడు పక్షముల బలముతో దిశాంతరములందు విహరించిన గాంధేయ సిద్ధాంత రాజహంస, ఈనాఁడు ఱెక్కలబలము తక్కి బక్కచిక్కి తనయింటిప్రాంతములోఁగూడఁ దిరుగలేక పడిపోయినదే! యనేబాధ ఆదృశ్యములు చూచినవారికిఁగలుగక మానదు.

కన్యాకుమారి ప్రసిద్ధ తీర్థము క్షేత్రముకూడ, అచటి వాతావరణము పవిత్రము మనోజ్ఞము. ఆ అతి మధురమైన వాతావరణము, పెఱిగి తఱిగే యలల యొయ్యారములు, తెల్లని తివాసీలు పఱచినట్లున్న ఆ సికతాతలములు. దర్శించుచు అనుభవించునప్పుడు కలుఁగు రసానుభూతిముందు మన యాంత్రిక జీవనము నిరర్థకమనిపించును. అచ్చటకు విదేశీయులుగూడ ననంఖ్యాకులు వచ్చుచుందురు. ఆస్తికులకు నాస్తికులకుఁగూడ నా భారతమాత పాదపీఠము అర్చింపఁదగినది. ఆరాధింపఁదగినది.

కన్యాకుమారిలోఁ గార్యక్రమమును బూర్తిచేసికొని. ప్రాజ్య ప్రాచ్య వైదిక విజ్ఞానమును అప్రాచ్యలోకమున వెదఁజల్లినవాఁడు. అనాదిసిద్ధ భారతీ

యావ్యయాద్వైత మత ప్రబోధ వైతాళికుఁడు- జగత్కల్యాణ జాగ్రదానందుఁడు నైన వివేకానందుని దివ్యస్తూప దర్శనార్థమై బయలుదేరితిమి.

## వివేకానంద స్తూపము

కన్యాకుమారికి 1 కిలోమీటరు దూరములో వివేకానందస్తూపమున్నది. వాని మధ్యలో సాగరుని రాజ్యమున్నది. వివేకానందుఁడు శ్రీ రామకృష్ణ పరమహంస శిష్యుఁడు మహామేధావి- అనన్య శక్తికల మహావక్త.

1962లో వివేకానందుని శతజయంతి సందర్భమున 85 లక్షలవ్యయముతో నా స్తూపము నిర్మింపఁబడినది. అందులో 8 1/2 అడుగులయెత్తుగల స్వామివారి గంభీరకాంస్య విగ్రహము పరివ్రాజకముద్రలో నిలుపఁబడినది. దానితోఁబాటు ఆ ప్రాంతములోనే దేవీ పాదముద్రలున్న బండపైఁ గూడ దర్శనీయమైన యొకమండపము నిర్మింపఁబడినది. ఆ పాదములనుబట్టి మొదట దేవ్యాలయ మచ్చటనే యున్నదని చెప్పుచున్నారు.

వివేకానందుని స్తూపము, కన్యాకుమారి దేవ్యాలయమున కెట్టయెదుట నిట్ట నిలువుగాఁ దలవంచక ఠీవిగా నిలఁబడియున్న ఆ మహాత్ముని యాత్మస్థైర్యము వలెనున్నది- కన్యాకుమారినుండి చూచిన యా స్తూపము గ్రామదేవతగుడివలెఁ చిన్నదిగాఁగనుపించును- దగ్గఱకుఁబోయి చూచిన నది విశాల పర్వతశిఖరమున నాల్గు ఎకరములభూమిలోఁజతురస్రముగాఁగట్టఁబడిన యద్భుత నిర్మాణమని యర్థ మగును.

ఆ స్తూపము యొక్కయెత్తు ఏబది యడుగులు, వివేకానందుడు శీతనగము నుండి పాదచారియై బయలుదేరి కన్యాకుమారి చేరి దేవీ పాదముద్రలున్న బండ దగ్గఱ మూడు సంవత్సరములు తపస్సుచేసి యమ్మవారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడై నాఁడట.

అప్పటినుంచి యా ప్రదేశము "వివేకానందశిల" అను నామముతో వ్యవహరింపఁబడుచున్నది.

అఖండ భారత దేశమునకుఁ గలికితురాయి శీతగిరి- పాదాంగదము కన్యాకుమార్యగ్రము.

మేము 11-10-34 ఉదయము వివేకానంద స్తూపదర్శనార్థమై బయలు దేరినాము- జిగమిషువుల చాలు-కొండవీటి చేంతాటివలె,చిలువజేని వలయములవలె, స్వార్థపరుని యాశాపాశమువలె, ననాద్యంతమైయున్నది. గంటసేపు వేచియుండి మేము టిక్కెట్లను దీసికొని యోడనెక్కితిమి- టిక్కెట్టు 3-00, ఈ యల్ప సముద్రతరణమునకే 3-00 రూ. రుసుము చెల్లించిన, అపార సంసార సముద్ర తారకునకు ఎంత రుసుము చెల్లింపవలెను. నరుడు ఆమూల్యమును జెల్లింపఁగలడా- ఆ మహా నావికునకు ధనమక్కఱ లేదు. ఆయనకుఁగావలసినది భక్తి. ఆయన కీయవలసిన మూల్యమదియే.

కడలిదాటుటకై ఊష్మయానము నెక్కినాము (పొగయోడ) గదా! అది యలల తాకిడికి నుయ్యాల లూఁగసాఁగినది. చుట్టు భయంకర సముద్రము-మధ్యలో నూఁగుచున్న మా స్టీమరును జూడగా మాకుఁగొంత భయము కలిగినది.

జీవితయాత్ర వార్ధియని చెప్పిన విజ్ఞులమాటలోని స
ద్భావన మెంతనిక్కమొ యపాంపతి భీకరహస్త సీకరా
ప్లావితమైన నావఁగన భంగురగామిని, స్పష్టమయ్యె. నే
జీవియుఁ గాఁపురంబున వసించునె కష్టమునష్టమందకే.

గతజనిఁజేసికొన్న తనకర్మఫలంబుగ జీవయాత్రలో
జతపడు కష్టసౌఖ్యములు. సజ్జను సాగరఘోషకాదు భో
గితల భుజంగ ఫూత్కృతులు గీడ్పడఁజేయఁగనోప పట్టి సం
తతహరిభక్తులన్ జెనకధైర్యమె? దంషధరోగ్రశక్తికిన్.

కడలితరగల నూయలపడకపై నఁ
బవ్వళించిన బాలగోపాలభక్తు
జలధి యాతఁడు కబళింపఁగడఁగఁడెపుడు
హరినిఁగాదని బ్రతుకనెవ్వరితరంబు.

అని ధైర్యముగా నా మహా ప్రవహణములో సాఁగుచుంటిమి- నావ ఆవలి గట్టునకుఁజేరినది- ఆవల నున్నది స్తూపము, స్తూపములోఁ బ్రవేశించితిమి.

అహో! ఆ క్షేత్రమెంత దివ్యము. ఎంతటి పవిత్రము, అది యొక మేటి నగము, దాని తల పొగరణచి చదరముచేసి యా సానువున వివేకానంద మహా

యోగి స్తూప నిర్మాణము చేసినారు దానిపైఁదిరుగుచుండగా శ్రీ తిరి
దిరుగుచున్న యనుభూతి కలిగినది- భక్త భగవంతులకు భేదముండదుగద

ఆ కట్టడ మతిస్నిగ్ధమై,నిస్వార్థమై జనతోద్ధరణ బద్ధశ్రద్ధమైన,వివేక
యకలంక చిత్తమును సూచించుచుండును. మేమా స్తూపమునకుఁ బ్రద
చేసితిమి. ఒకచోట బుద్ధిమంతులు కొందఱు దేనికొఱకో వెదకుచున
గనుపించిరి.

పడమటిగాలిచేఁ గలఁగి బాఱిన భారతదేశసంస్కృతిన్
వెడవెడవీఁగిపోవు ఘనవిద్యను జిత్తము వీడుదాని, నా
యెడ గమనింప వచ్చిన రహీన్ గనుపించిరి కొందఱచ్చటన్
బడయరె? జ్ఞాననేత్రుపదపద్మముమోసల నీప్పితార్థముల్.

జ్ఞానవిశిష్టుల యోగుల
యానవమును జూచునంతె నారణ్యధరో
ద్యానమునన్ జిత్తము బ్ర
హ్మానందము నందునని మహాత్ములసూక్తుల్.

యోగులలోనయోగి భరతోర్విసముద్ధరణైకదీక్షలోఁ
గాఁగిన గుండె కల్గుమొనగాడు సమాజ వికాసహేతువై
త్యాగముచేసి జీవిత మహస్కరుఁడై పెఱవారిచీకటిన్
వీగఁగఁజేయు వాగ్విభవవీరుఁడు ధీరుఁడు శాంతమూర్తియున్

ఆలిసిఁగోరకుండఁ బరమాత్మని తత్త్వమెఱుంగఁగోరి యో
గాలయుఁడైన యా పరమహంసపదంబులనమ్మి ధ్యానవీ
థీలసమానచిత్తుఁడయి తృప్తిగ సర్వముసన్న్యసించి యు
న్మీలితనేత్రపద్ముఁడు మునీంద్రుఁడు తొల్లి నరేంద్రుఁ డార్యుఁ

"ఆనందో బ్రహ్మ" యట,
న్నానందాత్మజుని, మాట నాదృతిఁగొని పూ

జ్ఞానందముఁగనిన వివే
కానందుని ధామమందుఁగలుగవె? శాంతుల్.

పోయిన పురాణసంస్కృతి
ధ్యాయితచేతులకుఁ దిరిగియందును నచటన్
పోయిన వివేకధన మట
బాయదు కనుగల్గియున్న వారికి నిపుడున్.

ఆ మహాయోగియందుఁ జదువరులకు భక్తి విశ్వాసములెక్కువ. అందు వలననే యీ పరమహంసాంతేవాసి యంతేవాసిత్వమపేక్షించి యచ్చటకు నంతమంది జనులు ప్రతిదినము వచ్చుట.

ఆ స్తూపాంతర్భాగము ప్రశాంతి నిలయము. వివేకానంద బోధామృత పునీత పుణ్యక్షేత్రము. ఆ భవనద్వారములు- అమూల్యదారు శిలానిర్మితములు ప్రాచీన నవీన శిల్పకళాఖండమండితములు. అక్కడ ఎత్తైన శిలావేదిక. దానిపై సజీవమా! యనిపించు స్వామి సమున్నత గంభీర ప్రతిమ.

శిరముపైఁ గావియుష్ణీషమ్ము మకుటమై
యోగీశ్వరత్వ సంయోగమీయ
అతి విశాల లలాటహర్మ్యము జ్ఞానదే
వికిఁ బూజ్యమైనట్టి విడిది కాగ
ఆకర్ణ చుంబి నేత్రాకృతి యద్వైత
సిద్ధాంతలక్ష్మికి సిరులఁబోడుగ
ఉచ్ఛ్వాసహృదయ సముజ్జ్వలత్ గాథత
భువనోన్నతత్వముఁ బొదివినిలుప
అన్యోన్య తుంగాంస గణ్యబలిష్ఠత
కార్యదీక్షా స్ఫురత్ కాంతుఁ దెలుప
కటిబద్ధ కాషాయ కమనీయ రేఖ సం
గ్రథిత వైదికవివేకమ్ము కాఁగ
ఆజానులంబి కరాంచిత దైర్ఘ్యము
భరత సంస్కృతి ప్రాభవమ్ము కాగ

శయసేవితోద్దండ సౌమ్య దండము మతాం
తర భీతిదాయక కరణమనఁగ
గుల్భదర్శి మనోజ్ఞ కోవిదకంచుకం
బకలుష భావ పేటికను బోల
కించిదున్నత పాదకీలితపద్ధతి
నిరత ప్రయాణ బంధురతఁ దెలుప.
ఊర్ధ్వదృష్టులు తనలోన నొదిగియున్న
భావ పరిణాహ పరిమళ ప్రభలనీన
కారణమ్మున జన్మించి కదలిచనిన
శ్రీవివేకుని చిన్మూర్తిఁ జేరికంటి

ఆ మహాత్ముని సమీపించి, దర్శించి, యిట్లు ప్రశంసించితిని.

ఓయీ! మానవదేవ! పుట్టువుననే యొప్పారుఁ బూవాసనల్
ప్రాయం బందునఁబొందఁగాఁగలవి. ఔరా! క్షీరకంఠంబునన్
వేయుం బ్రశ్నలు వేసి తెల్వికలయే వృద్ధున్ ఖసూచిన్ భళీ!
చేయంజాలితి విట్టి నీ ప్రతిభ వాసింగాంచె నానాఁటనే.

ఎందఱో బోధకుల్ మఱియు నెందఱో యోగులు జ్ఞానపీఠసం
క్రందనులెందఱో సభలఖంగున మ్రోసెడువారుగూడ నీ
చిందిన పృచ్ఛభల్లముల శీర్ణవచస్కులె. ఎట్టిదో ప్రతి
స్పందన లేని నీ పలుకుబారతి. భారతరత్న భూషితా.

హంస ముఖమ్మునన్ బరమహంస జనించెను రామకృష్ణుఁడై
అంసమునీయ జ్ఞానరహితాదృతికై. మహితానుభావుఁ డా
మాంసల సత్త్వశీలుఁ డతిమాన్యుఁడు నిన్ను సుపంటురాయియై
వ్యంసకదూర! లాగి తనవారసుఁగా గ్రహియించెఁ బ్రేమతో.

ఏనిమసంబునన్ బయిడినేనియు మృణ్మయఖండమేని స
మ్మానము చేయఁగల్గు మతిమంతుని యోగినిరామకృష్ణు నీ

మానసమందు నిల్పితివా మాన్యవరా! యలనాఁడె నీవచో
గానము నిద్రవుచ్చెను జగత్తును దీయనితత్త్వగీతితో.
గళమున కోటివీణియలు కమ్మగ మ్రోసెడివంట నీవచో
మిళితసుధాస్రవంతు లరమీలితనేత్రులఁజేయు నెల్లరన్
దళితము లన్యధర్మము లతంద్ర భవద్ఘనతర్కశక్తి చే
భళిభళి నీకులేరు సరివారు నగోన్నత భావభూషితా!

ఆ మహాత్ముని దర్శింపగానే ఆ మహా తత్త్వవేత్త, పాశ్చాత్య ఖండములలో నద్భుతముగా మ్రోగించిన భారతీయాధ్యాత్మిక జయభేరీధ్వని నా మనస్సునకు వినిపించినది. ఆ మహారవమును పదరూపముగా నిట్లు ప్రతిధ్వనింపఁజేసితిని.

పాశ్చాత్త్యులు తమ మత ప్రాముఖ్యమును జగద్వ్యాప్తము చేయుటకై యమెరికాలోని చికాగోనగరములో నొక మత మహాసభ నేర్పాటుచేసిరి- వారా సభకు దేశదేశముల నాహ్వానించిరి

మ్రోసె మతభేరి యమెరికామ్రోల నల చి
కాగొపట్టణమందు విక్రాంతమగుచు
ఎవ్వరైనను దమ మతవృద్ధిని చటఁ
జాటిచెప్పఁగవచ్చు నిస్సంశయముగ.

విని యాభేరిరవమ్ము సర్వజగతీవేదిప్రబోధమ్ము నం
దిన శాస్త్రీయ సుధీవతంసులు మహాధీమంతు లచ్చోటికిన్
ఘనసన్నాహముతోఁ జేరిరి స్వనత్కంఠంబుతో నాత్మ వా
ణిని విన్పింప మతాధికత్వమును నిర్ణిద్రోన్నతిన్ నిల్పఁగన్.
గాలితరంగయానమున ఖమ్మున నీదుచు నా ప్రవృత్తి హిం
దూలలితాంగి కర్ణములదూఱెఁ గలంచెను నామెడెందమున్
బోలినవాఁడు హిందుమతమున్ సరితాంపతియింటిలోన వే
కాలములుండునట్లు సరిగా లిఖియింపఁగలాఁడు కల్గెనా?
నా కన్నబిడ్డలందున
నా కన్నులఁగాంతి నిల్పునాయన యని యా

భూకాంత మదినిఁగుండెను
చీకాగో నగరవార్త చేరినయంతన్.

చిన్నమబిడ్డలైన బలసింధువులైన నమేయబుద్ధి సం
పన్నులునైన లోకములఁబాలన చేయ సమర్థులైన స
ర్వోన్నత భారతీయ మతరూఢమహత్వముఁ జాటిచెప్పఁగా
బిన్నలె, పెన్నకూటికి లభించునె ? యీయన దండదంశముల్.

అమలినశాస్త్రసంచయము నంతములేని శ్రుతిప్రపంచమున్
నమలియుమ్రింగి జీర్ణమగునట్లుఁగఁ జేయఁగలట్టివారు కా
ర్యమునకుఁజాల రందుల కహార్యగభీరవివేకయుక్తి యు
క్తము సమయోచితంబగు నఖండవచోఝరి ముఖ్యమైతగున్.

ఎంతటి పండితుఁడైనను
సొంతముగా నాంగ్లభాషసాధింపక యీ
ప్రాంతమునన్ గొఅఁగాడం
చెంతయుఁజింతించె భరతసీమంతినియున్.

గౌరవమున్నవారినిఁ జికాకులఁబెట్టెఁజికాగొవార్త యె
వ్వారును "నేముచాల" మని ప్రక్కకుజారి. కాని యొక్కడున్
ధీరుఁడు హైందవోన్నతిని నిర్భయుఁడై వరుణావనీశ కే
దారములందు నాటఁగల దమ్ములు కల్గినవాఁడు లేడహో !

తల్లియెడదలోని తహతహాగమునించి
పూజ్యమైన భరతభూమిపరువు
నింగికెత్త మేరుభంగిగాఁ గదలెను
భరతపుత్రుఁడొకఁడు పండితుండు.

నల్లనినేలతల్లి కనినట్టి సహోదరవర్గమందు సం
ధిల్లిన నీలిమచ్చలను నేర్పునమాపఁగ నీరుపాయమున్

పొల్లుగఁజేసి మాతృపదమున్ నిజజీవితపుష్పరాజిచేఁ
గొల్లగనింపఁగల్గు ననఘుండు మహోదయుఁ దార్యమిత్రుఁడున్.

తొల్లి నరేంద్రనాముఁడు బుధోత్తముఁడైన యతీంద్రుఁడయ్యె నే
మొల్లక మెల్లమెల్ల తృణమున్ వలెవీడెను దేశమాత భా
గ్యోల్లసనంబు పశ్చిమపయోధులకావల నింపివేయగా
వల్లెబిగించెఁ గుక్షినెలవంతయునిండిన పాండితీప్రభన్.

అతఁడుగనెఁ వివేకానంద" యనెడు ప్రథిత
మైననామోత్తమంబు ప్రఖ్యాతయశుఁడు
అక్షరాక్షరమందునన్ లక్షవిలువ
చేయుదానిని నమరమై చెలఁగుదాని.

చికాగో సభకు భారత ప్రతినిధిగాఁబెద్దలు వివేకానందు నెన్నికచేసిరి. ఆ మహాత్ముఁడు తొలుత శ్రీదేవీ చరణారవిందములకు నమస్కరించి.

పెద్దలయానతింబడసి వృద్ధులదీవెనలంది బుద్ధిలో
నద్దిన రామకృష్ణుని పదాంబుజనిశ్చలభక్తి, వజ్రమై
హద్దులఁగాయ, సాఁగె జలయానమునన్ బరిణద్ధభావ సం
పద్దివిజేంద్రదేశికుఁడు స్వామివివేకుఁడు మాతృకీర్తికై.

వారిధిదాటరాదనెడు ప్రాజ్ఞులమాటల నుత్తరించి నే
మేఱను మీఱలేదె నను మ్రింగునె? భూరి సముద్రవక్త్రముల్
నీరదమున్ ప్రభంజనుఁడు నెట్టునుగాని స్పృశింపనేర్చునే
మేరువు, విఘ్నముల్ గురువుమెచ్చిన నన్నలయింపఁజాలునే?

అనెడునమ్మిక జలధిపై నలలపైనఁ
దేలియాడుచుఁ బడమటిదీవియందు
పదమునుంచెను ఆనందపదము పథము
పథముఁదప్పని యా మహా బ్రహ్మచారి.

దేశముగ్రొత్త, యున్కి పరదేశమునందున, వారలిచ్చు సం
దేశము గ్రొత్తయే, యట పదేపది చెట్టలు చెట్టఁబట్టి భో
గాశయభూమికీడ్చు, వెలుగన్నది కీటమణిప్రకాశమై
ఆశల ముంచుఁగాని విమలాశయమార్గముఁ జూపదచ్చటన్.

నీటిమూటఁగఁగట్టనౌ నిప్పుచేత
నిలుపనౌ వెల్గువన్ జక్రమొలయఁగలిపి
పొందనౌ కాని పెలిదీవిఁబొందనౌనె?
పారమార్థిక భావసంపల్లవంబు.

జఱిగెఁ జికాగొపట్టణ లసచ్ఛిత హర్మ్యగుహాంతరంబునన్
కరమరుదైన నైజమతగర్వముఁజాటెడు కాహళాకృతిన్
నిరుపమమైనగోష్ఠి, గణనీయులు విద్యల మాననీయులున్
బరమతమన్న గిట్టని యభాగ్యులు కూపజలస్థభేకముల్.

ఎందఱెందఱో జయమునాశించి మించి
చేరి రెన్నొ మతంబులవారు సదము
నుత్తమాత్ములు మధ్యముల్ రిత్తగతులు
వేదికాప్రియు లంతర్వివేకధనులు.

ఆ పాద కంఠంబు నాచ్ఛాదనముసేయు
దీర్ఘకంచుకములన్ దిరుగువారు
ఉపకంఠసంస్పర్శి తపనీయ కేశపా
శములతో మేషవేషములవారు
వింతటోపీలతో వింతైన గళబంధ
నములతో, శీవిగానడచువారు
తమలోని వాగ్ధాటి తప్పక పరమత
సిద్ధాంతములనెల్లఁ జిత్తుచేయు

ననుచు నెంచెడివారు గర్వాంధమతులు
క్షితిని విడి నింగిపై సాముచేయువారు
కొంగలన్నియు నొకచోట గుంపుగూడి
నట్లు కనిపించి రా గోష్ఠియంతరమున.

కిటకిటలాడుచుండెసభ. గీష్పతిసన్నిభుఁ డొక్కవ్యక్తి యు
ద్ఘటిత సభాపతిత్వమును దాల్చెను. వేదికపై నొకొక్కఁడే
పటుతర భాషణంబుల సెబాసన శ్రోతలు చేయుచుండెఁ, జ
ప్పటులరవంబు తప్పెటలభంగిని మ్రోయుచునుండె దీర్ఘమై.

గడిచెను గొన్నినాళ్ళితరఖండ విపశ్చిదఖండు లెందఱో
బుడబుడ వాగు పొంగినటు పొంగిరి, చల్లిరి మాటజల్లులన్
గడనకువచ్చె నీ భరతఖండము వంతొకనాఁడు గోష్ఠినా
థుఁడు పిలిచెన్ వివేకుని మతోద్ధతవాదిఘనప్రభంజనున్.

విని సభాపతి మాటను వెఱపుగదుర
సమయ మర్థించె నప్పుడా సంయమీంద్రుఁ
డవల మఱివచ్చెవంతు నా యతియు మరల
కోరె సమయము జడిసి యింకొక్కనూఱు.

మూడవమాఱు పిల్చెను సముద్ధతి నాయకుఁ డంతధైర్యమున్
కూడఁగఁ బెట్టుకొంచు విడి గొంకును జంకును వేదికాస్థలిన్
దోడన నేగి నిల్చె. మదిఁ దూలిన తాలిమిఁ గేలనొత్తుచున్
వేఁడినిఁ దెచ్చుకొంచును వివేకుఁడు వేఁకువఁ దోఁచుచుక్కయై

రెండు నిముసంబు లిచ్చితిమండి! మీకు
మాటలాడఁగ సమయము మఱువకండి
యని వచించె సభాపతి. యతనిమాట
వినుడు యోగీంద్రుఁ, డధిసభావేది నిలచి.

కలయఁగఁ జూచినాఁడు సభఁగల్గిన పండితమండలిన్. సభా
స్థలమది జ్ఞానపేటికవిధంబునఁగన్పడె. నందమూల్యకాం
తుల వెలుఁగొందు. రత్నములె తోరము. చూడఁగ గాజుపూస మం
దులకును గానరాదు సభదొడ్డది. యందనుభూత్యమూల్యమే!
పయిగా వారలు వత్సరాల్ చదివి ప్రాప్తంబైన పాండిత్యమున్
గయికొన్నారలుఁ. గ్రంథసంగతము విజ్ఞానమ్ముఁ బత్రాల సం
దియముల్ దీఱఁగ వ్రాసితెచ్చుకొని ముందే బల్లపై నుంచుకొ
న్న యసామాన్యులు, దక్షు లక్షయము వాఙ్నైపుణ్యమున్
జూపఁగన్.

అట్టి మహామనీషుల సమక్షమునందునఁ గాగితంబుఁ జే
బట్టక వ్రాగరన్ దగునె? భాషణ మిచ్చుటఁజేయ నన్న ఓ
కట్టిడి యూహకల్గ వేనుకాడెను, నాయవధూతశిష్యుఁ డా
పట్టునఁ గన్నులన్ మసకవాఱెను, జత్తము సంభ్రమింపఁగన్.

వేలమయిళ్లు వార్థిపదవిన్ బయనించి శ్రమించివచ్చి యీ
నేలను మాతృవైదికమనీషను జాటఁగనెంచినాఁడు. నా
మూలమునన్ జెడున్ భరతభూమిప్రతిష్ఠ. మనస్సులోన నే
లీలను గ్లైబ్యమేర్పడియె. లేఁతఁదనమ్ము మదిన్ గుదుర్కొనెన్.

అని యాందోళనమందుచు
మనమున గురుదేవచరణ మాహాత్మ్యంబున్
వినతి నతిపూర్వకంబుగఁ
బ్రణుతించి యతండు నేత్రపద్మము లంతన్.

తెఱచి కనుంగొనన్ హృదయదీప్తి కనుంగవనుండి రెచ్చి ముం
దరఁగల సభ్యవర్యుల కదంబముపైఁబడె. మాన్యులెల్లఁ బా
మరులుఁగ, రామకృష్ణ పరమర్షి యనుగ్రహశక్తిఁగన్పడన్
వెఱ తొలఁగన్ బదంపడి వివేకుఁడు స్ఫూర్జథుకంఠుఁడై యనెన్.

రెండు నిముసములందు మాఖండ విభవ
మెట్టు వివరింతు. వర్షముల్ పట్టుదాని
అని విచారించి సార్థకమైన వాక్య
యుగముఁబల్కెను నామహాయోగివరుఁడు.

సోదర సోదరీమణులు! సూనృత శుభ్రవచస్సుమాంజలుల్
పాదములందుఁజల్లుదును. భారతదేశశుభాభిలాషలన్
గాదెలకెత్తి తెచ్చితిని. గైకొనుఁడయ్య! అహస్కరోదయా
స్త్రాదిక దిక్ సమన్వయము, తారక మీ కలికాలమందునన్.

ఎన్నడు తెల్లని దీవుల
విన్నదిలేనట్టి పిలుపు పెన్నిధి శ్వేతో
త్పన్నుల డెందములందున్
వెన్నెలఁబండించెఁ బ్రేమబీజమునాటన్.

గుండెలఁగదలించిన యా
పండిన సంబోధనార్ద్రభావముబలిమిన్
దండిగఁగరతాళధ్వని
నిండెన్ రోదసిని శ్రోతృనేత్రములురలన్.

ధ్వనులు ప్రతిధ్వనుల్ దిశలభాగములన్ నిలువెల్లముంచి శాం
తినిఁగన, సభ్యసంఘములు తేరొకని శ్వాసలఁబీల్చియుండ, నం
తను నుతిమెన్ వివేకజలదమ్ము, ఎటువంటి సుధాప్రసార మం
దున నుదయించునోయని బధోత్తములెల్లరు వేచియుండగన్.

తూరుపునుండి వెల్వడును ద్యోమణితేజము లోకమందునన్,
మీ రిపుడింతకాలమును మించి శ్రమించి గడించినట్టి సం
స్కారమహత్త్వమెంతటిదో, జన్మమునందె మదీయజాతి సం
స్కారము దానికంటె నధికంబయియుండె ననాద్యనంతమై.

అతని గంభీరవాక్య మహార్ణవస్థ
మైన లోతును దెలియ నా మానవులకుఁ
గానిపని యయ్యె నేత వాగర్థములను
వివరణము సేయ గడువిచ్చెఁ బిదపఁ గొంత.

అపుడా మహాయోగి విస్ఫురన్నేత్రములతో సభను బరిశీలించి.

ఆకర్ణాంత విశాల నేత్రముల రోహాత్ జ్ఞానదృష్టిచ్ఛటల్
సాకారాగమ శాస్త్రభేదములుగా సవ్యాపసవ్యంబులై
ప్రాకన్ ద్రష్టల ఫాలభాగములపై, వారాశినిర్ఘోషతో
డీకొన్నట్టి రవంబుతోఁ బలికెఁ, బాండిత్యంబు కొండెక్కఁగన్.

పుట్టలోఁ బుట్టువై పూర్వకావ్యాగమ
ప్రతిభావిశేష వర్షమ్ము కురిసెఁ
వ్యాసుఁడై వచియించె పంచమ వేదము
భాగవతార్థ సంపదలఁ బఱపె
ద్వైపాయనుండయి వివిధపురాణాంత
రార్థముల్ పోసెను రాశిగాఁగ
గీతార్థసారము కృష్ణుఁడై వెదఁజల్లె
పేర్చె ధర్మములన్ని భీష్ముఁ డగుచు
శంకరాచార్యుఁడై సర్వ వేదాంత మం
దరమాచుఁ బీయూషధారఁ బంచె

కవికులాగ్రణి యగుచు సత్కావ్యమేఘ
గర్భమునుండి యందించెఁ గ్రమసుధలఁ
బాఁపఁదొరయాచుఁ బండిన భారతీయ
సంస్కృతిన్ గ్రుమ్మరించె సంసత్తునందు.

కారణమైనవాఁడు కలకాల మభంగురశక్తియై జగత్
భారము మోయువాఁడు, అఖిలభావనుఁడా పరమాత్మ యొక్కఁడే.

దారమునందుఁబూసల విధంబున సర్వము వానియందునన్
మేరనుమీఱకుం డతఁడు మిత్తికిమిత్తి పరాత్పరుండగున్.

దేహమనిత్య మయ్యది విదీర్ణ పురాతన కంచుకాభమా
దేహి యసక్తుఁడై విడిచి తీఱెనకంచుక మన్యమెట్లు ని
ర్వాహితమున్ బొనర్చు, నటె బ్రహ్మము దేహములాశ్రయించు. నీ
యూహ యథార్థ, మాత్మము,మహోన్నత మవ్యయ నిత్య సత్యమా.

నిత్యమైనపరము సత్యమైయుండుట,
దానికొఱకు సర్వదా తపస్సు
చేయవలయు సర్వజీవు, లనిత్య మై
హికముకొఱకుఁ జేయ నేల? కృషిని.

సర్వలోకాలు సుఖముగా సాఁగుగాక
ప్రజలలో నైక్యధర్మ భావమ్ము లమరి
మూఁడు పూవుల నెస గిరుమూఁడుపండ్ల.
రక్షితమ్మైన ధర్మ మే రక్షచేయు.

అని ముగించెను బరమహంసాత్మ శిష్యుఁ
డా సభాంగణమంత మోహంబునందు
మునిగితేఱదు గడియసె, పొక్కవక్త్ర
తక్క, మాక్షిక మద్యముఁ ద్రావినట్లు.

రెండు నిమేషముల్ గడుపు రెండు దినంబులకున్ గమించె నె
వ్వండును "గాదుకూడ" దని వాదన చేయఁడు. చిత్రమూర్తులై
నిండినగుండెలంది శ్రవణేంద్రియదత్త మనఃప్రవృత్తులై
యుండిరి శ్రోతలందఱును ద్యోరసమానిన చాతకంబులై.

కరకలు కారుమేఘముల కంఠతలంబునువీడి, భూమిపై
నుఱుముల దూకినట్లు, శిఖరోదిత శైలఝురమ్ము రాళ్లపైఁ

బరుగులు తీసినట్లుగను వారిధి తుంగతరంగ మాలికో
ద్ధుర నినదాకృతిన్ ముగిసె, దుందుభిమ్రోఁతల యోగివాణియున్.

మంత్రబద్ధభుజంగంబు మాద్రి, ధవళ
వర్గములవారి నాకట్టి పరమహంస
మఠనివాసులఁజేసె నమ్మాన్యవరుఁడు
పెద్దపులియైన యోగులవద్దజింకె.

అట్లు నిరంతరాయత వియద్ధునిఁబోలిన వాగ్ఝరంబులన్
గట్లనుబెట్టినట్లు కలకాలము నిల్పి మఠంబులెన్నొపై
చోట్లకుఁబెంచి భారతయశోవిభవమ్మును, హిందుధర్మమున్
గోట్లకునెత్తె నా పరమకోవిదరత్నము కీర్తికాయుఁడై.

అంతేవాసి వివేకుఁడా గురున కత్యంతేవాసియైయుండ నా
ప్రాంతంబందున నగ్రభాగమున విశ్వారాధ్యుఁడా రామకృ
ష్ణాంతర్వ్యాతము చిత్రమొక్కఁడు విరాజత్ఫాల మాభిత్తికన్
వింతల్గొల్పుచు వ్రేలుచుండును. జగద్విఖ్యాతవిఖ్యాతియై.

పరమహంసప్రక్క పరఁగుశారదవోలెఁ
బరమహంసప్రక్కఁ బరుగు శార
దాపురంధ్రి. వారు తమ శిష్యపద్యపైఁ
బూలవానకురియు లీలనుంద్రు.

గురువులన్నవారు గురువులా! మోక్షము
తెరువు, లఖిలయోగి పరమగురులు
ఒకఁడు తల్లిఁజూచు నొప్పుగాభార్యలో,
అంతజనము పుత్రు లనును నొకతె.

పవిత్రక్షేత్రములలోనికిఁబోయినప్లే యచ్చటకుఁగూడఁ బాదరక్షలను వదలి తలపాగలను దీసియే జనులు పోవుచుందురు. ఆ తమోహారునివలె నీ తమో హారుఁడును బూజనీయుఁడేగదా, ఆ ప్రక్కనేయున్న శ్రీదేవీ పాదముద్రలను గూడ దర్శనము చేసికొంటిమి.

ఆ ప్రక్కనే యొక పెద్ద గదియున్నది- అది శాంతికినిలయము- ఆధికి విలయము, అదియే వివేకానందస్వామి ధ్యానమందిరము- ప్రకృతిలో లీనమై యున్న పరమాత్మవలెనే ఆ స్తూపప్రాంగణములో (దొలిచూపునకందక యా మందిరాంతర్భాగముండును బోధచేతవినా చిత్‌పదార్థము జ్ఞేయము కానట్లు జ్ఞాతృ నిర్దేశము లేనిదే యా పుణ్యకందరము మనకందదు.

ఆ మందిరములోఁ జిఱుచీకటి యావరించియున్నది. దూరముగఁ జిఱు దీపమొకటి యున్నది. అది "మాయాకబళితం బ్రహ్మ" అను వేదాంత వాక్యము నకు దృష్టాంతము.

లోపలకు వెళ్ళగానే యా చీకటిలో మొదట నేమియుఁగనుపింపదు- క్రమ ముగా నా మందిరాంతర్భాగము స్పష్టాస్పష్టముగా గోచరించును- ఆ మందిరము శూన్యము- దానిలో భక్తులెందఱో ధ్యానముద్రలో మునిగియున్నారు. చీమచిటుక్కు మన్నను నక్కడఁ బ్రతిధ్వనింపకమానదు- ఆ శాంతి మందిరములో లభించు వరము ప్రశాంతి.ఆ మందిరము విజనమయ్యు విజనము. అంధకారబంధురమయ్యు తేజోవంతము. అదృశ్యమయ్యు విశేషదృశ్యము- ఆ మందిరము.

శ్రవణ బిలంబులన్ విద్రుచు సాగరభీకర ఘోర ఘోషలం
దు, విగత ఘోషమై, సకలదుర్మతవాత విచార దుర్గమ
ప్రవరమునై ప్రశాంతికి వరాలయమై, మును జీకటిల్లునై
చివరకు జ్ఞానగేహమయి చిన్మయమైః యది యొప్పుచుండెడున్.

బోధకబోధచేతఁ దెలివొందినచిత్తము, కండ్లువిప్పి దూ
రాధియునై క్రమంబున మహస్సును గాంచఁగఁగల్గినట్లె స
ర్వాధిక కాంతి యొండు, తిమిరంబునుజీల్చుచుఁ జూపఁగల్గె మా
కా ధర, దానసర్వము సుగమ్యము దృశ్యము వశ్యమైచనెన్.

నోళులవేసితాళముల, న్యూనతనిచ్చెడు దుష్టభాష లే
వేళను జేయరెవ్వరట, వీఱిడిచెయ్వులఁ జేయనెంచు నే
కూళయుఁగానరాఁడచటఁ, గూరిమి భక్తియు శాంతి సామ్యతల్
ప్రేళులనాట్యముల్ సలుపు. రేబవలాక్కడ తన్మరంబునన్.

ఏమిమహాత్త్వమో తెలియదింతకు సర్వులు మందిరమ్ములో
నేమియు మాటలాడక యదృశ్యుఁ డమేయుఁ డనంతుఁడౌ పరం
ధామ పదాబ్జధాములయి, దైహికబంధమువీడి యోగులా!
యేమి ? యనంగనుండి. రిది భృంగకకీటకరీతియాగదా.

అచటి యీ సన్నివేశమునందుఁ గలదు
తొలి నరేంద్రుని యజ్ఞానదోషలవము
మలి వివేకుని జ్ఞానవన్మహితదీప్తి
కానఁబట్టును, బుద్ధివికాసమున్న.

"సాధనముచేత నంతయు సాధ్యమగును
నోర్పు నేర్పును గూర్పు తీర్పున్న యెడల"
ననెడు సత్యము నా మందిరాంతరమ్మఁ
గలవు నాగంతుకులకు నాదరముతోడ.

యథాకాలము యథాశక్తి కన్యాకుమార్యగ్రమును దర్శించి యటనుండి ది. 11-10-84 రాత్రి శుచీంద్రము- బయలుదేరితిమి.

## శుచీంద్రము

శ్లో॥ నమోఽస్తు వాగీశ హరీశ్వరాయ - నాగేంద్రచాపాయ
నదీధరాయ
నామ్నా శుచీంద్రేతిచ సంస్తుతాయ-జ్ఞానాటవీశాయ
నమశ్శివాయ

అని ప్రసిద్ధి వహించిన క్షేత్రము శుచీంద్రము. అనంతశయనము తరువాత నిదియే యా దేశములోఁ బెద్ద క్షేత్రము- ఈ క్షేత్రమునకుఁ బ్రక్కఁగా "పళయార్" అనునది ప్రవహించుచున్నది.

శుచీంద్రము కన్యాకుమారికి 40 కిలోమీటర్ల దూరములోనున్నది. పరమేశ్వరుఁడు కన్యాకుమారి కరగ్రహణముచేయు నవకాశము లేక విసిగి తిరిగిపోవుచు శుచీంద్రములో నాగిపోయినాడట- అది మొదలా స్థలము పుణ్యక్షేత్రమైనదఁట.

'శుచి' యనగాఁ బవిత్రమైనది (ప్రదేశము) యనియర్థము 'ఇంద్ర' మనగా శ్రేష్ఠమైనది- 'శుచీంద్ర మనగా' శుచిమత్సు (ప్రదేశేశేషు) ఇంద్రం= శ్రేష్ఠం- అని విగ్రహము- అనగాఁ బవిత్రవంతములైన క్షేత్రములలో నగ్ర గణ్య మని ఫలితార్థము.

ఈ క్షేత్రములోనున్న దేవాలయములలో స్థానేశ్వరాలయము గొప్పది- స్థానేశ్వరస్వామి బ్రహ్మచారి- కన్యాకుమారి లభింపక పోవుటచేత విరక్తిఁజేందిన శివుడు ఈ క్షేత్రములో స్థానేశ్వర నామముతో బ్రహ్మచారిగా నిలిచిపోయినాఁడు. ఈ యాలయమతిప్రాచీనము- అతి విశాలము- ఈ యాలయము మొదటిప్రాకారము పై ఏడంతస్తుల గోపురమున్నది- అది ప్రాచీనమైనదైనను నాకర్షణీయముగా నే యుండును.

ఇంద్రుఁడొకప్పుడు మహాపాపముచేసి ఆ పాపపరిహారమునకై శచీసహితుఁడై యాక్షేత్రములోఁదపస్సుచేసి పాప విముక్తుడైనాడట- అనంతరము పాక శాసనుఁడు శచీ సహితుఁడై స్థానేశ్వరు నారాధించుచు నచ్చటనే యున్నాడట అందువలన నాక్షేత్రమునకు "శచీంద్ర" మనికూడ పేరువచ్చినది.

శచీచ ఇంద్రశ్చ = శచీంద్రౌ, తయోః ఇదం = నివాస స్థలం = శచీంద్రం అని విగ్రహార్థము.

ప్రత్యహము సురేంద్రుఁడు శచీసహితుఁడై వచ్చి స్థానేశ్వరు నారాధించి పోవునని యచ్చటి యర్చకులకథనము- అర్చకులుచేసిన పూజాకుసుమముల స్థానములో నూతనకుసుమములుండుటయే యందులకు దృష్టాంతమఁట- లోపలకు వెళ్ళినవారు లోపలనేమి జరిగినది బయటకు వచ్చినతరువాత నెవ్వరితోను జేప్పఁ గూడదఁట. చెప్పిన ఆపదలు కలుగునట- అది యక్కడి నియమము.

శుచీంద్రమునకు మఱియొక ప్రత్యేకత కూడ నున్నది. ఆ ప్రదేశమందే పూర్వ మత్రిమహర్షి యాశ్రమ ముండెడిది అత్రిమహర్షి భార్యయే మహాపతివ్రత యైనయనసూయాదేవి- అత్రిమహర్షి సప్తర్షులలో నొకడు.

అచ్చట మూడుయ్యాలలున్నవి- వానిలో బాల్యాది దశాదూరులు ముగ్గురు మూర్తులు అర్భకులై యూఁగుచున్నారు. వారి బోసినవ్వు వెన్నెల లాప్రాంతమునకు నింతసోయగమునిచ్చును.

చెఱుప సతీత్వమున్ ( జిలిపిచేష్టలఁజేయు త్రిమూర్తులన్ సతీ
వరపరశక్తిచేతఁ బసిబాలురఁజేసిన యత్రిదార మం
దిరమున నూయలూఁగు భువనేశుల నిర్మలభావనేశులన్
బరములఁగాంచితిన్ గపటనాటకచాలకసూత్రధారులన్.

అనసూయాదేవి సృష్టిస్థితిలయ వ్యాపారములు ప్రవర్తిల్లుటకై దేవతల చేతను, బసుపు కుంకుమలను నిలుపుకొనుటకై సరస్వతీ లక్ష్మీ పార్వతులచేతను ప్రార్థింపఁబడి తిరిగి యా పసిపిల్లలను త్రిమూర్తులనుగా మార్చినది. అనసూయ పాతివ్రత్యమున కబ్బురపడి త్రిమూర్తులామెను వర మొకటి కోరుకొనుమనిరి. అపుడా సాధ్వి "మహాత్ములారా మీముగ్గురయంశలతో నాకొక పుత్రునిఁ బ్రసాదింపు" డనికోరినది. త్రిమూర్తులామెకుఁ దమయంశలతో నొకపుత్రునిచ్చిరి. ఆతఁడే దత్తాత్రేయుఁడు అత్రేః అపత్యం ఆత్రేయః. (త్రిమూర్తిభిః.) దత్తశ్చా సౌ ఆత్రేయశ్చదత్తాత్రేయః. అనగా త్రిమూర్తులచేతనీయఁబడిన యత్రి మహర్షి యొక్క కుమారుఁడని భావము.

దత్తాత్రేయునకు శరీరమొకటి. తలలు మాత్రము మూడు. ఆ మూడు శిరస్సులు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు.

మూర్తిత్రయ మొకచోటనే యేకరూపముఁదాల్చి మూడు శిరస్సులతో నుండుట యపూర్వము.

గేహము లేదు బ్రహ్మకు, ఖగేశ్వర శర్వుల కెల్లచోట్ల ని
ర్వాహితముల్ గృహంబులు, మురారిపురారులవైన వేఱుగా
నే హవణింత్రు దేవళము లెన్నియొ. ముగ్గుర నొక్కరూపుతో
నీహలు చేయుటేయరిది. యియ్యదపూర్వము భారతావనిన్.

దత్తాత్రేయ రూపమునకు "ధర్మసంవర్ధన" మని మఱియొకనామమున్నది. అనగా. ధర్మం = అద్వైత రూపం సిద్ధాంతం (ఏకోనారాయణోహరిః ఇతిరూపం) సమ్యక్ వర్ధయతి వ్యాపయతి (త్రిసుషుమూర్తిషు ఏకత్వరూపేణ) ఇతి ధర్మ సంవర్ధనమ్. అనగా త్రిమూర్తులభిన్నత్వములో నభిన్నత్వమును సాధించి యద్వైత ధర్మమును వ్యాపింపఁజేయునది యని పిండితార్థము.

అక్కడకుఁ గొంచెముదూరములో- జానకీపతి పాదారవిందమధుపము పల్వలీకృతసాగరము భక్తలోకమందారము ఆంజనేయాఖ్యము మహోన్నత విగ్రహమొకటి దర్శనమిచ్చినది.

అచ్చటికావలన్ విజయమందెను మారుతి, యూర్ధ్వదేహుఁడై
విచ్చిన నేత్రపద్మపదవీ సర దచ్ఛ దయా ప్రపూర్ణుఁడై
వచ్చిన భక్తసంతులపాలిటి కల్పలతా ప్రసూనమై
నిచ్చఁ బ్రసన్నమూర్తియయి నెమ్మది నిండిన రామచంద్రుఁడై.

తాళప్రమాణ మూర్తియైన యాస్వామిమీద భక్తులు వెన్నముద్దలను వేయుదురు. ఆ ప్రాంతమువారికి వెన్న చాలా యిష్టమైన పదార్థము- సహజముగా వెన్న సాత్వికము బలకరమునైన యాహారముగదా- అందువలన వారు దేవతా నైవేద్యములందు వెన్నను విధిగా ఉపయోగింతురు- అందులకై యచ్చటఁ బ్రత్యేకముగా వెన్నముద్దల వ్యాపారము చేయఁబడుచుండును- వెన్నముద్దలతో నిండిన యాస్వామి విగ్రహము.

అంజనాద్రిపైన హత్తిన బూఁదీవ
వితెయఁబూచి దరుల నొఱసినట్లు,
కారుమొయిలుపైనఁ గ్రమ్మినచంచలా
వలయచయమువోలె నలరుచుండె.

ఇంకొకచోట గరుడాళ్వారు పక్షముల నుత్క్షిప్తములఁజేసె దుష్టశిక్షణకుద్యోగించుచున్నాఁడు.

నిశితదృష్టుల, నున్నతవిశిఖ నాసి
కాగ్ర విచ్ఛిన్న భుజగసంఘాతములను,
సర్వధరు ధారణాచణ సారదేహ
పాటవమ్మునఁ, దార్క్ష్యుఁ డుపాస్యుఁడయ్యె.

ఆ గరుడుని మీదను నాప్రక్కనేయున్న వృషభేంద్రుని మీదఁగూడ వెన్నముద్దల వేయుచుందురు- అదియక్కడి సంప్రదాయము.

శుచీంద్రక్షేత్రమును దర్శించి యచ్చటినుండి మా నిర్జీవప్రాణి (బస్సు) **11-10-84** రాత్రి **2** గంటలకు తిరునల్వేలి క్షేత్రము నకభిముఖుఁడైనాఁడు.

# తిరునల్వేలి

12-10-84 ఉదయమునకు మేము తిరునల్వేలి చేరితిమి. తిరునల్వేలిని దమిళతములో "తెన్నెవెల్లి" యందురు.

తిరునల్వేలి జిల్లాకేంద్రము. సుమారు 70 వేల జనాభా కలది. ఈ నగరము సుప్రసిద్ధమైన తామ్రపర్ణీ నదీతీరమున నున్నది.

తామ్రాణి పర్ణాని యస్యాంసా తామ్రపర్ణీ- అనగా యెఱ్ఱని ఆకులు గలది. ఆ నదీప్రవాహము రజోమిశ్రితమై ప్రవహించుచుండుటచే నందున్న తీగలు ఆకులు గూడ ఎఱ్ఱనివిగాఁగన్పించుచుండును- అందువలన నానది కానామము వచ్చినది లేక తామ్రపర్ణో నామ ఓషధీవిశేషః తస్య సంసర్గవత్వాత్ తామ్రపర్ణీ. అనది కొండల మీద "తామ్రపర్ణము"లను నోషధుల సంసర్గము కలిగి ప్రవహించుటచేతను, నా పేరు వచ్చియుండవచ్చును.

ఓషధి తీరగుల్మ ముల సుద్భవమంది ధరాభృదంకమున్
పోషక పూజ్యమూర్తివిడి, భూమిసతీ హృదయంబుపైన ని
ర్ఘోషము జాలువారి, ధరకుక్షి ఫలింపఁగ జీవనమ్ము ని
ర్దోషమునిచ్చు, నర్ణవవధూమణిఁగంటెనిఁ దామ్రపర్ణినిన్.

ఇత్తడి రేకును సోఁకునఁ
బుత్తడిగామార్చుశక్తిఁ బొందితివమ్మా !
ఉత్తమవు తామ్రపర్ణీ !
హత్తెనొకో ఘరుసవేది హస్తములందున్.

ఈ పట్టణ మధ్యమున "నెల్లెంయప్పార్" స్వామిదేవాలయమున్నది. ఈ యాలయము పెద్దదే- చక్కని శిల్పమున్నది- వేయిసంభముల మండపము సంగీత స్తంభములు నిచ్చటనున్నవి. ఆ మండమున నున్నవి యెనిమిదివందల స్తంభములే- అయినను "ఈషద్వైషమ్యం అవివక్షిత" అనున్యాయముచే నది సహస్ర స్తంభమంటపముగానే వ్యవహరింపబడుచున్నది.

ఈ యాలయము శిథిలావస్థలో నుండగా విశ్వనాథ నామకుఁడు దీని పునర్ని ర్మాణము చేయించెనఁట- విశ్వనాథ నాయకుఁడన్న నెవరనుకొన్నారు ? తెలుఁగు జ్యోతికిఁ దైలమర్పించినవాఁడు. మాన్యచరిత్ర యథావసర కథనీయముకదా !

ముప్పునఁ గోర్కెవాగురకు ముద్దఁగఁజిక్కి స్వదేశమాతకున్
ముప్పునుదెచ్చు నా పరమ మూర్ఖుఁడు నాగమనాయుఁ దట్టి యా
తప్పరి వెన్నుగోర్కుఁ బెడదారినిఁబట్టినవానిఁ దండ్రినిన్
దిప్పలుపెట్టి పట్టి ప్రభుదీవనలందిన దేశభక్తుఁడా!

తెలుఁగులవీర! ప్రేగు తరితీపులఁ ద్రెంచియుఁ గన్నతల్లి గుం
డెలఁ బెను మంటరేఁపి చని డీకొని నీవె నినున్ రణంబులో
పలి ఫలితంబు రాజు వద పద్మము ముందర ధారవోయు నీ
వలె నొకఁడుండెనా! భరతవంశమునందునఁ గర్మవీరుఁడా!

రాజు ముదల రాజ్యరమణిని గ్రహియించి
రమణినగవులోన రాయలయ్యె
పేరుముంచినట్టి ధీరుఁడఁ! నీపేరు
మొలకచెడదు తెలుఁగుపొలములందు.

పెరిగెడు దేహమందుఁగల వెచ్చని నెత్తురుటేరుచాలులోఁ
బెరిగిన దేశభక్తి కనువిచ్చెను, దెచ్చెసు దెల్గుతల్లికిన్
దఱుఁగనికీర్తి సంపదల, త్వాదృశుఁడొక్కఁడు నేఁడు కల్గినన్
దొరతనమిల్లు తొత్తుగునె? దోపిడి హెచ్చునె? విశ్వనాథుఁడా.

ఇట్లు మన తెలుఁగు బిడ్డని గడుఋకు తనంబును సంస్మరించితిని.

అచ్చటికిఁగొంతదూరములో మఱియొక దేవాలయమున్నది. ఆదేవునిపేరు ఎల్లయప్ప యనగా ఎల్ల+అప్ప, సర్వజగన్నాథుఁడని యర్థము. ఆయన దేవేరి కాంతిమతి. ఆ ప్రక్కనే ధవళమూర్తి యనంతస్వామి యున్నాఁడు.

మహాదేవుని కెదురుగ నందికేశ్వరుఁడున్నాఁడు. ఆతఁడు పరమేశ్వరుని విడిచి యుండలేక నందిరూపమున నక్కడవసించిన కైలాసపర్వతమువలె నున్నాఁడు

బూడిదపూఁతగాని పొడవున్ సతతమ్మును మోయుచుంట నా
బూడిదయంటి మేనిపయిఁ బొచ్చెముతాఁకని వెల్లవర్ణ మా

కోడెకునంటెనా ? యువముకొండను గోడిగ చేష్టసేయ నా
పాడిమియంటెనా ? యనఁగఁ బొల్పరు నావృషభేంద్రుఁడచ్చటన్.

అచటి గోడలపైన భారతదేశప్రసిద్ధ దేవతామూర్తులన్నియు నద్భుతముగఁ జిత్రింపఁబడినవి. ఆ సర్వ దేవతా చిత్రసృష్టి సజీవ సర్వకళా రహస్యసమష్టి.

కానియుఁ గర్చుచేయకయ కాలుకదల్పక లేకకష్టముల్
మేనులఁదాల్చి కోరు వరమీయఁగవచ్చిన యట్లే యున్న యీ
చానల బొమ్మలన్ విబుధసారసనేత్రల నొక్కచోటనే
కానగవచ్చు, నీకలియుగంబున నయ్యదె సూక్ష్మమోక్షమా.

ఆ ప్రాంతములో దేవాలయము లనేకమున్నవి. ఎవరికైనను నెప్పుడో యొకప్పుడు జరాశైథిల్యము తప్పదుగదా. ఇపుడాదేవాలయమునకు జర ప్రాప్తించినది.

## వైకుంఠపురము

"వైకుంఠపురము" ఒక పుణ్యక్షేత్రము. 12-10-84న మేమచ్చటకుఁ జేరితిమి. అచట దేవుఁడు వైకుంఠనాధుఁడు. దేవత వైకుంఠవల్లి. ఈ స్వామికిఁ గూడఁ దామ్రపర్ణి విహార దీర్ఘికగానే యమరియున్నది. ఈ నదిలో ముత్యములు పండును. ఈ కూలంకష సముద్రలోఁగలియును.

నీకు జనించు ముక్తములనేకము, కావున ముక్తగర్భగాఁ
బ్రాకట నామమున్ బడయు రాణివి ధన్యవు తామ్రపర్ణి ! ర
త్నాకర పత్ని వౌచు రతనాలకుఁగంటివి. రత్నహారా కీర్తికా
నీకముఁగన్నతల్లి ! మహనీయము నీసుచరిత్ర పావనీ.

వధుపును వరుఁడును నుత్తమ
పథగమనులైన వారివంశముకూనల్
ప్రథితినిఁబొందవె ? కావున
విధిగా సంస్కార మహిమ వెలుఁగును జంటల్.

ఇచట వైకుంఠనాథుఁడు రజతశేషతల్పముపై శయనించియున్నాడు.

ఈ దేవాలయముగూడ చాల ప్రాచీనమే, ఇక్కడఁ జైత్రమాసములోఁ బదిరోజులు బ్రహ్మోత్సవములు చేయుదురు- ఐదవరోజున వైదుగగరుడసేవలను జేయుదురు. అది యత్యంతదర్శనీయము.

ఈ దేవాలయముకూడ శతాబ్దముల చరిత్రకు సాక్షీ భూతము. మనప్పాడి రాజా యను ప్రభువీయాలయమును 4000 వేల సంవత్సరములకుఁ బూర్వము కట్టించెనని ప్రతీతి- ఇచ్చట ఇతర దాక్షిణాత్య దేవాలయాములదృష్ట్యా శిల్పము తక్కువయే.

అక్కడ నొక యద్భుత శిల్పమున్నది. అది యేకశిలా స్థగితము ఒక యేనుగు- దానిపై సింహము- ఆ సింహము నోటిలోఁ గ్రిందనున్న యేనుగు యొక్కతుండ కుంభములు- ఆ సింహముపై నొక యేనుఁగు- దానిపై మఱియొక భీకరహర్యక్షము- దాని యుత్తమాంగముపై మండపము. ఆ సన్నివేశము- ఒక సందేశమిచ్చుచున్నది.

ఒకనినిమించువాఁ డొకఁడుండు భువిలోన
నొకఁడె సర్వాధికుం డుండఁబోఁడు
శ్రీనివాసుఁడు తప్ప, చెడ్డకాలమునందుఁ
దనక్రిందవాఁడెక్కుఁ దనశిరస్సు
చేత ధర్మములున్నఁ జెడినవాఁడే పునః
వృద్ధిఁగాంచును గాలరీతి యిదియె
ఎంతవాఁడైన సర్వాంతరాత్మకులోఁగి
యతని యాశ్రయమందె బ్రతుకవలయు
ప్రకృతి పురుషుఁడు బ్రహ్మయుఁ బ్రబలమైన
కాలఫలకమునందె యోగంబుఁగంద్రు
విడిగఁజూచిన వారు వేత్త్వారు, కలియ
నొక్కరంచును శిల్పమునొక్కిచెప్పె.
వైకుంఠపురము ప్రాఁతది
నాకంచును వీడి దాని నలినాక్షుఁడు గొ

ణాకృతి నిటను వసించుట
వైకుంఠ ఖ్యాతి పురికివచ్చినదేమో.

ఇట్లు ఆ వైకుంఠేశ్వరుని దర్శనము చేసికొని చరితార్థులమై యటనుండి బయలుదేరి మఱుసటి మజలి నమ్మాళ్వార్ తిరునగరములోఁ జేయనెంచితిమి.

## నమ్మాళ్వార్ తిరునగరము

ఇదియొక వైష్ణవ పుణ్యక్షేత్రము. ఇదియుఁదామ్రపర్ణీ తీరముననేయున్నది. అళ్వారనగా మతాచార్యుఁడు- ఈ ప్రదేశమున పన్నెండ్రుమంది మతాచార్యులు, ధర్మప్రచారముచేసిరట వారిలో "నమ్మాళ్వార్" ప్రసిద్ధుఁడు, ఆయనకక్కడ గొప్ప దేవాలయమున్నది– ఆయనపేరే నగరమునకు వచ్చినది.

ఈ దేవాలయము ప్రాకారత్రయ పరివేష్టితము. ఆలయమునకు వెనుక పెద్దది ప్రాచీనమైనది అయిన నొకచింతచెట్టునున్నది. నమ్మాళ్వార్ ఆ చెట్టు తొఱ్ఱలోఁ బన్నెండు సంవత్సరములు తపస్సుచేసి తమిళవేదమును బద్యరూపమున రచించెనట.

ఆ వృక్షము దిగంత విశ్రాంత శాఖలు కలిగి తన అత్యంత ప్రాచీనత్వమును బ్రకటించుచున్నది. దాని యాకులు తక్కిన చింతచెట్ల యాకులవలెగాక రాత్రులందు గూడ ముడుచుకొనవు- దాని కాయలు పండవు.

ఆ చెట్టు బెరడును నాకులను బ్రసాదముగా భక్తులకిచ్చుచుందురు. నిరంతర ప్రసాదవినిమయ చర్మ పత్రములుగల యా వృక్షము.

పూలన్ జందన చర్చలన్ మునిఁగి రూపున్మాపుకొన్నట్టి యా
లీలా మానుష విగ్రహుండు తనమాలిన్యమ్ము నిర్మాల్యమున్
గేలన్దీయఁగ నంతశుద్ధుఁడగు, శుక్తిన్ బీడు ముత్యంబు, రా
కాలంకార మృగాంకుఁడై. దనరు వృక్షంబల్లై నిష్కృత్తియై.

ఈ భావము దైవికము- ఒక లౌకిక భావమునుగూడ నా తరుపు సూచించుచున్నది.

ఆకులు లేక కీడ్పడిన యీతరువప్పుడయొప్పె నీడుచే,
సోఁకిన వ్యాధిచేతఁ దనచూడ సమస్తము రాలిపోవ మో

ఘీకృత మస్తకుండగుట ఖేదమునందినవ్యక్తివోలె స
ర్వాకృతి పోషకంబులగు బంధుర కుంతల నీలవర్ణముల్.

ఆ చెట్టుకొమ్మ నఱికిన నెత్తురువచ్చెడిదఁట. అనగా నది వృక్షాకృతిలో నున్న యోగియన్నమాట. కాకున్న స్థావరమున జంగమస్థితి యెట్లుండును? గుడిలో నమ్మాళ్వారి విగ్రహము దానికిఁ బ్రక్కనఁ దక్కిన యాళ్వారుల విగ్రహములున్నవి.

పచ్చికొబ్బరి చిప్పల ప్రమిదలందు
దీపములనిల్పి యచ్చట దేవతార్చ
నమ్ము చేయుట పరిపాటి. నాల్గుదెసలఁ
గానఁబడ దీవిధంబు జగంబునందు.

అచ్చటినుంచి మా బస్సు తిరుచ్చందూరునకభిముఖమైనది.

## తిరుచ్చందూర్

తిరుచ్చందూర్ పెద్ద పట్టణము, ఇది సముద్ర తీరముననున్నది. ఈ ప్రదేశము ప్రకృతి రమణీయము.

ఇచ్చట సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవాలయమున్నది. అది వేయి సంవత్సరములకుఁ బూర్వమే కట్టఁబడినట్లు శాసనాధారములున్నవి. ఈ యాలయము చాల ప్రసిద్ధము, ఇందున్న శిల్పలక్ష్మి చిదంబర శిల్పలక్ష్మికిఁ దోఁబుట్టువువలె నుండును. ఈ యాలయము తూర్పు ప్రాకారమును సరిత్పతి నిరంతరము పరిశుభ్రముచేయుచుండును.

ఈ చైత్య మంటప మతివిశాలము. ఉపసహస్ర స్తంభవిరాజమానము. మండపాంతర్భాగమంతయు నద్భుత శిల్ప భూషితము

ఆలయములో సుబ్రహ్మణ్యేశ్వరస్వామి శివార్చనారతుఁడైన యువకుని వలెనుండి ఒక చేత జపమాలను మఱియొక చేతఁబుష్పమును ధరించియుండును. అట్టి యా స్వామి.

నిరతము నాత్మ నింపుకొను నిర్మల దివ్యతపః ప్రభావ భా
సురతకు నక్షమాల యొక సుందర చిహ్నము. నైజ భక్తులం

దతిపయిఁ జూపు ప్రేమకు నిదానము పుష్పము కాఁగ, భక్తిని
ర్భరవిధి బోధసేయ గల భాగవతేశ్వరు లీలఁగన్పడెన్.

స్కందుఁడనఁగాఁ గుమారస్వామి- ఆ స్వామి లోక రక్షణార్థ మీ స్థల మునఁ దారకుని సంహరించెనని స్థల పురాణ కథనము- అందువలన నిచ్చట నేర్పడిన గ్రామమునకుఁదొలుత "స్కందూర్" అను పేరు వచ్చినది- గ్రామ నామములు, అన్య భాషాపదాంతములందుఁజేరు సంప్రదాయమున్నది గదా యథా- తిరుచునాపల్లి.

వర్ణ లోపాగమాదేశ వ్యత్యయాదుల ద్వారా పదము రూపాంతరముఁ బొందు సంప్రదాయమున్నదికదా- దానిని బట్టి- స్కందూర్- చందూర్ అయినది- పిమ్మట పూజ్య వాచకమైన 'తిరు' చేరగా తిరుచ్చందూర్ అయినది. యథా తిరుపతి- స్థలప్రశంస వచ్చినవుడు తత్సంబంధ కథను జెప్పుట పురాణ సంప్ర దాయముకదా! అందువలనఁగుమార కథను సంక్షిప్తముగా వ్రాయుదును.

తారకుఁడన్మహాసురుఁడు తామరసాసన దత్తమైన దు
ర్వారవరానుభావమున వ్రాలి త్రిలోకము లేలుచుండు ని
ర్వైరముఁజేసి సర్వ పృథివీతల, మాడినదాట పాటగా
నేరములెన్నొ చేయుచు ననీదృశ దుష్టపథప్రచారుఁడై.

వాని దురత్యయమ్ములకు వాని మహోగ్ర కుకర్మ వాహినీ
మీన తిమింగిలాహతికి మృత్యువు పజ్జనె యున్నయట్లై, నీ
రానని నిర్మమేషముల యట్లుగఁ, దల్లడమందుచుండి, రే
మౌనొ జగమ్ము రక్కసు నహంకృతికిన్ బలియై క్షణంబులో.

మంగలమ్మునందు మలమల మాడెడు
వడ్లగింజలట్లు, వడలిపోయి
రెల్లవారు. ధరణి, యీ బాధపడలేక
వనజభవుని మ్రోలఁ బడి వచించె.

మంచినిఁ జెడ్డలన్, మనెడి మానిసిమోముల ముందె వ్రాయు నో
యంచతురంగ! తారకుని యాగడముల్ సహియింప నోప, నా

వంచకు దుర్నయం బెపుడు భంగురమౌను? వరంబులిచ్చి యా
క్రించును బెద్దఁజేసితివి. కీడ్పడకీ జగ మెట్లు నిల్చెడున్.

చేసిన దోసగులనున్ సరి
చేసికొనుటె గొప్పవారి చేవయగును న
బ్జాసన! వానిని దునుమం
గా సమయము వచ్చె లెమ్ము కావుము మమ్మున్.

అని మొఱపెట్టెడు భూసతి
ననునయమునఁ బల్కె ధాత అబ్జాక్షీ! మహా
దనుజుఁడు వీఁ డని దునియడు
ననువంటి విధాతవలన నలినాక్షునిచే.

అని మొన వీని మార్కొనఁగ నైశ్వర తేజము తక్క యన్య మెం
దును గనుపింపఁబోదిపుడు ధూర్జటి యెక్కడె శీతశైలమం
దునఁ దపమాచరించుచును దుర్దమతేజుఁడు దుర్నిరీక్ష్యుఁడై
తన సతిఁ గోలుపోయిన వ్యథన్ నివసించు నబాహ్యదృష్టియై.

మంచుగుబ్బలి యింటిలో మణియనంగ
నొక్క కన్నియ పెరుఁగుచు నున్నదిపుడు
పడతి వన్నెలఁజిదుప దీపంబు లగును
నతివ యందము తొలిమూర్త మార్గశమ్ము.

ఈశుఁడు బ్రహ్మచారి. కుధరేశ్వరనందిని కన్య. తత్సమా
వేశము మారనిఘ్న, మది వేళమ కావలెఁ. దాతకావలెన్
శైశిరగాత్రుఁ, డంత నగజా తనుజాతుఁడు త్రాత కావలెన్
దేశము కెల్లఁ, దారక మదేభ శిరశ్చ్యుత ముక్త హారియై.

ధాత మాటకుఁ బ్రాణదానంబు చేసిరి
రాచిల్కరౌతు నోరారఁ బొగడి

విబుధు, లంత మరుండు వినుతుల బంతియై
ఎగిరి దూకెను మంచు నించు కొండ,
కందుక పతన సంక్రాంత రజోరాగ
ముమ్మైన భవునిపై నొరగి పడియె
సత్త్వంబుపై రజస్సత్త్వంబు పడుటకు
కినిసిన యభవుండు కీలకేల

బంతి గాలినిఁ దీయఁగాఁ బాడుపడెను
నదియుఁ, గాని రజమ్ము కాసంతయైన
శివుల మనముల వీడదు. చివరకదియె
ప్రబలమై వారి యెదలందుఁ బాదుకొనియె.

వాగు నురవడిఁబులకించు పర్వతమ్ము,
చపల చూపుల నీరగు జలదపటలి,
తీవ పెనవేయ భూజ ముద్రిక్త మగును,
తరుణి కఱఁగిన సృష్టియే కఱఁగి పఱచు.

ఖండేందు శేఖరుఁడు భూ
మండనమా నగజ ఆలుమగలై చెలఁగన్
బండె సుపర్వుల భూసతి
గుండెలు ముల్లహారి పొంగి కూలముదాటన్.

మూఁడు జగంబు లుద్ధత తమోహర తాండవనృత్య కేళికిన్
బోఁడిమి వీడి కీడ్పడియె, భూధర కన్యక భద్రకాళియై
ఆడెను, దాండవోద్ధత మహాద్భుత లాస్య ఝణంఝణధ్వనుల్
చేడియలై భవోద్ధతికి శ్రీకృతిచుట్టఁగ భర్తతోడుతన్.

పగళుల్ రాత్రులు పక్షముల్ ఋతువులున్ వర్షంబులున్ బార్వతీ
నగధన్వి ప్రణయంబునందు గడచెన్, గచ్ఛన్నిమేషంబులై

పగఁదీర్చెన్ వెఱవింటివాఁడు గరళ ప్రాంతంబునన్ దేనెలన్
దగఁబుట్టించుచు. నంతకాంతకుఁడు నీదన్ జాలునే? మోహమున్.

శ్రావణ మాసమందు ముదిరాంతరమందున నీరమట్లు, చై
త్రావసరమ్ములందు వలరాజు శరంబుల వాడి యట్లుగా,
భావము పల్చనై పఱచెఁ బార్వతియందుఁ బినాకపాణికిన్.
చేవలు నిల్చునే? మగువ చేరిన వేళల బ్రహ్మకేనియున్.

జ్వలనోదగ్ర మహా భయంకర శివస్ఫార స్ఖలద్వీర్య మా
యిలపై జాఱెను. భొందఁగాక విడిచెన్ హ్రీముగ్ధయై శైలరాట్
కులదీపంబగు నార్య. దేవతలు సాకుంగూర్చి సంతాన మా
జలజాతాక్షికిఁ గల్గనీని పరుసన్, సల్పన్ మహా యత్నముల్.

తనువు పండు వేళ ధర్మము నెంచక
యడ్డుపడిన నిర్జరాళిపైన
నలిగి కుధరసూతి "యనపత్యులై యుండు"
డనుచు శాపమిచ్చె నమరతతికి.

భద్రకాళి రుద్ర ముద్రలు కలిసిన
జనన మందు వాఁ డసాధ్యుఁ డగును
అతిని నొంప వాని యబ్బకుఁ బోలదు
కాన సుర లధర్మ గాము లయిరి.

జ్వలనమందున గాంగజలమందు శరవణ
భవన మందుండి యావల మహేశ
వీర్యము షట్కోణ వీరుఁడై రహించె.
దేవసేనానియై తేజరిల్లె
కొంచెగుబ్బలి వ్రక్కలించెను, దెసలన్ని
మాటఁగట్టెను నీదె మొదటి జలము

గండర గండఁడై కాల్దువ్వెఁ దారక
దుష్టరాక్షసు దుమ్ము దులిపివేయ
అర్గళము లేదు నా కని యదరి పడెడు
నసుర చెయిదోయిఁ దగిలించె నర్గళమ్ము
తల్లులార్గుర పాలను త్రాగియుంట
బలియుఁడై శూలిశక్తి సంపన్నుఁడగుచు.

పలలాశి దుస్తంత్ర భైరవకర్మకు
రక్షసూత్రముఁ గట్టెఁ గ్రౌంచభేది
కాచపాత్ర నిబద్ధ నీచపిశాచ తా
రకుఁడు పొంగెను నూపిరాడకునికి
మనుజ రక్తము త్రాగు దనుజ యూధమ్ము తోఁ
గదలి వచ్చెను వాఁడు కదన ధరకు
రాక్షస శిరముల అంపములన్ గోయ
వర తక్ష సేనఁ గపర్ది సుతుఁడు.

తరలి వచ్చెను. వారు భూధరము లనఁగఁ
బెల్లురేఁగిన మత్త ద్విపేంద్రములన
మదము త్రిప్పక పోరిరి. మహియు దివియు
నిండె శరములఁ, దమములు పండె దెసల.

ఆ తీవ్రాస్త్ర సముజ్జ్వలత్తపన సంవ్యాప్తాఽఖిలా శాంత రా
శాతిక్రాంత మహా విజృంభణ భయాయాసంబునన్ లోకముల్
జాతాతంకము లౌచుఁ గిమ్మనక యాశానాశ మగ్నంబులై
చేతంబుల్ గతి తప్ప నుండెను. గళత్ స్వేదార్ద్ర దేహంబులై.
ఆ ఘోరాహవ రక్త కర్దమధరా వ్యాకీర్ణ వారాశి హ
స్తౌఘంబుల్ సికతా స్థలంబులును సాహ్వ్యాధారముల్ షణ్ముఖా

మోఘప్రోద్ధత బాణ జాలములు, దుర్మోహాంధు రాక్రాంచరున్
మేఘాకారుని సంహరించు విధికిన్, మిన్నందు తత్కీర్తికిన్.

ఆ దివ్యస్థలశక్తి దుష్ట దనుజాహంకార నిర్వాపణ
ప్రాదుర్భూత జలౌఘమై, శివసుతోద్బాహు ప్రభా వర్ధక
త్వాఽదేయాధిక హేతువై నెగడె. పాపం బేరు మన్నింతురే?
నే దిష్టుండగు క్షుద్రు సజ్జనుఁడు బంధింపం బ్రయత్నింపడే.

అగ్గినేలు వాఁడు క్రమ్మగెను నగ్గిలో
నేలనేఁచువాఁడు నేలఁగలిసె
గాలినేలువాఁడు గాలిలోఁ దేలెను
నీరు కలఁచువాఁడు నీరుగాఱె
బాహులేయ కాల బాహు పంజరమున
నుక్కుఁదక్కినట్టి పక్కియగుచు.

దుష్టుడు తారకాసురుఁడు దుర్దమ ధూర్జటి పుత్రశక్తిచే
క్లిష్ట దశాలవాలుఁడయి కీడ్పడెఁ దొల్లిట. నట్టిభూమి సు
స్పష్ట పవిత్ర కీర్తి, యనిశంబు సమాగత భక్త సంఘ సం
వేష్టిత పుణ్యతీర్థమని, పృథ్విని సుస్థిరమయ్యె నేఁటికిన్.

స్కందుఁడు తారకుఁ బితృపతి
మందిరమున కతిథిఁ జేయు మాన్యస్థలమై
"చందూ" రను నామము జగ
మందున గడియించియుండు నాప్రాంత మొగిన్.

దేవాలయమునకు ముందు శిల్పకళా నిలయమైన యొక సమున్నత గోపుర మున్నది. ఆ క్షేత్రములో నపాంపతి యతి భీకరుఁడు. ఉత్క్షిప్త భీకరకరములతో హుంకరించుచుండును.

కనుగొనలేదు నేను దిరుగాడిన యాత్రలయందు నెక్కడన్,
వణకును బుట్టఁజేయు నటువంటి పయోనిధి భీషణోద్ధతిన్,

జనులను స్నానకాంక్షులను, సాగర భూతము, త్రోసి చేతులన్
వెనుకకు ముందు కూపి పడవేయును సైకత వేదులందునన్,

లేచి తానమాడ రేవున కేగగా
ఏఁచి నీటిరాశి తాఁచి విసరు
మునుక మాట దైవ మెఱుఁగు నెఱుఁగును
కాలు మోప భయము కడలిలోన.

తండ్రి రెచ్చిపోయి తనయుని పౌత్రిని
రెచ్చఁగొట్టి, మిగుల రెచ్చినట్టి
యూమెచేతఁ జేసె నాత్మ పౌత్రుని వృద్ధి
భూతముల కసాధ్య మున్నె! జగతి.

గాలికి లేచుచున్న యచటి యిసుకతుపానులు మరు భూములలో విజృంభించు విసుకతుపానుల జ్ఞప్తికిఁదెచ్చుచుండును.

స్నానమాడ తిరిగి సాగరతీరముఁ
జేరఁబోవఁ జూచి సింధురాజు
ఆెక్కఁబట్టి, లాగి ప్రక్కలఁ బడవైచి
నవ్వె నుఱుఁగు కాంతి నివ్వటిల్ల.
ధనమదాధికుండు తనవంటివాఁడేడి ?
యనుచు విఱ్ఱవీగి, యనడ నెత్తి
పైనఁ గాలిఁబెట్టి, పకపక నవ్వును
లేని వాని బాధ లీల ధనికి.

ఆ తీరములో సదాచరుఁడు సదాచరుఁడై నిరంకుశుఁడై సంచరించుచుండును. పైగా నాతఁడు రత్నాకరాశ్రయుఁడు గదా. ఇఁకవాని ధాటి కడ్డమేమి యుండును- వస్త్ర చోరుఁడన్నది యాధూర్తునకున్న యమోఘమైన బిరుదము- ఆ సముద్ర తీరమున వాని యాగడములు గడిలేనివి.

పైని బట్ట యెగుర బలమైన గాలికి
కట్టుకొన్న బట్ట పట్టుతప్పి
....

పుణ్యతీర్థమందుఁ బోకిరి పనిచేయు
గాలికన్న తుంట కలఁడె జగతి.

కడలి దౌష్ట్యమును సురగాలి దురుసుతనమును సహించి దైవదర్శనము చేసికొంటిమి. ధర్మస్థలలో వలెనే యిక్కడఁగూడఁబీచు తీసిన కొబ్బరికాయనే దైవమున కర్పింతురు.

శిఖను గలిగి యుంట శిష్టుల యాచార
మందువలన సశిఖమైన నారి
కేళ మిత్తురొకట. వేళమ యాపైన
శిఖను దీసికాని శివునకీడరు.

అర్పణంబువేళ సాంగము ముఖ్యము
భక్షణంబు వేళ వ్యర్థ మదియ
టంచు నిచట యట్టి యాచార ముండెనో
లేక యిట్టిరీతు లేల కలుగు.
"శివున కిచ్చు వేళ శిఖలేని ముక్కంటి
పండు కేల మొదట నుండుపీఁచు"
ననుచు నెంచి యచట నాదినే పీఁచును
దీసి యిచ్చుచుండ్రు దేవతలకు.

ఈ క్షేత్రములో భస్మము గంధము ఆకులలోఁబెట్టి భక్తులకిత్తురు. ఆ క్షేత్రములో బస్సువారు మాకొక యపరిశుభ్ర ప్రదేశములో బంతికుడుపు నేర్పాటు చేసినారు. "అగ్గిపుల్ల, కుక్కపిల్ల, చుట్టముక్క, యిటువంటివేవీ అనర్హములుకావు కవితకు" అని శ్రీశ్రీ చెప్పినట్లు యాత్రా పరులకు అందులో వ్యాపార దృష్టితో బస్సులు వేయువారికి, బసకుగాని, భోజనములకుగాని, అనర్హములుకావు యెటువంటి ప్రదేశములను అని బాహాటముగా చెప్పవచ్చును. అక్కడ నుండి మేము రామేశ్వరముఖమంటప సదృశమైన మంటపముఁ జేరఁబోయితిమి.

## మంటపము

మా పుష్పకము తిరుచ్చందూర్ నుండి బయలుదేరి గ్రుక్క త్రిప్పుకొనకుండ నాలుగంటలు ప్రయాణము చేసి 12-10-84 రాత్రి 7 గంటలకు మండపము

చేరినది- రామేశ్వర యాత్రికుల బస్సులన్నియు మండపములో నాగిపోవును- ఆవల మహా సముద్రము. ఆగక యేమి చేయఁగలవు.

మండపములో సింహళ ప్రభుత్వపుఁగార్యాలయమున్నది- అచటి యధి కారులవద్దనుండి యనుమతి పత్రము లభించినవారే సింహళమునకుఁబోవనర్హులు- మండపమునుండి రామేశ్వరము రైలుమీద పోవలయును.

ఆ మండపము, రామలింగేశ్వరస్వామి దేవాలయమునకు, మండపము వంటిది- దైవదర్శనమునకుఁ, బూర్వము- అనంతరము భక్తులు దేవాలయ మండపములోఁగొంత సేపుందురు. అట్లే రామేశ్వరదర్శనాభిలాషులు- రామేశ్వరము వెళ్ళునపుడు, వెళ్ళివచ్చినతరువాతఁ బ్రయాణానుకూల్యత కొఱకై మండపములో కొంత సేపాగుదురు- కావుననే మండపము రామేశ్వరాలయ మండపమైనది.

మండపము చిన్న స్టేషను- జనము విస్తారము- అచ్చట చోరభయ మధికము- నిద్రపోవుటకు వీలులేదు- రైలువచ్చుటకు చాల నాలస్యమున్నది- నిద్రపోకుండుట దుర్ఘటము. ఏమి చేయవలయును- అపుడు మేము.

అచ్ఛ భల్లము చెట్టుపై, నాదమఱచి,
నిద్రపోవుచు నొకకంట, నెల్ల దిశల
చూచుచున్నట్లు యొకకంట, వేచి యొకట,
లాతి గుర్కితి, మా శివరాత్రి నాఁడు.

ఆ రాత్రి మేము అవకాశాభావముచేత నిజముగా నిరాహారులమే- నిర్నిద్రు లమే- అందుచేతనే ఆరాత్రి మాకు శివరాత్రి యైనది. ని ద్రత్వ నిరాహార త్వములు శివరాత్రి దీక్షాంగములే కదా !

ఇంతలో ధూమశకటము వచ్చి యాగినది- అంతకు ముందు ఎంతో ఆప్యాయముగా మాట్లాడువారు బండిరాగానే యెవరికి వారుగా బండిదగ్గఱకుఁబరుగు లెత్తిరి- స్వార్థమునకు ధర్మము బలియగుచున్నదిగదా.

తుట్టెను దేనెయున్న రసధూర్వహమత్త మనస్కములై వెసన్
దృట్టును దీర్ప నేకమయి తెట్టువఁగట్టిన తేనెతిండు, లా
పట్టున తేనెవాయ విడి పాఱవె దిక్కున కొక్కటౌచుఁ. గూ
పెట్టినఁ బల్కునే జనుఁడు, పృథ్విని స్వార్థములేని యచ్చటన్.

లోకము సాంప్రదాయమిది, లోతుగఁ జూచినఁ దేట తెల్లౌ, మే
వో కలుషార్థ సిద్ధులను బొందఁగ నైక్యత నావహించి మి
త్రాకృతినుండి యర్థము ముందంబున నంది యనంతరంబు వే
ఱై కడకొక్క మాటయును నాడక చూడక పోవుచుండుటల్.

మనసు మఱుఁగున నైజమ్ము మాటుపఱచి
పైన వెన్నను బూయుట పాడిగాఁదు.
వెన్న కఱుగద!? స్వార్థము వేఱు పడద?
స్వ స్వ భావంబు విడుచుట సాధ్యమగునె?

మేము త్వరగా బండిదగ్గఱకుఁబోయి యొకపెట్టెలోనెక్కఁబోతిమి లోని వారు- "ఇక్కడ చోటులే"దని తలుపుల మూయుచుండిరి.

మానవ నైజ మియ్యది యమానుష, మాత్మకు పెట్టి పుట్టెనా!
తానుగ నన్యపాదములఁ దప్పక పట్టును, గట్టునెక్కెనా!
తానయి చేరువారినిఁ బదంబునఁదాఁచును. నిట్టి దుర్గుణం
బీ నరజాతి వీడునపుడే మన జాతికి వచ్చు మోక్షమున్.

వాని యబ్బసొమ్మ! బండిలోఁదానెక్కి
తావు లేదటంచుఁ దఱుముఁబెఱలఁ
దాను బడ్డ బాధఁ దలపోయఁడించుక
మంచి విస్మరించుఁ గ్రించుగుణము.

రైలులో జనమెక్కువగా నున్నారు. ఎట్లో కష్టపడి మా శ్రీమతిని సామానును ఒక పెట్టెలోనికిఁద్రోసితిని- ఇంతలో రైలు కదిలినది- ఏమి చేయ వలయును? ఇంతలో రైలు గమనమున కనుజ్ఞనిచ్చుచుఁ బచ్చజెండా నూపుచున్న గార్డు చేతిలోనుండి హరిత ధ్వజము జాఱి క్రిందఁబడినది- అందువలన నాతఁడు బండినాపి దిగి జెండా తీసికొని తిరిగి బండి నెక్కులోపల నేనుద్వరగా వెళ్ళి రైలెక్కి భగవంతునకుఁ గృతజ్ఞతల నర్పించుకొంటిని.

ధూమ శకటము మండపము స్టేషన్ వదలినది- "పాంబన్" స్టేషను జేరినది- అక్కడనుండి సుమారు రెండు మైళ్ళు రైలు బ్రిడ్జిపై పోవను- ఆ రైలువంతెన 1914 సంవత్సరములో నిర్మింపఁబడినదట.

పాదరసమును బోలు నవార్య బుద్ధి
మంతు లత్యంత విజ్ఞులు మాన్యులైన
యట్టి విజ్ఞాన సాగరు లా యగాధ
సాగరునిపైనఁ దమమేధ ప్రోగుచేసి.

ఓడలు వచ్చునప్పుడు మహోన్నతి నందుచు నోడయేగుడున్
బాడబధారిపైన నొకవంతెనగా నమకూరి రైళ్ళకున్,
వేడుకచేయుచున్ గమన నిర్గమనంబులఁ జూడముచ్చటై
పోడిమిఁగూర్చు వంతెనను బోల్పుగఁ గట్టిరి యింజనీయరుల్.
వామనమూర్తి వోలె నొకపాదముతో దివి నాక్రమించు నా
పై మహి నాక్రమించు నొక పాదముతో, మఱియొక్క యంజ నే
సీమను బెట్టునో యెఱుఁగఁజెల్లునె? సాగర దేహపీఠిపైఁ
బామకయున్నఁ జాలు. నదె భాగ్యము. వారధి యాగ్రహంబునన్.

ఆ వంతెన కిరుప్రక్కల ఆధార స్తంభములు లేవు- వంతెన పైకెగయు నంతమేర మాత్ర మాధార స్తంభములున్నవి.

పైన చలించుచున్న వంతెన, క్రింద నుత్తుంగ తరంగములతో హుంకరించు మహా సముద్రము- ఏ మాత్రము పొరపాటు జఱిగినను ధూమశకటము కడలికడుపులో దీర్ఘనిద్రపోవలసినదే.

గాలిలోఁ దేలిపోయెడు గాలిపటము
శూన్యమందున విరివిగా సురుఁగుసట్లు
రైలు వారధిపైఁబోవు- నీల దేహు
కట్టడికి మాఱుకలదె? జగంబునందు.

అట్లా సహస్రపాదుఁడు ప్రదేశానుకూలముగా మందగమనుఁడై మమ్ము నిరపాయముగా రామేశ్వరము చేర్చినాడు.

## రామేశ్వరము

రామేశ్వరము హిందూదేశమందలి మహాక్షేత్రములలో నొకటి- ఇది యంతరీపము- ఇది సముద్ర మట్టమునకు వందయడుగుల యెత్తుననున్నది. ఈ

క్షేత్రము ఛత్రాకారము కలిగి యున్నది ఈ ద్వీపమునకు "నచలద్వీప" మని మఱియొక పేరున్నది.

పరిణామ శీలమై పరఁగు లోకము, లేదు
దాని శక్తికి నసాధ్యమ్ము కనఁగ
వనములు ధనములు పర్వతంబులు సము
ద్రము లన్ని మాఱు యథార్థ మిదియు
సృష్టి మాఱును మాఱు స్రష్టయుద్యోగము
ముమ్మూర్తులే మాఱిపోవు చుంద్రు
మాఱని దొక్కటే మహిమాన్వితము నాఁడు
నేఁడును నుడివోని నిత్యశక్తి

పాపవాతూల వహ్ని, సోపాన పంక్తి
స్వర్గ సౌధము నెక్కఁగ, బ్రహ్మఁజేర
కనఁగ రామేశ్వరమ్మె భావనకునందు
కనుక నిశ్చల నగరమై గణుతికెక్కె.

ఈ క్షేత్రము భారతదేశమునఁ బ్రశస్తి చెందిన- రామనాథ్ (రామేశ్వర) ద్వారకానాథ్ (ద్వారక) జగన్నాథ్ (పూరీజగన్నాథ్) బదరీనాథ్ (బదరి) అను నాథ చతుష్టయములో నొకటి- యావద్భారతములోఁ బ్రసిద్ధి చెందిన ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రములలో గూడ నొకటి.

ద్వాదశ జ్యోతిర్లింగములలో మొదటిది సోమనాథాలయము. ఇది గుజరాత్ రాష్ట్రములో నరేబియా సముద్ర తీరముననున్నది- ఇది చాల పురాతనము. పూర్వ మీస్వామి యర్చనకై గంగనుండి జలమును గాశ్మీరము నుండి పుష్పములను బ్రతినిత్యము తెచ్చెడివారట సోమ నాథాలయమున కా నామమువచ్చిన విధ మిట్లు చెప్పఁబడినది.

దక్షుఁడు బ్రహ్మలందుఁ గడుదక్షుఁడు. షడ్దశ వారముల్ తగన్
గుక్షి ఫలించె నాతనికి, నొక్కఁడు పుత్రుఁడు లేడు వారిలో

నక్షిశరుండు చేకొనియె నాతని పెద్దకుమార్తె. నిచ్చె నా
దక్షుఁడు నిర్వదేఁడుగురఁ దారల నోషధి జాల భర్తకున్.

రోహిణి తారలందుఁ దనరున్ సుకుమార విలాస హావభా
వాహృత సర్వలోకయయి, యామె గనుంగవ నిల్లుకట్టె ను
త్సాహముతోడఁ జంద్రుఁడు, నిశాదివముల్ నిముసంబులయ్యెఁ బ్రే
మాహవ యోద్ధృభూత తరుణాద్వయ తద్వయ సౌఖ్య యాత్రలో

శీత కన్ను వైచె శీతకరుండు వే
ఱైన తారలందు నగ్ని పొడమ
శీతకరమె నీరజాతము లందున
చిచ్చుపెట్టి గాదె మచ్చనందె.

చంద్ర ముఖమ్ము దూరమయి, సారస నేత్రలు సర్వసౌఖ్యముల్
సంద్రము చక్కెరై కఱుగ, జక్కని జీవిత శోభ యగ్నిలో
నంద్రవియించినట్లు గణనాధిక బాధలనంది, తంద్రిఁ జే
రంద్రుతపద్ధతిం జని రురమ్ముల మోదుచుఁ దీవెచేతులన్.

కృత్తిక చెల్లియింటఁ గనుపించదమాస, జగమ్ము నందుఁ గ
న్నెత్తిన యంధకారమె యహీనము కన్పడు. రోహిణీశుఁడై
చిత్తజు మేనమామ మనపిచ్చిన ప్రేయసి మోవితేనెలో
మత్తుగఁ దేనెటీగయయి మంచికి వంచన చేయుచుండగన్.

కడుపునఁబండు పంటలను గాఱియ పెట్టు నిశాట కీటకం
బడపఁగ దక్షధాత జలభాండముపైకి నదృష్టిఁ బంప నా
జడము మహోగ్రమై చని నిశాపతి నెత్తిన వహ్ని కీలలన్
బడబడఁబోసె. రాజు తను వాయది మ్రింగెను రాజయక్ష్మయై.

చిక్కిన మేనివానిఁ, దన చేష్టకు సిగ్గిలి మోము చూడకే
ప్రక్కలు చూచువాని, తన భామల బాములు పెట్టు వెట్టచే

గ్రుక్కుచు నున్నవాని, తన రోహిణి వక్షముఁ జందనాంకముల్
తక్కఁగఁ జేయువానిఁ, గని దక్షుఁడు శీతమయూఖు నిట్లనెన్.

"ఓయీ! తమ్ముల వైరి! నీ కరములం దుంచంగ నా కన్నులన్
న్యాయంబెంచక బెల్ల మెక్కి యెద సున్నంబన్య నేత్రంబులన్
వేయం జూచితి వంచనన్. గలుషముల్ పీడింపవే కర్తలన్
నా యీ శాపము పొల్లువోదయినఁ గొంతన్ మార్తు నీ మామగా.

మాసము నందునన్ సగము గ్రమ్గుచు వ్యాధులఁ, దక్కు నర్ధమున్
వేసటఁ బాసి యుండు, మిటు బిడ్డలకోసము క్రమ్మరించితిన్
మీసము మీశెడో వ్యథలు వీడక యెప్పుడు వెన్నుదున్నుచున్
గాసినిఁ బెట్టుచుండు నిను, గాపురుషున్ వృజినంబు వీడునే.

మక్కువ మిక్కుటంబగుడు మానక రోహిణి యింటియందు నీ
వెక్కువ యుండవచ్చు మురిపెంబునఁ, దక్కిన యాంధ్రకెల్ల స
మ్యక్కుగ భాగమీయవలెనయ్య! తరించితి వేనిఁ గట్టడిన్
నిక్కిన వ్యాధిచేత మరణింతు" వనెన్ మృగశీర్షుఁడా యెడన్.

తపసి కన్యాప, తెవులుచేఁ దపనపడుచు
స్తిమిత మందఁగలేక విశ్వేశుఁగూర్చి
తపము చేసెను. బూత గోత్రాంకమందు
బ్రహ్మచర్యంబుఁబూని నిర్భర సుదీక్ష.

ఇంద్రియంబుల నాపి ఈ శాను సేవింపఁ
గనుల విందయ్యె ముక్కంటి వేల్పు
ఆత్మ పుష్పంబును హరుని పాదంబుల
నర్పించి నిలచె శీతాంశుమూర్తి
నీ మామ శాపము నిలువెల్లఁబోవదు
కాని నా యాన నిన్నానలేదు

నే పక్షమందది యీ రీతి దయతోడ
వరమిచ్చితిని నీకుఁబంటసామి.

అనుచు వరమిచ్చి యరిగెను సభవుఁడపుడు
సగము రోగము కుదిరి శశాంకధరుఁడు
దారలందఱ కెడదలోఁ దానమిచ్చి
కొంత సుఖముండెఁ పొరపాటు చెంతఁబోక.

సోముఁడనఁగను శశి, బేసి చూపు పలన
నీరుజుండేచుఁ దేటగా నెగడుకతన
సోము నాథుండు శివుఁడట, సోమనాథ
నామ మందెను, భక్తుల నోము ఫూన్కి.

ఆవల నెవరో భక్తులు
దేవళమును గట్టియందు దేవుని నిలుపన్
కోవెల ప్రసిద్ధమయ్యెను
దేవాశ్రయ సోమనాథ దేవాలయమై.

దక్షప్రజాపతి చంద్రునకిచ్చిన దుర్భరక్షయవ్యాధి పరమేశ్వరునిచే నిచ్చట నాభానవ్యాధిగ మార్చఁబడుటవలన నీ క్షేత్రము మహా క్షేత్రమైనది. ఈ పవిత్రదేవాలయమును. 1025లో మతోన్మాదియైన మహమ్మద్ ఘజనీ దోపిడీ చేసి ధ్వంసముచేసినాఁడు 1951 మే 11వ తేదీన ఈ దేవాలయము పునః పవిత్రము చేయఁబడినది. ఈ సంస్కరణ కార్యక్రమము మన తొలి రాష్ట్రపతి బాబు రాజేంద్రప్రసాద్‌గారి యాధ్యక్షమున జఱిగినది.

2. రెండవ జ్యోతిర్లింగ క్షేత్రము శ్రీశైలము. ఇచ్చట శివుఁడు స్వయంభువు. ఈ క్షేత్రమునకు "దక్షిణ కైలాస" మని ప్రసిద్ధి యున్నది.

3. మూడవ జ్యోతిర్లింగ క్షేత్రము కాశీ విశ్వేశ్వరాలయము విశ్వస్య=సమస్త జగతాం, ఈశ్వరః=షడ్గుణైశ్వర్య ప్రదాతా ప్రభుః" సమస్త లోకములకు షడ్గుణైశ్వర్యము నిచ్చు ప్రభువని యర్థము.

1494లో "సికిందర్‌లోడీ" యను మహమ్మదీయుఁడు ఈ యాలయమును గొల్లఁగొట్టినాఁడు, ఆ పాపఫలముగా నాదేశములోఁగఱవు కాటకము లేర్పడినవి.

కఱవునకు గుఱియైన ముస్లిములు "నారాయణభట్టు" అను పండితుని బోధలవలనఁ దమ జాతివాఁడు చేసిన తప్పును దెలిసికొని హిందువులతోఁ గలసి 1569లో నా దేవాలయమును బునరుద్ధరింపఁజేసిరఁట.

1669లో నౌరంగజేబు విశ్వేశ్వరాలయమును మరల గొల్లఁగొట్టుచున్నపుడు గర్భాలయములోని జ్యోతిర్లింగమెగిరి యచటకు నేబదిగజముల దూరములో నున్న పెద్దబావిలోఁ బడినదఁట. ఇప్పటికిని భక్తులు గుడిలోని విశ్వేశ్వరుని దర్శించి తరువాత బావిలోనున్న మూలవిశ్వేశ్వరునకుఁగూడ, బూజలఁజేయు చుందురు.

3 విశ్వస్య, మోక్షరూపజగతః ఈశ్వరః = ప్రభుః = మోక్ష సామ్రాజ్యమునకుఁ బ్రభువని యర్థము.

4. నాల్గవది యజ్జయినియందలి మహాకాళేశ్వరము. కాళమనగా సర్పము. పూర్వమొకప్పుడు దూషణుఁడను రాక్షసుఁ డుజ్జయినీనగరమును నాశనము చేయుచుండగాఁ బరమేశ్వరుఁడు భక్తుల ప్రార్థనములను మన్నించి మహాకాళస్వరూపుడై మహాగరళ ఫూత్కార ప్రచండ ప్రభంజనాహతులలో నారక్కసుని నుక్కడఁగించి మహాకాళేశ్వర నామముతో బ్రసిద్ధి చెందినాఁడట ఈ యాలయము 'శిప్రా' నదీతీరమున నున్నది.

5. ఓంకారేశ్వరాలయము. ఓంకారము ప్రణవస్వరూపము. అదియే భగవత్స్వరూపము. ఓంకారరూపః ఈశ్వరశ్చ = ఓంకారేశ్వరః అనగా నోంకారరూపుఁడైన ఈశ్వరుఁడని యర్థము. మఱియు నీ గుడిలో నోంకారము వినఁబడుచుండునఁట. ఇది మధ్యప్రదేశములో నర్మదా నదీతీరముననున్నది. ఈ జ్యోతిర్లింగము చుట్టు నిరంతరము నీరు నిలచియుంటుంది. అందువలన దీనిని "అబ్లింగ" మని కూడ ననుచుందురు.

6. కేదారేశ్వరాలయము. ఇది హిమాలయుని ఒడిలో నున్నది. సహస్రకవచ రాక్షసవధార్థమై తపస్సు చేయుచున్న నరనారాయణుల కోరికమీదఁ బరమేశ్వరుఁడిట వెలసినాఁడట. ఈ స్వామి నామము కేదారేశ్వరుఁడు. "కేదార" మను పేరుగల క్షేత్రమునకు నీశ్వరుఁడు. ఆయనయొక్క యాలయమే కేదారేశ్వరాలయము.

7. త్ర్యంబకేశ్వరాలయము- ఈ యాలయము మహారాష్ట్రమందలి నాసిక్ కు 32 కిలోమీటర్ల దూరములో గోదావరి యొడ్డుననున్నది ఇచ్చటి స్వామి త్ర్యంబకేశ్వరుఁడు- అనగా మూడు కన్నులు కలవాఁడని యర్థము రెండు కండ్లవలెనే మూడవ కన్నుకూడ స్వామి మోముపై స్పష్టముగాఁ గనుపించుచుండుటయే ఆ పేరునకుఁ గారణము- ఈ కథ పద్మ పురాణాంతర్గతము.

8. వైద్యనాథాలయము- ఇది పశ్చిమ బెంగాల్‌లోని "సంబల్" పరగణాలో నున్నది- ఇచ్చట రావణాసురునకు నీశ్వరుఁడు ప్రత్యక్షమైనాఁడట "వైద్య" అను భక్తుని నామముతో భవుఁడిట పెలసినాఁడట.

9. భీమశంకరాలయము- ఈ యాలయము 'పూనా' జిల్లాలోని భోనగిరి (భువనగిరి) సమీపములో నున్నది- భీమశ్చ (దుష్టానాం) శంకరశ్చ (భక్తానాం) ఇతి భీమ శంకరః- అని విగ్రహము. అనగా దుర్మార్గులకు భయంకరుఁడు సన్మార్గులకు శుభంకరుఁడని భావము- ఈ యాలయము సముద్ర మట్టమునకు- 3400 అడుగుల యెత్తుననున్నది- శివుఁడిచట త్రిపురాసురలను సంహరించినాఁడఁట ఈ లింగమునుండి గూడ జలబిందువు లూరుచుండును.

10. ఘుశ్మేశ్వరాలయము- ఇది ఎల్లోరా గుహలకు సమీపములలో నున్నది- ఈ జ్యోతిర్లింగము ఘుశ్మేశ్వరనామ ప్రసిద్ధము.

11. నాగేశ్వరాలయము- ఈ యాలయము ద్వారక నుండి టిబెట్ వెళ్ళు త్రోవలో నున్నది- ఇచ్చట శివుఁడు సర్పభూషణుఁడై నాగేశ్వర నామముతో ప్రసిద్ధి కెక్కినాఁడు. ఇది శివ పురాణాంతర్గతము.

12. రామేశ్వరాలయము- ఇది రామేశ్వరములో నున్నది- ఇది పన్నెండవ జ్యోతిర్లింగము- ఇచ్చట శివుఁడు శ్రీరామునిచేఁ బ్రతిష్ఠింపఁబడినాఁడు.

ఇవి పన్నెండు జ్యోతిర్లింగములు. వీనిలో నొకదానిని వివరించితిని- తక్కినవిగూడ పురాణ ప్రమాణములు కలవియైనను గ్రంథ విస్తరభీతిచే సంగ్రహించితిని.

వారణాసియందలి గంగోదకముతో రామేశ్వరునకభిషేకము చేసినచో యాత్రాఫలము సంపూర్ణముగ లభించునఁట సర్వమత సహనము హైందవ లక్ష్యము- సర్వ దేవాలయములలో సర్వవర్ణములవారికిఁ బ్రవేశార్హత యుండుటయే యందులకు నిదర్శనము.

కొన్ని మతములు వితండపరములు- అనగాఁ గేవలము పరమత దూషణమే లక్ష్యముగాఁ గలవి. కొన్ని మతములు జల్పపరములు- అనగాఁ దప్పైనను నాత్మ పక్ష సమర్థన శ్రద్ధాళువులు- హిందు మతము వాదపరము, వాదమనగాఁ దత్వ నిర్ణయార్థకమైన తర్కరూపము- అందువలననే యది యాదిత్యునివలెఁ బ్రకాశించు చున్నది.

వివిధరూపములైన నదుల కన్నింటికిఁ దనలో స్థానమిచ్చి వాని భిన్నత్వములో సముద్ర మభిన్నత్వమును బ్రదర్శించి తాను మాత్రము నిర్వికారముగ నున్నట్లే యతి విశాలమైన హిందూమతము సర్వమతములకుఁ దనలో నాశ్రయ మిచ్చి తానేమాత్రము రూపాంతరమును బొందక వానికన్నింటికి సమన్వయము చేయుచున్నది- అందువలననే యది యద్వైతయతమైనది. మతరాజమైనది- అజరామరమైనది.

కొందఱయ్యలు, హిందూమతములో మత సామరస్యము లేదనియు ఆ మతము కొందఱికే పరిమితమనియు నవిచారితాభిధానమును జేయుచున్నారు. "విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని. శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః-" "సమత్వం యోగ ఉచ్యతే" ఇత్యాది గీతాచార్యోపదేశములు వారికి శ్రవణ గోచరములు కాలేదేమో. భారత పవిత్రేతి హాసముల వాసనసైన నెఱుఁగని వారికి హిందూ మతప్రాశస్త్య మెట్లు తెలియును

కడవాని కుక్షికిఁ గల పేలపిండి న
ర్పించు సక్తుప్రస్థుఁ డెచటివాఁడు
కడజాతి పశువుతోఁ గల జీవితము ముడి
యిడినట్టి ధర్మరా జెచటివాఁడు
ప్రాణము బలిపెట్టి పారావతము మోము
వెలిగించు శిబి యేడ వెలసినాఁడు
అడుగు వేసినఁ జీమ యణగారు నని యెంచు
ధర్మరా జేనేలఁ దనువుఁదాల్చె
ధర్మ శాస్త్రాంతర మర్మజ్ఞుఁడైన ధ
ర్మవ్యాధుఁ డెక్కడ మాచ్యుఁడయ్యె

జీమూత ధర్ముఁడు జీమూతవాహనుఁ
డేనేల నేల జనించియుండె
"ఆత్మవత్సర్వభూతాని, యను మహార్థ
వాక్య మేక్షితిలో నిరవందియుండె
అట్టి హైందవభూమి యథార్థ రూప
మెఱుఁగ కాడినమాట గ్రహింపఁదగునె?

"నశ్వరమైన లౌకిక మనాదరణీయ" మటంచు, సర్వమున్
శాశ్వత సిద్ధికై గతిక చాయను వీడుచు, నింగిరిక్కలై
విశ్వముఁ గాంతివంతముఁగఁ బేర్చిన పెద్దల వారసత్వమై,
విశ్వ జనీన కర్మమయి వేద విధేయమునొచు, సర్వదా
విశ్వసనీయ ధర్మమును, వీఱిడియూ తెగనాడు వాఁడిలన్.

కంటి దోషముచే దివ్వె, కానఁబడదు
కానఁబడనట్టి దోషము కంటిదిగద!
కంటి రోగముఁ బోఁగొట్టఁగడగవలయు
కాని దీపము నిందింపఁ గలదెసిద్ధి.

పురుషులు చేసిన జ్ఞాతాఽజ్ఞాత దోషములన్నియు- సేతుస్నాన- రామ లింగేశ్వర దర్శనములవలన నశించునని పురాణ ప్రవచనము.

స్త్రీలకుఁ బ్రత్యేకముగా సంభవించునది ఋతుదోషము. ఋతుకాలము సమ్యక్ జ్ఞాతము కానందువలన ప్రతి మహిళయు నా కాలములోఁగూడ హవ్యకవ్యాదు లందుఁ బాల్గొనుచుండును- అందువలన నామెకు మహా పాప మవశ్యము సంభ వించును- ఆ పాపము, ప్రత్యేకముగాఁజేయుఁ గర్మలవలనను, సేతు స్నానము వలనను నశించును- కావుననే స్త్రీలకు సేతు స్నానము ముఖ్యము.

సేతుస్నానవిధి :- సేతుస్నానార్థినియైన పడతి తెల్లని కొత్తచీరను దెచ్చి పురో హితున కీయవలెను. ఆ తఁడా చీరను వసంతములో ముంచి యా స్త్రీకే యిచ్చి వేయును. అపుడామె యరుణ వస్త్రధారిణియై సైకతలింగమును జేసి దానికి షోడ శోపచార పూజ చేసి- ఆ సైకతలింగమును సముద్రములో కలుపవలెను- పిమ్మట

దీప దానాదికమును నిర్వర్తించి యథా దక్షిణగా నాశోణ వస్త్రమును బురోహితున కీయవలయును!

శ్వేత వస్త్రము స్త్రీయొక్క సాత్విక హృదయ సూచకము. దానిని వసంతములో ముంచుట స్త్రీ అజ్ఞాత ఋతుకాల దూషితయగుట- దానిని త్యజించుట యనగా తనకు సంక్రమించిన రజోద్దోషమును సేతుస్నాన జన్య పుణ్యముచేతఁ బాపుకొని పరిశుద్ధ యగుట యని భావము.

సేతుస్నానానంతరము మేము దైవ దర్శనమునకు వెళ్ళితిమి ఆ క్షేత్రాధిపతిపేరు రామలింగేశ్వరస్వామి-

లింగరూపః ఈశ్వరః = లింగేశ్వరః- రామేణ ప్రతిష్ఠితః లింగేశ్వరః = రామలింగేశ్వరః- అనివ్యుత్పత్త్యర్థము- అనగా శ్రీరామునిచేత ప్రతిష్ఠింపఁబడిన యీశ్వరుఁడని భావము- ఆ శివలింగము రామ ప్రతిష్ఠితమైన విషయ మిట్లు పురాణములో నున్నది.

తొల్లి మినుకులు సకల శాస్త్రోక్తి చయము
జీర్ణమైనట్టి పండితశ్రేష్ఠుఁడతఁడు
నిచ్చ నవకోటి శివలింగ నియమపూజఁ
బుణ్యనిధి యింద్రజేత యా పుణ్యజనుఁడు.

ప్రేగుఁ బెకల్చి భీమవిధి భీముని మెప్పునకై యొనర్చి స
ద్రాగము రుద్రవీణ సచరాచరపృథ్వి ద్రవింపఁ బాడి శ్వే
తాగనివాసి మెప్పుఁగని దద్దయు సామము సుస్వరంబుగాఁ
గ్రేఁగయి వ్రాసినట్టి ఘనకీర్తియగున్ దశకంఠుఁ డీయిలన్.

బ్రహ్మ భక్తుఁడు బ్రాహ్మణ ప్రథిత యశుఁడు
చాలకే కాలకర్మముల్ శీలవతిని
సీతఁ జెఱఁగొనె, దానితోఁ జెఱఁగి పోయె
దిగ్దిగంతరపూర్ణ తత్తేజమెల్ల.

ధర్మము నుద్ధరింప వసుధాతలమందు జనించినట్టి యా
కర్మ ఫలప్రదాత పలుగాకిని రావణుఁజంపె దానిచేఁ

గూర్మ్మమువంటి యాతనికిఁ గొంతయఘమ్మను బ్రాప్తమయ్యె నా
ఊర్మ్మల నీఁగఁగాఁ దరమె యోంకృతి మానస చక్రవర్తికిన్.

ఆ కలుషంబుదాఁటఁ బ్రమథాధిపలింగము యోగ్యభూమిలో
శ్రీకర సన్ముహూర్తమున శిష్ట విధానఁ బ్రతిష్ఠ చేయుటే
యేకవిధం బటంచును మునీశులు చెప్పఁగ రామచంద్రుఁడున్
మేకొని లంకవీడి తన మేదినికిన్ జనుచుండ నంతలో.

మూర్తము దాపురించె, నది పూర్వ సముద్రము, దానియొడ్డునన్
వర్తుల రూపు నిల్ప రఘువంశధురంధరుఁడెంచి కాశిలో
వర్తిలు లింగరాజమును భవ్యముఁ దెమ్మని యాంజనేయు ని
ర్వర్తితరామ కార్యునిఁ ద్వరన్ బనిచెన్ నిజకార్యసిద్ధికై

వెళ్ళెను రామభక్తుఁ డతి వేళము. లగ్నము వచ్చె, లింగ మీ
రాళ్ల సమూహమందుఁ గనరాదని జ్యోసులు చెప్ప, సీతయున్
వ్రేళ్లను సైకతంబుఁగొని శ్రీపతియానతిఁ జేసె ధూర్జటిన్
ద్రెళ్ళఁ దరంగబాధకది, తీర్చెను జానకిఁ, దీటె లింగమున్.

నెత్తికి నెక్కెమూర్త మిటనిల్వదు సైకతలింగ మబ్ధిచే
నొత్తుట, రామరామయు శ్రమోదక సిక్తలలాట భాగయై
తత్తరమంది దానికి నిదానము వార్ధితరంగ మెంచి, చే
యెత్తియ నెన్ గృథాఽరుణ సమీక్షణ తర్జిత వార్ధి హస్తయై.

రఘుకుల పూర్వ వర్ధిత! పరాకున నుంటివ? శంభులింగమున్
రఘుకుల వార్ధివర్ధనుఁడు రావణ మారణ హోమ సంభృతా
త్యఘమును బాయ నిచ్చట స్వయంబుగ నిల్పఁగనుండ నీవె యా
మఘవముఖాశ్రయున్ జడధి! మారొ్కనఁజూతువ? నిండనూకలున్.

కాలము దాఁటరాదు కృతకష్టము నీఱగు నీదునీటిచే
ఘాలస! బాంధవమ్ము నెడఁ బాయుచు విఘ్నము చేయుచుంటివా

నీలశరీర వహ్నిశిర నిర్ఘృణతన్ జనిచూచి తప్పు డీ
వేల నయోని జాత ముఖ భీషణ భాషణ మాలకింతువో.

"ముడిచి చేతుల బుద్ధిగా నడఁగి యుండుఁ
కాకపోయిన నీ జాయ కంఠ సూత్ర
మట్టె యుండ"ద నన్ నదీమానినీశుఁ
డుండె కిక్కురు మనకుండ నుక్కుదక్కి.

ఇది యుడివోనిమాట యట జృంభదభంగ తరంగ సంచలత్
మద వివశుండు వారినిధి మంద కరుండయి శాంత దేహుఁడై
కదలక యుండు భీతి, నవి కంపితమైన జలాశయంబు నాన్
నిదురను జెందినట్లుడగునే ? జలరాశి వినా నిదానమున్.

నిలువగ నాగఁడంబుడిగి నీరధి, మైథిలి సైకతస్ఫురత్
సలలిత శైవ చిహ్నమును సాగమ పద్ధతిఁ జేసె, మూర్త మా
వలి కరుగంగనీక, రఘు వారిధి చంద్రుఁడు రామచంద్రుఁ డా
జలనిధి తీరమందు మను సంస్కృతిఁ జేసె. శివప్రతిష్ఠయున్.

శివుఁడు నిలంబడెన్ జలధి క్షేత్రము నందున, వార్ధి కన్యకా
ధవుని బలంబునన్ ప్రబలధాత్రి ముఖోద్గత మంత్రశక్తిచేఁ.
బవనతనూజుఁడచ్చటికి వచ్చెను, స్వేదము లూరుచుండఁగా
భవసహితాత్మహస్తుఁడయి వాయువు మించిన తీవ్రవేగుఁడై.

లింగము ధాత్రిపై నిడి నిలింపసమానుఁడు వాయు సూనుఁ డా
చెంగట సుప్రతిష్ఠితము శ్రీవర సేవితమైన లింగమున్
వంగియు వంగిచూచి కను పద్మము లెఱ్ఱని కాంతులీన భ్రూ
భంగము మోమునందు నెలవందఁగఁ, బల్కెను గర్కశధ్వనిన్.

శివునిఁ దెమ్మని యవిముక్త సీమకంపి
నన్విముక్తునిఁ జేసి తనాథ నాథ !

తగునె ? యీ పని శ్రీరామ ! ధర్మమగునె ?
యాడి తప్పుట మిమువంటి యార్యులకును.

డెందములోన నీ ప్రతిమ చేవ తలిర్పఁగ నిల్పుకొంటి ని
ష్పంద మనంబునన్, భవుని భావము హస్తము నందు నిల్పి యీ
చంద మొకాయెకిన్ శ్రమను శ్రద్ధను వీడియు వీడకుండ, మ
ద్వందిత పాద ! మీపద ముపాసన చేయఁగ వచ్చియుంటినే.

నా తెచ్చిన ఈ లింగము
ఖ్యాతికి నెక్కంగవలయు ఖగవాహన ! నీ
పాతిన లింగము, వెలికిన్
సీతాపతి ! తియఁగలను నీ పరమేశున్.

చేయుము ప్రతిష్ఠ, నను నా
వాయుజ వాక్యంబు వినుచుఁ బరమాత్ముఁడు నో
యీ ! యీ మంత్రస్థిరుఁడో
నేయుఁడు నీకగునె? హరుఁడు నిజగతిఁగనుమా!

తాను బెట్టిన మొక్కను ధరణినుంచి
వేఱుచేయుట ధర్మమె ? నేర నేను
సుప్రతిష్ఠిత లింగము నప్రతిష్ఠ
పాలుసేయఁగ, ననఁ బల్కెఁ వాయుసూతి.

"స్వామీ ! తెచ్చితి వారణాసిసుప్రశస్తంబైన శైవాంకమున్
నా మర్యాదను పెట్టఁబుత్తునె ? రమానాథా ! పయోరాశి నీ
కామారిన్ బడవేయు, దంచును మహోగ్రాకారుఁడై నిల్చి శ్రీ
రామ స్థాపిత లింగ దేహమును దర్పం బొప్ప వాలమ్ముతోఁ.

చుట్టి పెకల్పఁబూనె, నది సుంత చలింపదు, పెన్ జలంబుతోఁ
బట్టును బట్టిలాగు బలవంతుఁడు మారుతి, నాగలోకమున్

ముట్టిన లింగమింతయును ముప్పును బొందదు, మానఁడింతయున్
బట్టును గీశశేఖరుఁడు, మారహరుండు చలింపఁడప్పుడున్.

తనకుంగల్గిన శక్తి యంతయును వ్యర్థంబౌట స్వార్థార్థమున్
గనఁగానేరని యాంజనేయుఁడు మదిన్ గాఢంబుగా నున్న మే
దిని కాంత ప్రతిభా విశేషమును- మందీభూతనైజప్రభన్
గనుచున్ గేలు ఘటించె. మానసములోఁ గంజాక్షు చిచ్ఛక్తికిన్.

తన పని కాకముందె వసుధావరు ముంగల మిత్ర మండలిన్
తనపని యాటకున్ దలను ధాత్రికివంచి త్రపానతాంగుఁడై
వెనుకొనియున్న భక్తునిఁ గపీశ్వరు నశ్రుతరంగ నేత్రుఁడై
కని రఘువీరుఁడాదరముగా నెద హత్తుచు ఁబొంగి పొఁపుచున్.

పలికెన్, నీమది హనుమా
కలఁగుడు, నా చిత్తమంత కలఁగును. నిలచున్
తొలి భక్తుఁడు. మలి దైవము
తులలేనిది నీదుభక్తి, దోర్బల, మిలలో.

నీవు తెచ్చిన త్రిపురారి నిశ్చయముగ
నా ప్రతిష్ఠిత శశిమౌళి నానుకొనియె
వెలయు. పూజలు జఱుగు నా విధముగానె
భక్త భగవంతులకు భేద భావమున్నె.

అనుచును రామచంద్రుఁడు శుభావహ కాలమునందు వాయునం
దనహృత భస్మధారి నట ధర్మ్యముగా నిలబెట్టె. నేఁటికిన్
మును రఘువీరుఁడిచ్చిన యమోఘ వచస్సును బట్టి యంజనా
తనయుని శంభుపూజ తొలుతన్ సికతాశివపూజ పిమ్మటన్.

జఱుగు చుండును నచ్చట. సైకతమ్ము
చిన్నదైవము. పెద్ద కాశీశ్వరుండు.

పెద్ద వానిని ముందుగాం, బిదపంజిన్న
వానింజూతురు- లోక స్వభావమంతే.

తదుపరి నాలయమ్ము సుకృతాత్ముల పుణ్యము పక్వమౌటచే
నుదితము నయ్యె. భారత ధరోన్నత దేవ గృహాగ్రగణ్యమై.
అది మొద లింతదాకం దఱుగన్నది లేక మహేశ్వరాశ్రయా
భ్యుదయ హిమాంశు చంద్రికలు మోదముంగూర్చును సర్వజాతికిన్.
ద్రష్టలు దేవళంబునం బదంబుల నుంచంగ, నున్న తాత్ముండై
స్పష్టముగాంగనంబడును బావని శంభుండు. వాని పొంత న
స్పష్టము గోచరంబగును బార్థివ దైవము- చూడవెంట సం
తుష్టిగం జోడెయావు- తనన్యానత నెంచునె ? తల్లియౌగదా.

రామేలింగేశ్వరాలయము ప్రాకారత్రయ పరివేష్టితము. మొదటి ప్రాకారములో గర్భాలయమున్నది- దానిలోనే శివలింగద్వయమున్నది- దానిలోనే కోటి తీర్థము సరస్వతీ తీర్థము నున్నవి.

రెండవ ప్రాకారములో నమ్మవారి దేవాలయ మున్నది- ఆ ప్రాంతము లోనే నందీశ్వరాలయమున్నది- అనేక తీర్థములు కూడ నున్నవి- ఇది 500 × 300, అడుగుల వైశాల్యము కలది.

మూడవ ప్రాకారము 17 అడుగుల వెడల్పు, 400 అడుగుల పొడవు కలిగి యున్నది- ఇంత యందమైన విశాలమైన ప్రాకారము భారతదేశములో మఱియొకటి లేదు- ఈ ప్రాకారములో గూడ గాలి వెలుతురు తగినంతగా నుండును- మఱియు కోదండరామ, నటరాజ, సేతుమాధవస్వాముల యాలయములు న్నవి-ఈ యాలయమునకుం దూర్పున సముద్రము,పడమర పురగోపురములున్నవి.

ఈ యాలయమునకు నాల్గువైపుల గోపురములున్నవి- ఈ గోపుర శిల్పము ఈజిప్టు శిల్పమును బోలియున్నది.

ఈ క్షేత్రమున కధిదేవత పర్వత వర్ధనీ దేవి- అనగాం బార్వతీ దేవి యని యర్థము- పర్వతం పితృరూపం హిమవంతం పుత్రికా రూపేణ- నోచేత్- పర్వతం- పరమేశ్వరనివాసస్థాన కైలాసగిరి నివాసినం పరమేశ్వరం పత్నీరూపేణ, వర్ధయతి స్వానుభావేన తోషయతీతి పర్వత వర్ధనీతి వ్యుత్పత్తిః-

అనగా పుట్టి హిమవంతుని మెట్టి పరమేశ్వరుని సంతోషింపఁ జేసినది యని భావము.

పర్వత మన్న మంచుమల, భాసురహారజతాద్రియాను, నీ
యుర్వరధారులన్ దన శుభోదయ భూతుల వృద్ధిఁజేయు నా
పార్వతి యయ్యె వర్ధనిఁగ. భామిని సార్థక జన్మ నింపదే
ఖర్వము కానికీర్తి ననమూఁగజ, పుట్టిన మెట్టినింట్లలోన్.

ప్రతి శుక్రవారము. పర్వత వర్ధని బంగరు పల్లకిలోఁ ప్రాకారాంతరములలో మహా వైభవముగా నూరేగును- పాశ్చాత్య పండితుఁడు "ఫర్గూసన్" ఈ దేవాలయ వైభవమును మిగుల శ్లాఘించినాఁడు.

మేము, లక్ష్మణ, రామ, సీతా, కుండములలో స్నానముచేసి రామలింగేశ్వర స్వామి దర్శనమునకుఁబోతిమి.

ఆ యాలయ ప్రాకారములో 33 బావులున్నవి- వానిలో స్నానముచేసిన 33 కోట్ల దేవతలు సంతోషింతురఁట- ఆ స్నానములకు రుసుము. రు 10-00 ఈ బావుల మహాత్మ్యమును దెలుపు పురాణ గాథలున్నవి- ఈ తీర్థ స్నానములు ఆరోగ్యప్రదములఁట.

అచ్చటి యధికారులు రుసుములను దీసికొని తడవకు నిరువది మందిని స్నానములకై పంపుదురు- వారితో స్నానములు చేయించుటకొక పురోహితుఁడుండును- అతఁడు ప్రతిబావి దగ్గఱ నీయిరువది మందిని వంగొనపెట్టి బ్రహకు గూడ నర్థము కాని మంత్రములు చదివి తలకొక బొక్కెన నీరు తానే తోడి వారిమీదఁ బోయును.

రెండు మూడు బావులయిన తరువాతఁ బురోహితుఁడతి వేగముగా బావుల వెంటఁబోవుచుండును- యాత్రికులు వాని ననుసరింపలేక సతమత మగుచుందురు- మొదటి బావి దగ్గఱఁ దీర్థనామమును దద్విశేషములను జెప్పిన యా పురోహితుఁడు తరువాత నవియేమియుఁజెప్పక స్నానములు సరిగఁజేయింపక దూసికొని పోవు చుండును- ఆడ మగ భేదములను మఱచి యాత్రికులొకరి నొకరు త్రోసికొనుచు నా పురోహితుని వెంటఁ బరుఁగులెత్తుచుందురు.

తీర్థ జలంబు నెత్తిపయిఁ దిన్నఁగఁదాల్పఁగఁగోరి యాత్రికుల్
మూర్ధముపైన మూర్ధముల ముందుఁగఁ బెట్టుచుఁబోవ ప్రోక్షకుం

ఘర్ధము కాక "యెవ్వరికి నప్పుడు పోయుట" యంచు వీడి యా
తీర్థముఁ బోయెనావలకు. దేబెముగంబుల నేయ యాత్రికుల్.
ఒక్కొక్కసారి బొక్కెన రహోగతిఁదాఁక శిరంబుఁ జేటితో
నొక్కుచుఁ దైర్ఘికుం డదియు నుత్తమ తీర్థ జలాభిషేక మన్
దృక్కునఁ దృప్తినంది మఱి తీర్థమునందునఁ దానమాడఁగా
గ్రక్కున నేగు, నెంతటి ప్రగాఢమొ తజ్జలసేక దీక్షమున్.

ఆ యాత్రికులలోఁ గొందఱు యువకులు కేవలము విలాసార్థమే యాత్రలకు వచ్చినవారున్నారు. వారిలో నొకమూర్ఖుఁడు.

స్నానము చేయునప్పుడు- ఒకసారిగ స్త్రీ పురుషుల్ జలార్థమై
పూనికవంగుచుండ నొకబుద్ధి విహీనుఁడు స్త్రైణమందునన్
దానుగ వంగిలేచి ప్రమదా స్తన కుంభము రుద్దుచుండెఁగన్
గాననియట్లు చేతుల, జనంబులు 'ఘూ' యని ఊయ మోముపై.
నీటనుదోఁగి యాశ్వయుజ నీరదతుల్య పటాంతరంబునన్
తేటఁగఁగానఁబట్టు యువతీ కుచనాభి బిలంబులందు నే
యోటును లేక చిక్కి యొకయున్మదుఁడుండెను. స్నానసంగతిన్
గోటనుమీటి, యాత్రిజనకూటము ముందునకేగ నొంటిగా.
అట్టి మూర్ఖులకేల యీ యాత్రలంటి
మొదట, నిజమది. యాత్రకుఁగదలువారు
చిత్త శుద్ధులు కావలెఁ. జిత్తశుద్ధి
లేనివారికి దండుగయౌను యాత్ర.

గడచెను గొన్ని తీర్థములు, క్రమ్మెను ప్రోక్షకు నందు మాంద్యమున్,
దడదడలాడి బొక్కెన ద్విధా ప్రవిభక్తమునయ్యె. బావులున్
గడవఁగ నింకఁగొన్ని వెనుకాడక పాత్ర త్రిధా విభాజ్యమై
వడివడి సాఁగె. నొక్కటనఁబర్వెను, దాఁ బడి యాచుఁ బిమ్మటన్.

ఆ ప్రాకారాంతర భాగమంతయు నిరంతరార్ద్ర వస్త్ర ధారుల పరిభ్రమణము వలన సీటి బుగ్గవలెఁ గన్పట్టును.

నతతముఁదన్నుఁజూడఁగ నచంచల భక్తిరస ప్రపూర్ణులై
జతపడునట్టి భక్తుల ప్రచారములన్ గలుషీభవత్తదా
యతనము శుద్ధిచేయ శివునానతి నా కుతలంబునుండి భూ
గతయయినట్టి భోగవతిగాఁ గనుపించె ధరిత్రి యార్ద్రమై.

కన్నుల శక్తి చాలని యఖండ మహాద్భుత దివ్య వైభవా
భ్యున్నతి కల్గుదానిఁ గని పొంగితి. గోపుర సాల దీర్ఘతా
భిన్న సురాలయమ్ము, పరిబృంహిత దిక్పతి పూజ్య భావనా,
చ్ఛిన్న మహత్త్వ, మా యమర శిల్పకళానిధి శూలిగేహమున్.

ఆలయములో రెండు లింగములున్నవి- అందొకటి సికతాలింగము, అది భూజాత కృతము- అంతస్థిత జ్యోతి- జ్యోర్లింగము.

రెండవలింగము రెండడుగుల యెత్తున్నది- అది వినీల శిలామూర్తి- శ్రీమదాంజనేయానీతము- ఆ రెండును శ్రీరామచంద్ర ప్రతిష్ఠితము లగుటచేత నతివేల మహిమాన్వితములు- రామలింగేశ్వరునిఁ బర్వతవర్ధనీదేవిని సందర్శించి యథాశక్తి నర్చనలఁ జేయించితిమి.

తరువాత గంధమాదన పర్వతమును దర్శించితిమి- శ్రీయాంజనేయస్వామి యచ్చటినుండియే సీతాన్వేషణమునకు బయలుదెరినాఁడఁట శ్రీరామచంద్రుఁ డిచ్చటి నుండియే కపిసేనతో సేతువుదాఁటినాఁడఁట.

ఆ కొండపై నొకయిల్లున్నది. దానిలో నొకగదిలో శ్రీరాముని పాద ముద్రలున్నవి- భక్తులాముద్రలను భక్తి ప్రపత్తులతోఁబూజింతురు. ఆ కొండపై నుంచి చూచిన రామేశ్వరమంతయుఁగన్పడును.

రామేశ్వరాలయము శిల్పలక్ష్మి నివాసమువలె నున్నది - మహా విశాలములైన ఆ యాలయ వీథులు- వీథుల కిరువైపులనున్న దుకాణములు క్రిక్కిరిసియున్న జన సముదాయము- ఆ యాలయమునకు నగర రాజ శీవినిఁగల్పించుచున్నవి- రామలింగేశ్వరున కెదురుగ మహానంది యున్నది.ఆనంది యౌన్నత్యము పదునైదడుగులు-పొడవు-ఇరువది యడుగులు. జగద్భర్తకు వాహనము కాఁదగిన దైహిక మానసిక దార్ఢ్యము దానియందు స్పష్టమగుచున్నది.

ఈశుని వాహనమ్ము వృషభేశ్వరు నెమ్మొగమందుఁగన్పనుఁ
పాశుపతీయ శూలముఖ బద్ధ సుతీక్ష్ణత, లోకహర్తృది
వ్యాశయ సంచల త్పరుష భావ నిరంకుశ నిర్భయత్వముల్,
పాశధరాంతకస్థ దృఢబంధుర వహ్ని విలోచనద్యుతుల్.

కన్నులఱమోడ్చి, ఱిక్కించి కర్ణయుగము,
మెదలకున్నట్టి యూ నేఁటి మొదవు తేఁడు
మఱచి యాదను తనస్వామి! కఱపు బోధ
వినుచు నున్నట్లుగాఁ నుండె విప్పిమనసు.

అలహాబాద్‌లోని త్రివేణీ సంగమమునందున్న (గంగా యమున సరస్వతి) గంగను దెచ్చి రామేశ్వరములోని రామలింగేశ్వరస్వామి కభిషేకము చేయ వలయును. తదుపరి రామేశ్వరములో సైకతలింగమును జేసి దానికి షోడశోప చార పూజ చేసి దానిఁ గాశీలో గంగలో నిమజ్జనము చేయవలయును. అపుడు కాశీ రామేశ్వర యాత్ర పూర్తియగును. కాశీ వెళ్ళలేనివారు ఆ వాలుకా శంకరుని నచటి వారిధిలోనే కలుపుదురు. కాశీనుండి గంగను తీసుకొని రానివారు అక్కడఁ దామ్ర పాత్రలలో నమ్మఁబడుచున్న గంగను గొని యా జలముతో రామలింగే శ్వరున కభిషేకము చేయింతురు.

తరువాతనే నచ్చట యధాశక్తి పితృకర్మ నాచరించితిని అచటి పురో హితులు- మంత్ర తంత్ర కియా శూన్యులు- ఏ కర్మనైనను ఐదు నిమిషము లలోఁ జేయింతురు- వారెట్లు చేయించినను తైర్థికులు తీర్థక్షేత్ర మహిమల పురస్క రించుకొని తృప్తి పడుదురు. అచట- 'పురోహిత' అను పదములకు స్వాది సంధి చేయరాదు- పురః+హితః (ముందే హితము పదేశించువాఁడు) పూర్వ రూప సంధిచేయ వలయును- పురః+అహితః- ఎట్టి యెదుటనే హితము కానిదానిని అనగా అశాస్త్రీయమైనదానిని చేయించువాఁడు- ఆ విధముగా రామేశ్వరములో రెండు రోజులుండి యచటి విశేషములను యథావకాశముగ దర్శించితిమి.

రామేశ్వర యాత్ర పూర్తి యైన తరువాతఁ గోటితీర్థములో స్నానము చేసి సర్వ తీర్థము దగ్గఱకుఁ బోవలయును- సర్వ తీర్థమనఁగా సర్వతీర్థగత మహిమకలదని యర్థము-ఆ తీర్థమును గొని రాగి పాత్రలలోఁబోసిఁ సీలు చేయించు కొని యిండ్లకుఁ దీసికొని పోయి కాశీ గంగను వలెనే యుపయోగించుకొందురు-

గృహోన్ముఖులగువారికిఁ బురోహితుఁడు- ఆశీః పూర్వక ప్రసాద మిచ్చును. ఆ తీర్థప్రసాదములను దీసికొన్నవారు ఆ క్షేత్రములో నిద్ర చేయరాదు- నిం(ద్రించిన నా యాత్రా ఫలము నశించునఁట- మా రామేశ్వర యాత్ర లట్లు పూర్తి యయినది- అపుఁడాస్వామికి నిట్లు మనవి చేసికొంటిని- ఓ రామలింగేశ్వర ప్రభూ !

హైందవ భూమిలో నరుడైన పుణ్యప్ర
దేశముల్ గాశి రామేశములగు
సంసార రథచక్ర సరణియే తెలియని
దశయందు విశ్వేశదర్శనమ్ము
చేసియుంటిని ప్రభూ ! చేసితి నిప్పుడు
తనువు పక్వప్రాయ దశను బొంద
మీదర్శనమ్ము రామేశ్వరనాయకా !
ఏనాఁటి పుణ్యమో యింతఁ జేసె

రామచంద్ర ప్రతిష్ఠిత రమ్యలింగ !
శైవ వైష్ణవ సామరస్యాంతరంగ !
రెండు రోజులు మేము నీ యండ నుంటి
మదియె పదివేలు- వ్యోమకేశా ! గిరీశ !

జలనిధి నుత్తరించి, దనుజాధిప మస్తక ముత్తరించి, నీ
లలనను దెచ్చుకొంటి వఖిలాశ్రయ ! యీ ధర నుండి, యేను నీ
జలనిధి నుత్తరించి కనఁజాలితి నిక్కడ నీ ప్రతిష్ఠ. నా
కలవియె కాని యీ ప్రకృతి కంధిని, దాఁటఁగఁ జేయు మయ్యయా !

ధ్యాతకున్ ధ్యేయునకు నభేదంబుగాదె
హరియు హరుఁడును దాదాత్మ్యమందు నొకటె
గుడియె భేదము లౌకిక గుణితమందు,
హరిహరా ! సైచిమమ్ము కాపాడుమయ్య !!

హరహరా ! పోయివత్తుమయ్యా ! యటంచు
పలికితా చారమున, మాకు నలవియగునె
తిరిగి వచ్చుట, వచ్చిన కరణియెంచి
సాపరాధుల బిడ్డల సాకుమయ్యా !

ఈ విధముగా స్వామికి మనవులందించి యటనుండి 13-10-84 సాయంకాలము 4 గం. దర్భశయనమున సాగరశయను దర్శింపనేగితిమి.

## దర్భశయనము

శ్లో॥ శ్రీ దర్భశయనే స్థానే దర్భసుందర దైవతం
దర్భశయ్యా శయానం చ శ్రీరామం సానుజం భజే

అని ఖ్యాతి నొందినది దర్భశయన క్షేత్రము. ఇది చిన్న గ్రామము. దీనికి సముద్రము మూడు మైళ్ళు. అరవములోనీ క్షేత్రమును "తిరుపుళ్ళ" అని యందురు. రామేశ్వర యాత్రానంతరము ఈ క్షేత్రమును దర్శించుట యాచారము.

దర్భశయన క్షేత్రములో శ్రీ రామాలయమున్నది. ఆయన ప్రక్క ముకుళితహస్తుఁడైన లక్ష్మణున్నాడు. సీత రాముని ప్రక్క లేదు. అపుడా సాధ్వి లంకలో నున్నది గదా !

ఆలయములో శ్రీరాముఁడాదిశేషునిపై శయనించినట్లున్నాడు. శ్రీరామ మూర్తి యేడడుగుల పొడవున్నది. ఏరండ దీప కాంతిలో నాదాశరది సువర్ణ ఫలక మధ్యమునఁ బొదఁగఁబడిన ఇంద్రనీలమణివలెఁ బ్రకాశించుచున్నాడు.

చీకటి కావలన్ చెలుఁగుఁ జిన్మయమూర్తి యదేమి చిత్రమో !
ప్రాకట నీలకాంతి యుదరంబున నుండె గభీర ముద్రతో,
జేకొని భక్త పాపములఁ జేరినవారి యఘౌఘు నీలిమన్
దాఁకిన కందుచే నతఁడుఁ తప్పక నీలిమనందియుండెనో.

ఆ యాలయము ప్రక్క నవగ్రహ ప్రతిష్ఠలున్నవి. ఆ రాష్ట్రములో దేవాలయ ప్రాంగణములలో నవగ్రహ ప్రతిష్ఠలు సర్వ సాధారములు. వినాయక ప్రతిష్ఠలు సార్వత్రికములే. ఆ దేవదేవుని యంతికమందే లక్ష్మణస్వామి వినమ్రుఁడై ముకుళిత కరకమలుఁడై నిలఁబడియున్నాఁడు గర్భాలయమునకు

వెలుపల విభీషణ సుగ్రీవ విగ్రహములు రామాజ్ఞ కొఱకై నిరీక్షించుచున్నట్లున్నవి. ఆ విగ్రహములు.

"అన్నల జంపి యాశ్రిత జనావన ! రాజ్యపదంబులిచ్చి సం
పన్నులమమ్ముఁజేసితివి. మాకదిమాన్యము కాదు దేవ ! నీ
యున్నత పాదసేవ పురుహూత విధాతల కందనట్టి దో
యన్న ! యొసంగు మా"కనుచు నంజలిఁ జేసెదు నట్లు కన్పడున్.

ఆ యాలయమునకు వెనుక మహా ప్రకాండము కలిగిన యొక పిప్పల వృక్షమున్నది (రావి) యచ్చట నాగ ప్రతిష్ఠ చేసిన పిల్లలులేని వారికిఁ బిల్లలు కలుఁగుదురని ప్రతీతి- అచ్చట నాగప్రతిష్ఠ లనేకములున్నవి- ఆ చెట్టుక్రిందఁ బూర్వము మహర్షులు తపస్సు చేసిరఁట.

సముద్ర తీరమున నొక బావియున్నది- ముందు వాపీస్నానము పిమ్మట సముద్రస్నానము ఆ తరువాత దైవదర్శనము చేయవలయును.

"దర్భాః ఏవ- శయనం- శయ్యా- యస్మిన్ స్థలే- తత్ దర్భశయనం నామక్షేత్రం- అనగా- ఏ స్థలమందు దర్భలు (శ్రీరామునకు) శయనముగా నేర్పడి యున్నవో ఆ ప్రదేశమునకు దర్భశయనము. అని పేరు.

అదియొక విచిత్ర సన్నివేశము- మానవత్త్వములో దైవత్వమును బ్రద్యోతింపఁజేయు మహత్తర ఘట్టము, నీటిలో నిప్పును బుట్టించు మహేంద్ర జాలము

శ్రీరాముఁడు కపిసైన్యముతో సముద్రతీరమునఁజేరినాఁడు, సముద్రము దాఁటవలయును- అది యసాధ్యముకదా ! మార్గమిమ్మని యపాంపతినిఁ బ్రార్థించి నాఁడు- ఆతఁడనుగ్రహింపలేదు రాముఁడు దీక్ష వహించినాఁడు. ఉపవసించి నాఁడు- చివరకుఁబవిత్రములైన దర్భలను శయ్యగా నేర్పఱచుకొని యందు శయనించి అంతర్దృష్టియై యుపాసించినాఁడు.

ఇక్కడొక చిన్నప్రశ్న :- రాముడు భగవంతుడు గదా. సంకల్ప మాత్రముచేతనే సర్వము సాధింప సమర్థుఁడుగదా. మఱి ఆతనికేల యా యగచాట్లు, అని.

దశావతారములలో శ్రీరామావతారము దుష్టశిక్షణముతోఁబాటు మానవులకుఁగర్తవ్యమునుపదేశించుటకుఁ గూడ సంభవించినది. కావుననే శ్రీరాముఁడు వీలున్నంతవఱకు మానవాను సరణమున కనుకూలమైన ప్రవృత్తిలోనే ప్రవర్తించి నాఁడు. ఆవశ్యకమైనపుడు అజేయమైన దివ్యత్వమును బ్రకటించినాఁడు.

తన యవతారమును మానవుల కాదర్శముగా జేయుటయే యా ప్రభువు లక్ష్యము. ఆ లక్ష్యసిద్ధికొఱకే, సంకల్పసిద్ధి కలవాఁడైనను దివ్యత్వమును బ్రకటింపక మొదట కార్యసిద్ధికై మానవుడు చేసినట్లే సముద్రుని యనుగ్రహప్రాప్తికై నియమ నియమితుడై ధ్యానాదులను జేసినాడు. దేవతానుగ్రహము కొఱకు మానవుడు వ్రతధ్యానములనేగదా చేయుచుండును. మొదటనే రాముఁడు దివ్యత్వమును బ్రదర్శించిన యనుకార్యుఁడెట్లు కాఁగలఁడు? "రామాదివత్ వర్తితవ్యం" అను సూక్తికి మూదల యెట్లు కాఁగలడు? శ్రీరాముని చరిత్ర ఆద్యంతము ఈ లక్ష్యసాధనమున కనుకూలముగానే ప్రవర్తిల్లినది. అందులకే సముద్రుని శ్రీరాముఁడు సామాన్య మానవునివలెఁ బ్రార్థించినాఁడు.

ఒకరోజు గడచినది. సముద్రుఁడులుకలేదు, పలుకలేదు. రెండవరోజు దయించినది. అస్తమించినది. నిరంతరము చంచల స్వభావుఁడైనను సముద్రుఁ డేమాత్రము చలింపలేదు. మూడవదినమునఁగూడ నరుణకిరణుఁడు యథాతథముగాఁ బుట్టిన యింటినుండి మెట్టిన యింటికిఁజేరినాఁడు. సముద్రుఁడు రామునిఁగన్నెత్తి చూడలేదు సరికదా మిన్నంటునట్లు మేనుపెంచి విలయతాండవము చేసినాఁడు. తురీయ దినము వచ్చినది. సముద్రుని పొంగు క్రుంగలేదు. శ్రీరామునికి నాగ్రహము కలిగినది. ఆ మహాపురుషుఁడు జలనిధిని జడనిధి చేయ సంకల్పించి యిట్లన్నాఁడు. ఓయీ! జడధీ!

ఓర్పుగ దీక్షఁబూని, వినయోక్తులతో స్తుతియింప నేలపై
నర్పిత దర్భశయ్య, నియమాన్విత చిత్తుఁడనై పరుండి స
ర్వార్పణ మేను గొల్వఁ గనరావు, ఫలింప దనార్యులందు నో
దర్పిత! సామ, మింకఁదగు దండనమే నినువంటివారికిన్.

అంచులు మించఁబొంగి, మరియాదను నెంచక న్యాయ ధర్మముల్
వంచనచేసి, గర్వమున ఁబండిన జీవన మెందునట్లు కీ

లాంచిత దివ్య శస్త్రమున నంతముఁజేయుదుఁ జంచలాత్మ! నీ
పంచను మొల్వదింక నొక పచ్చని మొక్కయు నగ్గితూపునన్.

ఓయి! భంగాత్మ! నిజపరోద్యోగ గరిమ
నెంచలేనట్టి దుర్మతి సంచయమ్మ,
నామరూపాలు లేకుండ నణఁగిపోవు
నెపుడు నీవలె మూఢమై యేపులుడిగి.

లక్ష్మణా! యిమ్మ రిపుపటలాగ్ని హేంతి
చూచి రమ్మన్న నెవ్వారిఁ జూఁడివచ్చు
యముని దండము! గండ మన్యాయమునకు
ధనువు, త్రైలోక్య విజయ సాధనము ఘనము.

**మత్తకోకిల :**

అనుచు రాముఁడు నిప్పుకోలను నాగ్రహంబునఁ గూర్పఁగా
గొనయమందున, ధాత్రియూఁగెను ఘోషపెట్టె గిరీంద్రముల్
వణకె దిక్కులు రాలెరిక్కలు భ్రాంతినందెను భూతముల్
దిన నిశాకర బింబముల్ తమ తెన్నుఁదప్పెను భీతిచే.

రౌద్రము రూపవంతమయి రాచసిరిన్ గనులందు నిల్పఁగా
భద్రుఁడు రామభద్రుఁ డరివంశ మహాగ్ని శరమ్మ నెత్త, ని
ర్నిద్రుడు వాహినీపతి జనించిన భీతిని, నిల్వ నిల్వ, వా
తద్రుమ రీతిగా వణఁక, దైన్యము కన్నుల నాశ్రయింపఁగా.

చేతులు మోడ్చి రామపద చింతకుఁడై త్వరఁగా సదారుఁడై
భూతల నాథు కట్టెదుట భూతల చుంబిలలాట భాగుఁడై
చేతము సంభ్రమింప నిలచెన్, బలికెన్ గళ గద్గదస్వరా
ధూత పదంబులన్, వినయ ధూర్వహ భావము మోసులెత్తఁగా.

పాహి! రమాపతీ! దళిత పాప విజృంభణ! నీదు సేవ నా
దేహము పావనమ్మ, గృహ దేహళి తీర్థము క్షేత్రమయ్యె నీ

యూహిత పాదముద్రలను, ఆ గ్రహమున్ దలయెత్త నీకు, దా
సోఽహమటంటి, నీయలుక చొప్పగునే ననువంటి దీనుపై.

ఘోరమదాంధ దుష్ట గజకుంభ విపాటన దక్షమై, మహా
క్రూర నిశాచరోద్ధతి నిరోధిక శీలమునై, మహేంద్ర దు
ర్వారమునైన నీ పటుతరాస్త్రము చెల్లునె? బంటుపైన ని
ష్కారణ మిట్లు వేయఁ, జటకంబు పయిన్ ద్రుహిణాస్త్రరీతిగా.

నాకు స్వరూపమిచ్చు క్షితినాథులు సాగరు, లట్టివారి పు
ణ్యాకర వంశమందు జననంబును బొందితివీవు, శ్రీసతిన్
జేకొని నన్ను మామనుగఁ జేసినవాఁడవు సర్వ దేవతా
నీకపుఁజక్రవర్తి విట నిల్చుటఁ బొంగితి జానకీపతీ.

తాదృశమైన నాయునికి దర్పపుఁజిహ్న మటంచు నెంచి క్రో
ధోదయ మయ్యెనీయెడ మహోదయ! బిత్తరిజింక యెన్న డే
నాదను వీటఁబుచ్చి మృగనాథుని డీకొన సాహసించునే?
నీ దయఁగోరినాఁడ గరుణింపుము నింపుము జాలి నాయెడన్.

అని వినయంబుగాఁ బుడమియందునఁ జాఁగిలి మ్రొక్కి, యమ్మయుం
డణకువనుండ వాహినులు హస్తములన్ జతఁజేసి "స్వామి! యా
ననముల కుంకుమ ప్రభల నాశముఁజేయకు, సూత్రకాంతికిన్
గునుకును గమ్మనీకు" మని కొంగులు పర్చిరి భర్తృభిక్షకై.

కని కరుణాపయోనిధి యగాధ మనస్వి, పయోధి కాంతలన్
గనికరమొప్ప లెండనుచు నల్లనఁబల్కె సముద్రరాజ! నా
ధనువుననున్న బాణము వృథా యగు టెన్నఁడు లేదు. లక్ష్యమున్
దునుమక నిల్వఁబోదు. మును దూఁగదు, తూఁగిన యాగఁబోదిఁకన్.

నీ దేహమొ, లేకున్నను
నేదో లక్ష్యమ్ము వేగనిమ్ము సముద్రా!

మోదమెు ఖేదమెు నీలోఁ
బ్రాదుర్భావంబునందఁ బ్రాజ్ఞుల మూర్తీ.

అని రఘునందనుండు పలుకాడఁగ, నీరము తేఁడు మెల్లఁగాఁ
దన జవరాంద్రతో నిలచి ధైర్యము కొంచెము కూడఁగట్టి, ఓ
యినకుల సార్వభౌమ ! కన నెంతటివాఁడను నీకు, నీ దయా
ధనమును మించు సాధనము ధారుణి నున్నదె చింత వీడఁగన్.

ఉగ్రాగ్నిచ్ఛటలన్ సమస్త భువనాయుస్సార మింకించు నీ
వ్యగ్రాస్త్రోద్భవ తీవ్ర దండనము నోయయ్యా! సహింపంగలే
నగ్రాహోగ్ర్యద్ధత దుష్టరాక్షసులు నాయం దాఁగియున్నార లా
కుగ్రాహంబుల నోరు కొట్టుము భవత్ క్రూరాస్త్ర పాతంబునన్.

అని మనవిచేసి మిన్నుముమ్మనుమఁ డపుడు
కానిపించెను దనలోని ఘూతుకులను
నాలుకల్ సాచి శ్రీరాము నారసమ్ము
కాటు వేసెను రాక్షసగణము నపుడు.

రాక్షస సంఘము శిక్షితమైపోవ
విశ్రాంతిఁబొందె నావేఁడికోల
తన కార్యమును దీర్చి, దర్భల నుపవిష్టుఁ
డైనట్టి రాముని సరసి యబ్ధి
మానవాకృతినున్న మాయాద్వితీయ ! నీ
పరతత్త్వ మెఱుగంగ వశమె నాకు
నా పేరు ధరణిపై రూపుదిద్దుకొనంగ
దయచేసి తిట్టు లవ్యయ ! యనాది
నీదు మహిమార్ణవంబులో నీటిబొట్టు
నైన, నన్దాఁట శక్యము కాని పనియె
హృదయావార్ధి ! సర్వ దిగీశ వినుత !
వినుత రక్షక ! నీకు గంభీరహృదయ.

కపిసందోహమునందు శాత్రవ మహాకాలుండు నీలుండు నాఁ
గపివర్యుండొకఁడుండు నాతఁ డగదంకారాగ్రగణ్యుండు శా
స్త్రపయోధిన్ జులుకించినట్టి ఘనవిద్యాపారగుం డాతఁడే
యుపయోగించును నబ్ధితారణమునం దోరామ ! దీనావనా !

శిలలన్ దారువులన్ వలీముఖము లార్జింపంగ, నా నీలుఁడ
వ్వాల హస్తంబునఁదాఁక, ఊాలు పులకింపన్ గాంచి, నా మేనిపై
వెలయంజేయుఁడు, నేనువాని నిలుపంబెట్టంగ శక్తుండ. నా
వలనన్ గాఁగల దెట్టిదైన నొనరింపన్ జాలుదున్ రాఘవా.

నీవు పరాత్పరుండవని నిక్కము నమ్మితి. నీదు పాదసే
వావసరమ్ము నాకు గతమందలి సత్కృతివల్లఁగల్గె. నీ
పోవు పథమ్ము నేర్పఱుపఁబోలుదు జీవన మీవలావలన్
ప్రోపులఁజేసి పోవఁగల త్రోవలఁజేసి, రమా మనోహరా !

కాని యొక్క చిక్కు కల్గు, నొక్కండు నీ
చరితవిన్న వీరుఁడగని నన్నుఁ
త్రోవయడుగ నాకుఁద్రోవేది ? కాదన,
భద్రమేది నాకు ముద్రపడిన.

నాదువిన్నప మాలించి నాదుక్షేమ
మెంచి నేచెప్పినట్లు చేయింపుమయ్య !
నిఖిల సృష్టికిఁ బ్రభుఁడవు- నీదికాద !
నాదు రక్షణమంత అనాథ నాథ

అనుచు వచియింప నీరధి, యట్లె జఱుగ
వార్థియెదపైన వారధి పఱఁగెనొకటి
వాయు పుత్రాది కపివరా నీయమాన
తరుశిలా శైల కల్పితాధారమగుచు.

కట్టుకొమ్మె౯ రప్పడెన్ గాని కఠినతరము
దానిపై మేను, గాలూనఁదగదు. చూచి
ఉడుత యొక్కటి యిసుకలోఁ బడియుపొర్లి
మేను విదిలించె వంతెనమీద నిలచి.

భక్తబంధువు రాముఁ డాసక్తితోడ
చూచి చిక్రోడ కార్యమ్ము చోద్యమంది
అభయ ముద్రను ధరియించు హస్తమెత్తి
దాని వీఁపును నిమిరె మోదమ్ముతోడ.

నాఁటఁగోలెను వీఁపున నాటుకొనెను
మూడు గీతలు చిక్రోడమునకు సతము
చిత్తశుద్ధియె శ్రీపతిఁ జేర్పఁగలదు.
నేర దితరము దాంభికాచారసరణి.

ఉడుతను బ్రోచి, పోకడకు నొప్పిన మార్గముఁ జక్కఁజేసి యే
పుడిగి సదారుఁడై వినయ ముద్ర వహించి సమక్ష భూమిలో
నడియరివోలెనున్న యుదకాధిపుఁజూచి మనుష్యదేవుఁ డి
బ్బడి కరుణా సుధల్ గురిసి పల్కెను, వత్సలతా భరంబునన్.

మా యినవంశపూర్వకృత మాన్య సుయత్న ఫలప్రభూత! స
న్మాయిత దివ్యరూప! అరుణాన్వయబంధముచేత బాంధవం
బోయి! మనిద్దఱన్ గలిఁగెఁ. బొంపిరి వోయెడు కీర్తి కల్గుటే
న్యాయము నీకు దర్భశయనంబున, నిట్లు వరంబు నిచ్చితిన్.

అనుచు దీవెనలిచ్చి యా యరుణ కిరణ
కులము దీపమ్ము లంకకు వెలసె. రామ
వరముచేతను నాతీర్థవరము దర్భ
శయన మంచును బేరొందె సర్వదిశల.

ఆ మహాక్షేత్రములో వాపీ సముద్ర స్నానములాచరించి దైవదర్శనము చేసికొని ఈషణ త్రయమునకు శోషణమును గల్పించు నవపాషాణక్షేత్ర దర్శనమునకు బయలుదేరితిమి.

## నవపాషాణములు

శ్రీరామచంద్రుడు లంకపై దండెత్తిపోవుచు దేవీ పట్టణము దగ్గఱకు వచ్చినాడు. తాను దల పెట్టిన రావణ విజయము నిర్విఘ్నముగాఁ బూర్తియగుటకై యచ్చట నవగ్రహ ప్రతిష్ఠ చేయఁదలపెట్టినాఁడు. గ్రహములు వక్రించినచోఁ గార్యఫలము కూడ వక్రించునుగదా.

ఆంజనేయస్వామి, శ్రీరాముని యాజ్ఞచేత గ్రహరూప చిహ్నితములైన తొమ్మిది పాషాణములను దీసికొనివచ్చినాఁడు. పిమ్మట సుముహూర్తమున లక్ష్మణాగ్రజుఁడు సముద్ర తీరమున ఆ నవగ్రహములను బ్రతిష్ఠ చేసినాఁడు. వానినే నవపాషాణములందురు.

"నవానాం పాషాణానాం సమాహారః" అని సమాహార ద్విగువు చేసినచో నవపాషాణం అని సమాసము చేయవలయును కాని సంజ్ఞ యగుటవలన "నవ పాషాణములు" అని బహువచనాంతమయినది.

తొమ్మిది గ్రాములచ్చట నిధుల్ వలెనుండి, తమున్ భజించు బృం
దమ్ములఁ బ్రోచు బాపి వివిధాపదలన్, రఘు నందన ప్రభా
వమ్మున గొప్ప క్షేత్రముల పంక్తినిఁ దానమువందె దివ్య తీ
ర్థమ్మది, వార్థియంకమున రాపెడి నందని క్షీరకంఠమై.

దాశరథి నవగ్రహ ప్రతిష్ఠ చేసిన యా ప్రదేశమును దరువాత శరధి దురాక్రమణము చేసినాఁడు. కాని నవగ్రహముల యాగ్రహమునకు భయపడి యేమో యా ప్రాంతములోఁ దన యార్భాటమును జూపక యాతఁడు గ్రామ సరస్సువలెఁ బ్రశాంతముగానున్నాఁడు నవగ్రహము లక్కడ నూరుదఘ్న లవణజలములలో నోలలాడుచున్నట్లుండును. గ్రహముల యనుగ్రహమే యెల్లరకు క్షేమదాయకముకదా !

బాటకు వందగజముల దూరములోఁ దొడబంటి సముద్ర జలములో నవ పాషాణములున్నవి. మేమా గ్రహముల దర్శించి స్తుతించి తిరిగి బాటను జేరి యాఱు కాళ్ళ వాని నధిరోహించి ధనుష్కోటి కభిముఖులమైతిమి.

## ధనుష్కోటి

రామేశ్వరమునకు సుమారిరువదిమైళ్ళ దూరములో ధనుష్కోటి యను క్షేత్రమున్నది. యాత్రికులు రామేశ్వరయాత్రానంతర మీ క్షేత్రమునుగూడ దర్శింతురు.

శ్రీరాముఁడు రావణుని సంహరించి సీతతోను బరివారముతోను బుష్పకముపై బయలుదేఱి సముద్రోత్తర తీరమున దిగి యచ్చటఁ గొంతసేపాగి సేతువును బరిశీలనముగాఁ జూచినాఁడు, ఆ సేతువు పవిత్ర కార్యముకొఱకై నిర్మింపఁబడినది- ఆ కార్యము పరిసమాప్తమైనది. ఇఁక నీ సేతు వేయపవిత్రకార్యము కొఱకు నుపయోగపడకూడదు. ఆ సేతు వట్లేయున్న దుర్మార్గులు కూడ దాని ద్వారా ముందు ముందు లంకాపురమునకుఁబోయి దాని నపవిత్రము చేయుదురు- అట్లు జఱుగకూడదని ధనువుయొక్క కోటితో (కొనతో) ఆ సేతువును మోదినాఁడు. ఆ దెబ్బ కా వంతెన కూలిపోయినది. అది మొదలుకొని యా ప్రదేశము "ధనుష్కోటి యనుపేరుతోఁ బ్రసిద్ధి చెందినది- "ధనుషః కోటిః" అని దానికి విగ్రహవాక్యము- దానికి ధనువుయొక్క చివరి భాగమని యర్థము. ధనుస్సుయొక్క యగ్రభాగముచేత సేతుభంజనము చేయఁబడిన ప్రదేశమని ఫలితార్థము.

ఇక్కడొక ప్రశ్న :- తాను నిర్మించినది తన కత్యంతోపకారము చేసినది యైన సేతువును రాముడు స్వయముగా నాశనము చేయుట న్యాయమేనా- అది కృతఘ్నతా లక్షణము కాదా ?

**సమాధానము :**

దైవము చేఁత, యేరికి యథార్థముగాఁ దెలియంగరాదు. జ్ఞా
నావృత చిత్తులే తెలియనర్హులు గారు తదీయ కార్యముల్.
కావఁగ లోకమున్ సృజనకార్యము చేయు విధాత, తీఱఁగా
ర్యావసరమ్ము దాని హతిమార్చును- నయ్యది కీడు చేయుచోన్
పెంచిన మొక్క యెంత విషభీకరమైనను, దానిఁద్రుంచుటల్
మంచిది కాదటంచు బుధులాడుదు, రయ్యది నీతివాక్యమే
యెంచఁగ, ఁగాని హాఁవ దుదయించిన నా చెడుమొక్క చేత, నా
వంచక భూజమెట్లు జనవంద్యమగున్ స్థితినెట్లు పొందెడున్.

సామాన్య విశేషంబుల,
నీ మహిలో నీతియుండు, నెందైనను నా
సామాన్యము వర్తించును,
సామాన్యేతరము సమయ సందర్భములన్
సామాన్యము భేదించుచు
క్షేమముగాఁగార్యసిద్ధిఁ జెందును. దోషం
బేమాత్ర మందు నుండదు,
ఈ మాదిరి నీతి, నీతియే యగు జగతిన్.

హింసను జేయ రాదనుట, యెంచఁగ సార్వ జనీన నీతి. గో
హింసను నిష్టమందు జతిపించుట యాను విశేషనీతి. యే
హింస పరోపకారమున కేర్పడియుండునో, యట్టి దానినిన్
హింస యనంగ రా దది యహింసయె, దూరముఁజూడఁ గల్గినన్.

కావున సేతు బంధన మకార్యము కాదు- రాముఁడు కృతఘ్నుడును గాడు.

ధనుష్కోటి గొప్ప పుణ్యక్షేత్రము. "కోటి నదులు ధనుష్కోటిలో నుండఁగ" అని ప్రఖ్యాతి వహించిన దా తీర్థరాజము.

**1969** సంవత్సరములో వచ్చిన పెనుతుఫానులో సాగరుఁడు ధనుష్కోటి నాక్రమించుకొని సొంతము చేసుకొన్నాడు- అతడు నారసమువంటివాఁడు గదా- సేతు నిర్మాణ సమయములో- రత్నాకర మహోదధి నామములతో రెండుగాఁజీలిన పారావారము సేతు భంజనానంతరము తిరిగి మహోదధినామముతో నొకటైనది- ధనుష్కోటి సాగర సంగమముగా- పవిత్ర క్షేత్రముగా రామావతార మహిమకు సూచకముగా నిలఁబడినది.

## శ్రీరంగము

శ్రీరంగ మొక పుణ్యక్షేత్రము- అది కావేరీనది యొడ్డుననున్నది. శ్రియః- లక్ష్మ్యాః (సంపదః) రంగః- నాట్యస్థానమ్=శ్రీరంగః. తస్య ఈశ్వరః శ్రీరంగేశ్వరః అనగా సంపదలకు నిలయమైన పట్టణ మని భావము- దానికి (ఆ పట్టణమున) నీశ్వరుఁడు శ్రీరంగేశ్వరుఁడు.

అచ్చటఁగూడ కావేరి మహావేగవతి. ఆమె ప్రకృతియే యంత. ఆజలనిధి గడుసుపురంధ్రి యనుభావము నిట్లు వర్ణించితిని.

నాలుక తేలికై నలువ నాలుక పంటను సుస్వరంబుగా
నోలి వచింపఁజాలు, జటిలోద్ధత శాస్త్ర రహస్య చర్చలన్
హేల గ్రహింపఁ జాలు, గహనీకృత కావ్య రసామృతంబులన్
లీలఁగఁ ద్రావఁజాలుఁ, జవులీనెడు నీ జలపాన శక్తిచే.

కోయిల గొంతులోని రసకోమల గానము, నారదీయ గీ
తాయత హృద్య శాస్త్ర నిలయ స్వరసంపద, తాల నీరుఁగాఁ
జేయఁగలట్టి రాగజ విశేషముఁ, బొంది నరుండు మాఱుడే
గాయక సార్వభౌముఁడుఁగఁ. గన్మని నీ జలసేవ వాహినీ.

ఇచ్చటఁ గావేరి దక్షిణకావేరి ఉత్తరకావేరినిఁ యను నామములతో రెండు పాయలైనది ఉత్తర కావేరిని దమిళములో "కొల్లడం, అని యందురు. అనగా" పాపములను నాశనము చేయునది. యని యర్థము.

శ్రీరంగము చరిత్ర ప్రసిద్ధికల పట్టణము. ఒకప్పుడది యమరావతికి దీటైనది. మఱియొకప్పుడది యాంగ్లేయ మహా వాత్యాహతికి గుండెనిచ్చి బెండు పోయిన మహా వటవృక్షము

శ్రీరంగ మొక సుందర ద్వీపము. కావేరి, యగడ్తవలె దానినిఁ బరివేష్టించి యున్నది. శ్రీరంగము సాక్షాత్తు వైకుంఠపుర శ్రీ రంగము. సప్తప్రాకార భూషణ భూషితమైన శ్రీరంగము శ్రీరంగధాముని బహిరంగము. సప్త ప్రాకారవలయిత మైన నగరమింకొకటిలేదు. విభీషణుఁడు ప్రత్యహము మధ్యేరాత్రము వచ్చి స్వామిని సేవించి పోవుచుండునఁట. శాసనాధారములవలన నీ యాలయము నాలుగువేల సంవత్సరములకు ముందే నిర్మింపఁబడినట్లు తెలియుచున్నది.

ఆ శ్రీరంగ దేవాలయమునకు చుట్టును నేఁడుప్రాకారములున్నవి. పదిహేను గోపురములున్నవి. నారికేళ కదళీ వనములు. తోఁటలు నీరంధ్రములుగా నున్నవి.

చుట్టును గావేరి యున్నది. ఆ కావేరీ మధ్యమందున్న యా దేవాలయ గోపురాదులు.

నాల్గు దిశావిభాగముల నాక్రమణంబును జేసి నీలమై
వెల్గెడు వార్థి మధ్యమునఁ బేరిన దిబ్బలపైన రూపముల్

గల్గిన దీవులో యనఁగఁ బ్రాలును దోఁటలు గోపురంబులున్,
మెల్గిన సాలముల్ విపులమేదినిఁబోల్చిన కొండలోయనన్.

ప్రాఁతదైనట్టి వైకుంఠ పట్టణంబు
మీఁద నాదరమందక మృదుల వనవి
రాజమానము శ్రీరంగ భాజనమ్ము
చేరినట్లుండె శ్రీహరి చింతవదలి.

మొదటి ప్రాకారమందు రంగనాథాలయ మున్నది. దీనినిఁ దమిళములో "తిరుపగుడె" యని యందురు. ఆలయములో స్వామి శయనించి యున్నాఁడు. ఆ విగ్రహము చాలపెద్దది. ఆ దేవాలయములో జన కలకలము చాల తక్కువ. జనసముదాయ మెక్కువ.

సీమలు లేని దేశముల క్షేమములన్ దగఁజూచి స్వామి యే
జామున వచ్చి పండెనో ప్రశాంతికి భంగము చేయరా దటం
చా మహనీయమూర్తి నిలయంబునఁ బెద్దగ మాటలాడఁగా
నేమొ? యటంచు నెవ్వరును నేమియుఁబల్కరు భక్తి నింపునన్.

శ్రీరంగధాముని యాకారము చీకటిలో నుండి యస్పష్టముగా గోచరించును. ప్రత్యేకముగా రుసుము చెల్లించినవారికి మాత్రము కాగడాలవెలుఁగులో నర్చకులు స్వామి యాకారమును బూర్ణముగాఁజూపింతురు. లేక హారతి యిచ్చునపుడు స్వామిని దర్శింపవచ్చును. హారతి యిచ్చుట యననేమి? కర్పూరమును వెలిగించుట. స్వామిచుట్టు నొకమాఱు త్రిప్పి యార్పుట. ఆ కర్పూరమే మఱి నాల్గు హారతులకు సరిపోవలయును. హారతి రుసుము మాత్రము ప్రతి భక్తుని దగ్గఱ వసూలు చేయుదురు.

ఈ యాలయ ద్వారములు స్వర్ణ ఫలకములతో నిర్మింపఁబడినవి గర్భాలయముపైనున్న విమానము కూడ సువర్ణమయమే. అది యోంకారాకార రూపమున నుండును. దేవాలయమున కెదురుగ బంగారుధ్వజ స్తంభమున్నది. దానికిఁ గొంచెమావల స్వర్ణసీత విగ్రహమున్నది.

జాయాహీనుని యజ్ఞ కార్యమును శాస్త్రం బొప్పమిన్ నాఁడయో
ధ్యాయజ్ఞంబున రామచంద్రుఁడును సీతన్ స్వర్ణమూర్తిన్ స్థిరం

బైయుండన్ నిలిపెన్ మనోజ్ఞముగఁ దత్పార్శ్వంబునన్, బిమ్మటన్
ధ్యేయంబయ్యెను దేశభాగముల స్వర్ణీభూత సీతాకృతుల్.

విడిచి యవతారమును రామవిభుఁడు చనఁగ
భక్త రక్షార్థమై సీత పరమపూజ్య
స్వర్ణమూర్తిగ నిక్కడ సాధ్వి తాను
వెలసినట్లుండె భక్తుల పెన్నిధివలె.

ఆ ప్రక్కనే యొక మండపమున్నది- దానిలో రంగయ్యస్వామికి ధనుర్మాసాది యుత్సవములు చేయుచుందురు. ఆ మండపమును- "రేవతీ మండప" మనియు, "చిలుకల" మంటపమనియుఁగూడ వ్యవరింతురు.

రెండవ ప్రాకారమును "విరజవటి" అని యందురు- స్వామికి వెనుక నుత్తరద్వారమున్నది- వైకుంఠ యేకాదశినాఁడు స్వామిని ఈ ద్వారము నుండియే బయటకుఁదీసికొనివచ్చి ప్రజలకుఁజూపింతురు- గుడికెదురుగ నొంటి గరుడ స్తంభమున్నది- దానిని దర్శించిన యనంతరమే రంగనాథ స్వామిని దర్శింపవలెను.

మూడవ ప్రాకారమునకు "అవినాడ తేరువీధి" యనిపేరు- ఆ ప్రాకారములోఁ గోదండ రామాలయమున్నది- శ్రీరామస్వామి యక్కడ నాలుడుగుల పొడవు కలిగి గంభీరుఁడై యుండును- నీల శిలాంతరస్థితుఁడైన యా కౌసల్యానందవర్ధనుని దేహమంతయు సువర్ణ ఫలకావృతము- ఆ స్వామి.

అంజన పర్వతంబుపయి నంచిత సాంధ్య పయోదమట్లుగాఁ,
గుంజము నగ్రభాగమున గోరిట గుల్మము పూచినట్లుగా,
రంజిత మేఘ దేహమున ప్రోదిని తీవలు ప్రాఁకినట్లుగా,
మంజిడిపైన శుభ్రకుసుమంబుల నల్లిన యట్లు లొప్పెడున్.

జానకి పార్శ్వమం, దెదుట సంచిత పుణ్యుఁడు నాంజనేయుఁడున్
మానితకీర్తి లక్ష్మణుఁడు మర్దిత శత్రువు ప్రక్కలందునన్,
పూనిక వెన్క నా భరత మూర్తియు నుండఁగ మధ్యమందు వి
శ్వానికి రక్షకుండయి ప్రశస్తిగనెన్ రఘురాముఁడచ్చటన్.

ఏమరి పాటునఁ జూచిన
నే మనుజులో యంచు జూపఱెల్లరు భ్రాంతిన్
వేమరు పొందఁగ నిలఁబడె
రాముఁడు భక్తానుజార్ధరామా యుతుఁడై.

ఆ ప్రక్కనే వైకుంఠవాసుఁడు ఆ భూలోక వైకుంఠమున శ్రీదేవీ భూదేవీ నీళాదేవులతోఁ బొరపొచ్చెములు లేని కాపురము చేయుచున్నాఁడు. దాని ప్రక్క పట్టాభి రామాలయమున్నది-దానిలో విభీషణుఁడు విభీషణుఁడై రాముని విగ్రహ రూపమున సేవించుచున్నాఁడు- స్వామికెదురుగానున్న ఖగపతి.

నా పృష్ఠమ్ము త్వదీయ పాదజలజ న్యాసాప్త సౌగంధ్యమై
ఈ పృథ్విన్ బ్రబలెఁదిన్ గనెన్ సకల లోకేశేశ్వరా! ఓ ప్రభూ!
నీ పాదంబుల సంతతంబు నిలుపన్ నేఁగోరుదున్ వీఁపుపై
శ్రీపాలా! శ్రితభూజ! రమ్ము ననుఁబాలింపంగ భక్తావనా!

అని యర్థించుచున్నట్లుండును- ఆ స్వామికిఁ గోట్లవిలువచేయు రౌప్యాభరణ పాత్రాదులున్నవి. 1875 సం॥లో- ఏడప ఎడ్వర్డు ప్రభువు స్వామికిఁబెద్ద బంగారు పళ్ళెరము నుపాయనముగా సమర్పించినాఁడఁట.

నాల్గవ ప్రాకారమును "ఆళ్వార్ తిరుచ్చి" యందురు- ఈ ప్రాకారము మీద మూడు వైపుల మాత్రమే గోపురములున్నవి- తూర్పుగోపురము వెండి కొండకు వెనుక పుట్టినట్లుండును- అందువలన దానిని శ్వేత గోపురమందురు- ఆ గోపురము- 160 అడుగుల ఎతు గలిగి యనర్ఘ శిల్పభూషితమై యుండును దానికావలనే సహస్ర స్తంభ మంటపమున్నది.

ఎంతటి గొప్పవాఁడో! అమరేంద్రపురీ పరిణద్ధ శిల్పసం
క్రాంత విశిష్టబుద్ధి మొనగాఁడు శిలాహృదయాంతరాళమున్
పంతము పట్టిచూచి పసిపట్టి గ్రహించెనొ నాఁటిశిల్పి, లే
కింతటి జీవరేఖ తులకించునె మంటప శిల్ప మందునన్.

ఏక శిలా ప్రకాండముల నింపుగఁజెక్కి సృజించె స్తంభముల్
ప్రాకట శక్తి యుక్తి నిరవగ్రహ పారదబుద్ధి శిల్పి, యం

దే కనుపించు సర్పపతియింటను జెక్కెను, టంకజీవకుం
డేకశిలన్ హరీంద్రముల, నెల్ల విభాగము లక్షి కందఁగా

సర్పపతి యిల్లనగా నక్కడనే యున్న శేయరాయర్ మండపము.

ఒక్క రాతినిఁ బొడవంది యున్న బొమ్మ
లందు సూక్ష్మాంశముల్ స్పష్టముగను జూచ
శిల్పధనుఁడైన దాపసిచేతి కెందు
నెదురు కల్గునె? యా సృష్టిపదును చెడునె?

ఆ ప్రాకారములోనే శ్రీరామానుజాచార్యులవారి చర్మసమాధి (శవసమాధి యున్నది. ఇందులోనే దక్షిణ ద్వారమువద్ద ఆండాళమ్మవారి సన్నిది (గుడి) యున్నది- వీధుల పేర్లను- అక్కడ దేవతా చిత్రములను వానిక్రింద వ్రాసిన తెలుఁగు వివరణములను బరిశీలించిన నాప్రాంత మానాఁడు తెలుఁగు రాజుల యేలుబడిలో నున్నట్లు తోచుఁను.

శ్రీరంగ నాథుని యర్థాంగి శ్రీరంగనాయకి- ఆమెను దమిళములో శ్రీరంగ నాంచార్ అందురు- ఆమె యయ్యవారికి దూరముగ నున్నది (4వ ప్రాకారము) ప్రసిద్ధ క్షేత్రములలో నయ్యవారు- అమ్మవారు- వేఱు వేఱుగనుందురు- ఆ వేఱుగ నుండుట యొక సృష్టిరహస్యమును సూచించుచున్నది.

ప్రకృతియుఁ బూరుషుండు నొకరై జగముల్ సృజియించుచుండు రం
చొక కథ యుండెఁగాదె, యదియెప్పుడు, పూరుషుఁడంతరాత్మయై
ప్రకృతి కతీతుఁడన్న పరభావము గుర్తును జేయఁగోరి త
న్నికటము చేరకే కమలనేత్రుఁడు వేఱుఁగఁదోఁచుఁ గోవెలన్.

ప్రకృతి చీకటి పురుషుండు పగటితేఁడు
వెలుఁగు చీకటు లొకచోట నిలువఁగలవె?
అన్న భావము జగతికి నంది యీయఁ
బఱఁగు వేఱుగ దేవదాంపత్యమిలను.

"పురుషః ప్రకృతేరన్యః" అను వేదాంత వాక్యమిందుకు దృష్టాంతము.

అమ్మవారి యాలయముకూడఁ జాలపెద్దదే. ఆమె విగ్రహము చాల హృద్యము. ఆ ప్రక్కనే ఆ దేవతపంచలోహ విగ్రహమున్నది. కంబర్ కవి యచ్చటనే రామాయణమును వ్రాసినాఁడఁట. ఆ ప్రక్కనే యొక గోశాల యున్నది. దానిలో సుమారేబది యావులున్నవి. గోవు హిందువులకు దేవత కదా! అందువలన నచ్చటకు వచ్చు యాత్రికులు. అవిసియాకులను గోసి కామధేనువుల నోటికందించుచుందురు.

ఇంటఁబుట్టిన లేకున్న నొంటఁబుట్టి
నట్టి సంస్కార మెన్నఁడు నణగిపోదు
యడ్డు తొలఁగిన వెంటనే యదియె పొంగి
కదలి యుబుకును బాతాళ గంగవోలె.

ఐదవ ప్రాకారమునకు "ఉత్తరవీధి" యనిపేరు. పట్టణ మీ ప్రాకారము నుండియే ప్రారంభమగును. ఇది బ్రహ్మాండ ఖాండమువలె నుండును.

గర్భమునందు లోకములఁ గైకొని, కంటిని ఱెప్పవోలె స్వీ
యార్భక సంచయ మ్మహరహంబును బ్రోచెడు బమ్మగుడ్డునా,
నిర్భయతన్ బ్రజావళిని నిండుగ లోపల దాఁచి యెట్టి సం
దర్భములందుఁ బ్రోచును ముదంబునఁ బంచమసాల మచ్చటన్.

గృహములు గోపురంబులు నగేంద్రసమున్నత సౌధపంక్తులున్
బహువిధ పణ్యవస్తు గృహబంధుర వీథులు తోరణంబులున్
కుహు కుహు కూయు కోయిలల నొప్పెడు తోఁటలు వార్క్ష
వృక్షముల్
రహిఁ దులకించు సుందర తరంబుగ నైదవ సాల మందునన్.

సాలంబుండును గోట కెక్కియునన్, సర్వ ప్రజానీక ని
ర్వాలంబౌ నగరాల వాలమయి ధాత్రిన్ వప్రమిచ్చో వినా
గాలింపంగను పట్టు, దన్య నగరాగ్రణ్యమ్ము శ్రీరంగమున్
బాలింపంగను రంగనాథుఁ డిది విశ్వంబందు విఖ్యాతమౌ.

రాజ్యపాలనకున్ దైవరాజసేవ
కనువుగానున్న యేడు ప్రాకారములను
ఎంత విజ్ఞానవేత్త సృష్టించెనొక్కొ?
వాని శక్తికి లోకమే పరవశమగు.

ఆఱవ ప్రాకారమునకు- "చిత్రవీధి" యనిపేరు, చిత్రము అనగాఁ చైత్ర మాసమని యర్థము, చైత్ర మాసములో జఱుఁగు బ్రహ్మోత్సవపుటూరేగింపు ఈ వీధినుండి వెళ్ళును. అందువలన నీవీధి కీనామము. ఈప్రాకారములోఁగూడ గ్రామమున్నది.

ఏడవ ప్రాకారమునకు "సాతానులవీధి" యని పేరు, సాతానులనగా హరి దాసులు, వారుండుటవలన నా వీధికా పేరు వచ్చినది.

తానంనామ తన్నకారేణ గీయమానః సంగీత విశేషః తానేన సహితః సతానః- గాయకః- ఇత్యర్థః- సతాన ఏవ సాతానః- (అనగా సంగీత విశేషము లతో భగవంతునిఁ బ్రార్థించు వాఁడని ఫలితార్థము.

శ్రీరంగములో సాతానులు కాలత్రయ మందును శ్రీరంగేశ్వరుని గుణ గణములను స్తుతించుచుందురు- వారి యుద్యోగమదియే- వారి జీవన భృతికి మాన్యములుండును- మాన్యములనఁగా సామర్థ్యమునకు బహూకరింపఁబడు క్షేత్రములు. ఈ సాతానులనే వంది మాగధులనవచ్చును.

గుడిచుట్టేడు బలిష్ఠవప్రములు హాంగుల్వార నా గోపురం
బొడఁగూడున్ నగరంబు సర్వ విధ భక్తుల్ రేపవల్ కావలా
నడుపన్, దుస్తర వార్థివోలెఁ బరిఖా న్యాయమ్ముఁ గావేరి చే
యుచుఁ, దాఁ దైవత చక్రవర్తివలెనే యుం డచ్చుటన్ రంగడున్.

మఱియుఁ గావేరి, శిఖిపింఛహాళి వేష్ట-
నంగనాజన పరివృతుఁడగుచుఁ దీర్ఘ
మాడు దీర్ఘిక మర్యాద నంది చెలఁగు
గానసావేరి కావేరి కలుషహారి,

ఈ వీధి యందుఁగూడ పట్టణమున్నది.

ఈ దేవాలయ దక్షిణ ద్వారమును విజయనగర ప్రభువైన యచ్యుతి దేవరాయలు నిర్మింపఁజేసినాఁడఁట. అందువలన నా ద్వారమును "రాయద్వార"మని పిలుతురు.

కావేరీ తీరమున నొక పూల తోఁట యున్నది. దాని వైశాల్య మిరువది యకరములు. అది సాక్షాత్తు నందనవనమే. ప్రతి దినము శ్రీరంగని పూజ కీతోఁటనుండి గంపల పూలు గొంపోఁబడును రంగడు పూల రంగడుగదా! అందులకే ఆయనకచ్చట అంతటి పుష్పమాలాకైంకర్యము అక్కడనే యొక గదియున్నది. ఆ గదిలో స్వామివారి కైంకర్యమునకు మాలలనుగట్టుదురు. పాద ప్రక్షాలనము చేయకుండ నెవ్వరు నాగదిలో నడుగు పెట్టఁగూడదు. అది యంత పవిత్రము.

ఆ యాలయ గోపురము మహోన్నతోన్నతము. ఆనఖశిఖ మనల్ప శిల్ప భూషితము. మాఘ మాసములో నీ స్వామికి ప్రవహణోత్సవము (తెప్ప యుత్సవము) మహా వైభవముగ జఱుగును. కావేరి జలము సునిర్మలము. అతి మధురము.

గాలిలోని లఘుత ఖములోని స్వచ్ఛత
అమృత రుచియుఁ గలుఁగు, నాఝరమ్మ
సర్వతోముఖమ్మ, సర్వతో ముఖముగాఁ
దెలివి పెంచుఁ బెంచుఁ దేజమెంతొ.

యథాశక్తి దైవదర్శనార్చనాదుల నిర్వర్తించి రంగనాయకమ్మ కంజలి ఘటించి సర్వలోకేశ్వరుఁడైన జంబుకేశ్వర దర్శనమునకై బయలుదేరితిమి.

## జంబుకేశ్వరము

జంబుకేశ్వరము గొప్ప శైవక్షేత్రము. అందున్న శివలింగము ప్రసిద్ధ (పంచ) మహా శివలింగములలో నొకటి. ఇది అబ్లింగము. అనగా నీటిలింగము ఈ లింగములోనుండి నిరంతరము నీరూరుచుండును.

భోళాశంకరుఁడన్న నామమున సంభూతంబునౌ భావమున్
బాలింపన్ నిలువెల్ల నీరయి కృపా పాత్రుండునై శంకరుం

డాలింగంబున నుండె నా! యనెడు నూహల్ గల్గు, భక్తార్థమై
కేలన్ సిద్ధులఁ దాల్చు నా శివుని నక్షీణార్ద్రమూర్తిన్ గనన్.

శీర్షము నందునన్ విబుధసింధువు నిల్చిన సౌధభూమికిన్
సర్షప మాత్రమై పడిన సన్నని రంధ్రమునుండి నీరముల్
వర్షము వోలెఁ బర్వఁ, దనువంతయు నమ్మయమయ్యెఁ బాపసం
కర్షణుఁడైన యీశ్వరున కన్నటు తోఁచును నూహ కంటికిన్.

ఆ క్షేత్ర స్వామి పేరు జంబుకేశ్వరుడు- క్షేత్రము పేరు జంబుకేశ్వరము.

జంబూపదమునకు నేరేడు వృక్షమని యర్థము- జంబూ శబ్దమునకు మహదర్థములో "క" ప్రత్యయము చేరగా- జంబుక- అని యగును- "క" ప్రత్యయము చేరినపుడు ప్రకృతికి మార్పులు వచ్చుట భాషా సంప్రదాయము- అర్థాత్ జంబుకమనగాఁ బ్రసిద్ధమైన నేరేడు వృక్షముగల ప్రదేశ మని యర్థము జంబుకస్య ఈశ్వరః జంబుకేశ్వరః, అని విగ్రహము. జంబుకమను పేరుగల క్షేత్రమున కధిపతి యని ఫలితార్థము, ఈ క్షేత్ర మాహాత్మ్యమును దెలుపు కథయిది.

శర్వున కొక్క- కాలమున సంభృతమయ్యెను బ్రహ్మహత్యచేఁ
బర్విన గొప్పపాప, మది పాయదు క్షేత్రము లెన్ని యేగినన్
బూర్వము, తత్ప్రభూతమగు పుట్టెడు దుఃఖముతోడ నాతఁ డీ
యుర్వి నిఁ జుట్టివచ్చె నఘుహుంకృతి రూపడఁ జేయ దీక్షతో.

ఎన్నో పుణ్యధరల్ శ్రమంబనక సర్వేశుండు సేవించి ని
ష్పన్న గ్రావ మహాటవుల్ తిరిగినన్ బ్రహ్మఘ మొక్కింతయున్
విన్నం బోవదు, ప్రాణముల్ విసిగి యీ వృక్షమ్ము మూలమ్మునన్
దిన్నెన్ నిల్చి తపస్సు చేసెను మహాదేవుండు సామాన్యుఁడై.

జంబూ వృక్షము మూలము
నం బరమేశ్వరుఁడు భోజనంబును విడి ఘో
రంబగు తపమును జేయఁగఁ
బంబిన భక్తిన్ నెరేడు పాదప మంతన్.

సకల చరాచరంబులకుఁ జక్కని పోషణమిచ్చు నష్ట భా
గ్య కలితయోగి కాలవశుఁడై నిరుపాధియునై క్షుధార్తుఁడై
వికలత నొందినాఁడని సవిస్మయ జంబు మహీజ మాత్మ శా
ఖిక బనసాభమైన యొక కేవల దివ్య ఫలంబుఁ బండఁగా.

నొనరిచి, దాని శంకరుని యొక్క యొడిం బడవైవ శూలి స
న్మనమున నాహరింప క్షుధనాశనమయ్యెను. నాఁటినుండి యా
ఘనతరు వొక్కపండు సరిగాఁ బదిరెండవ గంటయందు శం
భుని యొడి వేయుఁ బ్రత్యహము మోదముతోఁ దిను దాని

నీశుఁడున్

ఈవిధి వత్సరాంతమును నీశుఁడు ఘోరతపంబుఁ జేసె నీ
లావనిజాత జాత ఫలలబ్ధిని. నా స్థలశక్తిచేత నా
శైవతపోబలంబునను సన్నగిలెన్ వృజినంబుఁ పిమ్మటన్
పావనుఁడై మహేశ్వరుఁడు పాయుచు క్షేత్రము పల్కెనిట్టులన్.

దివ్య మీక్షేత్ర మిది మహా భవ్యశక్తి
జంబుకేశ్వరుఁడను పేర చాల కీర్తిఁ
బొందు దేనిందు. నాకు నీ భూజఫలము
ముందు నైవేద్య మీయ నే ముదముఁగనుదు.

అని ధవళాంగుఁడాడి ధవళాంగుఁడునై ధవళాద్రికేగ నా
దినమున నుండి యీ స్థలము దివ్యము సేవ్యము నయ్యె. నీ విధం
బున నది కొంతకాలము విముక్త ఫలంబు మహేశ్వరార్చకై,
పోనుపడె నాక్రమమ్ము, శివ పూజల నెట్టి దోసంగు కల్గెనో.

నేఁటికిఁ బండు రా దయిన నిత్యము నీశసహస్రపూజ లా
వీటను సాగుచుండుఁ గనువేడ్కఁగ మోక్షపు బాటలొచు. నే
నాఁటను నాటిరో కుజము నాల్గుదెసల్ ధరఁగప్పి యోగిశ్రం
గాటకమయ్యెఁ బత్రతతికల్పిత శాంభవ పూజకంగమై.

జంబుకేశ్వర మహిమల సంప్రదాయ
సిద్ధములునైన వానినిఁ జెప్పఁబు పొంగ
వినియుఁ, జూచియుఁ దద్గత వివిధ విషయ
ములను, సంతుష్టి నందితిఁ గలఁత తొలఁగ.

నేరేడు దళములతో నీశ్వరార్చన చేయుట యీ క్షేత్ర విశేషము. ఈ యాలయమునకును బంచప్రాకారములున్నవి. మొదటి ప్రాకారములో గర్భాలయమున్నది. ఐదవ ప్రాకారములో గ్రామమున్నది. తక్కినవానిలో మంటపములు, వందయడుగుల యెత్తుగల గోపురము మొదలైనవి యున్నవి. మూడవ ప్రాకారములోనే యమ్మవారి యాలయమున్నది. ఆ తల్లి పేరు. అఖిలాండేశ్వరి.

అండము నాగ్రగుడ్డు. నిఖిలాండము లెక్కువ కాలముండకే
భాండము లట్లు వాసిచెడి బ్రద్దలగున్ భువనంబులోన. బ్ర
హ్మాండము మాత్ర ముండుఁ బ్రళయాంతము. కావున నండమన్నఁ బే
రుండెను లోకజాతి. కదె యొప్పును నండ పదాభిధేయమై.

పదియు నాల్గండముల కామె పరమ రాజ్ఞి
గాఁ బ్రసిద్ధినిఁబొందె లోకంబులందు
ఆమె యఖిలేశ్వరార్ధాంగి యఖిల భువన
మాత నగజాత గుణగణోద్భాత పూత.

అమ్మవారి నుదుట మాణిక్యము తిలకాయమానమై దగద్ధగకాంతుల నీనుచుండును. సుబ్రహ్మణ్య భక్తి యిచ్చట నధికము. జంబుకేశ్వర దర్శనము చేసికొని యటనుండి తిరుచినాపల్లికి బయలుదేరితిమి.

## తిరుచినాపల్లి

తిరుచినాపల్లి కావేరీ తీరముననున్న పెద్ద పట్టణము. కావేరిపై ముప్పది రెండు ఆర్చిలుకల పెద్ద వంతెన యున్నది. కావేరికి అద్దరి శ్రీరంగము. ఇద్దరి తిరుచినాపల్లి.

తిరుచినా పల్లిలోఁ గొండమధ్య భాగమున నొక శివాలయమున్నది. ఆ దైవతము పేరు మాతృభూతేశ్వరుఁడు. అమ్మవారి పేరు సుగంధి కుంతలాంబిక.

మాతృ భూతేశ్వరుఁడనగా- మాతౄణాం సప్త మాతృకానాం భూతానాంచ (ప్రమథ గణమునకు సమస్త జీవులకు) ఈశ్వరః ప్రభుః- అనగా సప్త మాతృకలకు ప్రమథగణములకు లేక సమస్త భూతములకుఁ బ్రభువని యర్థము.

మాతృ భూతేశ్వర సమాసమునకు మఱియొక యర్థమును గూడఁజెప్పు కొనవచ్చును- "మాతేవ భవతీతి మాతృ భూతః- మాతృభూతశ్చ ఈశ్వరశ్చ- మాతృ భూతేశ్వరః- అనగాఁ దల్లివలెనయి బిడ్డలను భక్తులను నధిక వాత్సల్య ముతోఁగాపాడు పరమేశ్వరుఁడని భావము. అందులకుదాహరణ మచ్చట మార్కండేయుని రక్షించుచున్న శివుని విగ్రహము.

ఆ శిల్పములో మృత్యువు వాతఁ బడనున్న పరమ భక్తుని మార్కండే యునిఁ జూచి పరమేశ్వరుఁడు తల్లివలెఁ గఱఁగిపోయి యమునకు బుద్ధిచెప్పి ఆ బాల భక్తుని అక్కునఁజేర్చుకొన్నాఁడు అందువలన నా దేవునకు మాతృ భూతేశ్వరుడని నామము కలిగినది.

మాతృ భూతేశ్వరాలయము మూడు వందల యడుగుల నెత్తుననున్నది- నగమధ్యమందున్న యా యాలయము కైలాసమున శివుని నికేతనమును బోలి యున్నది. మాతృ భూతేశ్వరాలయమునకే మార్కండేయాలయ మని నామాంతర మున్నది.

ఆలయములో నడుగు పెట్టగానే "భక్త రక్షణ దీక్షితుఁడై శూలమునెత్తి యముని ఝళిపించుచున్న రుద్రమూర్తి-" త్వమేవశరణం మమ యని భక్తి బాహు పంజరములోఁ బశుపతిని బంధించి బాహ్యాజ్ఞాన శూన్యుఁడై యున్న మార్కండెయుఁడు- శూలి శూలోగ్రాగ్నిలో శలభాయమానుఁడగుచున్న పరేత రాట్టు స్వస్వభావాను కూలముగా బ్రత్యక్షమగుదురు- అచ్చట.

తనకన్న యధికమహా ఘనశక్తి యుంపరఁ
దలపంచి యున్న మహాంధశక్తి
భక్తరక్షణమె నా పరమ ధర్మంబని
తద్రక్షకై నిల్చు రుద్రశక్తి
మానవాతీత మన్యాన దైవమె దిక్కు-
సర్వాలకన్న విశ్వాస శక్తి

నారదాది మహర్షి వార విజ్ఞేయమహా
సార్వకాలిక మహో సత్త్వశక్తి
అన్నిశక్తులు దేవాలయాంతరమున
కన్నులకుఁ గట్టినట్లుగాఁ గానుపించు
నడుగుమోప, మృకండునందాంగ జాతు
నునికి యందున మోక్షపు మనికియందు.

దేహము విస్మరించి ప్రభు! దేహి! యటంచును మూసి నేత్రముల్
"పాహి" యటంచు లింగమును బాహు యుగంబునఁ గౌగిలించి స
మ్మోహముఁబాసి యంతకుని ముప్పును బాపఁగ వేఁడుకొంచు సం
దేహము వీడియుండె రవితేజుఁడు బాలమృకండుసూతియున్.

మహిషము తామసంబునకు మచ్చు. మహేశుఁడు భక్త రక్షకున్
విహిత నిమిత్త, మింద్రియ పవిత్ర విభూతి మృకండు సూతి యా
గ్రహ విధికిన్ ధ్వజమ్ము, యమరాజును గర్వము చిహ్నమౌచు నా
గృహమునఁగానుపింత్రు. పరికించిన సర్వము దైవనిఘ్నమే.

ఆ గోడలమీద శివ చరిత్ర వైవిధ్య సుందరముగఁ జిత్రింపఁబడినది

మాతృభూతేశ్వరాలయము దాటి పైకిఁబోయినచో నత్యున్నత శిఖరాగ్రమున గణేశ్వరాలయమున్నది- అది యా నగర సర్వ దృశ్యములలోఁ ప్రథమ దృశ్యము ఆ యాలయమునకు నాలుగు వందల యేబది యెట్లున్నవి- అక్కడ.

భూలోకంబున భక్త పాలనము సంపూర్ణంబుగాఁజేసి యు
ద్వేలంబైన శ్రమమ్ము నంది ప్రమథాధీశాశ్రయంబున్ జనన్
జాలిం జాలక విశ్రమార్థము గిరిస్థానంబునన్ దృప్తిగా
గాలున్ గేలును మోడ్చి యున్నటుల విఘ్నాధీశుఁ డుండెడున్.

గణికల మెచ్చు వేల్పగుటఁ గట్టిరి తత్కటియందు చుట్టు మం
దిరమున నున్న యొంటిపలు దేవరకున్ బులుజాలవల్లి సుం

దరముగ నాఁడునాఁడె పెఱదారముతోఁత రచించి లేనిచో
నురము హరించునట్లు లది యొప్పునె నూత్నవినీల కాంతులన్.

అనియనుకొంటిని కానీ
మనమున నయ్యాలలూఁగె మఱి సందేహ
ధ్వనులెన్నొ, వానిధాటినిఁ
జననేరక యూఁగులాడి సతమతమైతిన్.

మదిలోఁగల సందేహము
ప్రిదులంగా నొకని బ్రశ్న వేసితి నయ్యా!
ఇదె ఘాసవస్త్ర మెప్పుడు
గదియించిరి? నేటి రేప? కాలము వెనుకా.

వికవికనవ్వి యాతఁడను, వింతఁగఁ బల్కితి వేఁడవాఁడ వీ
వకట! యెఱుంగవేమి? తృణవస్త్ర చరిత్ర గణేశ కీర్తి పా
త్ర, కలియుగార్త దైవము గదా ద్వాపవక్తృఁడు, ఘాసచీర మా
యకలుష దైవమూర్తి కటియందునఁగట్టెను భక్తుఁడెవ్వడో.

నాఁటినుండియు నేఁటికి నీఁటిపోదు
వాడ దెంతదు మాయ దా బాలతృణవి
నీలజాలము ప్రత్యగ్రమాలవోలె
కాంతులీనుచునుండు నెక్కాలమందు.

దీర్ఘ కరుఁడైన యా ప్రథమ పూజ్యునకు కరములు మోడ్చి యుల్లంటిన్.
గిరిశతనూభవుండవు నగేశుని సప్తవు కొంత కోసలన్
దిరుగుట కాన చెందెదు మదేభముఖుండవు కాన నీకు నీ
గిరిజనవేషముబ్బె, నది కీర్తికి నెక్కఁగ ఘాసవాసమున్
వెఱువక తాల్చితయ్య! పృథివీధర జన్మ గృహార్ఘ రత్నమా!
ఎంతటి వారలైనఁ దమయింటను ముందుగ నిన్నుఁగొల్తు రే
నెంతటివాఁడ నిన్ను భజయింపఁగ నేరనివాఁడ నింతకున్

సొంతము కాని నాపనుల సర్వముఁ దొందరఁ బూర్తి చేసి నా
చెంతలనున్న చింతలఁ గృశింపఁగ జేయుమ విఘ్న నాయకా!

ఈశుని పొట్టలోపల రమేశుని కుక్షిని సృష్టికర్త వా
గీశునిలోన లోకములనేకములుండెనొ లేదొ కాని వి
ఘ్నేశుఁడ! నీదు పెన్నుదర గేహములోపల తిష్ఠవేసి స
ర్వాశలు నిండియుండునని పల్కెదు. నీ పృథుకుక్షిఁ గాంచుటన్.

సిద్ధియు బుద్ధియుఁ జేదోడు వాదోడు
గా నుండ, నీకేమి కలుగకుండ
ఇద్దఱమ్మలు నిన్ను నేలోపములు లేక
పెంచఁగా నీకేమి "కించ" యుండు,
ఆబాల గోపాల మాలీల భక్తితో
సేవింప నీకన్న శ్రేష్ఠుఁడెవఁడు
ఒక పలుపోటుతో నిక పాత్రమునుఁగూల్చు
నీకన్న వీరుఁ డేనేలఁ గలఁడు.

చందమామకు మోముపై నిందవైచి
యందలమ్మున నాపైన నలరఁజేసి
శిక్ష రక్షలయందు వైశిష్ట్యమందు
గణపతీ! నీవె జగమున గాంచవయ్య.

పొట్ట యంతయు జగములఁ బూర్ణమగుట
పూర్వ పర దేహములు నీకుఁ బొట్టివయ్యె
గుజ్జువేలు పటంచు నీ కొదవె పేరు
గట్టివాఁడవు సకలలోకమ్ములందు.

అమృత పురమ్మె నా జనికి నాశ్రయమైనది. యందునుండె నీ
సుమహిత విగ్రహమ్ము కడు స్థూలము, నియ్యదె కొండ కెల్ల నీ

యమిత మహత్వ విగ్రహా మహార్ఘ్య విభూషణ మేకదంత ! ఓ
సుమహిత ! యాత్రయింతు నిను జూర్ణిత విఘ్న మహాద్రి ! దేవరా.

నాకుఁదోఁచిన విధముగా నగజసుతుని
గవితలన్ గూర్చి సేవించి కయిని మోడ్చి
సెలవు యాచించి గుడినుండి వెలుపలకును
సాఁగివచ్చితి సహచరుల్ సందడింప.

విఘ్నేశ్వరాలయము కొండపైఁ జాల యెత్తున మున్నదిగదా. అక్కడ నుండి చూడగా.

ఇండ్లు కన్పట్టు బొమ్మరి లయిండ్లవోలె
చెట్లు కన్పట్టు పొందరిండ్ల చెలువుతోడ
బస్సులగుపించుఁ డుమ్మెద బారులట్లు
నరులు కనిపింత్రు చీమల వరుసవోలె.

అత్యున్నతమైన గణేశ పర్వతముపై నుండి చూచిన ఆ ప్రక్కనే కావేరీ మధ్య మందున్న శ్రీరంగ క్షేత్రము దృష్టిగోచరమగును. ఆ దృశ్యము.

చిత్ర విచిత్ర కేతువుల శిల్ప సమంచిత సౌధ వీథులన్
గోత్రమహీధ్రతుల్య వరణోన్నత శీర్ష విరాజ మానమై
యాత్రకుఁబోవునావ యుదకాశయమందున లంగరుంచి యా
రాత్రి వసించి నట్లలరె. రంగము కావెరి నీటి యందునన్.

జలములోపలి ప్రతిబింబములను జూచ
పురమునందలి గాలిగోపురము లుంతు
జలముఁద్రావఁగ వచ్చిన జలద పటలి
వార్ధి యుదరమునందున వ్రాలినట్లు.

అచట కావేరిపై గట్టబడిన గొప్ప వంతెన యొకటి యున్నదిగదా ఆ వారధి.

సంసార జలధి దాఁటఁగ
కంసారి సృజించినట్టి కట్టుకొనవతెన్
శంసలఁగొను కావేరీ
మాంసలఁ వారధి యెసంగు మాన్యతరంబై.

కొండ క్రింద పెద్ద కోనేరున్నది. ఆ కోనేటిలోఁ బ్రతి సంవత్సరము తెప్పోత్సవము మహా వైభవముగా మహానంద సంధాయకముగా జఱుగుచుండును.

"తెప్పోత్సవము" అనునది దుష్టసమాసము. అనగా వ్యాకరణ విరుద్ధమైనది. దుష్టసమాసము ప్రయోగార్హముకాదు. మిశ్రమ సమాసము చేసిన తెప్ప యుత్సవము. అని యగును. కాని ఆ మిశ్రమ సమాసమునకు సిద్ధ సమాస మర్యాదను గలిగించి "తెప్పోత్సవము" అని లోకము వ్యవహరించుచున్నది.

మహా కవుల ప్రయోగ సాధనము వ్యాకర్తల లక్ష్యమైనట్లు కన్పించు చున్నది. కావుననే సంస్కృతమున. పృషోదరాది గణము. నిపాతములు. ఆర్షత్వాత్ సాధుః, ఇత్యాదులు. తెలుఁగున వికల్ప. బహుళాదులు సృష్టింపఁబడినవి.

కేవలము మహాకవుల ప్రయోగములనేగాక బహుళ ప్రచారములో నున్న వ్యావహారిక ప్రయోగ సాధనముగూడ వ్యాకర్తల యభిప్రాయమైనట్లు కన్పట్టు చున్నది. అందువలననే. వామనుఁడు "అతి ప్రయుక్తం వ్యావహారిక పదమ్ స్వీకార్యం" అని సూత్రీకరించియున్నాడు. ఈ సూత్రానుసారమే "హాల" యను ప్రాకృతపదము సంస్కృత పద మర్యాదను బొంది సంస్కృత సమాసమున స్థానము సంపాదించినది.

అందు వలన "శంకర దేవళ్ళు" అను మహాకవి ప్రయోగముల వలెనే "తెప్పోత్సవము" అని బహుళ ప్రచారముకల దుష్ట సమాసములకు గూడ శిష్ట భాషలో స్థానము కల్పింపవచ్చును. జీవ ప్రపంచమువలె భాషా ప్రపంచము కూడఁ బరిణామ శీలముకదా! పరిణామము నెవ్వఁడాపఁగలఁడు. ఆ కోనేటి నడుమ మండపమున్నది అది

చక్కగ బాల సూర్యకరజాలమునన్ వికసించి నవ్వులన్
దిక్కులఁదన్పి మానవుల దృష్టుల లోఁగొను బంక జమ్ములోఁ

జిక్కఁగనున్న కర్ణిక విశేషమునంది చెలంగుచుండె నా
యొక్క సరస్సులో నొదిగి యుండిన మంటప మద్భుతంబుగన్.

నిర్వక్రకరుండైన యా వక్రకరుని దర్శించి సెలవు తీసికొని యొకనాఁడు తెలుఁగు దొరల యేలుబడిలోఁ బలుకుబడిని పొదించినదియు- నడదడి యేపున నలజడి నాపి ప్రశాంతి చేకూర్చిన తంజా పురము వైపునకు బయలుదేరితిమి.

## తంజావూరు

ది. 14-10-84 సాయంత్రము 6. గంటలకు తంజావూరు చేరితిమి. తంజావూరు చరిత్ర ప్రసిద్ధమైన పట్టణము.

**నామవిచారము :**

పూర్వము మహోదరుఁడను రాక్షసుఁడుండెడి వాఁడఁట- వానికిఁదమిళ ములో "తంజ" అని పేరట- ఆ దుష్టుని శ్రీహరి యా ప్రదేశమున సంహరించె నఁట- అందువలన నా ప్రదేశమునకు, తంజావూరను నామము కలిగినదఁట. తంజ+ఊరు=తంజావూరు.

"తంజావూరు" అను పదము గ్రంథములందు- తడజపురము అని ప్రయో గింపఁబడినది- సంస్కృతములోఁబుర శబ్దమునకుఁ బర్యాయముగా రేఫాంతమైన పూర్ శబ్దమొకటియున్నది- అపుడు- తంజ+పూర్ అని యగును. పకార స్థానములో వకారము వచ్చుట భాషా సంప్రదాయము. దానినిఁబట్టి తంజపూర్- తంజవూరుగా మాఱినది- పిమ్మట భాషా పరిణామములో దీర్ఘమువచ్చి- తంజా వూర్- అయినది.

తంజావూరిలోఁ బ్రవేశించగానె నాయకరత్నము సంగీత సాహిత్య కళానిధి తెలుఁగుల వారసుఁడు రఘునాథ నాయకుఁడు గుర్తుకు వచ్చినాఁడు- అపుడిట్లంటిని.

ఓ వీరా! రఘునాథ నాయక! సముద్రో పగ్రగంభీర! నీ
ప్రావీణ్య స్థగితమ్ము దేశజననీ రక్షార్థ యజ్ఞమ్ము నీ
భావోద్యానమునందుఁ బూచిన సుపుష్ప ప్రాజ్య సద్వాసనన్
కావించెంగద భారతీయ జననీ ఘ్రాణేంద్రి యానందమున్.

వెలుఁగుల జిమ్ము తెల్గుల యవేల కళా విభవమ్ముచేత, మేల్
కలయిక వెల్గు నద్భుత కళాస్పద కావ్య పరిమళంబులన్
శిలలఁ గఱంగఁజేయు స్వరనిర్భరగాన విశేషసంపదన్
తెలుఁగు సరస్వతీ సతికి దీధితిఁగూర్చితివయ్య! నాయకా.

తంజావూరు ప్రభువులు శిల్పమునేకాక సాహిత్యమునుగూడఁ బోషించిరి. వారి యకుంఠిత దీక్షాఫలితమే శారదా మందిరము. శ్రీకృష్ణరాయల సభకు భువన విజయమని పేరున్నట్లే రఘూనాథ నాయకుని సభకు శారదా మందిరమని యన్వర్థ నామమున్నది.

శారదా మందిర మారయ శారదా
మందిరమ్మె వేత్త్ర మాన్యపదము
సంచారమును మాని శారదామాత యం
దుపవిష్టయైనట్లు తోఁచుచుండు
ఒకనాఁడు సాహిత్య శకమునందచ్చట
రాజ్యమేలెను నల్వరాణి కాని
ఈ నాఁడు పుత్రుల యేహ్యావర్తనముచే
విధ్వస్త కరణయై వేదనపడె

రంగు తగ్గెను సాహిత్యరంగమందు
వాణి కుంకుమ బొట్టులో వాసి తగ్గె
నొక్కఁడైనను దిలకముఁ జక్కఁజేయు
వాఁడు లేఁడయ్యె శతపుత్ర ఫలితమేమి?

తంజాపురమునకుఁ బ్రఖ్యాతి తెచ్చినది యచటి సరస్వతీ మహా గ్రంథాలయము. ఆ గ్రంథాలయమందు ఇరువదివేల గ్రంథములున్నవి. వానిలో నెనిమిది వేలు తాళపత్రగ్రంథములు. ఆ భాగమునకు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమని పేరు. వానిలోఁగొన్ని శిథిలములగుచున్నవి. వానినిఁబండితులచేతఁబరిశోధింపఁ జేసి పునర్లేఖనము చేయించుచున్నారు.

తంజావూరులో బృహదీశ్వరాలయమున్నది- ఆ స్వామిపేరు బృహదీశ్వరుఁడు- ఈ యాలయము 13వ శతాబ్దములో నిర్మింపఁబడినదఁట- ఈ దేవాలయ శిల్పము గోపుర నిర్మాణము జగత్ప్రసిద్ధములు- ఈ యాలయ గోపురము- 216 అడుగు యెత్తున్నది- ఇది 180 అడుగులవఱకు సమానముగా నుండి యాపై భాగము క్రమక్రమముగా సన్నమై యాకాశములోనికిఁజొచ్చుకొని పోయినది ఈ గోపురమునకుఁ బై భాగమున నాల్గుప్రక్కల నాల్గు నందులున్నవి- అవి చాల పెద్దవి- ఏ కొండపురాళ్ళపైఁ జెక్కఁబడినవి

ఈ గోపురాగ్రమందుఁ, కలశ నిర్మాణమునకై- 26 అడుగుల ఏ కొండపు చదరపురాయి మలచఁబడినది- దాని బరువు- 80 టన్నులు- అక్కడకు నాలుగు మైళ్ళ దూరములోనున్న "సరప్పల" అను గ్రామము దగ్గఱనుండి ఏటవాలుగా మట్టి దిబ్బనేర్పాటుచేసి ఆ దిబ్బమీదనుండి ఆ మహా శిలను నెమ్మదిగా- 216 అడుగుల యెత్తునకు లాఁగి గోపురాగ్రమున బిగించినారఁట- ఆ "సరప్పల" గ్రామమిప్పటికి నక్కడనున్నది.

బృహదీశ్వరాలయమును కంజీవర గ్రామ వాస్తవ్యుఁడైన "సామవర్మ" అను మహా శిల్పి రూపొందించినాఁడఁట- ఆ విషయమచ్చటి గోడల పైనున్న శాసనములు తెల్పుచున్నవి,

దేవాలయమునకు ముందు మహానందిలోఁ గూడ లేని యొక మహానంది యున్నది- ఆ భృంగీశ్వరుని ఎత్తు 12 అడుగులు, బారు 16 అడుగులు, వెడల్పు 7 అడుగులు, బరువు 25 టన్నులు. అది బృహన్నంది. అందువలననే బృహదీశ్వర స్వామికి వాహనమైనది- ఆ వృషభరాజుపై ఏ వృషభరాజుపైఁగూడ లేని విచిత్ర శిల్పము నెలకొనియున్నది. అది నల్లని యేక శిలపై మలచఁబడినది- ఈనాఁటికిని కనుమూయని మాయని మెఱుఁగులను ఆ నందీశ్వరుని మేనికిఁ దొడవులుగాఁ దొడిగిన శిల్పి శేఖరుఁడెంతటివాఁడో, ఆ మహా నందీశ్వరుఁడు పై కప్పుతో వప్రక్రీడలాడుచున్నాడు- ఆతని యౌన్నత్యమంతటిది- సర్వజనానందిమైన ఆనందిని జూచి యట్లనుకొంటిని.

బృహదీశ్వర దేవుని కది
సహాకారము చేయఁదగిన సముచిత తురగం

బహింభూషణ భారము మో
యు హారువు గల యట్టి దా మహోక్షము సతమున్.

ఆ యుక్షాధ్యక్షుని వీక్షించి యిట్లు ప్రశ్నించితిని.

ఓయి! సుహోక్షరాజ! సతముగ్రుని ముందట వాని యాజ్ఞకై
రేయి బవళ్ళు దీక్షగ నిరీక్షణ చేయుచు బ్రహ్మచారివై
ప్రాయపు భోగముల్ విడిచి భక్తి గిరీశునింగొల్చునట్టి నీ
కాయము ధన్యమయ్య! నినుంగాదను భక్తుఁడు లేడు పృథ్విలో.

కాటుక కొండయట్లు శితికంఠుని ముంగల విశ్రమించు నీ
ధాటికి భీతిఁజెంది జగదంతర మంతయు మిన్నకుండె నే
లోటును లేక యే యసమశోచన తీవ్ర తపస్సు సాఁగు, నీ
పాటి సమర్థ భక్తుఁ డొక పాటికిఁగల్గునె? గోపురందరా!

ఈశుని దర్శనంబునకు నెంతటి వారలుఁబోవలేరె! యు
క్షేశుఁడవైన నీముదల జెందక నీ యనుభావమెట్టిదో
నాశకకర్తృ దర్శనము నందఁగవచ్చెడి వారి యంతరం
గాశయముల్ పఠించి నిశితాక్షుల వారి కనుజ్ఞ నిత్తువే.

ఆ యాలయ నిర్మాణము పన్నెండు సంవత్సరములు పట్టినది దేవాలయ గోపురము మధ్యమందు డచ్చిదొర విగ్రహమొకటియున్నది. ఆ దొర దేవాలయ నిర్మాణమున కెంతగానో యుపకరించినాఁడఁట.

ఈ దేవాలయమున కాగ్నేయ భాగమునఁ బ్రాకారము నానుకొని రెండు గణపతి విగ్రహములున్నవి- ఆ విగ్రహములమ మీటినచో నొకదానినుండి రాతి మ్రోత మఱియొకదానిలోనుండి కంచుమ్రోఁత వినిపించును.

బృహదీశ్వరాలయము దక్షిణ భాగమున ఒక వేఁపచెట్టున్నది- దానిక్రింద చిన్న మండప మొకటియున్నది— ఆ మండపములోఁ జాల పూర్వకాలమున నొక యోగి యుండెటివాఁడఁట- ప్రతిష్ఠజఱిగిన పిమ్మట బృహదీశ్వరలింగము చలింప నారంభించినదఁట- అపు డాయోగివరుఁడు తన తపశ్శక్తిచే శంభులింగమును నిశ్చలముగఁ జేసినాఁడట- అందువలన నచటి భక్తు లాయోగిని దేహాంతమున

నా మందిరము క్రిందనే సమాధి చేసినారఁట. నేటికి నా సమాధికిఁబూజలు జఱుఁగుచున్నవి.

తంజావూరు మహాశైవక్షేత్రము అక్కడ 108 శివలింగములున్నవి. ఆ క్షేత్రములో నాల్గు గోపురములున్నవి. మొదటి మూడు గోపురములు ఎత్తు తక్కువ వెడల్పెక్కువ. నాల్గవ గోపురము. అనగా గర్భాలయ గోపురము మొదటి మూడింటికంటె వెడల్పుతక్కువ. ఎత్తు ఆ మూడింటికంటె చాల యెక్కువ.

ఆ యాలయాధిపతి బృహదీశ్వరుఁడు గదా! బృహత్+ఈశ్వరుఁడు. అని యా సమాసమునకుఁ బదవిభాగము. అనగా చాల పెద్ద యాకారముకల యీశ్వరుఁడని యర్థము. అంత పెద్ద శివలింగ మెచ్చటను గనుపింపదు. అణోరణీయాంసుఁడైన చైతన్యమూర్తి భక్తరక్షణార్థమై యచ్చట స్థూల కార్యోపాధిగతుఁడైనాఁడు.

ఆ యగ్గికంటిని దర్శించి నతుల నుతుల నర్పించి యా పరతత్త్వతత్త్వము నిట్లు సంభావించితిని.

స్థావర జంగమాత్మక విశాల జగత్పరిణామరూపియై
భావన కందనట్టి సురవంద్యుఁడు శూలి తమోగుణాత్ముఁడై
పీవరరూపమున్ గలిగి, భీకరుఁడై, కరుణార్ద్రమూర్తియై,
కావరమెత్తు వారలకుఁ గన్పడు. నిర్మల భక్త జాతికిన్.

భూతేశుండసు పేరుకుందగిన సెంపున్ దాల్చి స్థూలాకృతిన్
జేతోజాత మదాపహార సముద్యోజ్జృంభ స్మహారూప మీ
భాతిన్ గూడెన? యన్న భావములు సంభావ్యమ్ములౌ. యంత కా
రాతిన్ దంజపురంబునన్ గనఁగ మేర్వాకారు లోక ప్రభున్.

అజ హరి మానసంబులకు నందని దివ్యసనస్వరూపమున్
ప్రజలు గనంగఁజాలరను భావమునన్, గటి శ్వేత వస్త్రమున్
గజ వసనంబుపైఁ గలుఁగఁగట్టిరి జ్ఞానులు, దానిచేత నా
వృజిన హరుండు కన్పడును. తెల్లని నల్లని దీర్ఘదేహుఁడై.

పశుపతి శక్తికున్నె యొక పట్టున నన్నువ, యొక్క చోటునన్
భృశతమమైన పేర్మి, మునివేద్యుని తత్త్వము సర్వదేశ కా
ల శరణ మౌను, దేవుని బలాబలముల్ మమువంటి వారికిన్
విశదమె, దోమ నేనుఁగుల భిన్నమె! బ్రహ్మము కన్నువిప్పినన్.

కారణోపాధియై చిదాకారమైన
బ్రహ్మముందును గార్యరూపాదులందు
తరతమాకారమై కాని తథ్యమరయ
మూలమందున భేద మేమూల కలదు?

బృహదీశ్వరుని తత్త్వ విచారముచేసి దర్శనానంతర మాయన సామేను దర్శింప ముందుకు బోతిమి- ధనుశ్శత దూరమరిగి యచ్చట నా భూతేశ్వరుని యర్ధాంగిని దర్శించితిమి- ఆమెపేరు బృహన్నాయిక బృహదీశ్వరి. ఆ దేవి.

భర్తకు తగ్గ భార్య, యను భావమునందునఁగాక రూపమం
దార్త జనార్తి హారమున, నా జగదంబ ప్రసన్న మూర్తియై
వర్తిలు, నామె చూపుకవఁ బండు దయామధురార్ద్రసస్యముల్
కర్తలు భక్తకోటి విపులాయత మోక్ష సుఖానుభూతికిన్.

ఓ తల్లి! :-

తెల్లనివాఁడు తండ్రి కడు తెల్లనివాఁడు మనోధి నాథుఁడున్
తెల్లని దేసపట్టె యిలు తెల్లనిదే తురగమ్ము తెల్లనే
నల్లనిదానివయ్యుఁ, బ్రథనందితి వెట్లు గృహంబునందునన్
నల్లని యింద్ర నీలము జనాదృతినందదె? విల్వ నొందదే!

ఆలయ ప్రాంగణ మతి విశాలము- అక్కడ పెద్ద సరస్సున్నది.

పై వేఁపచెట్టునకు నెడమపైపున సుబ్రహ్మణ్యాలయమున్నది. ఆ యాలయ శిల్పము దాక్షిణాత్య శిల్పసుందరి కంఠహారమున మెఱయు పతకమని "మెర్గసన్" పండితుఁడు వర్ణించినాఁడు.

తంజావూరు వివిధ పుష్పాకరమని ప్రసిద్ధి చెందినది. ప్రతి సాయంకాలము.

శ్వేత గులాబి పుష్పముల లెక్కకు మిక్కిలి మల్లెపూవులన్
జేతము నా హరించు పలు చెంగలువల్ మఱి కాంచనాదులన్
బోతలఁ గూర్చి నల్లు నడిబొడ్డున రంగుల వస్త్రమట్లుగా,
జాతి సుమాంబు రాశివలెఁ, జక్కనలీను జతుష్పథం బటన్.

బృహదీశ్వర దర్శనానంతరము- మోసమునకుఁ బర్యాయపదముగ జన శ్రుతిలో నెలవందిన కుంభకోణమువైపు సాఁగితిమి తంజాపూరిలో రాత్రి 9 గం॥ బయలుదేరిన మేము- 12 గంటలకు కుంభకోణములో నొకకోణమునకుఁ జేరితిమి.

## కుంభకోణము

ది. 14-10-84 రాత్రి 12 గంటలకు మేము కుంభకోణము చేరితిమి.

కుంభకోణము తంజాపూరు జిల్లాలోఁ తాలూకా కేంద్రము. ఇది- అరస లార్ కావేరీ నదులమధ్యమందున్నది. ఇది 7వ శతాబ్దములోఁ జోళరాజులకు రాజధాని. ఈ నగరములో పన్నెండు శైవాలయములు- నాల్గువైష్ణవాలయము లున్నవి.

బ్రహ్మకు నెక్కడను దేవాలయము లేదు. కుంభకోణములో బ్రహ్మ కాలయమున్నది- అది విశేషము. సర్వాధారుఁడు, నిరాధారుఁడగుటకు- అఖిల సృష్టికర్త కాలయము లేక పోవుటకు, నొకకారణమున్నది.

మును పొకనాఁడు సర్వజగమున్ హరియింప మహోన్నతాత్ముఁడై
మినుసిగ మేను పెంచె వినుమేరను మీఱి, రసాతలమ్ము క్ర
న్నన దన యంజకాఁగ భువనంబులు పిక్కటిలంగ, లోకమం
దున శివుఁడొక్కఁడే, యతనితోఁ బరులెవ్వరు సాటిగా రనన్.
ఆదియు నంతమున్ దెలియనట్టి, మహేశ్వర రూపవృద్ధిలో
నేదగు నాది? యంతమెది ?, యింతయుఁజూడఁగ లేరు దేవతల్,
శ్రీదయితుండు బ్రహ్మయు గిరీశుని యూపదశీర్షరూప మ
త్యాదరబుద్ధిఁ జూడఁగ నిరంతర తత్పరులైరి, వేడుకన్.
ఏగె నతివృష్ణుండునై సృష్టికర్త
ఆరసాతల మఱిగెఁ బద్మాక్షుఁ డెలమి,

తలనుజూపమి బ్రహ్మకుఁ దలయుఁదిరిగె,
అడుగుఁజూపమి వెన్నున కడుగు సడలె.

మతిచెడి శక్తిహీనతకు, మార్గముతోఁచక, జన్నిగట్టు ధో
గతికరుదెంచునాఁడు, తనకడ్డముగా ధరకేగు కేతకిన్,
నుతగతిఁ బుష్పరాజము వినూత్న మహేశ్వర శీర్షపూజిత
స్తుతులను బొంది, జాతియు వసుంధరకేగు నదృష్టవంతమున్.

కనిపలికెన్ విధాత, సుమకాండమతల్లిక! అగ్రపుష్పమా!
పెనుపునుదక్కి యోటువడి వెట్టిని నైతి. శివోత్తమాంగమున్
గనక, గిరీశమస్తమున గౌరవమందిన నీవు, ద్రష్టవై
మనుము. శివోర్ధ్వభాగమును మాన్యము నేఁ బొషగాంచి తం-చానిన్.

ఆడి తప్పినవాఁడును, బాడి తప్పు
వాఁడు బ్రతికినఁ జచ్చినవాఁడె యగును,
అని తలంచియు మొగలి, యా యబ్జసూతి
సృష్టి కర్తృత్వమునకుఁ జేయెత్తి మ్రొక్కె.

కనుగొన శంభు మూలమును, క్ష్మాపతి యేగెరసాతలమ్ము దా
టిన భువి, నైన నీశ్వరుని కొంకి పొలంకువయైన వానికిన్
గనపడలేదు, లక్ష్యమిక గమ్యము కాదని యెంచి, గూతఁడున్
వెనుదిరిగెన్, గనుంగొనెను వేల్పుగవిన్, దనపాలివేలుపున్.

కని, యెదుటన్ ద్రివిక్రముఁడు కామగవిన్, "శివపాదమూల ద
ర్శనమును జేసె నీతఁడని, సాక్ష్యము చెప్పి మహేశుమ్రోల, నా
ఘనతను నిల్పుమంచు," బలుకన్, విని వేలుపుగిడ్డి, యట్లె యం
చనె మొగమోడి, యెంతటి యనర్థమొ యీ మొగమోట మర్త్యలో.

గోడంగి సూనము వాదించె, నీ ధాత
నెలతేని యంచుల మెలఁగెనను చు,

మొగలి బమ్మల యొక్క ముసుగులోఁ బండిన,
మోసమ్ము గ్రహియించి భూతరాజు
ఇల్లు వాకిలి లేక యల్లాడు మని బ్రహ్మ,
నమరపూజ కనర్హ మగు మటంచుఁ
గాంచనమ్ము శపించె, (గామధేనువువచ్చి
తలనూపె వెన్నుని వలను గెలువ,
భవుని మోమును జూచి, పాడినిఁ దలఁదాల్చి
అష్టముగాఁ దోఁకనట్టు నిట్టు
లాడించె, గని, నిటలాక్షుఁడు సత్యము,
కోపించి సురభి! నీ కొమ్ము యుగము
అనృతమ్ము చెప్పెను. నందుచేత, నహర్మ
ఖమ్మున నీ మోముఁగొంచువాఁడు,
పాపకూపమ్ములోఁ బడిపోవు, తోఁకనో
నిజము చెప్పితి కాన, నెవడు చూచు
ప్రాక్సంధ్య నీ వాల భాగ, మాతఁడు పుణ్య
వంతుఁడై భోగించు స్వర్గఫలము.

అని వచించెను, గావున నది మొదలుగ
నిల్లు లేకుండె బ్రహ్మకు, నెపుడు దైవ
పూజకర్హత లేకుండె మొగలి కెచట,
"తప్పునే కర్మ ఫలమెంత గొప్పకైన.

వేల్పు పెద్దకు, గుడిలేని వెలితిఁదీర్పఁ
దలఁచి, యచ్చటి వారు శ్రద్ధాళువులయి
దేవళంబును గట్టి. యందే వసింపఁ
జేసి, రాతని, భక్తివిశ్వాసములను.

ఆ క్షేత్రాధిపతి నామము కుంభేశ్వరస్వామి- అచ్చట శివలింగము- అడుగు నుండి సగము వఱకు సమముగా నుండి యచ్చటినుండి పై బాగము కుంభ ముఖమును బోలియుండును.

కుంభస్య కోణ ఇవకోణః యస్యసః- కుంభకోణః = ఈశ్వరః కడవయొక్క- అగ్రభాగమువంటి యగ్రభాగము కలవాఁడని యర్థము- తస్య ఇదం కుంభకోణం క్షేత్రం- (అటువంటి ఈశ్వరునికి సంబంధించిన క్షేత్రమగుట వలన నాక్షేత్రము కుంభకోణమని వ్యవహరింపఁబడినది.

కుంభ రూపశ్చ ఈశ్వరశ్చ- కుంభేశ్వరః- అనగాఁగుంభాకారముగానున్న ఈశ్వరుఁడని స్పష్టార్థము- ఈ విధముగా క్షేత్రమునకుఁగుంభకోణ మనియు, శివునకుఁ గుంభేశ్వరుఁడనియు నచ్చట నామము లేర్పడినవి.

ఏ దేవాలయమందైనను బానువట్టము గోపుచ్ఛాకారముగా నుండును- కాని కుంభకోణములోఁ జతురస్రకారముగా నుండును.

శివుఁడు- అభిషేక ప్రియుఁడని ప్రతీతి. సర్వత్ర శివునకు నిత్య జలాభి షేకములు జఱుగు చుడుంను- కుంభకోణములో శివునకు నిత్యాభిషేకము లేదుగదా చివరకు మహా శివరాత్రినాఁడుకూడ నా గంగాజానికి గంగాభిషేకము చేయరు. అభిషేకము లేని యీశ్వరుఁడచ్చట అనిర్వాణుఁడైన గజరాజువలె గోచరించును. స్నానమెఱగని యా కొండవీటి జంగమును మానవ సహజమైన దాపల్యముతో నిట్లు ప్రశ్నించితిని.

ఏ ప్రాంతంబునవారలైన నుదకం బేమాత్రమున్ లేని వా
రప్రాపంచిక సక్తులైన నుదకంబత్యల్పమేయైన దే
హప్రాముఖ్యము నెంచి స్నానమును నిత్యంబున్ బొనర్తుర్గదా
ఏ ప్రారబ్ధముచేత సేచనము లే కిట్లుంటివో యీశ్వరా!
ఎక్కడి వింతయయ్య! పరమేశ్వర! నిత్యము నీటమున్గి యే
ప్రక్క రజోలవంబయినఁ బట్టవి నీవు, నిరంతరం బిటుల్
స్రుక్కుచు ధూళిధూసరిత రుగ్ణ శరీరుఁడవైతి, కాఁడె నీ
యిక్కగదా, మలీమసము లెంతలు నీకుఁ గపాల భోజనా.

జలముల్ ద్రాగుటకైనఁ బొందక, పిపాసాబాధఁ జల్లార్ప బా
వుల నీరందక, యెక్కడో పుడిసెడప్పంబొంది, నీరాడు నూ
హల శూన్యంబునఁగల్పు కాలమున మాయంబైన, నీ స్నాన మిం
దుల నాచారమునయ్యెఁ, గాక, యెటనే యొప్పారునే యీ విధుల్.

అభిషేకములేని హరునకచ్చట పునుగు చందనము మొదలగు సుగంధ ద్రవ్యానులేపనము చేయుచుందురు.

స్నానములేని లోటు ఘనసార సుగంధ పరీమళంబులన్
లూనము చేయనెంచితివ! లుంఠిత దంతిమహాసురా! శిరం
బానుచు గంగయుండఁ, నిటువంటి విపద్దశయేల కల్గెనో
ఆనతియిమ్ము నీకు, భగవానుని దుర్దశ భక్తుఁడోర్చునే?

పూజా పురస్కారము లన్నిచోట్ల శివలి గమునకే చేయఁబడుచుండును-కుంభకోణములోఁ బానువట్టమునకే షోడశోపచార పూజలు చేయఁబడును.

కొందఱు దేవతల్ తమను గొల్చెడి వారికి స్వీయపాదముల్
చెందఁగనీక యూవలనె చేయఁగఁబూజల స్వీకరింతు, రా
చందమె పానువట్టమున సర్వ సపర్యలఁజేయు మంటివా?
ఎందున లేని యీ విధి మహేశ్వర! యిక్కడ నెందుకేర్పడెన్.

ఆ కుంభేశ్వరస్వామికి నేబది ధనువుల దూరములో, ఇరువనాలుగు సిరిరూపములతో, వైకుంఠుని పట్టమహిషి చెలువారు చున్నది ఆతల్లి-

అందాది విగ్రహ మాదిలక్ష్మిగ నుండె,
వెలసె ద్వితీయమై వీరలక్ష్మి,
విజయలక్ష్మిగ నుండెఁ బేర్మి మూడవ రూపు,
గజలక్ష్మియయ్యె నాల్గవ విధంబు,
ధాన్య లక్ష్మమ్మ యైదవ విగ్రహము, ధన
లక్ష్మి యారవదిగా లక్ష్మిగనియె,
సంతానలక్ష్మిగా సప్తమాంశంబుండె,
సౌభాగ్య లక్ష్మి యష్టమ విధమ్ము.

వెరసి లోకములందెన్ని విధములైన
సిరులు కల్గెనో, యవియన్ని చేరియొకటఁ
గొలుపు తీర్చిన తీరుగాఁగొమరు మిగిలె,
అష్టలక్ష్ములు శోభన్యతా నష్టకరులు.
అష్టలక్ష్ములు తమ తమ యంశములకుఁ
దగిన రూపులు ధరియించి తనరి రచట
విష్ణుదేవుని ప్రేమ వేవేలగతులఁ
జూఱఁగొంటకో యనఁగఁ బ్రాచుర్యమంది.

అష్టలక్ష్మి నికేతనమున కనతిదూరములోనే సారంగపాణి దేవాలయ మున్నది. ఈ స్వామిని దమిళములో సారంగపాణి "పెరుమాళ్" అనియందురు. "పెరుమాళ్" అనగా శ్రీమహా విష్ణువని యర్థము.

సారంగపాణి పదము సంస్కృత వాఙ్మయములోఁ గనుపించుట లేదు- "సారంగపాణి" యనగా- సారంగము చేతియందుఁగలవాడని యర్థము-

"సారంగః పశుపక్షిణోః" అని నిఘంటువు- విష్ణువు చేతులయందు సారంగ పదవాచ్యమేదియు లేదుగదా- మఱి సారంగపాణి యను పదము నారాయణ బోధక మెట్లు కాఁగలదు.

విష్ణువు నా యుధములు నాలుగు— సుదర్శనము (చక్రము) కౌమోదకి (గద) శార్ఙ్గము (ధనుస్సు) నందకము (ఖడ్గము) అనునవి.

విష్ణువునకుఁ "చక్రపాణి" యని పేరు వచ్చినట్లే- శార్ఙ్గము చేతియం దుండుట వలన "శార్ఙ్గపాణి" యను పేరుగూడ వచ్చినది- ఈ శార్ఙ్గపాణి పదమే తమిళదేశములో "సారంగపాణి" యని వ్యవహరింపఁబడుచున్నది.

ఆ దేవుని యర్ధాంగిపేరు కోమలవల్లి తాయార్- ఆమెకానామము.

తనువు పాషాణమైనను, మనము సరళ
కోమలార్ద్రి లతాస్నిగ్ధ కుసుమ మగుచు,
భక్తపాలనమందు సంసక్తమగుట,
వచ్చె నామము కోమలవల్లి యనుచు.

ఆ క్షేత్రములో నొక ప్రదేశమున నొక యద్భుత శిల్పమున్నది. ఆ శిల్పము పేరు శయనోద్యోగము. అనగా "శయనాత్ ఉద్యోగః ప్రక్కమీది నుండి లేచుట యని యాసమాసమున కర్థము.

ఆ ప్రదేశమున శయన శిల్పములేదు. "అసంభవం వస్తు, తదుపాధి భూతం వస్తు ఆక్షిప్రతీతి" అను న్యాయము ననుసరించి. ఇచ్చట ఉద్యోగము (లేచుట) అను ప్రత్యక్ష క్రియ; దానికి కారణభూతమైన శయనించుట అను పరోక్ష క్రియాంతరమును దెలుపుచున్నది. శయనించుట యున్నగాని లేచుట సంభవింపదు గదా. అనగా సృష్టి స్థితి లయ కారకుఁడైన వైకుంఠవాసుఁడు. అంతకుముందే యచ్చట నిద్రించి యప్పుడు నిద్రనుండి లేచుచున్నాడని ఆ శిల్పభావము.

ఆ దృశ్యములో శయన మదృశ్యము. ఉద్యోగము దృశ్యము. కావున నాదృశ్యము దృశ్యాఽదృశ్యముల సమ్మేళనము. అందుచేతనే భావగంభీరము. ఆ దృశ్య వివరణ మిది.

ఆషాఢంబునఁబండె, సెజ్జపయి శుద్ధైకాదశిన్ భార్గవీ
యోషారత్నము పాదమొత్తగను సర్వోపాధి సృష్ట్యంతమం
దీషల్ గల్గఁగ, లీనమయ్యె నపుడే యీసర్వముఃన్ వానిలో,
శేషాహి ప్రభు నిద్ర చిహ్నము కదా సృష్ట్యంతకాలానికిన్.

కార్తీకంబున నిద్రలేచును జగత్కల్యాణ సంధాయియై!
స్ఫూర్తిశ్రీ వదనంబునన్ మెఱయ నంభోజాక్షుఁ డేకాదశిన్,
మూర్తంబయ్యెను సర్వసృష్టియు జగత్పూర్ణ ప్రబోధంబునన్,
మూర్తంబయ్యెదె యీ రమేశ్వర జగన్మోహాత్మక క్రీడకున్.

సృష్టింపన్ భువనత్రయంబు, పడకన్ శీఘ్రంబుగావీడి యా
స్రష్ట స్రష్టయుఁ బైకిలేచుట కళాంచత్ దృశ్యమై యచ్చటన్
శిష్ట ప్రక్రియ వ్రాయఁగాఁబడియె, నా శిల్పంబు లోకంబులో
వ్యష్టిన్ గన్పడ దెక్కడన్ వెదకినన్ ప్రాచ్య స్థిరాకుక్షిలో.

సృష్టిలయములు జఱుగును శేషశాయి
కనుల విప్పుల మూతల ననుచుఁ దెలుపు.

లేచుచున్నట్టి పరమాత్మ లీల యచట.
కళలు పరమాత్మ కృతికి వ్యాఖ్యానకములు.

శయనోద్యోగమునే ఉద్యోగ శయన మని గూడ ననుచుందురు- అనగా- ఉద్యోగార్థం శయనం- ప్రయత్నము చేయుటకు నిద్రించుట అని యర్థము సమధికోత్సాహముతోఁ గార్యక్రమమును జేయుటకు, దగినంత నిద్రయవసరము- పరమాత్మకూడ సృష్ట్యాది కార్యక్రమముల నొనర్చి యలసి అలసట పోవుటకై నిద్రపోయినాఁడు- ఆ తరువాత నుత్సాహవంతుఁడై తిరిగి సృష్టి కార్యక్రమమును సాగించినాఁడు- శ్రమపడినవాఁడు చక్కఁగా నిద్రించినచో, నిద్రానంతర మపూర్వో త్సాహముతోఁ, గర్తవ్యముల నెఱవేర్పఁగలఁ డను లౌకిక సందేశమునుగూడ నుద్యోగశయన శిల్పము ప్రకటించుచున్నది. "నచాతిస్వప్నశీలస్య జాగ్రతో" "నైవచార్జున" అను గీతావాక్య మీ భావమునకుఁ బోషకము

శయనోద్యోగ శిల్పమునకు నావల దశరథరాముని గృహమున్నది- ఆ నిలయములో రఘుపతి సీతా లక్షణ భరత శత్రుఘ్న హనుమంతులతో విగ్రహ రూపములో నున్నాఁడు- దానినే పంచాయతనమందురు- అచ్చటి స్వామిపేరు కోదండరామస్వామి ఆ కోదండపాణి,

నమ్మిన భక్తవర్యుల, ననారతమున్ సహజార్ద్ర సత్వ భా
వమ్మునఁ బ్రోవ, శీసానుజ సభక్తుఁడునై చను దెంచి నిల్చె నా,
నిమ్మహి నన్నయట్లు రమణీయ మనోహర ముగ్ధమూర్తియై,
తమ్ములకంటె కన్పడు, నదారుఁ డుదారుఁ పతీతమూరుఁడై.

దాశరథి ముందు నుండు, భక్తాంజనేయుఁ
డొదిగి తలవంచి నమ్రుఁడై, యుర్వినున్న
భక్తి భావము, పొంది రూపానుభూతి,
రామపాదాబ్జ భృంగమై ప్రాలినట్లు.

కుంభేశ్వరాలయములోఁ బ్రసిద్ధ శిల్పములేదు- ఆలోపమును శ్రీరామాలయ శిల్పము తీర్చినది- ఆ యాలయ స్తంభములన్నిటి యందును- దశావతార- శ్రీరామ చరిత్రలు మనోరంజకములుగాఁ జెక్కఁబడినవి- అకంబము లన్నియు ఏకాండపు బండలతోనే నిర్మింపఁబడినవి.

ఆ ప్రాంగణములోనే "చక్రపాణి" యాలయమున్నది. "చక్రంపాణౌ యస్యసః" అని విగ్రహము. అనగాఁ జేతియందుఁ జక్రముకలవాఁడని యర్థము విష్ణుచక్రమునకు "సుదర్శన" మని పేరు. ఆ సుదర్శనము ఆ దేవదేవుని దక్షిణ హస్తమున గుండ్రని అంపమువలె యలరారుచున్నది.

స్వామి సుదర్శనంబు కనుజంటల కెల్ల సుదర్శనంబునౌ
భూమికి స్వర్గసీమలకుఁ బోషణముందగఁ జేయు సాధనం
బామహనీయ శస్త్రము, మహత్తర తచ్ఛితధార కెన్న డే
ధామమునందుఁ బన్నొకటి ధ్వంసము కాదె, తలంప నేటికిన్.

తండ్రి చేతికత్తి, తనయుల యెడదలన్
భీతినింపుఁ, జిలుకుఁ బ్రేమసుధల,
చక్రధారి చేతి చక్రము, నరులకు
వంపదయౌను, నగును దంపదమ్ము.

ఆయన సతి విజయవల్లీ తాయారు. ఆ తల్లి యన్వర్థనామధేయ.

విజయవల్లి యనఁగ, విజయంబులకుఁజాలు,
కాన నామె భర్త కౌను జయము,
ఎల్లతావులందు "నింతి సచ్చిత్తంబు
పురుషునింటి పంట, పరుపువిడిది"

ఆ ప్రక్కనే నాగేశ్వరాలయమున్నది. "నాగసేవితః. నాగరాజ శేషేన సేవితః. హారకటకాది రూపేణ భూషితః. ఈశ్వరః. నాగేశ్వరః అనగా సర్ప రాజైన ఆదిశేషునిచేత హారకుండలాది రూపముగా సేవింపఁబడుచున్న ఈశ్వరుఁ డని యర్థము. ఆ యాలయముకూడ చాల పెద్దదే.

నాగేశ్వరాలయమునకు ముందు నటరాజ మండపమున్నది. అది రథాకార ముగా మలచఁబడినది. ఆ శిల్పమతిలోక రమణీయము.

పెద్దవి రాతిచక్రములు పెంపుగఁ జేసి యమర్చి, యశ్వముల్
ముద్దగు శిల్పముల్ గలవి ముందునఁగూర్చియు, వానిచేత నా

నిద్దపు మంటపంబు గణనీయగతిన్ ధర లాగఁబడ్డటుల్,
తద్దయుఁగూర్చె శిల్పి బళిరా! మొనగాడవె శిల్పిశేఖరా!

ఆ దేవాలయ గోపుర నిర్మాణ మతిసుందర మత్యద్భుత మత్యాశ్చకరము.

దేవుని యింటిపై నఁగల చిప్ప తరమ్ముగు గోపురమ్ముపై,
త్రోవలు మూడమర్చె నులితోఁ గ్రమపద్ధతి శిల్పి, యట్టి యా
త్రోవలనుండి వత్సరము లోపల సూర్యుఁడు మూడు మార్లుగా
దేవుని మస్తకంబుఁ గరదీపితమున్ బొనరించు భక్తితో.

సూర్య దేవుని సేవలఁ జూడఁగొనిన,
భవుని మహిమలఁ జెప్పఁగా వలను బడునె
మిహిరగతులను గనుగొన్న మేటి శిల్పి,
శిల్పి బ్రహ్మలు సృష్టి నెచ్చెలులుగారె.

అచ్చటకుఁ గొంతదూరములోఁ గంచికామకోటి పీఠమున్నది. ఆ మఠము కంచి మఠమునకు శాఖగా 1943 లో తంజావూరి రాజు నభ్యర్థనముచేత జగద్గురువు శంకరాచార్యులవారిచేతఁ కుంభకోణములోఁ బ్రతిష్ఠింపఁబడినది.

కుంభకోణములో నొక మహాగ్రంథాలయమున్నది. అందులో నమూల్యములు ననంఖ్యాకములైన సంస్కృత గ్రంథములున్నవి.

అక్కడ నొక మహా సరోవరమున్నది. దానిపేరు మహా మాఘము. లేక మాఘకొళము. ఇది దాక్షిణాత్య సరస్సులలోనెల్ల నతి విశాలము, దాని వైశాల్య మిరువది యెకరములు. ఇక్కడ పన్నెండు సంవత్సరముల కొకమాఱు మహోత్సవము జఱుగుతుంది. దానిపేరు మహామాఘి బృహస్పతి సింహరాశిలోనికి వచ్చునపుడీయుత్సవము జఱుగును, ఈ యుత్సవమునకు పదిలక్షలమంది వత్తురఁట ఈ యుత్సవము మాఘ మాసములో జఱుగును.

కుంభకోణమను పదము లోకములో మోసమునకుఁ బర్యాయ పదముగా వాడఁబడుచున్నది. "ఇక్కడేదో కుంభకోణము జఱిగినదే" ఈ యర్థమెట్లు వచ్చినది

మహా దేవాలయములలో సాధారణముగా విద్యుద్దీపములుండవు. ఆముదము లేక నేతిదీపములుండును. ఆ చిఱుకాంతిలో దైవసన్నిధి యస్పష్టముగా నుండును. అర్చకులు ప్రతి భక్తుని దగ్గఱఁ బూజకై రుసుము వసూలు చేయుదురు. కాని ఒక భక్తుఁడిచ్చిన రుసుముతోఁగొన్న పూజాద్రవ్యములతోనే, నలుగురైదుగురకుఁ బూజలుచేయుదురు. అస్పష్టముగా నగుచున్న దైవదర్శనము, స్పష్టముగాఁ గావలెనన్నచోఁ, గర్పూరహారతి యీయవలయునని చెప్పి ప్రతిభక్తుని దగ్గఱ డబ్బు వసూలుచేయుదురు. ఒక తులము కర్పూరముతెచ్చి వెలిగించి హారతియిచ్చి వెంటనే యార్పివేయుదురు, హారతి వెలిగించుట ఆర్పుటలోఁగల కాలవ్యవధి అత్రిమాతిశయోక్తికిఁ, జక్కని యుదాహరణము. ఆకాల సూక్ష్మాంశమును, శత పత్ర పత్ర వేధన సమయజ్ఞులైన యాలంకారికులే నిర్ణయింపఁగలరు. ఆ కర్పూర మునే తరువాత వచ్చు భక్తుల విషయములోఁగూడ నుపయోగింతురు. ఆ యస్పష్ట పుఁగాంతిలో గుడిలోనేమి జఱుగుచున్నది యెవ్వరికిఁదెలియదు. ఇందువలననే కుంభకోణము అను పదము మోసమునకు మారుపేరైనది. ఇట్టి మోసములు చాల చోట్ల జఱుగుచున్నను. పంకజన్యాయముచేత నీ పర్యాయపదము కుంభకోణము నకే పరిమితమైనది.

ఇట్లు కుంభకోణ క్షేత్రమును దర్శించి మాయవర క్షేత్రదర్శనమునకై మోపరి మూఁపు నధిష్ఠించితిమి.

## మాయవరము

ది. 15-10-84 సా॥ 4 గంటలకు మాయవరము చేరితిమి. ఇది తంజావూరి జిల్లాలో తాలూకా కేంద్రము.

ఈ క్షేత్రమున కధిదైవతము పేరు మయూరనాథుడు. మయూరనాథ పదమచ్చట పరమేశ్వర పర్యాయపదము.

ఆలయములో శివుని విగ్రహమున్నది ఆ విగ్రహమునకుఁ గ్రిందుగా నెమలి బొమ్మయున్నది. ఆ సన్నివేశమును బట్టి యీ మృత్యుంజయునకు మయూరనాథుఁడని నామమేర్పడినది.

మయూరనాథుఁడనగా మయూరమను వాహనమునకు ప్రభువు. యజమాని. యని భావము. మయూర వాహనుఁడని ఫలితార్థము.

మయూర వాహనుఁడు కుమారస్వామి యని ప్రసిద్ధి- పరమేశ్వరునకు మయూర వాహనత్వ మప్రసిద్ధము కదా మఱి యచ్చట భవునకు మయూర వాహనత్వమును గల్పించుటలో నౌచిత్యమేమి ?

"మీనాతి సర్పానితి మయూరః" అనగా సర్పములను హింసించునది యని వ్యుత్పత్తి. (మీఞ్ — హింసాయాం)- ఇచ్చట సర్పశబ్దము- ఆర్యధర్మ విధ్వంసకు లైన రాక్షసుల కుపలక్షకము. మయూర పదము, తాదృశదుష్టులను శిక్షించు నీశ్వర శక్తి కుపలక్షకము- మయూర నాథుఁడనగా- ధర్మ విధ్వంసకములైన దుష్ట శక్తులను శిక్షించు మహా శక్తికి నధినాథుఁడైన పరమేశ్వరుఁడని పిండితార్థము-

మఱియు మయూరనాథనామములలో- దుష్టభంజకః- పాపనాశకః మొదలైన నామములుగూడ నున్నవి. ఆ నామములుగూడ మయూరనాథ సమాస వ్యుత్పత్తికి దోహదముచేయుచున్నవి గదా.

ఈ విధముగా మయూర నాథ పదమునకు, స్వామి ముందున్న నెమలినిఁ బురస్కరింపకొని లాక్షణికముగా సమన్వయము చేసికొనవలసినదే గాని వాచ్యార్థము సమీచీనము కాదు పురాణాదులలో నెక్కడను ఉమాధినాథుఁడు మయూర నాథుడుగాఁ వర్ణింపఁబడలేదు- ఎవరి నడిగినను మయూరనాథ పదప్రాదుర్భావ సామంజస్యమును గుఱించి యించుకంతయుఁజెప్పరైరి. "స్థితస్య గతిశ్చింతనీయా" యనున్యాయము నాశ్రయించి భగవదాజ్ఞ చేత నీ సమన్వయము చేసితిని.

మాయవరనామము :- మయూరనాథస్వామి యున్న గ్రామముకనుక, నా గ్రామమునకు మొదట "మయూరనాథవరము" అని పేరు వచ్చినది- గ్రామ నామాంతమందు "వరము" అని యుండుట వ్యవహారములో నున్నదిగదా ! యథా "మానవరము".

అనంతరము జనవ్యవహారములో- క్రమముగా- మయూరనాథవరము మయూరవరము, మాయూరవరము మాయవరము అని మార్పుచెంది యుండును. లేనిచో భగవ న్నామధేయమైన మయూరనాథ పదమునకును, గ్రామ నామమైన మాయవర పదమునకు ననుబంధము మృగ్యమగును.

ఆ క్షేత్ర నాయకి పేరు అభయాంబిక- అభయముద్రాసహితా అంబికా- అభయాంబికా = అభయ ముద్రతోఁ గూడిన తల్లి యని యర్థము.

బహ్మిరాతుగ నచ్చె ప్రథితిగన్న
శంకరస్వామి, కథయ నాస్తాఽభియుక్త
మైన ముద్రను గొను నభయాంబికకును
నంజలింజేసి వచ్చితి నఘము వీడ.

## వైద్యేశ్వరము

మాయవరము నుంచి బయలుదేరి మేము వైద్యేశ్వరము వచ్చితిమి వైద్యేశ్వరమొక క్షేత్రము. ఆ క్షేత్రాధిపతి వైద్యేశ్వరుఁడు. అమ్మవారు బాలాంబిక.

వైద్యేషు ఈశ్వరః వైద్యేశ్వరః అని వ్యుత్పత్తి, అనగా వైద్యుల యందు సమర్థుఁడని యర్థము. లేక విద్యాయాః వైద్యవిద్యాయాః నోచేత్ ఆధ్యాత్మిక విద్యాయాః ప్రభుః విద్యేశ్వరః విద్యేశ్వర ఏవ వైద్యేశ్వరః. అనగా వైద్యవిద్యకు లేక తత్త్వవిద్యకు ప్రభువు. విద్యేశ్వరుఁడే వైద్యేశ్వరుడని వ్యవహరింపబడును. వైద్యేశ్వరుని క్షేత్రమునకు వైద్యేశ్వరమని పేరు.

ఆ ప్రాంగణములో నొక మహా జీర్ణవృక్షమున్నది. దాని వయస్సు మూడు వందల సంవత్సరములకుఁ బైపడి యుండును. ఆ వృక్షము క్రింద విశాల వేదిక యొకటి యున్నది.

పూర్వ మా ప్రాంతములో వ్యాధులు ప్రబలిపోయినవఁట. అగదములు గాని యగదంకారులుగాని యందుబాటులో లేకపోవుటచేత జనసామాన్యముతోఁ బాటు శివభక్తులనేకులు వ్యాధులకు గుఱియై శివునిస్మరించుచు మరణించుచుండిరఁట.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే”

అనునది గీతాచార్యుని నిర్ణయము. ఇచ్చట దుష్కృతపదమునకు దుర్జన వాచకత్వముతోఁబాటు దుష్కర్మ వాచకత్వముకూడా గూడఁజెప్పుకొనవలెను. లేనిచో, అమృతోత్పాదన ప్రతిబంధ రూపదుష్కర్మనివారకమైన కూర్మావతారము నందీ లక్షణమున కతి వ్యాప్తి రూప దోషము సంభవించును.

ఈ నిర్వచనాను సారమే “జన జీవన ప్రతిబంధక రూప రోగదుష్కర్మను దొలగించుటకై పరమేశ్వరుఁడు.

వైద్య వేషములో నొకమందులసంచితో నక్కడకు వచ్చి యాచెట్టు క్రింద నున్న వేదికపై నుపవిష్టుఁడై సంచివిప్పి యా యరుఁగుపైఁ బోసినాఁడఁట- ఆ సంచిలోనుండి మిరియములు- ఉప్పుపొడి క్రిందఁబడినవఁట- ఆమరీచ చూర్ణ మును లవణక్షోదమును మిశ్రముచేసి మందు తయారుచేసి రోగులను నీరోగులను జేసినాఁడట.

చూచారా ! మన యాయుర్వేద మహిమ- నవీన సూచీవేధ చికిత్సావిధాన ములోఁ దలమున్కలగుచున్న మనము మన ప్రాచీన మూలికా సంజీవినులను విస్మరించినాము- ఎంతటి దౌర్భాగ్యము.

పిమ్మటఁ బరమశివుఁడు భక్తుల ప్రార్థనను మన్నించి వైద్యేశ్వరనామ ముతో నచ్చట వెలసినాఁడఁట. ఆ భక్తులా దేవుని.

ఇతఁడె మమ్ముఁ బ్రోచె నెనలేని దయతోడ
లవణ మరిచ చూర్ణ రసము నిచ్చి
కన్నతల్లి కంటెఁ గన్నులలో నుంచి
సాఁకెమమ్ము సర్వ జగముతండ్రి.

యని స్తుతించి యా వైద్యేశ్వరుని భగవంతునిగా భావించి యర్చించు చుండిరఁట.

నాటినుండి వైద్యనాథున కచ్చట
నుప్పు మిరియములను నొసఁగుచుంద్రు
హృద్య భక్తితో నివేద్యవస్తువులుగా
నూతనాంశ మిది సనాతనమ్ము.

వైద్యేశ్వరునకే వైద్యనాథుఁడను నది నామాంతరము- ఆ వైద్య నాథుఁడు భక్తుల స్తోత్ర పూజాదులకు సంతుష్టిఁజెంది.

"మంచి మందులగును నెంచిన నుప్పును
మిరియములును" ననెడు మేల్మి బోధ
చేసి జగములకును. జేరెను బరధామ.
చెడదు వమ్ము కాదు శిష్టవాక్కు.

ఈ విధముగానే విమత మతో జ్జృంభణము నరికట్టి ఆర్యమతమునకు నండగా నుండుట కవతరించినదే, శంకరుని శంకరాచార్యావతారము.

తైర్థికులు మరమరాలను గొని యచ్చటి కొలఁకులలోఁ బారాడు మీనము లకు వేయుదురు— భూతదయ మన వెన్నునఁబుట్టిన గుణముకదా.

అచ్చటి మీనులు, పెంపుడు
మచ్చములా యన్న యట్లు, మరమరముల, నే
పొచ్చెము లేకయె, యహమిక
యచ్చు పడఁగ నందుకొనును నహరహ ర్కీర్తిన్.

## చిదంబరము

మేము వైదేశ్వరమునుండి— దిగంబరుఁడు— అంబరకేశుఁడు నైన చిదంబ రేశ్వరుని తత్త్వ దర్శనాభిలాషతోఁ జిదంబరక్షేత్రమున కేగితిమి.

చిదంబరమొక గొప్ప శైవ క్షేత్రము. చిదంబరము దక్షిణ ఆర్కాట్ జిల్లాలో తాలూకా కేంద్రము. చిదంబరమునకు "చిత్తం బలమ్" అను నామాంత రముకూడ నున్నది— ఈ క్షేత్రము తనను దర్శించిన వారికి సాంసారిక బంధ ముక్తిని గలిగించి చిత్తములకు నాధ్యాత్మిక తత్త్వబలమును గలిగించునఁట. అందువలననే "చిత్తం బలం" అని నామాంతరమును బొందినది. ఈ నామము వ్యవహార పరిణతము.

ఆ క్షేత్రాదిపతి చిదంబరేశ్వరుఁడు— అది ఆకాశలింగము— ఆ లింగమును బట్టియే స్వామికి చిదంబరేశ్వర నామముకలిగినది.

**నామ నిర్వచనము :**

చిత్, అనగా భిగ్నాపరణమైన అఖండ జ్ఞానజ్యోతి యని యర్థము— అనగా— త్రిగుణాత్మకము అవిద్యారూపమైన ప్రకృతి నామక మాయాతీత దివ్య జ్ఞానరూప పరంజ్యోతి యని యంతర్భావము 'పరమాత్మ' యని లక్ష్యార్థము.

"అంబర" మనగా నాకాశము— చిత్ + అంబరమివ = చిందరం అని చిదంబర సమాసమునకు విగ్రహవాక్యము— అనఁగా నాకాశమువంటి పరమాత్మ యని పరిణతార్థము.

ఆకాశము నిరాకారము నిస్సంగము. ఐనను సర్వసంచారియైన వాయువు నకుఁ గారణోపాధి (ఆధారము) యగుచున్నది. ఆకాశములేనిదే వాయు వుండదు గదా !

చిదాత్మకూడ నిరాకారము- నిస్సంగమునయి చరాచర రూప సర్వ విశ్వమునకు నంతర్యామియైన కారణోపాధి (ప్రత్యగాత్మ) యగుటచేత సర్వ భూతములకు నాధారమగుచున్నది- భూతములాధేయము లగుచున్నవి.

శ్లో॥ మయాతతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా
మత్ స్థాని సర్వ భూతాని నచాహం తే ష్వవస్థితః

అను గీతాశ్లోక మీ భావమునకుఁ బరిపోషకము.

ఈ యాధారాధేయ భావము మూడు కారణములవలన విచిత్రమై లోక రీతికి భిన్నముగా నున్నది.

1) లోకములో నాధారము నాధేయమును భరించుచున్నది. ఉదా॥ బల్లి మనుష్యుఁడు.

ఇచ్చట కార్యములైన (ఆధేయములైన) శరీరాదులు కారణమైన అధార మును (ప్రత్యగాత్మను) భరించుచున్నవి.

2) లోకములో ఆధారమైన (కారణమైన) మృత్తు- ఆధేయములైన (కార్యము లైన) ఘటాదులయందనుగతమగుచున్నది.

ఇచ్చట- ఆధారమైన (సర్వకారణమైన) పరమాత్మ ఆ ధేయములందు కార్యరూపములైన భూతములందుండుటలేదు. ఇటువంటిదే భూ భూధరముల యాధారాధేయభావముకూడ

3) లోకములో నాధారాధేయ భావము సంశ్లిష్టవస్తువులకే కలుఁగుచున్నది. ఇక్కడ నసంశ్లిష్టములైన వస్తువుల కాధారాధేయ భావము చెప్పఁబడినది- సర్వ సంచారియైన మహా వాయువు, నిరవయవము- నిరాకారము నయిన యాకాశ మందున్నట్లే, సర్వభూతములు- నిస్సంగుడు- నిరాకారుఁడునయిన పరమాత్మ యందు వెలయుచున్నవి- నిరాకారముతో వస్త్వంతరమునకు సంశ్లేష మసంభవము కదా. ఈ కారణముల వలననే లౌకికమైన ఆధారాధేయ భావము కంటె అలౌకిక మైన ఈ ఆధారాధేయ భావము భిన్నము- ఆధ్యాత్మికము- జ్ఞానిమాత్ర గమ్యమగు చున్నది.

పరమాత్మ ఆకాశములకు- ఉపమేయోపమానములకు- అనంతత్త్వము నీరూపత్త్వము నిస్సంగత్వము- మొదలగునవి సమానధర్మములు.

శ్లో॥ యథాకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగోమహాన్
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ

అను గీతాశ్లోకములోని- ఆకాశపదము పరమాత్మకు నుపలక్షకము- వాయు పదము భూతములకుపలక్షకము.

ఇచ్చట చిత్ (పరమాత్మ) అంబర (ఆకాశ) సామ్యము కలవాఁడగుటచేతఁ జిదంబరుఁడుగాఁ బ్రసిద్ధి చెందినాఁడు- చిదంబరస్య ఇదం (క్షేత్రం) చిదంబరం- అని యా క్షేత్రమునకు నామమేర్పడినది. అనఁగాఁ జిదంబరస్వామికి సంబంధించిన పుణ్య క్షేత్రమని భావము. ఈశ్వరుఁడనగా అణిమాది అష్టైశ్వరములు కలవాఁడు.

చిదంబరశ్చ ఈశ్వరశ్చ- అని చిదంబరేశ్వర సమాసమునకు విగ్రహ వాక్యము- అనఁగా నాకాశసామ్యము కలవాఁడైన ఈశ్వరుఁడని భావము- లేక- చిదంబర నామకస్య క్షేత్రస్య ఈశ్వరః=ప్రభుః = చిదంబరేశ్వరః (చిదంబర క్షేత్రమునకు నాయకుఁడు) అనియుఁజెప్ప వచ్చును.

పరమేశ్వరుని నిస్సంగ నిర్గుణ నిరాకార తత్త్వమునకే చిదంబర రహస్యమని పేరు- అది కేవలము రహస్యమేకాదు- పరమ రహస్యము- ఆ పరమ రహస్యము- అజ్ఞానుల కగమ్యము సుజ్ఞానలకు సుగమ్యము.

ఆ క్షేత్రమున హరిహరాలయములు సోదరగృహములవలె నున్నవిగదా- ఆ దేవాలయములు తన్మండపములు నతి సన్నిహితములగుటవలన ప్రదక్షిణాది సమయములందు. తలుపులు తెఱచియున్నప్పుడు శివాలయములో నున్నవారికి విష్ణుదర్శనము (శివునిలో విష్ణువు) విష్ణ్వాలయములో నున్నవారికి శివదర్శనము (విష్ణువులో శివుడు) కలిగి శివకేశవుల యద్వైత భావమును రూఢము చేయు చుండును- ఇదియొక వ్యంగ్య చిత్రము. ఈ సన్నివేశము చాల యరుదు.

శివుఁడని కేశవుండనుచు శీర్షము బ్రద్దలు కొట్టుకొంచు మా
నవులు పరస్పరమ్ము జననాంతర సంస్కృతి నల్పభావులై

యావమతి నందు చంద్రుం, పరమాత్ముండొసంగిన మానవత్వమున్
ఘనమగుదాని నిష్ఫలముగా నొనరించుచు మూర్ఖచిత్తులై.

అట్టి యనిష్టభావమును నాంధ్ర మహా కవితా సురాజ్య స
మ్రాట్టు తెలుంగు వేత్త బుధమాన్యుండు తిక్కన రూడుమాపెం జే
పట్టిన సత్కృతిన్ హరి శివాహ్వాయ దైవము సృష్టిచేసి. యే
పట్టుననైన మూఢజన భావము మాఱునె? తెల్వినందునే?

ధీమంతుల్, "జగమంత కేశవ శివాధీనంబునై యుండు నిం
దేమాత్రంబును సందియంబు వలదం చీ పద్ధతిన్ గట్టి రం
దే మాహేశ్వర వైష్ణవాలయములన్. ధీశూన్యు లా నిర్మితిన్
దా మింకైన గ్రహింపకే పరమత ధ్వంసంబు లాసింతురే.

ఈ విధముగా నాక్షేత్రము శివకేశవాభేదమును బోధించు విజ్ఞాన క్షేత్రముగాంగూడం బ్రసిద్ధినందినది.

చిదంబరములో శివునకు ముందు రంధ్రకవాటమున్నది. ఆ రంధ్రముల నుండి చూచిన లోపల గోడప్రక్కగ నొకసింహాసనమున్నది. ఆ సింహాసనముపై నేమియు నుండదు. అక్కడ నున్నది ఆకాశలింగము కదా! ఆ గోడమీద బంగారపు రేకుయంత్రములో సావయవమైన శివప్రతిమ వ్రాయంబడియున్నది. దాని కడ్డముగా నొకతెర యుండును. అది తొలగింపగానే యాదృశ్యము కనంబడును. అదియే చిదంబరరహస్యము— అనగా దృష్టికందని పరమాత్మను మనోదృష్టితోం గాంచుట.

సగుణోపాసనమందు బ్రహ్మముం నకున్ సారూప్య నామాదు లుం
డంగ, నా బ్రహ్మకు నిర్గుణాత్వమున నుండన్ జాల, వాసత్యమున్
దంగబోధించుచు నింగిలింగ మచటన్ దత్ క్షేత్ర గోప్యంబునై
నెగడెన్. ముఖ్యము పాసన మ్మది యగు న్నేదిష్ఠ మోక్షంబునై.

ఆ సమీపమందే శివకామ సుందరీ నటరాజస్వాముల యాలయములున్నవి. శివకామ సుందరీ విగ్రహమత్యంత సుందరము. నగజాతకు ననేక నామము లున్నవి. వానిలో శివకామ సుందరి యొకటి.

అలనాఁ డాచలికొండపై శివుని హస్తాగ్రంబుఁ గై సేయఁ జి
న్నెలువన్నెల్ చెలువార రమ్యమగు వేణిన్ గూర్చి పూబంతి, యో
గులనైనన్ దలక్రిందు సేయఁగల పొంగుల్ రంగులేపారఁ గ్రొ
న్నెలతాల్పున్ జలియింపఁ జేయుటకు నిర్నిద్ర స్వరూపంబునన్.

సేవలన్ జేయుచున్న యా శీతకుధర
సుతకుఁ బేర్వచ్చె శివకామ సుందరి యన
సార్థకమ్మయ్యె నా పేరు శాంభవికిని
"సుగుణ రూపమ్ము సర్వత్ర సుందరమ్ము"

అచ్చట నటరాజస్వామి నటరాజు (నాట్యాచార్యుఁడు) వలెనే ముగ్ధసుందరిని అచలసుతను ననుగ్రహించుటకు నానంద తాండవము చేయుచున్నట్లుండును. వానికిఁ గొంచెమావలనే శ్రీదేవీ భూదేవుల యాలయములును వానినడుమ వైకుంఠ వాసుని యాలయములున్నవి.

ఆ దివ్య మూర్తుల కచ్చట నిత్య పూజలు జరుగుచుండును. పరిశీలింపఁగా నా దృశ్యములు.

శివుఁడు, వాని ప్రక్క శివకామ సుందరి,
లక్ష్మి భూమి రెండు ప్రక్కలందుఁ
గలుఁగు విష్ణు, వచటఁ గాపురం బుండిరా!
యిద్దఱనెడు శంక నెసగఁ జేయు.

చిదంబరాలయము వైశాల్యము 40 ఎకరములు. ఇది యైదు ప్రాకారము లలో నున్నది. మొదటి ప్రాకారమునకు నాల్గుప్రక్కల నాల్గు పెద్ద గోపురము లున్నవి. ఈ ప్రాకారమునకుఁ బ్రాక్ పశ్చిమ గోపురములపైన అష్టోత్తర శతవిధ నాట్యభంగిమలు చెక్కఁబడినవి. అవి శివుని యష్టోత్తరశతనామ భావ సూచకములా! యనట్లుండును. ఐదవ ప్రాకారములో బసవయ్య విశ్రాంతితీసుకొను చున్నాఁడు. ఈతఁడు. భారతనంది జాతికిఁ బితామహుఁడు. మహోన్నతుఁడు. ఆతఁడు.

ఈశుని మాత్రకాదు, సగిరీశు గిరీశునిఁ గార్యమున్న చో
లేశముఁగష్టమందక సలీల విలాసముగా భరిలప నే
నాశలఁబెంచుకొంటి జగదంబకుఁ, దండ్రికి నన్ను మించి స
ర్వాశల లేదు వాహన" మటన్నటులుండెను గర్వ రేఖతో.

ఒక్కమాట :- శిల్పలక్ష్మికి దక్షిణ భారతము కాణయాచి. దాక్షిణాత్య శిల్పములో నందీశ్వర సృష్టి ప్రముఖ స్థానము నాక్రమించినది దక్షిణాదియందు వృషభరాజులు- అనేక ప్రదేశములలో వివిధ భంగిమలలో మలచఁబడినారు. ఆ యాలపోతులు సామాన్య దృష్టికి సమానములుగానే దర్శనమిత్తురు. కాని పరిశీలించిన యెడల నందులన్నింటియందును భావ వైవిధ్యము గోచరింపకమానదు.

శిల్పి బ్రహ్మకదా! బ్రహ్మ సృష్టిలో మానవులందఱిలోను రూపభేదము కన్పించినట్లే- ఏకరూప శిల్పములందుఁగూడ రేఖా మాత్రముగ రూపభేదము తద్ద్వారమున భావభేదము గోచరించును- మేము చూచిన నైకవిధ నంది శిల్పములలో గూడ నాకు భావభేదము గోచరించి యది కవితా రూపముగా పరిణతి నందినది- నానంది వర్ణనములను, భావ వైవిధ్యముండుటవలన పునరుక్తి దోషము స్పృశింపదు సరికదా భావుకుల కది చమత్కార జనకముగఁగూడ నుండునని యాశింతును- మానవ భేదమును గుర్తించుట సుగమము ఏకరూప శిల్ప భేదమును గురించుట దుర్గమము. అచ్చటచ్చట ద్విరుక్తములయిన నావర్ణనముల లోఁగల భావవైవిధ్యమును గుర్తింపఁగోరుదును.

ఈ క్షేత్రమందే గోవిందరాజస్వామి యాలయమున్నది- ఆ స్వామి దేవేరి తాయారమ్మ.

అక్కడ నటరాజస్వామికి నెడమచెవిపై జుట్టుముడి వేయఁబడియుండును- అచ్చటి యర్చకస్వాములు నీ పద్ధతినే యనుసరింతురు- డిశంబరులో నచ్చట నార్ద్రోత్సవము జఱుఁగును.

ఈ విధముగాఁ జిదంబరములోని రహస్యమును రహస్యముల నుపలక్షించి, 16-10-84 రాత్రి 10 గం. నచ్చటినుండి బయలుదేఱి- శివకంచికిఁదెల్లవాఱు జామునకుఁజేరితిమి.

# శివకంచి

16-10-84 న త్రియామయొక్క తృతీయ యామమున మేము కంచి చేరితిమి. ఈ క్షేత్రనామము, సంస్కృతములో కాంచీనగరము. ఆ నామమే యాంధ్రమునఁగంచికా రూపందినది. కంచినిఁదమిళములోఁ గంజివరమందురు.

కంచి చెంగల్పట్టు జిల్లాలో తాలూకా కేంద్రము. ఇచ్చట శ్రీశంకర భగవత్పాదుల మఠమున్నది. శ్రీరామానుజాచార్యులు విశిష్టా ద్వైతమతమును. బుద్ధుఁడు బౌద్ధమతమును ఈ కంచినుండియే ప్రచారము చేసిరఁట. 8 వ శతాబ్దములో మన దేశమునకు వచ్చిన చైనా యాత్రికుఁడు "హుయాన్ సాంగ్" కంచిని దర్శించి యబ్బురపడి తన "భారత దేశ" గ్రంథములో దానినిఁ బ్రశంసించినాఁడట.

కాంచి యనఁగా సంస్కృతములో మొలదూలు (ఒడ్డాణము). నగర మధ్యమందున్న కామాక్షీ దేవికి, చిత్ర విచిత్ర సౌధములతో శోభించుచున్న నగరము ఒడ్డాణమువలెఁ బ్రకాశించుచుండుటవలన నా నగరమునకుఁ గాంచీనగరమని ఖ్యాతి వచ్చినది.

శ్లో॥ అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ చ ద్వారకా
అవంతి కాపురీచైవ సప్తైతా మోక్షదాయకాః,

అని సప్త పుణ్యక్షేత్రములలోఁ గంచియొకటి. కంచిలో నష్టోత్తరశత శివాలయములు ద్వాదశ విష్ణ్వాలయము లున్నవి.

కంచి ద్వివిధము. 1. శివకంచి. 2. విష్ణుకంచి. శివకంచిని పెద్దకంచి యనియు విష్ణుకంచిని చిన్నకంచియనియు ననుచుందురు. ఈ రెండింటికి మధ్య అంతరము రెండు మైళ్లుండును. ఈ యంతరము గృహారామాది నిరంతరము.

మేము పరిశుద్ధులమై శివాలయ ప్రాంగణములోనికిబోయితిమి. అచ్చట.

కాంచితిఁ గంచి నీశ్వరుని కాయత గేహము, భారతంబునం
దంచితమైన క్షేత్రములయందుఁ బ్రభూతతరమ్ముఁ, బ్రాజ్ఞనిన్
సంచిత పుణ్య కర్మ ఫలసాధ్యముఁ, బ్రార్థ్యము దేవతాళికిన్
బొంచిన మృత్యు భీకర మపూర్వము వైష్ణవ శైవ గమ్యమున్.

కౌబేరాశను సుప్రసిద్ధమయి యెక్కాలంబు సంసేవ్యమై
ప్రాబల్యంబునఁ గాశి యున్నటుల, వైవస్వద్దిశన్ క్షేత్రమై
ఆ బాలామర గమ్యమై సకల పాపారణ్య దావాగ్నియై
వేబూచుల్ దొర వెంకియై నెగడు పృథ్వీన్ గంచి కైలాసమై.

శివకంచిలో స్వామిపేరు ఏకామ్రేశ్వరుఁడు- ఆలయ పార్శ్వమున నతి పురాతనమైన నామ్రవృక్షమొకటి యున్నది- ఆమ్ర వృక్షమనగా మామిడిచెట్లని యర్థము.

ఏకః ఆమ్రః యస్మిన్ (స్థలే) తత్- ఏకామ్రం క్షేత్రం- తస్య ఈశ్వరః ఏకామ్రేశ్వరః ప్రసిద్ధమైన గొప్ప మామిడిచెట్టు ఏ స్థలములో నున్నదో ఆ స్థలమునకు, ఏకామ్రమని పేరు- దాని యధిపతికి నేకామ్రేశ్వరుఁడనియు నామములు.

కొందఱుస్వామిని ఏకాంబరేశ్వరుఁ డనుచున్నారు. ఏకం- ముఖ్యం గజ చర్మరూపం వస్త్రం, నోచేత్- ఏకం- రూపరహితం- అంబరం దిక్ వ్యపదేశం వస్త్రం- ఏకాంబరం భవతి- తస్య ఈశ్వరః తద్వాన్ ప్రభుః- ఏకాంబరేశ్వరః- గజ చర్మము వస్త్రముగాఁగల- లేక దిక్కులే వస్త్రముగాఁగల ప్రభువని భావము.

ఏకాంబరేశ్వరాలయములో శివలింగము పృథ్వీలింగము- ఆ మామిడి చెట్టు క్రిందనే పార్వతి తపస్సు చేసినదఁట.

గర్భాలయములోనికి వెళ్ళి ఏకాంబరేశ్వరుని దర్శించి యిట్లు స్తుతించితిని.

కుంభకోణంబులోఁ గుంభేశ్వరుండవు
వైద్యేశ్వరుండవు వైద్యనాథ
మందు గోకర్ణంబునందు గోకర్ణేశ్వ
రుండవు కంచిలో రూపమంది
యుంటి వేకామ్రేశ్వరోన్నతి, శ్రీశైల
మందు శ్రీశైలేశ్వరాఖ్యగనితి
యరుణాచలంబున నరుణాచలేశ్వరు
డీవ నందినిని నందీశ్వరుఁడవు

స్థానములబట్టి కలిగెను సన్న లిన్ని
ఈశ్వరా! నీకు నిజమున కెందుఁగలవు?
గౌణ భక్తుల కొఱకు నొక్కఁడవె పెక్కు
నామముల్ పొందియుంటి వనాది పురుష!

ప్రానీటన్ దరగల్ సదాగతి సమారాధ్యంబులై మిన్నుతో
యానా యానము లెన్నొ చేయుచును భిన్నాకారదృశ్యంబులై
యా నీరంబున నేకతత్త్వమున రూపైక్యంబునున్ బొందు న
ట్లా నీ రూప సహస్రముల్ కలియు నీయందే అపర్ణాప్రభూ!

ఏకాంబరేశ్వరాలయము పంచప్రాకార పరివేష్టితము మొదటి ప్రాకార గోపురమును 1509 లో శ్రీకృష్ణదేవరాయలు కట్టించినాఁడఁట.

ఆలయము ముందొక సరోవరమున్నది. దేవాలయములలో సరస్సులు భక్తులకొఱకే యేర్పడినవి.

ఒడలు మనస్సు శుద్ధమయి యుండవలెన్ భగవంతు సన్నిధిన్
బడయఁగ నెంచు వారి కని, వారినిధానము లచ్చటచ్చటన్
దడయక నుంచి, రా జలనిధానములందునఁ దీర్థమాడుటో
తడపుటయో పదద్వయము ధర్మము దేవునిఁజూచువారికిన్.

ఈ ప్రావరణములో పదుమూడు తీర్థములున్నవి. తీర్థమనఁగా బావి వానిలో సరస్వతీ తీర్థము ప్రశస్తతరము.

అమ్మవారిపేరు కామాక్షీదేవి. ఆతల్లి భారతదేశమందుఁగల యష్టాదశ శక్తి పీఠములలో నన్యతమము, రెండవది.

కామే- కామ ప్రదే వరప్రదే అక్షిణీ=నేత్రే, యస్యాః సా-అని కామాక్షీ సమాసమున కర్థము. అనగా- భక్తుల కోరికలను నిరంతరము నిరంతరాయముగా దీర్చు చూపులు గలదని భావము. అనగా భక్తుల నెల్లప్పుడు దయతోఁ జూచుఁ డి యని ఫలితార్థము. భక్త కల్పవల్లియైన యా తల్లికిఁ గామాక్షి నామమెంతయో సమంజసము. ఇక్కడ నొక విశేషమున్నది.

ఎదు పేయుండును వాహనమ్ము గుడులం దే ప్రాంతమందైన, నీ
పదమందుండె ధ్వజంబుపైన నగజావాహ్యాంబు సింహంబు, స
ర్వద కాత్యాయని కొల్వు సేయుచు సహస్రాక్షంబునై నల్దిశల్
పది యంబౌనటు చూచుచున్ విమత దర్పధ్వంస సంగంభియై.

కామాక్షీ సతియందుఁ గన్పడును ముక్కంటి స్వరూపంబు నె
మ్మోముమున్ జూడఁగ మూడుకండ్ల వలనన్, భూభాగమందుండు నే?
ఆ మార్తిదన్ హరురాణి, సోమరవులా యార్యా గిరిజా నేత్రముల్,
వ్యోమారోహి తృతీయ నేత్రమగు నంభోజాక్షి కా కోవెలన్.

చల్లని తల్లివోలె నెదసాగెడు కోర్కెలఁదీర్చు దేవతా
పల్లవితాగమో యనఁగ భక్తులపాలిటి కామధేనువై
ఉల్లల దంబుదంబనఁగ నొప్పును శాంకరి కంచియందు ను
త్ఫుల్ల విశాలలోచన సముద్గత వత్సలతా భరంబునన్.

కామాక్షీదేవి ప్రతిష్ఠలో నత్యుగ్ర బీజాక్షర విన్యాసము జరిగినదట- అందు వలన నాదేవి మహోగ్ర స్వభావమైనది- మఱియు.

దుర్గాదేవి మహోగ్రతత్త్వమునఁ బ్రాదుర్భూత కామాక్షిలో
భర్గార్ధాంగముఁ గొన్న శక్తివలనన్ బ్రాణాపహారక్రియా
మార్గాన్వేషణ మంచు మించె. నది సామాన్య ప్రజామృత్యువై
సర్గాంతంబును జేయుచుండె నరమాంసాహార దుర్వ్యగ్రమై.

శాంతిం బొందక ప్రత్యహంబు నరులన్ సాక్షాన్మహామృత్యువై
యంతం బొందఁగ జేయు చండిక మహాహంకారమున్ డింప నా
చెంతన్ శంకరయోగి నిల్పెను లసత్ శ్రీచక్రమున్. దాన వి
శ్రాంతిన్ బొందెను గామనేత్ర నిజహింసాకర్మలన్ వీడుచున్.

అది మొదలుగఁ గామాక్షియు
సదయాంతః కరణయగుచు సకల జనుల క

భ్యుదయంబిచ్చుచుఁ, దల్లిగ
నెదనిచ్చుచుఁ, బ్రోచుచుండె హిమనిధి సుతయై.

శంకరాచార్య కృతమైన సకల పాప
హారమునైనట్టి శ్రీచక్రవరమునకును
అతుల భక్తిని నేఁటికి నచటివారు
పూజలం జేయుచుందురు పున్నములను.

యంత్రమున్ గూర్చి లోక సంహార కర్మ
నాపి యుపకృతిఁజెసిన నాది శంక
రులను నిల్పిరి భక్తు లా నిలయమందుఁ
దమకృతజ్ఞతఁదెలుప శ్రద్ధాళువులయి.

దక్షిణ భారతంబున బుధావళి మెచ్చిన తల్లులిద్దరే
యక్షిమహా స్త్రిపత్నులు దివౌకసపూజ్యలు, కంచియందుఁ గా
మాక్షియు ప్రాజ్యహా మధుర యందున శిల్పకళామతల్లి మీ
నాక్షియు నాఁ బ్రసిద్ధలు, నిజాశ్రిత రక్షణ బద్ధహస్తలున్.

విష్ణుకంచిలోఁ బూర్వము రెండు బల్లులు వరదరాజస్వామి యాలయములో నుండి నిరంతరము- ఆ స్వామినిఁ జూచుచుఁ గ్రిందఁబడిన యా స్వామి యభిషేక జలమును నిరంతర మాస్వాదించుచుండెడివఁట- ఆ పుణ్యమువలన నా బల్లులు దేహాంతమున నా దేవాలయములోనే వెండి బంగారు బల్లులై యనుక్షణము స్వామిని దర్శించుచు- స్వామి యనుగ్రహమువలనఁ దమ జాతి స్పర్శవలన మనుజులకుఁ గలుఁగు దోషమును బోగొట్టఁగల సామర్థ్యము కలవై నవఁట.

ఆ సమీపములోనే వామనమూర్తి యాలయమున్నది- ఆవామన మూర్తి మహోన్నతుఁడు- విరాడ్రూపుడు.

అచ్చట వామన శబ్దమునకు పుణ్యజనాదులయందువలె వ్యతిరేక లక్షణము చెప్పుకొనవలయును. ఆ లక్షణవలన ఆ స్వామి చాల యున్నతుఁడను నర్థము వచ్చును. లేనిచో వామన పదమునకును ఆ మహోన్నత మూర్తికిని సమన్వయము కుదురదు-

అచ్చట వామనస్వామి విగ్రహము, చిన్న తాఁడిచెట్టు ప్రమాణములో నున్నది. ఆ స్వామి యచ్చట బలిచక్రవర్తినిఁ ద్రొక్కఁబోవుచున్నట్లుగ నిర్మింపఁబడినాఁడు- శైవ సాంప్రదాయములో వైష్ణవమైన వామనాలయ ముండుట యచ్చటి శివకేశవాభేదమును బ్రకటనము చేయుచున్నది.

నింగినిఁజీల్చుకొంచు గుడినిండిన వామనమూర్తి రూపు, రో
మాంగముఁగల్గఁజేయు ససమాన మహోన్నత విగ్రహాత్మమై
పొంగిన క్రోధశక్తి నలుమూలలనిండి నభస్పృశంబుగా
రింగున లేచినట్లు తనరెన్. బలిదర్ప మనల్ప మార్పఁగన్.

తృణరాజోన్నత మద్భుతమ్ము జగమం దేకత్వ సంస్థాపక
మ్మనల జ్వాల సమానకాంతి మునిసమ్మాన్య ప్రభావమ్ము భూ
మినిఁ బాదంబున మ్రింగి నొక్కుటను, నామీదన్ దివిన్ మ్రింగఁ జా
పిన పాదాంతరమైన రూపుఁగని కంపించున్ జగంబంతయున్.

బలిదైత్యేంద్రుఁడు మూఁడు లోకముల సంపాదించి, శౌర్యంబునన్
దుల యెవ్వండని చండశాసనము మత్తుండై సదాచేసియున్,
దలవంచెన్ భవదీయ పాదముల చెంతన్, జూడ నెవ్వాఁడు లో
పలబైటన్ గల నిన్నుఁగాదని క్షణంబైనన్ ధరన్ నిల్చునే.

నీలాశ్మ స్థగితమ్ము నుచ్చతరమున్ నిర్నిద్రగంభీరము
ద్రాలాలిత్య విలాస శోభితము సత్త్వాకార చిద్రూపమున్
గోలోకాధిపతీ! యమేయ మహిమా కూపార! నీ రూప మా
మూలాగ్రమ్మును గన్న, గాటుక నగంబో యన్న సందేహమా.

భువిపైఁ బాదము వ్యోమమందున శిరంబున్ గల్గు నీరూపు గ
న్గవ సారించినఁ, జీకటింట మఱుఁగై కానంగరానట్టి దా
ని విలోకింపఁగ, నర్చకుల్ గడపయిన్ దివ్వెన్ దగన్ నిల్పి ని
న్నవలోకింపఁగ వీలుచేయుదురు ప్రత్యంగంబు కాన్పింపగన్.

ఒక్కొక్క యంగమే మా
దృక్కుకుఁ గనుపించె దీపదీధితి చేతన్
నిక్కిన కొండన్ దీపం
బొక్కటి చూపింపఁగలదె పూర్ణ మొకపరిన్.

ఓ దశరూపధారి ! యొకటున్నది సందియ మంతరంగమం
దాదియునుండి నీవు ఖలులందఱఁగూల్తువు శిష్టులందఱన్
గాసనకుండఁ బ్రోచెదవు కాని బలీంద్రు నెడాటమందు నా
వాదము పొల్లువోయె. బలి పాపములెట్టివి చేసియుండెడే.

ఇంద్రుని గెల్చి, లోకముల నెల్లను నేలెను చక్రవర్తియై
సాంద్రయశస్వియయ్యెఁ బరసాహస నేత్రలవంక నేత్రమూ
నం ద్రపఁజెందుఁ, బ్రాణములనైనను నిచ్చును యాచకాళికిన్
దంద్రతఁజెందనట్టి సుగుణాలయు నేటికి నష్టపెట్టితో.

రాజ్యము వీరభోజ్య మనరా యుగవృద్ధులు ధర్మవర్ధులున్
ప్రాజ్యము రాజ్య వర్ధనము భవ్య పథంబని ముక్తకంఠులై
యోజ్యము కాదె యా విబుధసూక్తి భవత్కృతమందు, మాధవా !
ఇజ్యుని శిష్యుఁగంటె వరణీయుఁడు కాడె బలీంద్రుఁ డెంచగన్.

ఇద్దఱు కశ్యపాత్మజులె యిద్దఱు రాజ్యము లేల నర్హులే
ఇద్దఱి యందునన్ బలి మహిష్ఠుఁడు శ్రేష్ఠుఁడు, వాని నేల నీ
వద్దిర ! కాలఁద్రొక్కితివి ! యన్య సతీ ధనమాన సౌఖ్య సం
పద్దశఁగోరు వాసవుని భాగ్యము నిల్పితివేల ? నో ప్రభూ !

పరవృద్ధిన్ గమనింపలేఁడు- అధికమా స్వార్థమ్మె యర్థమ్ముగాఁ
బరిపాలించెడు వజ్రి లోకముల సంభావ్యుండె ? మీ బోంట్లకున్
గురుబోధన్ జెవిఁజేరనీక తన వాక్ శుద్ధ్యర్థ మాత్మచ్యుతిన్
బరధర్మంబుగనెంచు ధర్మి బలి పాపాత్ముండె శిక్షార్హుఁడే.

నాకీ సందేహము ముం
దేకగ్గెను మనవిచేసితిన్ నీ ముందే
చేకొనుము నాదు మనవినిఁ
బాకారి వరిష్ఠుఁడెట్లు ? బలికంబె ప్రభూ.

నిను స్పందింబఁగఁ జేయుశక్తిఁ గననే నేరన్ మహాత్మా ! లఘు
ధ్వని నానోటను వెల్వడెన్, జిఱుత వాతాఘాత మబ్దంబు గుం
డెను నార్ద్రింబొనరించునే? గహనమా నీ భావభావంబు నే
ర్వను నేనెంత ! మునీంద్రయోగి హృదయారాధ్యున్ నినున్
దెల్యగన్.

నేను నీతోడ భాషింప నేరనుగద !
నీవు నాతోడ మాటాడ రావు స్వామి !
ఎదను గదలిన సందియ మెదుగనీను
నీదు చెయిదము జగముల నేలు ననుచు.

కంచిలో శ్రీ ఆదిశంకరాచార్యస్వామి అద్వైతమత ప్రచారము కొఱకై భారత దేశములో స్థాపించిన చతుర్మఠములలో నొకటియైన కామకోటి పీఠమున్నది- కామకోటి పీఠమనగా,

కామానాం=ఇంద్రియ సుఖానాం, కోటిః = అగ్రం (చరమభాగః) యస్మిన్ పీఠే భవతి- సః కామకోటిపీఠః- అని విగ్రహము.

ఏ పీఠములోఁ బ్రవేశింపగానే మానవులకు నింద్రియ మోహమంతరించి వైరాగ్య భావ ముదయించునో అట్టి శక్తిఁగల యాధ్యాత్మిక మందిరము కామకోటి పీఠమని భావము- కనుక ఆ పీఠము లౌకిక భావనాలయము. అద్వైతభావనా నిలయము- అట్టి యోగీశ్వరాలయమును చూచుటకు వెళ్ళితిమి.

మఠ బాహ్య ప్రదేశమందే పాదరక్షలను వదలి లోపల ప్రవేశించితిమి- గడపదాటగనే మాకు నెదురుగ జీవకళ యుట్టిపడుచున్న యాదిశంకరుల చిత్రపట మొకటి మమ్మాశీర్వదించినది. అహో ! ఏమా ! స్వామి నేత్ర వర్చస్సు- ఏమా! శాంత ప్రసన్న ముఖచంద్రరోచిస్సముదాయము- ఎంతటిది- ఆ పరమేశ్వరో

ద్భుత ప్రతిభానుషమా ప్రస్ఫురదనుభావగరిమ- దర్శనానుక్షణమే కరనేత్ర హృదయ పద్మముల మొగిడ్చి యా పరమహంస నిట్లు ప్రశంసించితిని- ఆ జగద్గురువులు.

కారణ జన్ముఁడై భరత ఖండము, దుష్టమత ప్రవక్తృ సం
చారము నుండి వేర్పఱచి, జైనము బౌద్ధము చేయు హుంకృతుల్
దూరముచేసి, సర్వమత ధూర్వహదక్షము, భిన్నతత్త్వమం
దార! యభిన్న తత్త్వమును హత్తిన, తత్త్వమత ప్రవక్తయున్.

కన్దెఱచునప్పుడే జ్ఞాననేత్రముకల్గి
హంసోఽమన్న యధ్యాత్మయోగి
దోఁగాడు నప్పుడే తూగాడు లోకము
చంచలంబని మదినెంచువాఁడు
తప్పటడ్గు వేయునప్పుడే సంసృతి
తప్పించు నమ్మిన తత్త్వవేత్త
మాయా విమోహము మంటఁగల్పఁగ బాల్య
మందె సన్న్యాసియైనట్టివాఁడు
దృశ్యమైనది యెల్ల నశ్యమేయంచును
ధరను జాటిన దూరదర్శి, ద్రష్ట
తొలిమిన్కు తలలకు విలువైన భాష్యము
వ్రాయ నేర్చిన మహా పండితుండు
హరినోట జాలువారమృతధారారుచుల్
పంచిపెట్టిన మహా ప్రాజ్ఞమూర్తి.

సర్వ జగతియు, గురువుగా గర్వపడఁగఁ
బరఁగు కర్మంది, తిమిర భాస్కరుఁడు, హరుఁడు
ఆదిశంకరయోగి కధ్యాత్మ భోగి
కంజలించితి పుణ్య పాకంబు కలిమి.

ఆ మందిరము దాటి ముందుకు పోయిన నచ్చట శ్రీకామాక్షీ దేవి పూజా మందిరమున్నది. ఆ మందిరము పది యడుగుల యెత్తున నున్నది. ఆ పూజా మందిరములో మాతృశ్రీ కామాక్షీదేవి కళకళలాడుచుండును. ప్రతి దినము. మధ్యాహ్నము. 12 గంటలకు పెద్దస్వామివారు శ్రీ కామాక్షీ పూజ చేయుదురు. ఆ పూజా విధానము. అత్యంత దర్శనీయము.

అచ్చట ప్రస్తుత జగద్గురువుల ముగ్గురున్నారు. పెద్దస్వామి చిన్నస్వామి బుల్లిస్వామి. అచ్చటివారు వారిని పెద్దస్వామి చిన్నపెద్దస్వామి బుల్లిపెద్దస్వామి యని వ్యవహరింతురు. అనగా చిన్న బుల్లి తనములు వయోగతములు పెద్ద తనము పీఠగతము. అది యచ్చటి మర్యాద.

పెద్దస్వాములు మౌనవ్రతములో నున్నారు. అప్పుడప్పుడు వారు కొంత కాలమట్లు మౌనవ్రతములో నుందురు. ఆ యుండుట. భక్త పాపపరిహారముచేత వ్యయ మగుచున్న తన తపశ్శక్తిని పునస్సంపాదనార్థమేమో ?

పెద్ద స్వాములు జ్ఞాన గంభీరులు ప్రసన్నవదనులు. అస్తంగమ్యమాన. అరుణకిరణ ప్రభా భాసమానులు. తృతీయ భాగోన్మీలిత నేత్ర ధ్యాననిరతులు. నిరంతర పరంధామ పదాంబుజ లగ్నత్రికరణులు=చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి నామ ప్రసిద్ధులు=ఆయోగీంద్రులు.

లోకహితార్థమై, సుఖములున్నను గాదని సన్న్యసించి యీ
లోకమునంది లోఁగలుఁగు లోపముఁదీఱిచి దీర్ఘకాల దీ
క్షాకృత యోగలబ్ధ విలసత్పరతత్త్వ మిళత్ ప్రబోధ యన్
శీకర సేచనంబున నశేషజనంబను సస్యజాలమున్.

జేకొని కాచి ప్రోచి, తన చెంతను గల్గిన జ్ఞానసార మిం
దాకను బంచియిచ్చి శరదంబుదముంబలెఁ జిక్కి, తెల్లనై
వేఁకువఁజుక్కవోలె రుచి విభ్రమదీపిత శుష్కదేహులై
మాకటఁ దోఁచి రాకలితమానులు మాన్యులు పెద్ద స్వాములున్.

చిన్న పెద్ద స్వామి, చేకొన్న విజ్ఞాన
భరము ప్రజల పరము కరము చేయ

వలయునంచునుండె. జఠరంబును బోలి
ఉరుముటకును ముందు నున్నయట్టి.
బుల్లి పెద్దస్వామి పొందుచుఁ జదువులఁ
దిపముచేత జ్ఞాన ధనముచేత
పుష్టిఁజెందు చుండెఁ బూర్ణసారమునంద
జలము పీల్చునట్టి జలదమనఁగ.
పదియు నాలుకళల భావంబు నందంగ
శుద్ధ విదియనాఁడు సొంపు మిగుల
చంద్రరేఖవోలెఁ జక్కన లేపార
బుల్లి స్వామి యుండె బుగ్గ జిగుల.

ఆ మఠములో నిత్యము గోపూజ అన్న ప్రధానము చేయఁబడుచుండు. ఒక గోశాలను గూడ మఠము పోషించుచున్నది.

ఈవిధముగా శివకంచిలో రెండుగంటలసేపుండి తరువాత వైష్ణవ ప్రమరి మైన విష్ణుకంచికి బయలుదేరితిమి.

## విష్ణుకంచి

విష్ణుకంచివి చిన్నకంచి యనుచుందురు.

పెద్ద చిన్న కంచి పేరులే తెలుపును
శైవ వైష్ణవముల భావములను
పెద్ద చిన్నలుండు పెడబుద్ధులందునన్
కలదె భేద మఖిలగమ్యాలందు.

విష్ణుకంచి 25 అడుగుల యెత్తున్న రాతి గుట్టమీద నున్నది. ఆ రాతి గుట్ట గజాకారముగా నుండుటచేత దానిని "హస్తిగిరి యందురు. ఆ కొండమీద వరద రాజస్వామి యాలయమున్నది. ఆయనయే ఆ క్షేత్రాధిపతి.

వరాన్ దదాతీతి వరదః. వరదానాం రాజా. వరదరాజః. అని వరదరాజ సమానమున కర్థము. (అనగా వరముల నిచ్చు దేవతలలో నగ్రగణ్యుఁడని భావము.

మేము పూజాద్రవ్యములను సమీకరించుకొని- ఆ మహా పురుషుని పురుషోత్తముని సన్నిధికేగితిమి. "పురుషాదన్య ఈశ్వరః పురుషాత్ నపరం కించిత్" అని గదా పరమ వాక్యము- ఆ భగవంతునిఁజూడగానె నా వాణి యిట్లు బహిర్గతమైనది.

దేవత లెల్ల దేశముల దీవనలిత్తురు నష్టకష్టముల్
పోవఁగ భాగ్యముల్ కలుగఁగఁ బూజలు చేయుచుఁగొల్చు వారికిన్
ఏవలనైన వారికి రమేశ్వర ! యీ వరదాఖ్య కల్గెనే?
నీవలె లేదు లోకమున, నీవరదాఖ్య కలట్టి దైవమున్.

వరదులే గొప్పవారలు, వారికంటె
వరదరాజులు పెద్దలు, వారికంటె
వరదరాజులు స్వాములు కరముశ్రేష్ఠు
లందు వల్లనె నీవు సర్వాధికుడవు.

వరదాచార్యుని పాదముల్ గొలిచి విశ్వాకారరూపంబు సుం
దర లావణ్య మనోహరమ్ము కనువిందై యంద వీక్షించి యం
బరసంకాశ వపుర్విలాస విలసన్మాణిక్య శోభా దిశాం
తరకిమ్మీరిత దైవమున్ గని మహానందమ్ము నే నందితిన్.

అక్కడ నొక శతస్తంభమండపమున్నది. దాని సృష్టి యపూర్వము.

ఒకటే రాయి ప్రసిద్ధ శిల్పియులిచేఁ నొప్పారె నాచ్ఛాదమై,
ప్రకటంబయ్యెను దాని నాల్గు దెసలన్ వ్రాలారు పెన్గొల్సులున్,
మకుటం బయ్యెడె సర్వ శిల్ప జగతీ మర్మజ్ఞ సృష్టిస్థితిన్
భృకుటిం గూర్తురు లాతి శిల్పులు సనిర్వేదాత్ములై యచ్చటన్.

ఒక రాతితో మండపమును- ఆ మండపము పైనుండి నేలవఱకు జాఱుచున్న గొలుసులను జెక్కుట సామాన్యకార్యమా ! అది యపూర్వ సృష్టి.

వరదరాజ స్వామివారి యాలయములో గోడలపై రెండు బల్లులున్నవి- వానిలో నొకట పైడిది, రెండవది వెండిది.

ఆ బల్లులు సుమారు పది యడుగుల నెత్తునగోడపైన నున్నవి- వానినిఁ దాఁకదలచినవారు ఈవలనున్న మెట్లమీదుగాఁ బైకెక్కి- మొదట వెండిబల్లి నిఁ దాఁకిఁ, పిమ్మట బంగారు బల్లి నిఁదాఁకి యావలనున్న మెట్లమీదుగా దిగిపోవుదురు.

బల్లి విషప్రాణి- అది ఖాద్యములలోఁ (పానీయములలో) బడిన ఆ భోజ్యము ప్రాణహరమగునఁట- అందువలన బల్లి మీదఁబడిన, ఆరోగ్య భంగమగునఁట- కావున బల్లి మీదఁబడినపుడు వెంటనే స్నానము చేసిన ఆరోగ్య భంగము కాదఁట.

కంచిలో వరదరాజస్వామి సన్నిధిలో పూర్వమెప్పుడో రెండు బల్లులుండెనఁట- అవి ప్రతిదినము స్వామి పూజలు చూచుచు- క్రిందఁబడిన స్వామి తీర్థప్రసాదముల స్వీకరించుచు స్వామి పాదములను స్పృశించుచు జీవితమును గడిపినవఁట, స్వామి, వాని భక్తికిమెచ్చి వానిపేరు చిరస్థాయిగాఁ జేయుటకు దేహాంతమున వానిని బంగారు వెండి బల్లులనుగా జేసి గోడపై నిలిపి, వానినిఁదాఁకిన వారికి బల్లిపాటు వలనఁగలుగు దోషమంటకుండునట్లు వరమిచ్చినాడట- ఎవరైనను ఒకమారు ఆ బల్లులను తాఁకినచో జీవితములో,వారిపై నెప్పుడు బల్లి పడినను వారికాదోష మంటదట- ఇంతకంటె విచిత్రమింకొకటున్నది- కంచి వెళ్ళనివారు బల్లి తమమీదఁబడినపుడు చెప్పకుండ,కంచివెళ్ళి వచ్చినవారినిఁదాకవలయునఁటఁ. అప్పుడే వారి పాపము తొలగునఁట- ఈ యాచారమునకు నర్థమేమి.

కంచిలో బల్లులను, దాకినవారికి, వారిని దాకిన వారికి, బల్లిపాటు దోషము నివృత్తమగును- అనుట, భక్తులు భగవంతునితో సమానులు భగవంతుని వలెనె భక్తులుగూడ పాపములు పోఁగొట్టగలరు- అని భక్తమహిమను విశదీకరించుట- ఇఁక కంచి వెళ్ళివచ్చిన వారితోఁ జెప్పకుండఁదాఁకవలెననుట.

అహంకారము జ్ఞాన ప్రతిబంధి- అహంకారము కలిగినపుడు జ్ఞానము నశించి వ్యక్తి శక్తి క్షీణమగును- బల్లిమీద పడినవాఁడు కంచి వెళ్ళి వచ్చినవానితో, దోషము పోవుటకు నిన్నుతాఁకుచున్నాను- అని చెప్పినయెడల-కంచి వెళ్ళివచ్చిన వానికి- "పాపము పోగొట్టు శక్తి తనలో నున్నదను- అహంకారమేర్పడును- అపుడు వాని శక్తి నశించును- ఆ అహంకారము కలుగకుండుటకే చెప్పకుండ తాఁకుట.

బల్లి మాత్రమే మీదబడినపుడే స్నానముచేయవలెనుట- ఇచ్చట, "కాకేభ్యోదధి రక్ష్యతాం" (కాకులు తినకుండ పెరుగు కాపాడుము) అను నర్థవాదములో 'కాక' పదము- దధ్యుపఘాతుక సర్వ జంతువుల కుపలక్షకమైనట్లే (పెరుగును భక్షించు సర్వజంతువులకు సూచకమైనట్లు) ఇక్కడ- బల్లి పదము- ఏ అనారోగ్య కరప్రాణి, మీదఁబడినను స్నానము చేయవలయును, అని సూచించుట-

ఇట్లు విష్ణుకంచిలోని విశేషముల నీక్షించి పట్టుకు ప్రసిద్ధమైన కంచి విపణి వీథు లనుపలక్షించి తెలుఁగు బిడ్డవేసిన పునాదిపై సౌధములఁగట్టుకొన్న చెన్న పట్టణమును జూడ ముందునకు సాగితిమి.

## మద్రాసు (చెన్నపట్నము)

17-10-84 సాయంకాలము కంచిలో బయలుదేరి రాత్రి 10 గంటలకు మద్రాసు చేరితిమి- మద్రాసు నేఁడు భారతదేశములోఁగల మహా నగరములలో మూడవది.

సుమారు 300 సంవత్సరములకుఁ బూర్వము మద్రాసొక చిన్న పల్లెగా నుండెడిదఁట- చెన్నప్పయను తెలుఁగుబిడ్డ, తన యనుయాయులతోఁగలిసి యా పల్లెకు రూపమును గల్పించినాడట- అందువలన నానాఁడది "చెన్నప్పపల్లె" యను నామముతో వ్యవహరింపబడుచుండెడిదఁట.

తరువాత నా పల్లె మధుర తంజావూరు రాజుల పరిపాలనములోఁ గ్రమముగా వృద్ధిపొంది. చెన్నప్ప పట్టణమైనదఁట.

సమాస వృత్తియందు- సంత్యాక్షరము లోపించుట మన భాషా సంప్రదాయములోఁగన్పించుచున్నది. ఉదా॥ జగము+జెట్టి=జగజెట్టి- నెఱవు+విల్కాడు= నెఱవిల్కాడు, ఆ సాంప్రదాయమునను సరించి- చెన్నప్ప+పట్టణము- అను సమాసములోఁ బ్రథమ పదాంత్యాక్షరము "ప్ప" లోపింపగాఁ "చెన్నపట్టణము" అనునామ, మా నగరమునకు రూఢమైనది.

తరువాతఁ గొంతకాలమునకు ఆ పట్టణము "ముత్తరాస్" అను ఒక జాతి నాయకుని యధికారములోనికి వచ్చుటచేత ఆ చెన్నపట్టణము "ముత్తరాస్" పట్టణముగా మాఱినదట- ఆంగ్లేయులు దాని నాక్రమించుకొను నాటికి "ముత్తరా " నగరమనియే అది వ్యవహరింపఁబడుచుండెడిదట-పిమ్మట పదములను స్పష్టముగా

నుచ్చరింపలేని యాంగ్లేయులు "ముత్తరాస్" అను పదమును- సులభోచ్చారణము కొఱకై మద్రాసుగా మార్చినారు. చివరకు "మద్రాసు" అను పేరే చెనపట్టణమునకు స్థిరపడిపోయినది- వారు మనకుఁజేసిన యపకారములలోఁనిది పెద్దది- అయినమా.

వారిని దూఱనేల, మన వారికి నుండెన! దేశభక్తి, యె
వ్వారును స్వేచ్ఛ నందియును బల్కరు పేరుల మార్పుఁగూర్చి, సం
స్కారములోన నాది యుగంబును భారతజాతి, కందులో
నీరస మాంధ్రజాతి, గ ణుతింప దపూర్వతమాంధ్ర సంస్కృతిన్.

తెలుఁగుల జాతి చిహ్నములు తెప్పలు చెన్నపురంబునందు, నా
విలువను నెంచకే తెలుఁగు పెద్దలు దానినిఁ గోలుపోయి నా
రల మదరాసు పోయిన రవంతయు వారిని జీమకుట్టదే,
కలదొ! బలంబు రక్తమునఁ, గల్గనొ! వారికి, బాధకల్గెడున్.

అంతటఁ, దృప్తినందకయ- ఆంధ్ర జనావన కల్పశాఖియా
అంతటి వేంకటేశ్వరుని యాలయ సీమను దెల్గు స్వర్గమున్
సొంతము మ్రింగ, నోటి నొకసారియె విప్పిరి- కాని, యందులో
వింతగఁ జల్లె బూడిదను, వేంకటనాథుఁడు పాప హారియై.

మద్రాసులో నడుగు పెట్టగానే "ఇది మన సోదరుల చెమట తడిలో నుత్పన్నమైన మన యాస్తిగదా- మనకు కాకుండఁబోయినదే యను మూకబాధ నాకు కలుగక మానలేదు- జాతి బంధము- అవినాభావ సంబంధము కదా.

ది 18-10-84 న మేము మద్రాసు నగరమును జూడఁబోయితిమి. మా బస్సు ఒక అర్ధగంట ప్రయాణము చేసి యొక భవన సముదాయము ముందాగి నది. అది మృత జీవాలయము.

"మృతాః జీవా ఇవ-మృత జీవాః. తేషాం ఆలయః- మృత జీవాలయః- ఎచ్చట మరణించినవి కూడ బ్రతికి యున్నట్లే యుండునో ఆ భవన సముదాయమే మృత జీవాలయము- ఆ భవనములలో వందల కొలఁది మృత జీవములున్నవి.

మృత జీవుల కళేబరములలో దూదియో యటువంటి పదార్థమేదియో నింపి కుట్టి యక్కడ నిలఁబెట్టిరి- ఆ సన్నివేశమెంత సహజముగా నున్నదనగాఁ గొంత

కాల మచ్చటఁదిరిగిన తరువాత నిజముగా జీవజంతువుల మధ్యమునఁదిరుఁగుచున్న యనుభూతియే మాకుఁగలిగినది- అది యంతటి యసత్య సత్యము. ఐకమత్యము తోఁగలసియున్న ఆ జంతు జాలమును జూడగా నాకు

హరిణము వ్యాఘ్రమున్ ద్వీపమృగాధిపతుల్ మొదలైన జంతుపుల్
స్థిరమగు వైరమున్ విడిచి స్నేహవశంబునఁ బ్రక్కప్రక్కలన్
కరమను రక్తినుండె. నదిగాంచఁగ జీవదశన్ బ్రపంచ మీ
వరగుణ మాశ్రయించిన నభంగుర శాంతి సుఖంబులందదే.

అనిపించెను. కానీ య్యా
యనిమిషభావంబు మనుజలందున నౌనే?
మనుజుఁడు స్వార్థము బంటగు
వనపశువే నయము యనుజ పశువులకంటెన్.

పిమ్మట మేము ఓడరేవు (హార్బర్)ను జూచితిమి- ఆ రేవు ప్రక్కనే బరువుల నోడనుండి దింపుటకు నెక్కించుటకు శక్తిగల యంత్రములున్నవి (క్రేన్) అవి యాకాశోన్నతములు.

మన్ను మిన్నుదాకి యున్న ధూర్వహములు
నిట్ట నిలువుగాను నిలచియున్న
కుంభ కర్ణులనఁగ జృంభదాకారముల్
గలిగి యుండెఁ గాళ్ళు కదపకుండ.

ఓడను జూచుటకు మేము లోపలికిఁబోతిమి- ఆలోపలి భాగ మతివిశాలము- వందల ప్రయాణీకులకు భోజన భాజనాది సౌకర్యముల సమకూర్చఁగలిగినది- తరగల యొత్తిడికి యోడయూఁగుచున్నది.

లోకభర్త సర్వలోకాలఁగుక్షిలో
నుంచి సాఁగుచుండ నుదరమందు
నున్న ప్రాణులన్ని యూఁగుచున్నట్లు మా
కనుభవమ్మె నౌకయందుఁ దలఁగె.

ఆ ప్రక్కనే మఱియొక మహా ప్రవహణము కడుపునిండ సరుకు నెక్కించుకొని యలలయూపులకు నటునిటు నూఁగుచు మందమాదముగాఁబోవు చున్నది.

జలధి యలలపైనఁ జలియించు నాయోడ
స్థూల వారకాంత చోద్యముఁగను
కదలి కదలలేక కాల్ చెయ్యి కదుపుచు
నాట్యమాడు భంగి నచటఁ దోఁచె.

ప్రయాణమునకు సిద్ధమైన మఱియొక యోడ భయంకరముగఁగూఁతవేసి జలధి తరంగముల జీల్చుకొనుచుఁ బోవుచున్నది- ఆ సన్నివేశము.

ఆఁకలైన యంఁత నఱచి బిట్టుగలేచి
యొడలు విఱుచుకొనుచు నుగ్గురముగ
జంతు హింస కొఱకు సాంద్రాటవిం జేఱు
సింహమనఁగ నోడ చెలఁగి నడచె.

తరువాత మేము అష్టలక్ష్ముల యనుగ్రహ సంపాదనార్థము వెళ్ళితిమి. అష్టలక్ష్మి దేవాలయము కడలిలో (గట్టున) నున్నది- అది యాలయముగాదు- ఒక మహా భవనము- ఆ సౌధములోనే యష్టలక్ష్ములున్నారు.

ప్రధాన లక్ష్మీ విగ్రహము గర్భగుడిలో నున్నది- ఆ దేవికిఁ ప్రదక్షిణ క్రమములో నారోహణావరోహణ పద్ధతిలో- మిగతా లక్ష్ములున్నారు. ఆ యాలయము- సాగరుఁడు "అమ్మా లక్ష్మీ" యని పిలచిన "ఊఁ" యని లక్ష్మి పలుక గలిగి నంత దూరములో నున్నది.

బిడ్డను దగ్గఱుంచుకొన బిడ్డపతిన్ దనయింటనుంచి, యే
యడ్డును లేక సంతతము నాత్మజమోమును జూచుకొంట కా
దొడ్డ గృహస్థు వార్ధి పరితోషముతోఁ దనయుంటె బిడ్డ కా
గడ్డవె యిల్లుకట్టెననఁ గన్పడు సిందిర కంధివాసమున్.

ఆ భార్గవిరూపములు "ఉత్తరోత్తరం బలీయః" అన్నట్లు ఒకదానికంటె నొకటి సుందరము సుందరతరము సుందరతమములుగానున్నవి. ఆ యాదిలక్ష్మి

యొక్క- అష్టైశ్వర్య కలితములైన యష్టమూర్తులను దర్శించి యటనుండి యా సరిత్పతి నిసర్గరామణీయకతను దర్శించుటకు మున్నీటి సన్నిధికేగితిమి.

మద్రాసులో సాగరతీరము కాలక్షేపమున కెంతగానో యుపయోగించును- అది పూర్వాహ్ణము నిర్జనము- సాయాహ్నమున జనసంకులము- సంధ్యాకాలమున పరిణత భానుని యరుణ కిరణకాంతి ప్రసారములతో, ఆనంద డోలికల నూఁగు లాడుచున్న దంపతీ శోభలతో, బాహ్యాభ్యంతర భూములకు గమనాగమనములు చేయు తిరంగ సంఘముల యార్భటులతో పిండి యాఱఁబోసినట్లున్న తెల్లని యిసుక నేలతో, స్వాగతమిచ్చి శీతల స్పర్శలతో మేని శ్రమజలముల నపన యించుచున్న మందమందానిలములతో, నత్యంతాహ్లాదకరముగనుండును- ఇంచుక సేపక్కడ, నుపవిష్టులైనవారికి బాహ్యాభ్యంతర క్లేశము లుపశమించును.

అన్నాదురై యొకప్పుడు దమిళనాఁడు భూతపూర్వ ముఖ్యమంత్రి. ఆతఁడు ప్రజల హృదయాలలో జీవించి యందఱకు 'అన్న' యయినాఁడు- కాలవశమున నాయన భౌతిక కాయము భస్మమైనది- ఆ భస్మములోనుంచి యుద్భవించిన యాయన యశశ్శరీరమే సముద్రతీరమున సమాధిగా వెలసినది. ఈనాఁడా సమాధి, మద్రాసులో ముఖ్య దృశ్యములలో నొకటి- అది యానాఁడు పది లక్షల వ్యయముతోఁ దయారైనది.

ఆ సమాధి క్షేత్రములో నొక వంతెన యున్నది.

వంతెన యెక్కటున్నది సెబాసన దగ్గది, యెక్కి దానిపై
నెంత పదంబుమోప, నటఁ జోద్యముగా వినిపించు నప్పుడా
ప్రాంతము వ్యోమవాణి, పదిలంబుగ దానికి మూలమెచ్చటో
వింతగ నిల్పె శిల్పి, యది వేద్యముకా దెటకేగి చూచినన్.

ఆ క్షేత్ర మధ్యమున ముకుళిత హస్తుఁడైన యన్నాదురై విగ్రహ మున్నది- ఆ విగ్రహము ముందు దేవుని ముందువలెనే దీపము వెలుఁగుచున్నది.

కనరా దచ్చట వత్తి, నూనె యసలే కాన్పింప, దాక్రింద నెం
దునఁ జూపట్టదె యెచ్చటేన్ ప్రబమిద, వాతూలాహతుల్ దాకినన్
గనులన్ మూయదె యన్నకీర్తివలె నెక్కాలంబు నాదీప్తి, యా
ఘన దీపంబును జూచి రాపడితి శంకాపంకమగ్నుండనై.

మబ్బులు నుబ్బుచుఁ గసిగాఁ
బ్రబ్బిన గజతుండధారలన్ గురిసిన నా
దిబ్బను వెలసిన దీపము
తబ్బిబ్బులపడదు దాని దార్ఢ్యంబెంతో.

విచారింపగా నది దీపకాంతి కాదు. బల్బుకాంతి- అది చూచుటకు దీపమువలె నుండును ఆవిధముగా దానికి బ్యాటరీలను భూమిలో నమర్చినారఁట.

అనంతరము మేము మోర్ మార్కెట్టును జూడఁబోయితిమి. అచట విపణి వీధి చాల పెద్దది- అక్కడ దొరకని వస్తువుండదు మోర్ మార్కెట్టు అనగా- అందమైన విశాలమైన మార్కెట్టు.

అక్కడి వ్యాపారస్థులలో నెక్కువమంది మేధావులు. న్యాయమందుగాదు- అన్యాయమందు- ప్రతివస్తువు ధరను అసలు ధరకంటె పదిరెట్లు ఎక్కువగాఁ జెప్పుదురు. క్రొత్తవారు మొగమోటపడి ఏ కొంచెమో తక్కువగా అడుగుదురు. తరువాత అది ఎక్కువ ధరయని క్రేత తెలిసికొన్నను. ఆ విక్రేత బలవంతముగా నా వస్తువును కొన్నవాని కంటకట్టును. ఏమైననూ ఆ మార్కెట్టులోనికి వెళ్ళిన వారు ఏవియో కొన్ని వస్తువులు కొనకుండ నుండరు- దాని యాకర్షణము అటు వంటిది.

ఆ మార్కెట్టు ప్రాంతములో మోసము దౌర్జన్యము చాల యెక్కువగా నుండును- తెలివిగలవారే యచట మోసపోవుచుందురు- తెలివితక్కువవారి సంగతి చెప్పవలసినదేమున్నది- ఏనాటికైనను అన్యాయార్జితము విషభక్షణము వంటిది- చేటు చేయక మానదు. అది నగ్న సత్యము

ఉదరమునకు నెంత యొప్పునో యోగిర,
మంత యుడినఁజెడదు సుంత యొడలు
తేఱతిండి మేరమీఱగాఁ దిన్నచో,
నగు శరీరపదము సార్థకమ్ము.

"శర్యతే ఇతి శరీరమ్" అనిగదా శరీర, పదమునకర్థమ్ము,

అధర్మము చేయువాఁడు- దిన దినాభివృద్ధి నందుచున్నాడే, వానికేమీ తక్కువయగుచున్నది. యనఁగూడదు, వాని జీవితము చివరికేమగునో యీ శ్లోకమే చెప్పుచున్నది.

అధర్మేణైధతే తావత్ - తతో భద్రాణి పశ్యతి
తతస్సపత్నాన్ జయతి - సమూలస్తు వినశ్యతి.

అధర్మము చేయువాఁడు ముందు దినదినాభివృద్ధినందుచు సకల శుభములను బొంది చివరకు సమూలముగా నాశనమగును. అందుకు రావణ, దుర్యోధనాదులు ప్రబల దృష్టాంతములు. ఈ సిద్ధాంతమునకు మోర్ మార్కెట్టు గూడా దృష్టాంతమైనది. చూడండి.

పాపముపొంగిపొర్లి పరిపక్వతనందినఁ, దత్ఫలమ్ము సం
తాపముఁగూర్చు సత్వరము - తథ్యము - పాపసమాకులమ్ము దు
ర్వ్యాపృతి సక్తమై ఋతము రాపడఁజేసెడు మోరుమార్కె
ట్టాపయి బుగ్గియయ్యెను - గృతాఘము పండఁగ నగ్నికీలలన్.

ఆ తరువాత కొంతకాలమునకా మార్కెట్టు అగ్నికాహుతి యయ్యెనని పత్రికలు ప్రచురించినవి.

ఈ విలువైన సత్యము ననేకులు నేర్వక స్వార్థదుష్కృతో
ప్లావితులై యకార్యముల పాల్పడుచుందురు - కన్నులుండి యీ
భూవలయమ్మెఁజూడకయ, పుష్కరమందున దృష్టినిల్పి, యీ
పావనసూత్రముల్ దెలియువారి కిహమ్ము పరమ్ము సాధ్యమా.

ఈ విధముగా మద్రాసును స్థాలీపులాకన్యాయముగా దర్శించి యటనుండి బయలుదేరి, నమ్మినవారికిఁ బరపతినిచ్చు తిరుపతిని, గతమలమైన తిరుమలను దర్శించి, యా తరువాత సప్తనగసింహాసనాధీశుఁడు భక్తులకుఁ బెరటికల్పకము- ఆంధ్రభూమి కమూల్యాలంకారమైన శ్రీశ్రీశ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించుటకు, శ్రీ అలమేల్మంగా హృదయాబ్జ భృంగ ఝంకారములు వినుటకు- శ్రీస్వామి చరణ పంకజ పరిమళముల నాస్వాదించుటకు భక్తమందారుని, నేత్రపద్మ ధవళాలోకన సరస్సులోఁ దీర్థమాడుటకు ముందునకు సాఁగితిమి.–

# శ్రీ తిరుపతి

మేము 21-10-84 తేదీ ఉదయము శ్రీ తిరుపతి క్షేత్రము చేరితిమి. ఈక్షేత్రము ద్వివిధముగా నున్నది. 1. దిగువ తిరుపతి- అనగా దిగువనున్న తిరుపతియని యర్థము- 2. ఎగువ తిరుపతి- అనగాఁ బైనఁగొండపైననున్న తిరుపతి- దీనినే తిరుమల యందురు.

"తిరు, అనగా- పూజ్యమైన యని యర్థము". "పతి, యనఁగా నాధుఁడని యర్థము. అర్థాత్. తిరుపతి యనగా సర్వలోక పూజ్యుడైన జగన్నాధుఁడు- శ్రీ మహావిష్ణువనిభావము- మహాత్ములయొక్క పేరు వారి నివాసస్థలమునకు సంక్రమించుట యున్నది గదా- ఉ॥ హస్తినాపురము- జగన్నాధము- అట్లే తిరుపతి. పూజ్యుఁడైన జగత్పతి, నివసించు పట్టణమునకుఁ దిరుపతియని పేరు వచ్చినది.

తిరుమల యనఁగాఁ బూజ్యమైన కొండయని యర్థము- అకొండకుఁ బూజ్యత్వము క్షేత్రత్వము శ్రీ వేంకటేశ్వర నిలయ మగుటవలన వచ్చిననే.

తిరుపతి స్వామియూరగును, దిర్మల స్వామినివాసగేహమౌ,
బరఁగెను గొప్పక్షేత్రమయి భారతదేశమునందు నాస్థలం
బరయఁగ, నాటినుండి భగవంతుఁడు భక్తుల భాగ్యరేఖయై
ధరఁ గలికాలదైవమయి ధ్యాతలచేఁతల కేతమెత్తెడున్.

ఆ స్వామి తిరుపతియందు గోవిందరాజ నామముతోను దిరుమలయందు శ్రీ వేంకటేశ్వర నామముతోను బ్రసిద్ధిఁజెందినాడు, తిరుమల పుణ్యక్షేత్రముగానే కాక విహారస్థలముగాను ప్రకృతిసౌందర్య నిలయముగాను గూడ ప్రసిద్ధి చెందినది- తిరుమలను గలియుగ వైకుంఠముగ భక్తులు సంభావింతురు.

తిరుమల పైకిఁ బోవుటకు రెండుమార్గములున్నవి. ఒకటి ముక్తిమార్గము ముక్తిప్రదోమార్గః మధ్యమ పదలోపి సమాసము అనగా ముక్తిని ప్రసాదించు మార్గము. భగవద్దర్శనమే ప్రధాన లక్ష్యము కాఁగా, గమనాయాసమునకు భయపడక యుండు భక్తులు పోవుమార్గము- అదియే మెట్లమార్గము. అదియే ముక్తి మార్గము.

మెట్లమార్గము సుమా రేడుమైళ్ళుండును. ఆ యేడు మైళ్ళు ఆరోహణావరోహణములతోఁ గూడి యుండును. స్వామి నిజమైన భక్తులనే యనుగ్రహించును. డాంబికులను గన్నెత్తియైన జూడఁడు.

సరస నూతన సుమముల సరసఁబోక
కోరుకొనుచుండు నీరసకుసుమములను
స్వామి భక్తపరీక్షలోపల ఘనుండు
విశ్వరక్షకుఁ డాతఁ డనశ్వరుండు.

మించిమోఁకాళ్ళయెత్తును మెలఁగుచున్న
మెట్లతోనొప్పు నొకకొండ మిన్ను శిరసు.
దాని నారోహణముచేయు మానవులకు
పగులకుండవు మోఁకాళ్లు తగులమెట్లు.

మోకాళ్లపర్వతం బని
ప్రాకటముగఁ బేరునందెఁ బర్వతమది యా
యాఁకను గడిచిన నాపై
పోకడసాధ్యంబె సర్వపురుషుల కవలన్.

కొండపైఁగొండయుండదు కొండప్రక్కఁ
గొండియుండును నల్లేడుకొండలవల
స్వామియుండును నాయనపార్శ్వమందె
పుష్కరిణియుండు విరజకుఁ బోటియదియు.

ఏడుకొండలగద్దెపైనెక్కి భక్త
లోకములనేలు స్వామి లక్ష్మీకళత్రుఁ
డనుచు వేంకటనాథుని వినుతిసేయు
చుందురందఱు ధ్యాననిస్పందులగుచు.

రెండవది రక్తిమార్గము. అనగా అనురాగముతో కూడిన త్రోవయని యర్థము. రక్తిమార్గమునఁబోవు వారిలో చాలమంది ఐహికసుఖాభిలాషలు కలవారే. వారిలో

స్వార్థాభిలాషయే యెక్కువ గాని స్వర్థాభిలాష (సు+అర్థ+అభిలాష) చాల తక్కువ.

మేధావంతుడు స్వబుద్ధి శక్తిగతులన్ మేల్కొల్పినాఁ డద్రులన్
స్వాధీనంబులఁ జేసి వానిపయిరచ్చల్ తీర్చినాఁ డాపయిన్
రోధోధిపిని మార్గముల్ నిలిపి చంద్రుదన్ మెట్టి తత్త్రదహః
ప్రాధాన్యంబులఁ జాటెనాఁడు. ధరపై వారెల్ల బైవారుగాన్.

అవిధముగా నెదిగిన మానవుఁడే రక్తిమార్గమునకుఁగర్తయైనాఁడు-

వ్యాధి తగ్గిననీదు పాదారవిందముల్
సేవింతునని మ్రొక్కు-సేయు నొకఁడు
నల్లవ్యాపారమందెల్లఁ గోర్కెలుపండ
నిండదిబ్బెము డబ్బునింపునొకఁడు
మొదటితెరగతిలోఁ బూర్ణ జయముగల్గఁ
దలనీలములఁనీయఁ దలఁచు నొకఁడు
లాటరీయందున లక్షలు వచ్చిన
నేటేటఁగొండకు నేగునొకఁడు
హృదయ చందన చర్చ ముదిత యెదన్ జేర
జంటఁగా సేవింప సాఁగునొకఁడు

అంతియేకాని పరమాత్మ యంశమైన
యట్టిజీవాత్మఁ బరమాత్మ నంతికమునఁ
జేర్చు తత్త్వము నెఱుఁగఁడు. చేర్పఁబోడు
తెలిసియున్నట్టివాఁడు. నిదేమివింత ?

నేఁటి యాత్రికులలో నిట్టివారే యెక్కువ- వీరు పోవునదే రక్తిమార్గము అనగా బస్సుత్రోవ.

శ్రీ తిరుమలక్షేత్రస్వామి శ్రీవేంకటేశ్వర ప్రభువు- ఆ యిలవేల్పే మా యిలువేల్పు ఆయన సర్వదేవమయుఁడు. కాఁబట్టి-

కొండలఁ గోనలన్ వివిధ గోత్రతలంబుల మేఘనిర్గతో
చ్చండగతుల్ ప్రవాహములు సాంద్రములై వడిసాఁగి చేరవే
నిండగుసంద్ర, మావరుస నెవ్వరిజోతలు షట్పదంబులై
కొండలనెడునెక్కి- పరఁగున్ సిరివల్లభు నంజతమ్ములన్.

నా కారాధ్యదైవతము మొదటినుండియు మురళీమనోహరుఁడు రాధామాధవుఁడు- అటుపిమ్మట రాధామాధవుని స్థానములో శ్రీయలమేల్ మంగమాంబా సమేతుండైన శ్రీవేంకటేశ్వరస్వామి ప్రతిష్ఠితుఁడైనాఁడు శ్రీవేంకటేశ్వరుని భక్తవాత్సల్యమును దెలుపు నా జీవిత సన్నివేశమును ఈ సందర్భములోఁ దెలుపుట యుచితమనుకొంటిని.

## — వేంకటేశ్వర శరణాగతి —

దిబ్బలు గుట్టలున్, ఝురము తీరును మార్చును, గ్రొత్తత్రోవలన్
గొబ్బునఁజూపి యందునొడఁగూర్చునుపానము, జీవితంబులో
దెబ్బలు జీవలక్ష్యము పదేపది మార్చును మానవాళికిన్
ప్రబ్బు సుఖంబు దుఃఖమును, ప్రాక్తన కర్మవిపాకశక్తిచే.

వింశతి వత్సరంబులకువెన్క- మనస్సున నిల్పి విష్ణుమూ
ర్త్యంశము బాలకృష్ణు యదురాజును గొల్చితిఁ గొంతకాల మా
వంశవినోది నాహృదయపద్మ మహాసనవర్తి స్నిగ్ధ శు
భ్రాంశువులన్ స్రవించె జనిరంజిల నాపయి ప్రేమమూర్తియై.

ఈ విధముగా నా జీవన స్రవంతి యొడుదుడుకులు లేకుండగ- నిరుపద్రవముగా సాఁగుచుండఁగా

పల్లము మిట్టలన్ బడుచుఁ బొఱుచు నాగుచు జీవకుల్య సం
ధిల్లి గమించు చుండఁగను, నెట్టన నడ్డెను జబ్బుకొండ యీా
వెల్లువ, వ్యాధిపర్వతము నెక్క-సమై కనుబట్టె, దాన ని
ల్వొల్లను బల్లటిల్లఁ, దను వెల్లఁ గ కావికలొచుఁదూలఁగన్.

వ్రణము పుట్టెను బిరుదు పైభాగమందు
ననుదినంబును నది వృద్ధినంది యంది
మరణమార్గముఁ జూపించు కరణమయ్యె
చేయు వైద్యము నేరనిచేఁతకాఁగ

వ్యాధి ముదిరినది- బాధహెచ్చినది. తెనాలి ప్రభుత్వ వైద్యాలయ చికిత్సకులు భయములేదని ధైర్యము చెప్పి వైద్యాలయములోఁ జేర్చుకొని వారమైన తరువాత తమచేత కాదని గుంటూరు ప్రభుత్వ వైద్యాలయమునకు తీసికొని పొమ్మని చెప్పిరి.

గుంటూరు జనరల్ హాస్పటల్ లోని వైద్యులు నన్ను బరిశీలించి పెదవి విఱిచిరి. అటుపిమ్మట మా పెద్దన్నగారి కుమారుడు నాయందమితాభిమానము కంవాఁడు- రామమూర్తి నన్ను కేసరపల్లి సదాశివరావుగారి వైద్యాలయముతోఁ జేర్పించినాఁడు- ఆయన వైద్యవృత్తికే భూషణమైనవాఁడు- ఆయన నన్ను బరిశీలించి రెండు రోజుల తరువాత నాపరేషన్ చేయుదుననియు నమ్మకము చెప్పలేనని యుఁ జెప్పెను.

మఱుదినమే శస్త్రచికిత్స- బ్రతుకునమ్మకము లేదు- కలఁతలతో మనస్సు బలహీనమైనది- అర్ధరాత్రి సమయము. దేవదేవుని స్మరించుకొనుచు కన్నుల మూసితిని.

గతమతి నర్ధరాత్రి కలఁగాంచితి. నొక్క త్రిపుండ్రధారి నా
వెతలను జూచి జాలిపడి, వేల్పులవేలుపు భద్రముద్రతో
చ్యుతగతి నన్నుఁజేరిఁ భయమొందకు, నీ యెదనున్నవాఁడ నీ
బ్రతుకున కూతకోలనని పల్కె నదర్శన మందహాసియై.

ఆవిభు మాటలన్ విని యెగాదిగఁజూచితి, స్వామినామము, నా
శ్రీవరుఫాలమందుఁగడు చిక్కని చక్కని పంగనామముల్
పేవరముల్ గనంబడెను. బెద్దని కన్నులు వానిచాటునం
దే, వెలిఁజూడకుండె, గమనించితి నావిభు శ్రీనివాసుఁగా.

కన్నుల్ విప్పిననాఁటినుండి మదిలోఁగన్పట్టు గోపాలుఁడా
పన్నత్రాణుఁడు నాకు నేడుగడ నాప్రారబ్ధముల్ బాపఁ, నే

నున్నా, నంచును వేంకటేశ్వరుఁడుగా నొప్పెన్ దయాసాంద్రుఁడై
కన్నన్ వానిని భావనాపథములోఁ గన్పట్టె శ్రీకృష్ణుఁడే.
చిత్తము హద్దులోనిలిపి చెచ్చెరఁజూడఁగ బర్హిపింఛ మా
యుత్తమ భాగమందుఁ దళుకొత్తెను. వేణువు చేతులందునన్
హత్తి ధ్వనించునట్లు మదియందునఁదోఁచెను. నందగోపుడే
యిత్తఱి శ్రీనివాసుడుగ మృత్యువుఁబాపుచు నన్ను నేలఁగా.
వచ్చెనంచును మదినమ్మి పరమభక్తి
సందడింపఁగ నోపిక చాలనట్టి
శుష్కహస్తములన్ జాపి చోరవచేసి
విన్నవించితి సడిలేక యున్నభాష.

"బట్టను గట్టుచుఁ, గాలిన్
బెట్టిననే పుడమియందు, వెంకన్నా! నా
జుట్టును నీకిత్తును నేఁ
బట్టున శతకంబువ్రాసి పాదాబ్జములన్.
బెట్టుదటంచును" నా సా
ష్టాంగమున్ "శస్త్ర" వైద్యమాయెననువుగా
బట్టును బట్టిన మృత్యువు
పట్టును విడిపించె సప్తపర్వత విభుఁడున్.

తిరుమలేశుని యనుగ్రహమున నాకారోగ్యము చేకూఱినది.

గోపయ్య కలియుగంబునఁ
బాపాలనుబాప శ్రీనివాసుండయ్యెన్
నాపాలి దేవుఁడంచును
నేపుగ మదినమ్మి వేంకటేశుఁగొలిచితిన్.

అదిగో అదిమొదలుగ నా
మదివేలుపు పుడమితొల్పు మందిరుఁ డయ్యెన్

సదయుఁడు వేంకటనాథుఁడు
మది కలిఁగినఁ బ్రోచు, వెన్నమదిగల దొరయై.

శ్రీవేంకటేశ్వరస్వామి యనుగ్రహించినాఁడు గదా- ఇఁక నే నా స్వామికిఁ జేసి కొన్న విన్నపమునకు రూపమీయవలయును. ఒకనాఁడు స్వామిని మదిలో నిలుపుకొని సమాహితచిత్తుఁడనై

నన్నుఁగన్న తండ్రి నామాట నిలఁబెట్టు
నిన్ను వినుతిఁజేయ నెంచినాను
కవితవ్రాయుశక్తి కల్గించి శతకము
వ్రాయఁజేయుమయ్య భక్తబంధు

తేఁటి గీతికపరిపాటి తేఁటి రాజ!
కీటకంబును వలఁతివి తేఁటిఁజేయ
తేఁటిగీతిక వంటిదే తేఁటఁగీతి
కాన దాన నుతింతు నిన్ శ్రీనిధాన.

అని యా నగమందిరునకు జోతలర్పించి యవిజ్ఞాతమైన యా స్వామియనుమతిని స్వీకరించి శతక రచనను బూర్తిచేసితిని- అచ్చుకాలేదు.

మ్రొక్కుబడినిఁ జెల్లించుకొనుటకు- మేము తిరుపతి వెళ్ళినాము. స్వామి దర్శనార్థమై యచ్చట నున్న జనకుల్యను జూచి- నేను స్వామిని దర్శింపఁ లేనేమో యని భయపడితిని.

చలిమల నెక్కుట దివిలో
పలఁదిరుగుట జలధితుంగ భంగచయముపై
నిలఁబడఁగలుగుట వేంకట
నిలయుని దర్శించుటన్న నిజముగ నొకటే.

మనసు కఱగించి యందులో మమతఁజేర్చి
పరిమళముల్లద్దితీయని భావసుధల
రూపుఁగూర్చిన యక్షరరూపకవిత
స్వామికందిక సేనెట్లు చనఁగఁగలను.

నేనిట్లా వేదన పడుచుండగా నొకచిత్రము జరిగినది- పంగనామములను ధరించిన యొక వైష్ణవస్వామి రెండు నిమిషములు మా వంకఁజూచి సత్యదీప్తి మొగమున కలంకారము కాఁగా.

పిలిచినట్లుగవచ్చి యీ పేదబంధు
వనియె ననుజూచి దరహాసమంకురింప
వేంకటయ్యను జూడఁగ వేచియుంటి
వయ్య ! చూతువ ! వెంకన్న పాదయుగళి.

అమృతముసోన కర్ణములయందున నల్లన జాఱినట్లుగాఁ
గుమిలెడు ధాత్రిమీన నెలకొన్న ప్రమోదకణంబులట్లుగా
సుమహితమైన వైష్ణవుని శుభ్రవచస్సు హృదంతరంబునం
దు మధుర భావముల్ పెనుప దోసిలియొగ్గితి నూపిరందితిన్.

రూపము మార్చుకొన్న సురలోకసమర్చిత పాదపద్మఁగాఁ
దాపముఁబాపి నన్నుఁదన ధామముఁజేర్పఁగవచ్చినట్టి ల
క్ష్మీపతిఁగాఁదలంచి మనసిచ్చి కుటుంబముతోడ వానినిన్
బ్రోపరి వెంటనంటితిని. బూర్వము నోములు నాములీనగన్.

ఆ మహిమానుభావుఁడు రయంబున మమ్మల వేఱుత్రోవ నా
సీమను నీఁగఁజేసి విభుచెంతకుఁజేర్చె క్షణంబులోన నా
పై మఱికానరాడెచట. భావముపండెను. వేంకటేశ్వర
స్వామి దయారసంబునకు, భక్తులు ప్రాణమె స్వామివారికిన్.

పది గజంబుల దూరానఁ బరమ పురుష
భవ్య విగ్రహముండెఁ గాపాడ భక్త
కోటిఁజేయిచ్చి, కృపరాకోటిఁదాఁక
శేషనగమునఁదాను వసించునట్లు.

కాంచితి వేంకటేశ్వరుని క్రమపదంబుల సర్వలోక ర
క్షాంచిత రూపధారులను, కార్యఘటాది విభిన్న రూపులన్

వంచిత దుష్టశక్తులను, భాసురమూర్తుల భూరికీర్తులన్
మించిన నీలరోచులను మెచ్చిన భక్తుల చిత్తవృత్తులన్.

కాంచితి వేంకటేశ్వరుని కాయము, సద్గుణకాయమానమున్
మించిన రత్నవజ్రరుచి మేదుర సర్వదిగంతరాళమున్
వంచిత నీలమేఘ పరివార మనోహరకాంతి శ్రీవిలా
సాంచిత ముగ్ధవక్త్ర మభయంకర దీర్ఘకరస్థిరాంశమున్.

కాంచితి సప్త పర్వత శిఖాకమనీయ వినీలకంజమున్
సంచిత గణ్యపుణ్య పరిణద్ధ మహాపథ చక్రవర్తి, వై
రించి ముఖాఖిలామర కిరీటమరీచి విరాజితాంఘ్రి, శో
షించిన భక్తధాత్రిఁ బులకింపఁగఁ జేయు ప్రసన్న వాబ్దమున్.

ఏడుకొండలపైన నింపుగా నెలకొన్న
నల్లని శిఖరమై చెల్లువాని
దశదిశావలయంబుఁ దానయై నెలకొని
అణువు మేరువు నేచు నలరువాని
తను గొల్చువారి చింతలఁగాంచి రక్షింప
ఎత్తైన నగముపై నెక్కువాని
క్రింది పై లోకాల నందఱి కందఁగా
నడుమీటఁ గొలువున్న గడుసువాని.

భయములేదను గుర్తుతో, వరము లొసగు
ముద్రతో నొప్పు కరయుగ్మ మున్నవాని
కలియుగంబున దేవుఁడై వెలయువాని
కంటి వేంకటనాథునిఁ గంటిఫలము.

పులకించెందనువెల్ల డెందమున నుప్పొంగెన్ మహాహర్షముల్,
ఫలియించెన్ దొలిబాము సేఁత కనులన్ బండెన్ ప్రమోదాశ్రువుల్

తిలకించెన్ బున్రుబాటలో మనసు పాథోరాశి జామాత ముం
గల కందోయి విలగ్నమైనపుడు. పంకంబాఱ శంకల్వీడెన్.

ఎడదలోఁబుట్టి యెదిగి పై కెగసి నాల్క
బాటపై జాతి భావసంబాధనమున
మ్రోగఁగల్గిన ధ్వనుల నాభూతవిభునిఁ
బ్రస్తుతించితిఁ బాపముల్ పాఱిపోవ.

సుగంధి వృత్తము :

నింగినేల గాలి కాంతి నీరుచేర్చి లోకముల్
రంగుగాఁ బసందుగాఁ గరంబు మీఱఁ జేయుచున్
సంగమింత లేక మాయ సాయమై చెలంగ, భ్రూ
భంగ కర్తృకంబునన్ బ్రపంచరూపకల్పకా.

సుగంధి వృత్తము :

ఎండమావులీ ధరిత్రి నెంతమాత్ర సత్త్వమా
యంతమాత్ర యుండు లోక మంత నీ వయిన్ ప్రభో
కర్తవయ్యుఁగర్త కాక కారణ స్వరూపివౌ
నీకిదే నమోఽస్తు దేవ! నిత్య శాశ్వ తాక్షరా.

మిత్తి వాతను వాతను మేఁత పెట్టి
యెడఁగు నెక్కుడు దీపము నెదుఁగఁ జేసి
నన్ను సాఁకిన వెంకటనాయకునకు
శతక మర్పించితిన్ గృతజ్ఞతలఁ దెలిపి.

మ్రొక్కు చెల్లింపఁ బలికిన యక్కరముల
సామి మొగసాల వినిపించి సంగ్రహాముగ
ఋణముఁ దీర్చిన తృప్తితోఁ బణము నెగ్గి
నట్లుగా స్వస్థచిత్తుఁడనైతి నవుడు.

తిరుమల చరిత్రలో శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తానుగ్రహమును ప్రకటించు నాకథ యప్రస్తుతము కాదను నభిప్రాయముతోఁ జేర్చితిని. ఇఁక ప్రస్తుత విషయము.

మద్రాసునుంచి మేము తిరుపతి వచ్చితిమి. తిరుపతిలోనున్న సత్రములు యాతాఽయాత జనసంకులములై.

తీరముదాఁక వచ్చెడు సుదీర్ఘ తరంగగణంబుచేతనే
పారముమీఱి లోనికి నవార్యములై చను భంగసంగతిన్
భోరున మ్రోగుచుండు జలమూలము వోలెనె, వచ్చిపోవు వి
డ్వారముచేత సత్రము దివానిశలుండును క్షోభనందుచున్.

చేతికందని మోక్షముఁ జేకొనంగ
నహమికన్ బోవు యోగవిద్యార్థులవలె
మంచి వసతుల బొందంగ నెంచువారు
పడుచులేచుచు ముందుకు పరుగులిడిరి.

యోగ సంసిద్ధిఁబొందిన యోగులకును
బ్రహ్మధామము వలెనె నా వసతులందుఁ
గొందఱకు మంచి వసతులే యందివచ్చు.
లాతి వారికి నన్యముల్ లభ్యములగు.

మేము తిరుమలకుఁబోవనెంచితిమి. తిరుమల పైకిఁదీసికొని పోవుటకు దేవస్థానపు బస్సులున్నవి.

అంతదూరము మముమోసినట్టి బలుఁడు
జమిలి ముక్కాలివాఁడు శ్రీస్వామి కడకుఁ
బోవలేకాగె, ముందుకుఁబోవఁగాక
ఎంతవాఁడును సర్వత్ర యేగఁగలఁడె?

యాత్రీకులు బస్సుల కొఱకు బారులు తీరినిలువఁబడిరి.

కొండ చిలువను బోలునా గుంపు కదలు
చుండె మెల్లగనంత పీల్చుచును గాలి

ఎంత యేగిన వరుసకు నంతులేదె
యదియనాద్యంత సంసారమగున యేమి ?

వరుసలోనిలఁబడియున్న మాకుఁగొంత సేపటికి బస్సునెక్కు నవకాశము లభించినది- బస్సు కదలినది.

తిరుపతి యూరుదాటి చని, తిన్నగఁ బర్వతపాద భూమిపై
పరుగిడసాగె బస్సు భగవంతుని యానతినందినట్లు యం
బరమునుఁ జేరఁబోవుగతి, పర్వతసాను సమున్నతస్థలిన్
నిరతము నేర్చుకొన్న నవ నేర్పున వేసిన బాణమట్లుగన్.

అరుగగఁగొంతదూర మట నద్భుతరూపము కానుపించె. భీ
కరగదదాల్చి దౌష్ట్యమును ఖండనమున్ దగఁజేయ నిల్చిన
ట్లు, రఘువిభుప్రభావమును లోకమునందున జాటునట్లుగా
చిరమయి దీర్ఘమై విపులదీప్తిగలట్టిది యాంజనేయమున్.

తన యిలువేలుపే కలికృతంబగు పాపము నుత్తరింప శే
షనగ శిరంబునన్ వెలసె స్వామిగ మంగమతల్లి భర్తగా
నని పవమాన సూనుఁడు పథాంతరమందున స్వామి వీటికిన్
మునుగ వసించె భక్తజనమున్ దొలిచూపునఁ దన్పుచాడ్పునన్.

నీటిలోతకొడుకు, నింగి మున్మనుమఁడు,
నేలఁబుట్టు తల్లి నేలువాని
కాలిబంటు, నలువ కాలాంతరంబున
నగు సమీరపుత్రునకును మ్రొక్కి.

చనుచునుంటి ముపత్యకు స్వామిఁజూడ
ఎత్తు పల్లమునైన నగేంద్ర పద్యఁ
గొంతదూరము పోవగాఁ గొమ్మునందుఁ
గానుపించెను తార్క్ష్యుఁడు మేనుపెంచి.

దిక్కులఁజిక్కఁబెట్టఁగల దీర్ఘగరుత్తులు రక్తనేత్రముల్
నిక్కిన దుక్కివాలిగలుచు నెత్తగు ముక్కును, హస్తమందునన్
గ్రుక్కెడు తక్షకోరగము శూరతఁజాలెడు వాలకమ్ము మా
దృక్కుల నిల్పఁబెట్టె. బలదృప్త సుపర్ణ మహోగ్రరూపమున్.

బెండువలెఁగొండ నెత్తెడు వీరుఁడయ్యె
తల్లి యాదేశమాలను దలనుదాల్చి
చూచినన్ జచ్చువాములన్ జూరవయుడిగి
నెత్తికెక్కించుకొన్న వినీతుఁడతఁడు.

నూఱునొనలను నీఁకతో నూఁకి చదిపి
తల్లి ఋణమును దీర్చిన ధన్యుఁడతఁడు
భువనభర్తను వీఁపున మోయునట్టి
పూర్ణసత్వుఁడు గరుడుఁడు తూర్ణగామి.

విష్ణు రథమును వీక్షించి వెనలెరథము
పొగలఁజిమ్ముచుఁ బోఁగల ప్రగతిఁగనుచు
కలికి కులుకుల నేగెడు కలికివోలె
వక్రమార్గములందు నవక్రగతుల.

పంకరటింకరులుగా నున్న యా పర్వత మార్గము.

వైకుంఠంబున విష్ణు శయ్యయగు నర్పాధీశుఁ డావిష్ణువే
వీఁకన్ భక్తులఁ బ్రోవగాఁ దిరుమలన్ వేంచేయఁగా, మాధవున్
లోకాధీశుని వీడలేక మదికల్లోలంబునుంబొపఁగా
వ్యాకీర్ణంబగు శేషపర్వతముగా భాసించెనాఁ గన్నడున్.
ఎక్కెడు కొండనెక్కుచును నెక్కినదానిని వేగవీడుచున్
దక్కక యంచులన్ నడచి తల్లడఁబెట్టుచుఁదైర్ఘికావళిన్
ముక్కుచు మెట్టలందు బరిమోదమునందుచు నిమ్నభూమిపై
మ్రొక్కఁదీర్చు వేల్పు గృహమున్ దరియన్ జనె బస్సు దీక్షతో.

## తిరుమల

తిరుమల యపరవైకుంఠము- వైకుంఠవాసునకు స్థిరపీఠము వైకుంఠమందిరుఁడు తిరుమల సుందరుఁడగుటకు నొకపురాణ ప్రసిద్ధి యున్నది- ఈ ప్రకరణములో దాని తెలివిడి ముఖ్యాంశమగుటచేత నా కథ నిచ్చట నా త్రివిస్తరముగా ముచ్చటింతును.

నల్లని చేఁతలన్ నిలువునన్ దెగటార్చు తరంగఖడ్గ. శో
షిల్లినధాత్రి దప్పికనశింపఁగఁ జేసెడు దేవవాపి. నో
రెల్లను దీపిచేయు నధరీకృత సారఘసార మేరుజల్
జల్లఁగఁ జేయువెజ్జు. హరసౌధపురంధ్రి, సరిల్లలామయున్.

అగుగంగానది, భువికిన్
దిగిన పవిత్రాంబురాశి, తీర్థములందున్
బిగువైన తీర్థరాజము
జగతినిఁ బూతమ్మొనర్ప సాఁగుచునుండెవ్.

అట్టి సురతరంగిణీ తీరంబున నొకప్పుడు కశ్యపాది మునిపుంగవులు జగత్కల్యాణార్థమైన సత్రము నొకదానినిఁ జేయ సంకల్పించిరి. ఆ సమయమున బ్రహ్మ మానసపుత్రుఁడైన నారద మహర్షి హరినామ సంకీర్తనముఁ జేయుచు నచటి కేతెంచెను. అపుడా యతిథిని నాతిధేయులైన సంయమి ప్రవదులు యథావిధి సత్కరించిరి. అంత నా మహతీపాణి వారి నుద్దేశించి.

ఎందుల కీక్రతువును మీ
రందఱు దీక్షన్ వహించి యాగము విధితోఁ
బొందుగఁ జేయుచునుండిరి
ఇందుకు ఫలమేమి ? సంయమీంద్రులు ! చెపుడీ.

నారదుని మాటలను విన్న వాచంయము నిట్లు పలికిరి- మహాత్మా ! మానవ కల్యాణార్థమై మేమీ యజ్ఞమును జేయుచున్నాము- కాకతాళీయముగా నతర్కితో పనతులై మీరీ పవిత్ర స్థలమునకు వేంచేసినారు. ఏ కర్మమునైన స్వార్థబుద్ధితోఁ జేయరాదుగదా ! అందువలన మేము సమష్టిగాఁ జేయుచున్న ఈ యిష్టిఫలమును-

సర్వజ్యేష్ఠునకు- నమేయ మహిమా సంపన్నునకు ధారవోయఁదలఁచితిమి- మీరు త్రిలోక సంచారులు- త్రికాలజ్ఞులు. పిపీలికాది బ్రహ్మపర్యంతము సమస్త మనస్తత్త్వములను- గాచివడఁబోసినవారలు- కావున ఈ యాగఫలభోక్తకాఁ దగిన శక్తివంతుని యానతిండు-

మునుల వాక్య శ్రవణానంతర మా జ్ఞానదాత (నారద) యిట్లన్నాడు.

అన్నింటన్ క్షమ యుత్తమంబు. క్షమతో నబ్ధుల్ తరింపన్ దగున్,
మిన్నున్ దాటఁగవచ్చు, భీకరఫణిన్ మే భూషచేయంగనౌ,
పిన్నల్ పెద్దలు కాఁగవచ్చు, నది దుర్భేద్యంబె యేశక్తికిన్,
గన్నా, కయ్యది యున్నవాఁడు త్రిజగద్గణ్యుండు పూజ్యుండిఁకన్.

తాదృశగుణ సంపన్నున
కీదృశ పూజా ఫలమ్ము నీయఁగఁజెల్లున్
మీదరి గలవారెవరై
నా దశదిశలన్ సహిష్ణు నారయుఁడింకన్.

అని సందేశించి యా సురముని వారి నామంత్రించి యథేచ్ఛముగా వాయు పథంబున నంతర్హితుండయ్యెను.

అంత మునీశ్వరుల్ "జగములందుననున్న మహాత్ములందు న
శ్రాంతము నోర్పుఁగల్గి యజరామరుఁడై వెలుగొందువాని సు
స్వాంతుని నిర్ణయించి తెలుపంగదె" యంచును విన్నవింప ధీ
మంతుఁడు సమ్మతించె నఁబుమాత్రము జంకక తత్పరీక్షకున్.

పాదనేత్రుఁడు భృగుముని పరమగర్వి
ముగురు మూర్తులఁబరికింప ముందుపోయె,
బ్రహ్మలోకంబునకు నటస్రష్టయుండె
వదన జలధులఁ దరగలై వరలశ్రుతులు.

వీణానాదము వేదనాదమును గంభీరాకృతుల్ మ్రోయఁగా
నా నాదంబుల ముగ్గితేలుచు మహానందార్ణవంబందునన్

దా నుండెన్ విధి చూడకుండె భృగువున్ దానన్ మహాక్రోధియై
మానంబూనిజనెన్ శివుంగనఁగ బ్రహ్మన్ దూఱుచున్ మానియున్.

శ్వేతాగంబునఁ బార్వతీసహితుఁడై విశ్వేశ్వరుండుండె సం
పీతంబై తెలిమబ్బు నీలరుచితో వెల్గొందుచందంబునన్
భూతంబుల్ జయవెట్టుచుండె వృషభం బుద్దాంతమై మ్రోసె ని
ర్ఘాతిన్, మ్రోసెను గాంగనిర్ఝర జలస్ఫీతార్భటుల్ నిండుగా.

జయ! శంభో! పరమేశ! తాండవ కళాంచత్ భూరిదేహా! పద
ద్వయ సంచూర్ణిత రాజతాద్రిశిఖరా! భాస్వజ్జటాటీర! ని
ర్భయ! కైలాసనివాస" యంచు ధ్వనులేపారెన్ మహాసాగరా
ధ్యయనీయంబగు నా నినాదముల శ్వేతాగంబు మాఱ్మ్రోగగా.

ఆ కోలాహలమందు నెవ్వరును నాయాతుండునౌ తాపసున్
వ్యాకీర్ణ ప్రతిభున్ గనుంగొనరె యాహ్వానింపరే. దానికిన్
రేకెత్తెన్ మెయినిండఁగోపము మహోద్రేకంబునన్. దామసిన్
పోఁకెన్ రాజసమంచు వీడ శివునిన్ సుశ్లోకు నా మానియున్.

భృగువు- అజ హరులు నిర్మర్యాదులని భావించి హరిని బరీక్షింప వైకుంఠమునకేగెను- నచ్చట.

బంగరు కోటలోన, బహుభంగుల రత్నమరీచి మాలికా
భంగములందుఁదేలు బలుపాఁపదొరన్ శయనంబు నూయెలన్
హంగుగ నూఁగుచున్న జలజాక్షుని, వక్షమునందుఁజంచలన్
రంగుగఁదాల్చినట్టి రతిరాజనిభున్ మునిగమ్యమానసున్

చూచెను. గేశవు మానియుఁ
బూచు తమాలమ్ము సొబగుఁబూనిన వానిన్
రోచిఃపూర పరీతున్
ప్రాచీనతమాద్యవాక్య ప్రస్తుత పాదున్.

ఆ వైకుంఠమున - ఆ శ్రీమహావిష్ణువు
        రిక్కలన్ దృక్కులఁ బ్రక్కకుఁ ద్రోసెడు
                పదనఖాంకుర కాంతి పరిఢవిల్లఁ
దమ్ముల దిమ్ముల వమ్ముగాఁ జేసెడు
                యడుగుల జిగి, మించి యడుగులిడఁగ
వ్యత్యస్తమరటి పుష్పము సౌరుదిగఁజార్చు
                పిక్కలతీవి పెంపెక్కి నిక్క
కరికరంబుల లావుఁగాన్కగాఁ జేకొన్న
                గూఢోఁక యూరువు లహాము పఱుప
కలుముల జవరాలి కమనీయ భవనమై
                హిమసాను పరిణాహి హృదయమొప్ప
జగమునూయల నూపు బిగువు చేరులోయనన్
                ద్రాఘిష్ఠ బాహుముద్రలు రహింప
వలమురిసిరిని డాపలి కేల విదలించుఁ
                దలఁదాల్పుసొబగు నేత్రాలఁదస్పఁ
బ్రామిన్కు మూలమై వరగంధ ఫలిగెల్చు
                కోటేరు నాసిక కోమరు మిగుల
ఆద్యంత రహితమై యతి విశాలమ్మైన
                జ్ఞాన పీఠము శోభనంద నుదురు
కాదంబినీ మయూఖావళి ముసిరిన
                కేశి నీలాలకల్ ఖ్యాతినంద

అందచందములన్నియు నమరి యొకట
సర్వసౌందర్యరేఖగా సాఁగినట్లు,
జిష్ణువయ్యును సర్వసహిష్ణువగుచు
విష్ణువుండెను నీల రోచిష్ణువచట.

వలమురి ధృష్ణులున్ బటువు వాలు భయంకర దంతకాంతులున్
వెలిగెడు శార్ఙ్గదీధితులు వింతగు నందకనీల రోచులున్
తలపయి వెల్గు వజ్రమణిధామ కిరీట మయూఖసంతతుల్
కలిసిన కాంతి వెల్లువను గన్పడి కన్పడకుండె విష్ణువున్.

భృగువు హరి యనుభావమునకసూయఁజెంది తనను జూచియుఁజూడ కున్నట్లున్న నారాయణునిపై నలుకవహించి యాసంయమి సంయమమును వదలి హుంకారముచేసెను. కాని యాహుంకారమునకుఁ జంచలానాథుఁ డచంచలుఁడు గానే యున్నాడు. అది కని యా కాలికన్న అహంకృతి అంకెవేయ యధోక్షజుని పెడదయురమున నొక బలుతాపు తన్నెను. ఆయాఘాతమునకు.

తరళము :

చెవుల నిప్పుల గ్రక్కె శేషుఁడు చిందులాడెను హేతులున్
దవిలె సంభ్రమము, కూతుపెన్మిటి దైన్యమున్ గని బాధలో
రవరవంబడె ఖేచరాన్వయరాజు తేనియపక్షకున్
పవిలెఁబెన్నెద లిబ్బిపడతికి మాని క్రూరపదాహతిన్.

ఇంత జఱిగినగాని రవ్వంతయైన
క్షోభఁజెందఁడు పొంగడు కుధరుఁడపుడు
శతనదీ వేగమలమిన సాగరుండు
పొంగునా ? లేక క్రుంగునా ? పొలుపు దక్కి.

వెన్నుని యెదఁదన్నిన యా
చెన్నటి మునియూఁగుచుండెఁ జెలఁగిన కోపా
త్యున్నతి. నిప్పులయొత్తిడిఁ
బ్రౌన్నత గిరిశిఖరరీతి, ముక్కులురలగన్.

దెబ్బతిన్న పుండరీకాక్షుఁడప్లే క్షణ కాలముండి మెల్లగా లేచినాఁడు ఆ లేచుట తమాల వృక్షమే లేచినట్లున్నది. అట్లులేచి లోకేశ్వరుడు కరకమలములను ముకుళించి, మహాత్మా ! అక్షపాదా !

మొఱటగు మేని సోఁకున సమోఘతపశ్చర! పుష్పమార్దవం
బొరసిన నీదుపాదము ప్రభూతముశందెను- అయ్యయో! ఎదీ!
చరణము, సేవఁజేతు, ననుసాఁకుచు తప్పులనెల్లసైఁచి, ఓ
వరముని శేఖరా! యఘమువాయఁగ నన్ననుగ్రహింపుమా!

అని వినయంబు పేర్మిని మహాత్ముఁడు విష్ణువు సాదరంబుగన్
మునిపతి పాదమున్ గొని తమోధరమైన పదాంతరాక్షి గొ
బ్బునఁజిదిమెన్ నఖక్రకచ భూరిబలంబున. దుష్టశక్తులన్
దునిమి ప్రజాహితంబుఁ గరుణోన్నతిఁ జేయుట యాత్మవృత్తిగాన్.

అప్పాల నిచ్చి పాఱు జలదాకృతి, హంకృతి తూల మౌర్ఖ్యమున్
తప్పకఁబాయు మత్తుఁడనఁ, దామసభావము వీఁగఁ బెంపుతో
నొప్పెడు సత్త్వదీప్తియన, నూపిరిపోయిన చర్మభస్త్రినా
నప్పుడు మౌని యుండెఁ జరణాక్షివినిర్గత సర్వగర్వుఁడై.

అప్పుడా భృగువాచంయమి నిరస్తాహంకారుడై ఐదు పది చేసి పదివేసముల సామితో నిట్లన్నాఁడు.

సర్వము గర్వమున్ దునిసె సర్వజగత్ప్రభు! కాలికంటిచే
నౌర్వము వోలె నా హృదయమందున గంధము తిష్ఠవేసె ని
న్నోర్వఁగనెంతవాఁడఁ? గనులుండి యదృక్కునైతి దేవ! నన్
బర్విన మోహమెల్ల నెడఁబాసెను నీ సరిలేని ప్రాపునన్.

మొదటివాఁడవు నీవె యీ భూతలమున
క్షమితలందున సర్వపూజార్హులందు
సెలవటంచును సంయమిశ్రేష్ఠుఁడరిగె
తమముఁబాసిన యా యుషస్తరణికరణి.

భృగువు, భృగుపాతమంది పృథ్వీమతల్లి
కరుణఁ గాల్సేయి విఱుగక యరుగు నరుని

విధము శ్రీహరి దయచేతఁ, బేదవడియు
నరిగెఁ దఱిగిన నిజశక్తి మరలఁబడయ.

అట్లు భృగువు చని శౌనకాదులకు రోచిష్ణువైన విష్ణువే పరమసహిష్ణువనియు యజ్ఞ ఫలభోక్తయనియు బోధించి నిజేచ్ఛఁజనియె.

భృగువును నపగత గర్వునిఁజేసి సాఁగనంపిన రమాకాంతుఁడు భృగు పదతాడితమైన హృదయమును హస్తముతోఁబరామర్శించుకొని యులిక్కి పడినాఁడు. ఆత్మ హృదయ మందిరమైన యిందిర యచ్చటలేదు. తత్తరపడి యామె నన్వేషించినాఁడు. ఆమె యథోముఖియై శత ధనువుల దూరములోఁ బోవుచుఁగనుపించినది, అది గని పరమపదుఁడు ఆమె పదమంటి తనయెడఁగోలావు తీరుమని యనునయించినాఁడు. పెనుకోపము పెదవులఁగదలింపఁ బచ్చవిల్తునితల్లి యిట్లన్నది.

పంచచామరము :

సమున్నతంబు లోకమందు స్వామి! మీ యురమ్మటం
చమేయరక్తిఁ దృప్తి నందు హాయిగా వసించితిన్,
సుమా! ఇకిప్డు నాదుతావు శూన్యమయ్యె ధూర్త పా
దమూన. నింద్యమందు నే ముదంబు నెట్లు పొందుదున్.

పంచచామరము :

కరంబు గౌరవంబు నాకుఁ గ్రమభూషణంబగున్
మురారి! లేక గౌరవంబు మున్నుగా నెటుండుదున్
నరే! యికెందు నాకుఁగల్గు సౌఖ్య గౌరవంబు లా
ధరాతలంబునందు నుందు ధ్యానయోగ పద్ధతిన్.

అని పలికి యా తల్లితల్లి ప్రాణేశ్వరుఁడు ప్రతిమాలుచున్నను, అలమిన యలుక పెల్లున వెడలిపోయినది. పద్మాక్షుఁడును. బద్మావతీ వియోగమును సహింపఁజాలక నిద్రాహారముల మాని యామె నన్వేషించుచు వైకుంఠమును వదలి పుట్టలను గుట్టలను గొండలను గోనలను వెదకుచు నున్మత్తునివలెఁ బరిభ్రమింప సాఁగినాఁడు. అట్లు నిరంతర గమనముచేత శ్రీనివాసుఁ డత్యంత శ్రాంతుఁడై

విశ్రాంతి కొలఁకుఁదగిన నెలవును నెమకుచుఁ దిరిగి తిరిగి తుదకు వేంకటాద్రిని దర్శించినాఁడు. అచ్చట శాఖోప శాఖా విరాజమానమైన యొక చింతచెట్టున్నది. ఆ వృక్షచ్ఛాయలో పుండరీకాక్షుఁడు శయనించి యర్ధనిమీలిత నేత్రుఁడై యోగ నిద్రను జెందెను.

దినముల్ మాసము లేగ శ్రీపతి మహాదీక్షన్ సమాధిస్థుఁడై
కనులన్ మూసి తపంబుఁ జేయ, వడసోఁకన్ దాపముం జెంది తూ
లిన నీలాంగుని తాపమార్పఁగను వల్మీకం బొకం డచ్చటన్
మొనసెన్ గేహముబోలె. లోకవిభునిన్ భూతంబులున్ గొల్వవే.

అట్లా పుట్టను వర్షముల్ గడిపె గంజాక్షుండు పెన్నాఁకటన్
చేట్లం బొందుచు దప్పికన్ బడుచు వాసిన్వాసి. దీనాత్ముఁడై
యెట్లో గో వొక టొక్క టక్కడకుఁ దా నేతెంచి యాపుట్టపైఁ
దూట్లన్ జూచెను శ్రీనివాసుని మహాదుఃఖార్తునత్యార్తిమై.

కళవళంబడె గోమాత కనులుమూసి
పుట్టలోనున్న శ్రీపతి నట్టెచూచి
కలఁగె హృదయము గోమాత కపుడు, తల్లి
బిడ్డ కష్టము చూచి యోర్పెట్లు పొందు ?

గొల్ల పల్లెను దన్నోమ్ము నల్లరీని
శ్రీనివాసుని మోమును బూని చూచి
తనకు దైవము నాతనిఁ, దానొ వెనుక
నతని దైవమటంచును నాత్మ నెంచి.

కలఁగిన, యావు తల్లియెద, కాఱెను క్షీరముఖమ్ముగా మనోహ
హారమగు శ్రీనివాసు రుచిరాస్యమునందునఁ. దల్లి పాల నే
కరణిగ బిడ్డ త్రాగు నటు కంజదళాక్షుఁడు త్రాగి తృప్తితోఁ
బరవశుఁడయ్యె. గోవు తన పండిన పుణ్యము మెచ్చె నిచ్చలో.

అనుదినంబును ధేను వాదినారాయణుఁ
బాలతో సంతృప్తిపఱచుచుండె
వట్టి పొదుగుతోడ వచ్చెడు సురభినిఁ
గని గోమి శంకించి కలఁతపడుచు
నాలకాపరిఁజూచి యందుకుఁగారణం
బడుగ వాఁడును వేచి యసలు విషయ
మవగతంబునుగాఁగ నాగ్రహంబును జెంది
పుట్టఁబాలను బోయు పొదుగు కత్తిఁ
జంపగా నెంచి గొడ్డలి చయ్యనెత్తి
వ్రేసె నొకవ్రేటు. వల్మీకవాసి యపుడు
ధాత్రిఁ గాపాడ నిచ్చె యాదవున కెఱుగఁ
దలను, రక్తము వరదయై ధాత్రిఁబడఁగ.

అట్లు వ్రేని పరశుధారకు లక్ష్యమై శ్రీనివాసుని శిరము వ్రద్దలైనది. అది చూచి కాపరి రక్తముఁగక్కి మరణించెను. సాధుహంతకు చావు తప్పదుగదా. ఆ వార్త గోస్వామియైన తొండమాన్ భూపతికిఁదెలిసినది.

చారముఖమున నావార్త శ్రవణ పథముఁ
జేర నచ్చోటఁజేరెఁ జెచ్చెరను ఱేఁడు
తెలిసి విషయము జ్ఞానము కలిమిలేమి
శ్రీనివాసుని దూఱె నా చెనటిరాజు.

గొల్లని మిత్తికిన్ దనను గూర్పఁజేసిన మందబుద్ధి నా
ప్రల్లదు భూపునిన్ గఠిన భాషశపించెను జక్రపాణి "ఓ
కల్లరి! నీవు దయ్యముగఁ గష్టము నష్టము నన్భవింపుమీ
తల్లడమంది భూత నివదంబు లోకముగాసిఁబెట్టుచున్.

అట్లు శ్రియఃపతి శపింపఁజోళరాజు భయకంపితుఁడై తనకు శాపావసాదము ననుగ్రహింపుమని వేడగా సిరి చెలువుడును సహజ సజ్జనుఁడైన యా

చోళరాజును దయతో క్షమించి- రాజా ! ఈ జన్మమంతయు నీకుఁగాపి శేయత్వము తప్పదు- భావి జన్మమున నీవు- ఆకాశరాజ నామముతో ప్రఖ్యాతుడవగుదువు- అపుడు- అనన్య కీర్తి ప్రతిష్ఠా సుఖముల నందగలవని యాశీర్వదించి- లక్ష్మిని వెదకు కొనుచు నా లక్ష్మీపతి తిరిగి గహన సంచారియైనాఁడు.

* * * * * *

ఒడినిన్ నింపెడు కాంతిరేఖ హృదయం బూరించు జాబిల్లి, నే
రెడు తేవృక్షము గేహకందుకము దూరీభూతమైపోవ, నా
బుడుతన్ బాయఁగలేక నందసతి పెన్ మోహంబునన్ భూమిపై
నడయాడెన్ వకుళాపురంధ్రియయి పొందన్ జిన్నికృష్ణున్ దమిన్.
చిటిలిన పాల భాగమును జేతను మూయుచు బాధనొందుచున్
బొటబొట బాష్పముల్ ప్రిదుల మూల్గుచు నేగెను శ్రీనివాసుఁ డరి
తట వకుళాలతాంగి సదనంబున. కామెయు నార్ద్రదృష్టియై
నెటికలు వేసి వాని తల నిండుగఁగూరిమినింపె వానిపై.
గత జన్మంబున బంధమెంతటిదొ? యా కంజాక్షుఁ డా లేమయున్
సుత మాతాదర రజ్జు బంధితులునై సూక్ష్మేక్షికన్ బూర్వ సం
గత భావంబును బొంది, డెందములలో జ్ఞానంబు పెంపొంద నా
వితతారణ్య కుటీరభాగమున సంప్రీతాత్ములై రిర్వురున్.

## — పద్మావతీ చరిత్రము —

పద్మావతి సాక్షాత్తు లక్ష్మ్యంశమున జన్మించిన గుణరాశి- ఆమె పూర్వ చరిత్ర యతి విచిత్రము- యత్యంత పవిత్రము- శ్రోత్రపేయము- ఆ కథా క్రమమిది.

దండకాటవియందు దశరథరాముని
వంచించి, భూజాత బలముతోడ
గొనిపోవుచున్న రక్షోనాథుగనుగొని
జానకి రక్షింపఁ బూని వగచి
పీతిహోత్రుఁడు పల్కె వెరవుగా లంకేశ !
నిజమైన సీత నా నికటమందు

దాఁగియున్నది నీకు దడిసి యథార్థము
నమ్ముము నామాట వమ్ము గాదు.

నే స్త్రకాడవగుట నీకు నీ విషయముఁ
జెప్పఁదలఁచినాఁడఁ జెప్పినాఁడ
నీవు మిన్నకుండు నే నీమెఁ గొంపోయి
నిజము భూమిజాత నీకు నిత్తు.

అని పలికి రావణుని నమ్మించి యొప్పించి.

మైథిలిన్ వహ్ని గొంపోయె మిన్నకుండె
పంక్తికంఠుఁడు జానకీఁబడయు కాంక్ష
నిజగృహంబును జేరెను నిఖలభోక్త
మాత్మరక్షణ మాన్య సమ్మానమంద.

వెనుకఁజను దెంచు జానకీ విమల కాంతి (న్)
కృష్ణవర్త్ముఁడు సితకాంతి కిరణుఁడయ్యె
రాకయందున జాబిలి రాకవలన
పశ్చిమాంబుధి నాథుని భవనమువలె.

వైశ్వానరుఁ డయోనిజాతను దోఁగొని యింటఁ బ్రవేశించినాడుఁ అక్కడ నొక పుణ్యాంగన తపోనిష్ఠలోఁ దరణికిరణ పుంజమువలెఁ బ్రకాశించుచున్నది. ఆమె పద్మాంశ సంభూత. ఆమె పేరు వేదవతి.

వేదవతి యను నొకకాంత విమలచరిత
హరినిఁగామించి యసువుల హారతిచ్చి
చేయుచుండెను దపము నచ్చెరువునంది
భూజ దిలిజులు కరములు మోడ్చి పొగడ.

అటకుఁజను దెంచె రావణుఁ డసురభర్త
యన్యకాంతా పహార దుర్వృత్త పరుఁడు

వెల్లయేనుఁగు దంతముల్ పెఱికినట్టి
మేటి బలశాలి యజ్ఞతమించు జ్ఞాని.
వేదవతిఁ జూచి తలయూఁచి మోదమంది
వలపుఁ దెలిపెను గావాఁటి పలలబోక్త
గడ్డిపఱకగ భావించి కలికి వాని
తూలనాడెను క్రవ్యాదు దుష్టబుద్ధి.
మదపుటేనుఁగు పోషనంత మఱచి నళిని
నేలఁగోలకుఁ దేఁబూను లీల నసుర
వేదవతి పూర్ణయౌవనామోద జనిత
కామ మదమునఁ గోమలి కరముఁ బట్టె.
వచ్చి తేనెతిండ్లు దయమాలి తమ్మి తే
యెషదమధువు నాన నేగినట్లు
ఐదునైదునోళ్ళ కానందమునుబంచ
మొక్కలీఁడు వంగె రక్కసుండు.
వేఁగి బాతఁబడిన పిల్లమేక విధానఁ
దల్లడిల్లి యామె దరిసెయున్న
యాశ్రయాశుఁ జేరె. నాతఁడు నిజనామ
భిన్నగతినిఁ గాచె వేదవతిని.

అంత నా నీరుపాప ఆ షాపను ఆ పాపుని బాఱినుండి సంరక్షించి తన యిల్లాలైన స్వాహాదేవి కప్పగించి ఆమె యండను నీ కే భయముండదని వేదవతికి నచ్చఁజెప్పెను. తదాది రూపాంతర లక్ష్మియైన యాశుభలక్షణ వీతశంకయై జాతవేదుని యింటనే మనోరథ సిద్ధి నర్థించి తపము చేయుచుండెను.

రావణుని మోసగించిన పావకుఁడు జగత్పావనియైన పృథ్వీ పుత్రినిఁ దీసికొనివచ్చి తనయింటనున్న వేదవతిని నమ్మించి యొప్పించి సీతాప్రతిరూపమును ధరించిన యా స్త్రీరత్నమును రావణునకర్పించి యామెయే రాముని రామయని నమ్మించెను.

రావణ వధానంతరము శ్రీరామచంద్రుఁడు ప్రజా విశ్వాసార్థము సీత నగ్నిప్రవేశము చేయించినాఁడుగదా! ఆ సమయమునఁ ద్విముఖుఁడు సుముఖుఁడై దనయందుఁ బ్రవేశించిన సీతారూపవేదవతినిఁ దిరిగి తన యింటనుంచి, తనయింట నున్న యథార్థ జానకిని శ్రీరామునకు సమర్పించినాఁడు. అగ్నియింటిలో నున్న వేదవతి శ్రీహరిని భర్తగాఁ బొందగోరి తపస్సు చేసినది. కాని హరి ప్రత్యక్షము కాలేదు. అపుడావేదవతి విసిగి వేసారి చిరవకు.

మదన దర్పణ వృత్తము :

మానసమున మందుచున్న మన్మథాగ్నిచేత నా
మానవతియు జీవితమ్ము వమ్మటంచు నెంచి ప్రా
ణానిలములవీడె శ్రీశ వంద్యపాదమంద వే
తైన భవమునందునైన భాగ్యమెల్లఁ బండగా.

మత్తకోకిల :

మానసంబున నిల్పి శ్రీహరి మాన్యపాద సరోజముల్
ధ్యానయోగ సమాధి నిశ్చలయై తపో హిమ వేళలన్
వానలందున ఘోరభంగిని వాయుభక్షణ మాత్రయై
దీన, చేసెతపస్సు వేదవతీలలామ దశాబ్దముల్.

గురుకొని భావిజన్మఁ దనకోరిక తీఱఁగ నింగిజేని యూ
పరమ నిధానమందుఁ దన పండిన పుణ్యఫలంబుచేత సుం
దరతర వస్తుసంతతులు నాన మొగంబులు దింప, నైజ భా
సుర రుచిరూప సంపదను శోభకుఁ బైడిని మించు వన్నెకున్.

పేరు పద్మావతిగ నొరు పెన్నిధిగను
గానము తీవెకు గుదురుగా జనకునింటఁ
గునుకు లేనట్టి దివ్వెగా దినము దినము
వృద్ధి పొందుచునుండె నవ్వేదవతియు.

త్రాడు గట్టిన పురుషకదంబమునకు
నళికి సంపెఁగయయ్యె నా యతివ సొగసు
కుంటివానికిఁగొండపై పంటయయ్యె
జఠరరోగికిఁ బంచభక్ష్యంబులయ్యె.

విరియఁబూఁచిన కాచిన పృథుల చూత
లతను మించిన సుతను గల్యాణయోగ్యఁ
గాంచి యాకాశరాజు నుత్కంఠియయ్యె
శ్రీమతింజేయఁగాఁ జిరంజీవినంత.

కాలము గడచినది. శిశిరవసంతము లెన్నియో మాఱులు ప్రళయ ప్రభవములకుపాదానములైనవి. వకుళాదేవి లాలన పాలనములలో శ్రీనివాసుఁడు చిన్నికృష్ణుఁడై యెన్నియో విలాసములను జూపుచున్నాఁడు. కమలనేత్ర కమలనేత్రుని మధురస్వప్నములలోఁ బరవశయై పరవశముకాని చిత్తముతో కాలము గడుపుచున్నది.

నీరుపాయమునంది యా నీలవేణి
తల్లిదండ్రుల డెందముల్ పెల్లివొడువ
పెలుఁగుచుండెను, ఒకనాఁడు చెలులఁగూడి
యుపవనంబునకేగె నాయువిదమిన్న.

శ్రీనివాసుఁడు గూడ నానాఁడే యాదృచ్ఛికముగా నావనమునకే వేఁటకై వచ్చి యొక వన్యద్విపమునుజూచి యుత్సాహముతో వెంబడించినాడు.

పూర్వము దంతిరాజు ననుమోదముతో మకరేంద్రుబాధలన్
సర్వముఁబాపి ప్రోచె జలజాక్షుఁడు నాఁడు. మదేభదంభమున్
ఖర్వముచేయఁగా శరముఁగార్ముకమందుఁ లగించి వెంబడిం
బర్వెనునేఁడు. దేవతలు పార్శ్వములన్ దెరగండ్లు మెచ్చగా.

గజమది వాయువేగమునఁ గానన సీమలఁబాఱె నెయ్యురాం
ప్రజనముతో వనాంతరములందున వేడుకసేయ నింగిచూ

ల్పిజయము చేసినట్టి యశవిన్ జొఱఁబాఱెను. వైకుళేయుఁడున్
ప్రజవముతోడ నా యుపవనంబునఁజొచ్చి కనెన్ నృపాత్మజన్.

తొలిబాముున ముడిబిగిసిన
చెలువా సంస్కారబలముచేత నిరువురున్
గలలన్ గాంచిరి పగలే
ఫలియింపవె? పగటికలలు పరమార్థములై.

పద్మావతీ శ్రీనివాసుల ప్రణయము
పరిమళించెను దిశావలయమందు
ఆకాశరాజు నాస్వాదమందెను రసా
శ్రయమైన యాగంధసారమునకు
వకుళామతల్లిక సకలము కుసుమరో
మాంచమయ్యెను హర్షమారుతమునఁ
దల్లితండ్రుల పెళ్ళిఁ దనయుల కందని
దానిచే లోకమే మేనుమఱచె.

చుక్కచూపుల స్వర్గము చూచిమెచ్చె
భూమి మణినేత్రములఁజూచి పొంగిపోయె
ప్రథిత పద్మావతీ శ్రీనివాస శుభవి
వాహమహమున జన్మమే పండినట్లు.

ఈ శ్రీనివాస కల్యాణ వృత్తాంతము వరాహాది పురాణాంతర్గతము ఈ కథలో "సోదెచెప్పుట" మొదలగు గ్రామీణాచారములు కొన్ని ప్రస్తావింపఁ బడినవి- ఎఱుకచెప్పుట, మొదలగు వానిలో లోకజ్ఞానపు చాకచక్య మెక్కువే- కాని కొన్నిశక్తులు ఉపాసనల ద్వారా గూడా లభింపఁగలవని యనుభవజ్ఞుల ప్రవచనము- ఉపాసన యన్న నేమియో తెలియనివారికా ప్రవచనానుభూతి యెట్లు లభించును.

ఈ యాఖ్యాయికలో ప్రాచీన వివాహ క్రియా కలాపము కొంత ప్రస్తావింపఁబడినది వివాహ సందర్భములోని శుభలేఖల నంపుట- మంగళస్నానములు

చేయించుట (వధూవరులచేత) వరుఁడు శమీప్రతిష్ఠ జేయుట- వరపూజ విష్ణుస్వరూపాయ వరాయ కన్యాందదామి- అని కన్యాదానము చేయుట మొదలగు క్రియా కలాపమంతయు- నెంతయో యర్థవత్తరము- సంమోహోపకారకము- అవిచ్ఛిన్నముగా దాంపత్యము సాఁగుటకు రాచబాట- ఆ పవిత్ర క్రియా కలాపము సర్వదా శ్రేయోదాయకమే.

శ్రీనివాసుఁడు తన వివాహము కొఱకై కుబేరునివద్ద ధనము నప్పుగాఁ దెచ్చుకొన్నాడుట- ఆ ధనమునకగు వడ్డీని ప్రతిదినము నిచ్చునట్లు నిర్ణయము. అది మొదలు ప్రతిదినము వెంకటధాముఁడు భక్తుల వలనఁ దనకు లభించు ధనమును వడ్డీక్రింద గుబేరునకుఁజెల్లించుచున్నాఁడఁట- కాని యింతవఱకు వడ్డీ కూడ తీఱలేదట- అప్పు తీర్చుటకై కాసులు సంపాదించుచుండుటవలన వేంకటేశ్వరునకు "వడ్డీ కాసుల" వాఁడని పేరు వచ్చినదఁట.

ఇది కథ ఇది సంఘవిద్రోహకరమైన యొకలోకవృత్తమును దెలుపును.

తన కుహనాప్రవృత్తియను దారుణ జాలమునందు నేర్పుగా
ధనమను మీనుగట్టి పరదా పయిఁగప్పి పరాక్షికింతయున్
గనుగొనరానిదా కపట నాటకమాడుచు లోక సారమం
తను హరియించుచుంద్రు ధనదాసులు నప్పులనిచ్చు తామసుల్.

అప్పుచేయువాఁడు తిప్పలు పడుచుండు,
ముప్పుఁజెందుఁ బూచిపుల్లయైన,
నింటనుండఁబోదె యెంత గడించిన
వడ్డితీర దసలు ప్రబలుచుండు.

అనెడు విషయముఁదెల్పు వెంకన్న యప్పు,
బొజ్జఁబెంచెడు వ్యాపారి బుద్ధిఁదెల్పు
యక్షరాట్కథ, యింత కా యాదిలక్ష్మి
కాశ్రయుండైన వానికా యప్పుబాధ ?

ఇట్లే కథా ప్రపంచమంతయు కర్తవ్య బోధకము- యథాచార నిరోధకమును

శ్రీనివాసుఁడు పద్మావతితో నాఱుమాసములు- అగస్త్యాశ్రమమున నుండి యావల వేంకటాచలమునకేగినాఁడని కథ.

నవ వధూవరులు వివాహానంతర మాఱునెలలవఱకుఁ బర్వతారోహణము చేయరాదనియు నా యాఱునెలలు వా రనుభవజ్ఞులైన పెద్దల యొద్దికలో నుండ వలయు ననియు నా కాలము కట్టడి- ఇచ్చట పర్వతపదము సంసార రూప పర్వతమున కుపలక్షకము.

శ్రీనివాసుని నిలయము శేషాద్రి. నవ వధూవరులైన పద్మావతీ శ్రీనివాసులు పై కట్టడి ననుసరించి యాఱు నెలలవఱకు శేషగిరి యెక్కుటకు వీలులేక గడువు వఱకు నగస్త్య మహర్షి యాశ్రమమందుఁగాపురించిరట.

## —— కట్టడి సందేశము ——

కష్ట సుఖాదులతోఁగూడిన సంసారము- మకర రత్నములతోఁగూడిన సముద్రమువంటిదని యభిజ్ఞుల అభిబాషణము అనగా సముద్రమందు వలెనే సంసార మందుఁ గూడఁగష్టసుఖములు రెండు నుండునని భావము- కనుకనే దానిని సంసార సముద్రమన్నారు.

సంసారము సముద్రము వంటిదేకాదు- పర్వతము వంటిదికూడ. విషభుజంగ తీక్ష్ణకంటక గిరిసరిదాదులచేతఁ బర్వతము- దురారోహము అగమ్యము గమ్య మైనచో- సుఖదుఃఖ నిలయమైన సంసారము కూడ గమ్యాఽగమ్యమగుచున్నది.

అనుభవ శూన్యుఁడు పర్వతారోహణమున కుపక్రమించినచో గమ్యమును జేఱుకొనలేడు సరికదా మధ్యములోనే భ్రష్టగతియై గతిమాలినవాఁడగును- అట్లే "క్రొత్త జంగము ప్రొద్దెఱుగఁ"డన్నట్లు- క్రొత్తకాఁపు వెంటనే యొంటరిగఁ గాపురము పెట్టిన యెడల- వాని సంసారశకటము త్రోవలోని మెట్టపల్లముల కుదుపులను దట్టుకొనలేక భగ్నగమనమగును- కావున, గ్రొత్తదంపతులు కొంత కాలము పెద్దల దగ్గఱ సంసార శిక్షణమును బొందవలెనను సందేశమును నీకట్టడి యిచ్చుచున్నది.

సంసార సముద్రము- అనురూపకము సంసారముయొక్క- అధృష్యత్వ- అభిగమ్యత్వములను సూచింపగా- సంసార పర్వతము అను రూపకము- ఆ విశేషములతోఁబాటు ఆరోహదక్షునకుఁ గలుఁగు నభ్యుదయత్వ- అభ్యున్నత త్వ ములనుగూడ సూచించుచున్నది.

## — వరాహస్వామి శ్రీనివాసునకు నారాయణాద్రియందు స్థానమిచ్చుట —

బంగరు కన్నువాఁడు నలువన్ మురిపించి తపోబలంబుచే
తం గొనె రాక్షసశక్తులను దానఁ ద్రిలోక జనంబు గర్వియై
శృంగము లెత్తి క్రుమ్మి విదళించు బడల్పడ. క్రూరకర్ముఁడా
వెంగలి పెట్టు బాధలకుఁ బృథ్వి భయంపడెఁ దా నపద్యయై.

అంగనశీలసంపద లయంబునుం బొందెను, యజ్ఞయాగముల్
నింగి విలీనమయ్యెఁ జెడి, కార్యము సర్వ మకార్యమై ధరన్
మ్రింగెను, నేలఁ గాశ్యపిని మృత్యువు విలాసము. ధర్మమాఁగె. దు
స్సంగుడు పైడిచూపు కరసాత్కృత దుర్దమ కర్దమంబునన్.

అన్నకాఁడైన యా హిరణ్యాక్షుఁడేఁచి
రత్నగర్భను జేసెను రాళ్ళగనిగ
అంతతో నాఁగ కాతఁ డహంయువచలఁ
జలను గాఁ జేసి చలముతో జలములందు.

కానరాకుండ దాఁచె. లోకంబులన్ని
గోలపెట్టెను హరితోడ గోడుచెప్పి
చెట్టలన్ గొట్టువృత్తినిఁ బెట్టుకొన్న
గట్టిచేఁతరి వెన్నుఁ డప్పట్టునందు.

వరదుఁడు సాధురక్షకుఁడు బ్రహ్మవిధాత వికుంఠనాయకుం
డరమర సేయకే కిటిభయంకర రూపముఁదాల్చి గోళముల్
పురపురఁబొక్క రక్కసుని మూర్ధము వ్రయ్యలుచేసె దంష్ట్రికా
క్షురవరచక్రధారఁ. దన జాయనుఁ జేసెను గంభినీసతిన్.

పైఁడిచూపు మరణానంతరము సౌమ్యరూపము ధరించిన ఆదివరాహస్వామి భక్తుల ప్రార్థన కంగీకరించి. గోమతీ నదికి దక్షిణమున నిరువది యోజనముల

దూరమునఁ- బూర్వ సముద్రమునకు (బంగాళా ఖాతము) బశ్చిమముగ నైదు యోజనముల దూరముననుౘ సువర్ణ ముఖీనదికి నుత్తరముగానున్న వేంకటాద్రి యందు నివసించెను- వైకుంఠమందలి నారాయణగాద్రి- వేంకటాద్రి యందు శేషగిరియైనది- క్రీడా సరస్సు విరజానది స్వామిపుష్కరిణియైనది- శ్రీ మహావిష్ణువు సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరుఁడైనాఁడు- అందువలనఁదిరుమలాద్రి సాక్షాత్తు శ్రీ వైకుంఠపురమైనది- వరాహస్వామి పుష్కరిణికి పశ్చిమభాగమున నొక సౌధమునందు నివసించెను.

పూర్వము శ్రీనివాసుఁడు లక్ష్మి నన్వేషించుచు వెంకటాద్రికి వచ్చినాఁడు గదా" అప్పుడు వరాహస్వామి శ్రీనివాసునిఁజూచి "నీవెవ్వడవు" అని ప్రశ్నించెను- దానికి సమాధానముగా శ్రీనివాసుఁడు శంఖచక్రాదుల ధరించి తన నిజ స్వరూపమును జూపెను- ఇరువురు తెప్పలార్పక ఒకరినొకరు చూచుకొనిరి, ఆచూపులలో నొకరిసత్వ మొకరికిఁ దెలిసిపోయినది.

ఉదయత్ భానుఁడు శ్రీనివాసుఁడు వరాహుండస్త సప్తాశ్వుఁ డ
భ్యుదయంబందఁగఁ గార్యనిర్వహణమందుద్యుక్తుఁడాద్యుండు మే
నుదయంబైన ఫలంబుఁబొంది తన యుద్యోగంబుఁ జాలింపఁగా
నొదవెన్ గాల మటంచు నెంచును ద్వితీయుండున్ బ్రశాంతప్రభన్.

కనులు పెద్దవి చేయఁగా గానుపించె
శ్రీనివాసునిలో వెన్ను చిన్నె లెన్నొ
ఆదిఘోణికి నాతఁడత్యధిక మతిని
శ్రీనివాసునిఁగని యిట్లు చెప్పినాఁడు.

ఏలితి నీ మహాస్థలము నెన్నిరేను లక్షలవత్సరంబులు
ద్వేలపరాక్రమంబునను భృత్యుల భక్తుల కల్పకంబనై
సోలితి నేఁడు భూభరణ ఘూర్ణిత బాహుబలుండనై యిఁకన్
లీలఁగ నేలుమయ్య! కదళీకృతమందర! శేషశైలమున్.

అని చెప్పి శ్రీనివాసునిఁ
దనరాజ్యము నందునిలిపె ధరణీధరుఁడు

స్మరణమునఁ. "కర్తవ్యములన్
మునుకొందురు బాసి స్వార్థమున్ దత్వజ్ఞుల్.
తనకున్ దీటగు క్రోవరాజు మరియాదన్ నెంచి శేషాద్రి పె
త్తనమున్ దానము చేయుటన్‌గని ప్రమోదంబంది యీసూకరేం
ద్రునితో నిట్లనె శ్రీనివాసుఁడు వచస్తోమంబు హృద్యంబునై
తనరారన్ సమతా కృతజ్ఞతలు చిత్తంబందుఁ బెంపారగన్.
ఓ మహనీయ! ఓ క్రోతివర! ఉత్తమ పుష్కరిణీతటంబునన్
గోమలమా విమానమున నుండుము తృప్తిగనీవు. నేను స
త్వామల దివ్యధామమున నాధృతి నీవల నుందుఁ. జెల్లుగా
క్ష్మిమహీ నీకు ముందు వెనుకే ననుజెందును సర్వపూజలున్.
నిన్నుఁబూజింపకెవ్వఁడు నన్నుఁజేరు
ముందుగా నేను వానికి మోక్షమీయ
ననుచు వాక్కిచ్చె శ్రీవేంకటాద్రి విభుఁడు
మొదటి పూజ తదాదిగా ముట్టు కిటికి.

ఇక్కడ ఒక ప్రశ్నముదయించుచున్నది. విష్ణువు- ఒకమాతే వరాహ శ్రీనివాసరూపముల నెట్లు ధరించినాఁడు- అని- ఇది కేవలము ప్రాచ్య విజ్ఞానము లేని వారికి సంబంధించినది.

చతుర్దశ భువనముల యందలి యనంతకోటి జీవులలో, రత్నహారములో సూత్రమువలెఁ బరమాత్మని చైతన్యరూపము అంతర్యామియై యుండును- నిజమున కాకోట్లు జీవములన్నియు భగవంతుని యవతారములే- కాని బ్రహ్మాంశము జీవులలో వారి వారి సంస్కారమునుబట్టి తరతమ భావములను బొందుచుండును- అందువలననే యుపాధులలో హెచ్చుతగ్గులు సంభవించును.

భగవానుఁ డొక యవతారమెత్తి యావశ్యకతనుబట్టి మఱియొక యవతారమెత్తును- మొదటి యవతార లక్ష్యము నెఱవేఱగానే యా మొదటి యవతారశక్తిని ప్రబలమైన రెండవ యవతార మాకర్షించును- మొదటి యవతారమప్పుడు విలుప్త భగవత్తత్త్వమై శాంతించును- రెండవ యవతారము సంపూర్ణ భగవత్తత్త్వమై

విజృంభింపును- ఇదియే యవతార రహస్యము "ఉత్తరోత్తరః బలీయః అను పెద్దలవాక్యము దీనికి ప్రమాణము- చూడండి.

ధరణీనాథులు స్వార్థముల్ ముదిరి నింద్యాచార సంచారులై
నిరయంబున్ సృజియించి ధాత్రిపయి దుర్నీతిన్ దలందాల్చుచున్
బరమాఽన్యాయము ప్రాపునన్ జగమునే భగ్నాకృతిన్ జేయు న
త్తఱి వైకుంఠుఁడు గండ్రగొడ్డలిని హస్తంబందుఁగీలించుచున్.

దుర్మద రాజకంబును మదోద్ధతమున్ సమయించి స్వీయకా
ర్యోర్ముల పొంగు తీఱఁగ రఘూద్వహు దుష్టనిశాట వాటికా
మర్మభిదా విధాన శరమండిత బహుని వైష్ణవాంశగా
నర్మిలి గుర్తెఱింగి తనయంశము నీయఁడె రామమూర్తికిన్.

పరశురామ కథ యీ ప్రశ్నకు సమాధానము- ఇట్టి కథలు భగవన్మహిమకు వ్యాఖ్యానములు- కావునఁగోటి యవతారముల నెత్తగల స్వామికి నొకే సమయములో రెండవతారములెత్తుట యసాధ్యమెట్లగును? ఇవి యన్నియు భగవల్లీలా విలాస భాగములేయని భాగవత ప్రవచనము. ఈ విధముగా వైకుంఠ వాసుఁడు తిరుమలవాసుఁడైనాడు- ప్రకృతమనుసరామః

* * * * *

మా బస్సు నగరమార్గమును నగమార్గమునుత్తరించి తిరుమలేశుని పాద సన్నిధికిఁ జేరినదని చెప్పినానుగదా, బస్సు దిగిన వెంటనే యీ పరంధాముని పట్టణమును బరికించితిని. ఆ దివ్య క్షేత్రము మాకు వైకుంఠానుభూతినిఁ గలిగించి నట్లనిపించినది

ఇతర క్షేత్రములయందువలెఁగాక తిరుమల క్షేత్రమందు మ్రొక్కుఁబడి తీర్చు పద్ధతి విలక్షణమై యున్నది

కానుక లందియుత్తు రవికంపిత భక్తి పరస్థలంబులన్
బూనిక భక్తులెందరో ప్రమోదముతో నిజమైవ మూర్తికిన్
వేనకువేలు మొల్లములు వేలకు మించిన పైఁడి భూషలన్
గానని మూల్యముల్ గలుఁగు క్రమ బృహత్తర రత్న వజ్రముల్.

తిరుమలయందుఁగూడఁ గల దీ విధి. లెక్కకు మించి కానుకల్
నొసఁగినను దేవదేవునకు ముచ్చట నిచ్చుట కాని లేవె యే
పరిసరమందునైన నెటువంటి మనుష్యుఁడు నిచ్చుఁ గేశముల్
మురిపెముతోడఁ గానుకఁగ మ్రొక్కుగ నిచ్చు విచిత్ర పద్ధతున్.

హంకారంబు నశింప శుద్ధమతియై యాత్మావలోకంబుచే
ఓంకారాత్మము సర్వసేవ్యమును జ్ఞానోపాస్యమున్ గాంచినన్
శంకల్వీడును మెచ్చి యిచ్చును సమక్షప్రాప్తి వైకుంఠుఁ డా
టంకంబుల్ విడఁగొట్టి. భక్తుఁడనవాఁడో - కాఁ డహంభావియై.

డంబంబుల్ గల భక్తజాతిఁ గపటకంటన్ గూడ వీక్షింపఁ డే
సంబంధంబును గాంక్ష సేయఁడు మనశ్చాచల్య మావంతయే
నిం బాటింపఁడు వాఙ్మనః క్రియలచే నేకస్థమైయుండి శు
ద్ధంబౌచున్ జెలువొందు చిత్తమున కాధారంబగున్ శ్రీశుఁడున్.

జీవనమిచ్చి లోకము సజీవముఁ జేసి నిరంతరంబు స
ద్భావనఁ గొల్చువారిఁ దనవారినిఁగా దయఁజూచువాఁడు దీ
నావనుఁడైన వేంకటనగాధిపు ముందర నేలకో ? యహం
భావము, వెజ్జముంగలసు వ్యాధిని దాఁచుట క్షేమ మెట్లగున్.

గర్వము సర్వమున్ విడిచి కామ్యము లన్నిత్యజించి దైవమే
పర్వె సమస్తమందనెడు భావముతోఁ దనతోటివారిఁగా
సర్వులనెంచి శేషనగ సంస్థితు పాదములాశ్రయించినన్
ఖర్వము కాని మోక్ష సుమగంధము తన్నును ఘ్రాణ బంధువై.

తల ప్రధానము మానము తలకు జుట్టు
జుట్టునిచ్చుట తలతీసి పెట్టుటగును
సర్వహంకారముల్ బాసి చనుట యగును
గానఁ గోరును గేశముల్ దానవారి.

సరస నూతన సుమముల నరయఁబోఁడు
కోరుకొనుచుండు నీరస కుసుమములను
హృదయ తత్త్వముఁ బసిగట్టు పదిలుఁడతఁడు
పై పటారంబు గిట్టని పండితుండు.

దర్పసగంధ భక్తి దరిఁదప్పిన యర్చన పూజనాదులున్
దర్పక జన్మదాత యెడదన్ గఱగింపఁగలేవు మానసం
బర్పణముం బొనర్చి యిదె భక్తుఁడ, నీదియె నా సమస్త, మో
సర్పశయాన యన్నవిని సాఁకును భక్తుని శ్రీనివాసుఁడున్.

లౌకిక భోగభాగ్యముల లంపటులై తలకే యలంక్రియన్
జేకొని యున్న దానిఁ దన చిత్తముఁదన్పెడు కేశపాశమున్
బోకడఁబెట్ట దేవునకుఁ, బోవును రూపమటంచు మూర్ఖతన్
దేఁకువమాలి కేశముల నీయరుస్వామికిఁ గొందరజ్ఞులై.

అందువలననే వేంకటేశ్వరుఁడు భక్త తత్త్వమును దెలుపు శిరోజములకే యిష్టపడును- మఱియు,

“కేశానాశ్రిత్య పాపానివర్తంతే- తస్మాత్ కేశాన్వపామ్యహం” అను కారిక వలన సర్వపాపములు కేశముల నాశ్రయించి యుండును- దైవదర్శనమునకుఁ బోవువాఁడు పాపవిముక్తుఁడై (పరిశుద్ధుఁడై) దైవసన్నిధికిఁబోవలెను- అందులకుఁగూడ కేశవపన మావశ్యకమగుచున్నది-భక్తునిఁ బాపవిముక్తునిఁజేయుటకై స్వామి యీ నియమము నేర్పఱచినాఁడేమో యనిపించును- ఎంతటి దయాళువు శ్రీనివాసుఁడు.

భగవత్తత్త్వమును నెమరువేసికొనుచు వెళ్ళి స్వామి పుష్కరిణిలో స్నానములు చేసి తలనీలాల మ్రొక్కును జెల్లించుకొనుటకై కల్యాణకట్టకుఁ బోతిమి- అచ్చట పురుషులేకాదు స్త్రీలుకూడ భక్తి తాత్పర్యములతో విసీలకేశ పాశములనుగూడ స్వామి కర్పించుచుండిరి. “కల్యాణ కట్ట” అనునది వ్యాకరణమును బట్టి దుష్టసమాసము- వ్యాకరణము ప్రకారము “కల్యాణపుఁగట్ట” అని యుండవలయును- కాని వ్యవహారములోఁ గల్యాణకట్ట” యని నిలఁబడిపోయినది.

కాదాచిత్కముగా వ్యవహారములో సంభవించిన భాషలోని మార్పులు భవిష్యత్తులో నశింపక పరిణామశీలమైన భాషాప్రవాహములో నీదులాడుచు- "పురములో నివసించు గ్రామీణుఁడు పౌరసత్వమును బొందినట్లే-" భాషలోని భాగములుగాఁ బరిగణింపఁబడును- అనంతరము గ్రంథములలో స్థానమును సంపాదించుకొనును- ఈ జాతిలోఁజేరినవే- జీవగఱ్ఱ- ప్రాణగొడ్డము- ఇత్యాది శిష్ట ప్రయోగములు గూడ- కావున "కల్యాణకట్ట" అను సమాసము కూడ బహువ్యాపనమై స్థైర్యమును బొందినది.

"కల్యాణకట్ట" యనగా క్షౌరశాల- అధికారులు క్షురకర్మలకుఁ బ్రత్యేకముగా నొక శాల నేర్పాటు చేసిరి- దానికే కల్యాణ కట్టయని పేరు.

కల్యాణ శబ్దమునకు- శుభము- బంగారము- అని యర్థములున్నవి- 'కట' అను పదమునకు- మోపు- గట్టు- అని యర్థములు "గట్టు" పదమునకు అర్థాత్- స్థానము- అనిగూడ నర్థము వచ్చును.

ఆ క్షౌర మందిరము శిరోజముల నాశ్రయించియున్న సర్వపాపములను గేశఖండన కర్మద్వారమునఁ దొలఁగించి మానవునిఁ బవిత్రునిగాఁజేసి వానికి శుభములను జేకూర్చుచున్నది- ఆ భావముతోనే యా స్థానము- కల్యాణకట్ట యను నామముతోఁ బ్రసిద్ధమైనది. అనగఁగల్యాణములకు స్థానమని భావము.

కల్యాణ మనగా రెండవ యర్థము బంగారము కాఁగాఁ "గల్యాణకట్ట" యను సమాసమునకు బంగారమునకు (ధనమునకు) స్థానమనియు నర్థము చెప్పవచ్చు.

ఆ క్షౌరశాల స్థానిక శిరోజ విక్రయముద్వారా ధనమునకు స్థానమగుటచేత గూడ దానికి కల్యాణకట్ట యను నామ ముచితమే యగును.

"కల్యాణకట్ట" ఒక విచిత్ర మందిరము శతసంఖ్యాకులైన యంబష్ఠులు- అనుక్షణము కేశవపనార్థము సన్నద్ధ శస్త్రులై యచ్చట సిద్ధముగా నుందురు.

కత్తులను నూఱి శాత్రవ కంఠములను
గఱకఱన్ గోయ వీరు లుత్కంఠతోడ
వేచియున్నట్టు లంబష్ఠ వీరులచట
గాచియుంద్రు పునర్భవ ఖండనేచ్ఛ.

బరబర చప్పుళుల్ సురియబారుల నూఱుచునుంటచేత నా
జరజర శబ్దముల్ తలల సాంద్ర జలంబులఁదడ్పుచుంట నా
గరగర మ్రోతలున్ వరుసగా వినిపించును క్షౌరకర్మలన్.
చరణము లానినంతన నిశావధి యాక్షురశాలయందునన్.

పూర్వము క్షురకర్మ వ్యవస్థ ఇపుడున్నంత కట్టుదిట్టముగా నుండెడిది కాదఁట- "నోరుకలవానిదే రాజ్యమన్నట్లు" పలుకుఁబడిగల మంగలి పదిమందిని తనవైపున కాకర్షించి వారింకొకరి దగ్గఱకు పోకుండుటకై.

ఒకని నెత్తిన నీళ్లతో నుక్కళించి,
ఒకని తలమీది జుట్టు ముందున్న దాని
క్షౌరమున్ జేసి, యావలొక్కనికి వెనుక
గొఱుగు చుండును బేహాస మఱగివాఁడు.

ఒకని గడ్డము గీయు నింకొకని మీస
ములను దీయును మఱొకరి మూతిమీఁదఁ
గాట్లువేయును గాని యొక్కనికి నైన
చివరఁగానీఁడు క్షౌరము తపర నాఁగు,

"తిరుపతి మంగలిపని" యని
కరమరుదగు పేరుదాని కప్పుడున్ కలిగెన్
పరఁగెను నయ్యది ఒఱవల
జఱిగెడు కార్యమ్ము పేర జనవాక్యములన్.

నేను స్వామివారికి యథాప్రకారము కేశముల నర్పించితిని- నల్లని జుట్టును బాసి తెల్లనైయున్న నా తల యప్పుడు కలుషమును బాసి పరిశుద్ధమైనట్లున్నది- పిమ్మట పునశ్శుద్ధికై పుష్కరిణిలో స్నానమాచరించితిని.

ఆ పుష్కరిణీ జలమతినీలము- అందులకుఁగారణము.

నల్లవాఁడైన యాస్వామి నాఁడు మొదలు
నేఁటివఱకును పాదమా నీటఁగడుగుఁ

గనుక నది నీలనీలమై తనరుచుండు
నిత్య సంగతి, గుణముల నిచ్చు గాదె.

మేము వెంకటేశ్వరస్వామి కట్టడికి బద్ధులమై మును ముందు వరాహ స్వామిని దర్శించి తీర్థప్రసాదముల స్వీకరించి యావల సప్తనగ మందిర మందిరముఁజేరఁబోయితిమి.

భక్తుల వరుస యానాఁడు మా యదృష్టము వలన మహానదీ ప్రవాహము కాక సెలయేఱుగ నున్నది. స్వామి దగ్గఱకుఁబోవునా మార్గము బహు విచిత్ర ముగా నున్నది. దానికొక తీరులేదు. తెన్నులేదు.

గృహముల ప్రక్కనుండి తలక్రిందుగ మీఁదుగ నల్పవీథులన్
గహనములైన సందులను గాల్నిలుపన్ పరిగాసి త్రోవఁన్
సహనముఁబట్టి చూచు జనసాంద్ర సుదుర్గమ పద్యలందు మే
మహమిక నేగ సాఁగితిమి యయ్యయుఁ జిన్మయుఁ జూచుకోరికన్.

శ్రీ వేంకటేశ్వరస్వామి సర్వ జగచ్చక్రవర్తిగదా, ఆయన కలియుగమున ఏకైక దైవము. అందువలన నా స్వామి దర్శనము కొఱకై లక్షలు కోట్లు భక్తులు వచ్చుచుందురు. అందువలన స్వామి దర్శనము దీర్ఘకాల సాధ్యము కష్టతర సాధ్యమునగుచున్నది.

భక్తుల బారు జీవనదివంటిది. నదిలోనికిఁ గ్రొత్త నీరువచ్చుచుండగాఁ బ్రాత నీరము పోవుచుండును. ఆ క్రొత్త నీరే కొంతసేపటికిఁబ్రాఁత నీరగు చుండును.

నూతన నీర ధర్మమును నొంది యొకించుక సేపు, స్వామికిన్
బ్రాఁతయి ప్రాఁతనీరమయి పైకి గమించితి కొంతకాలమున్
అట్లా జనార్ణవము నీదుచుఁబోయి పోయి.

భూతల నాకమో యనఁగఁ బుణ్యఫలంబన నొప్పు మంగమాం
బాతరుణీ మనోహరుని ప్రాంగణ భూమికిఁ జేరఁగల్గితిన్.
అదియొకకోట దానికి మహత్తరసాలము రెండు తాళ్ళపై
కెదిగినయట్టి దండుఁ బరఁగెన్ సుమహత్త్వము శ్రీవిశాలమున్

సదనము శ్రీనివాసుఁడట సర్వసుపర్వ కిరీటరత్న కాం
త్యుదయ సముజ్జ్వలచ్చరణ యుగ్ముఁడు కాపురముండు ప్రీతుఁడై.

అదియొక పుణ్యభూమి కలియందునఁ బాపము లాహరింపఁగా
హృదయములున్న వారి జగదీశు దయాహృదయంబుఁ జేర్పఁగా
నెదఁ గదలాడు కోర్కెలకు హృద్య ఫలంబుల మెచ్చి యీయఁగా
నుదయము నందెఁ దిర్మల నగోన్నత దివ్య శిరంబునందునన్.

ఒక దినమందు కాదెపుడు నుందురు భక్తులు లక్షలాది త
న్నికటధరాతలంబున గణింపక మానవు. కోట్ల కెత్తు వాఁ
రకట ! సమస్త భూ భువన రాశికి నేలికయైన మంగ మాం
బిక ధవు ముంగలన్ బరుల పెత్తనముల్ నిలువంగ నేర్చునే ?

భక్తుల పారిజాత మఘవారణ వారణ ధీరసింహమై
ముక్తినిఁ జేతికిచ్చు పరిపూర్ణుని ముంగిట పాదమానఁగా,
ప్రాక్తన పుణ్యమేమొ ? సిరిరాజునకున్ ననువంటి పామర
వ్యక్తిపయిన్ జనించు నిరుపాధిక రాగమొ కారణంబగున్.

ఐదవ మాఱు నేఁ ద్రిభువనాధిపపాదసరోజగంధ సం
పాదనమంద వచ్చుటకు వచ్చితి, నైనను నిత్యనూతనం
బై దనుజాంత కాలయము పచ్చని తోరణముల్ నిరంతరో
త్పాదిత పాణిపీడన శుభంబులతోఁ జెలువారు వింతగా.

కన్నుల వైకుంఠంబై
పన్నిదఱు పవలు సేయు వారల సమమై
వన్నెలు చెఱుగని మహిమలఁ
జెన్నారును వెంకటయ్య శ్రీపద మెపుడున్.

మనసు దర్పణమందున మా సతీశు
దివ్యరూపము తోఁచఁగాఁ దృప్తి కలిఁగె

దేవదేవుని భావ సంభావనమ్ము
కన్నఁ గలిమేది కలదు ? లోకంబులందు.

పులకించెన్ నెఱమేను, మానసము నుప్పొంగెన్, ప్రమోదాశ్రువుల్
నిలచెన్ గండములందు, నింద్రియ సముస్మేషంబు నిద్రాణమై
తొలఁగెన్ స్పర్శలనుండి, భక్తియు సముద్యోతించె, నా భావనా
తలమందున్ నిలువంగ, వేంకట గిరీంద్రావాసి పూర్ణాకృతిన్.

దీర్ఘతమమైన యాత్రికుల వరుసలోఁబోవుచు నెట్టకేలకు మొగసాలకుఁ జేరితిమి. అంతవఱకు మనోనేత్ర దృశ్యుఁడైన స్వామిని నిఁక చర్మ చక్షువులతో దర్శింపవలయును. అందులకు నచటి యనంత జనసముదాయ మంతరాయ మగుచున్నది. ఎంత యతిక్రమించినను ఆ జనసముదాయము దీర్ఘాతి దీర్ఘమై యనుత్తార్యమైన సంసార ప్రవాహమువలె గోచరించినది. సంసార మనంతము గదా !

మాయకు వెన్కఁ దా నిలిచి మానిగ, సాక్షిగనుండి యాదియున్
మాయుట లేని సంసృతిని మాయురె ! యింకననీటి చాలుగా
నేయుగమందు బ్రహ్మము సృజించెనో ? నేఁటికి వట్టిపోవకే
ఆయది సాగుచున్నయది యామిని భామిని చేతి చిల్కగా.

చనువారల్ జనుచుండ వచ్చెడి జనుల్ సర్పాకృతిన్ బారుగా
మొనయన్ సాఁగెడు నా ప్రవాహము తమఃపూర్ణమ్ము సంసారమై
తనరెన్, బ్రహ్మము వేంకటేశ్వరుఁడుగా, ధామమ్ము వైకుంఠమై,
కనుల న్నిల్పును విద్యగా నచటి యోగాసక్తి మేధావికిన్.

అంతమే లేని సంసారమంత గడచి
పరముఁజూచుట దుస్తరంబైనయట్లు
చుక్కతో సాఁగి నిసిదాక స్రుక్కుజనత
కధిక దుర్లభమయ్యె వెంకయ్య సేవ.

అచటి దృశ్యముగనఁ బరమాత్మ సతము
చేయుసృష్టియు లయము భాసించుచుండు

గీతయందున నరునకుఁ గేశవుండు
సృష్టి లయముల పద్ధతి చెప్పినట్లు.

గీ త లో :

అవ్యక్తాత్ వ్యక్తయః సర్వాః ప్రభవంత్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవా వ్యక్త సంజ్ఞకే.

అ న ( గా :

కలుఁగు నహరాగమంబునఁ గలగ సృష్టి
మలఁగు నయ్యది రాత్ర్యాగమంబునందు
బ్రహ్మ ముఖమునఁబుట్టును బ్రహ్మమోము
నందెడిం. దిది సృష్టి లయాల సరణి

వ్యక్తము కాని తత్త్వ మఖిలాండ సమూహము నేలి శ్రాంతికై
ముక్త సమస్త సృష్టియయి మూలవిరాట్టు కనుల్ మొగుడ్ప న
వ్యకమునందు సృష్టియు లయంబగు. నావిధి మేలుకొన్న న
వ్యక్తమునుండి వ్యక్తమగు నీ జగమంతయు సృష్టిరూపమై.

ఈవిధి లయమును సృష్టియు
కేవలు నిద్రాప్రబోధ కృత్యంబుల సం
భావితములునై చెలఁగుటఁ
గోవిద వాక్యములఁ దెలిసికొందుము కాదే.

ఆపరిపాటి వేంకట నగాధిపు మ్రోలను గానుపించు. నా
శ్రీపతి సుప్రభాతమునఁ జేరును భక్త కదంబకం బదే
ప్రాపగు సృష్టికిన్. దిరుమలాశ్రయుఁడెప్పుడు పవ్వళించునో
యా పరు సప్పుడే ముగియు. నయ్యదియే లయమట్లు కన్పడున్.

ఊహాకందని లోకముయొక్క- సృష్టి
లయము లచ్చట నద్దమునందు వోలెఁ

గానఁబడుచుండుఁ జిత్రమై కన్నులున్న
తత్త్వవేత్తకుఁ గవికిఁ దర్థ్యంబుగాను.

ఆ సర్వేశ్వరుఁడు సకలసేవ్యుఁడు- ఆ భువనపతి ప్రభావ మమేయము.

రవి యస్తమించి తారకల తేఁజేతేర
శ్రీనివాసుని యిల్లు చేరుచుంద్రు
సురలు సురేంద్రుఁడు పరమర్షి గణములు
తిరుమలేశుని పాద సరసిజముల
కన్నారఁగాంచి సౌఖ్యంబుల నందఁగ
చిత్త వికారముల్ చెదరిపోవ
వైకుంఠమును వీడి స్వామి పుష్కరిణి యం
దున రమాసహితుఁడై దొరతనమ్ము
చేయుచున్నాఁడు శ్రీనాథుఁ డీయుగమున
ఎదల మెదలిన యూహల కెల్ల రూపు
రేఖలన్ దీర్చువాఁడని రేఁబవళ్ళు
భక్తులర్చించుచుందు రీప్రభుని పదము.

ప్రాకారాంతర భాగమందున జనవ్రాతంబు హేరాళమై
కేకల్ పెట్టుచు వేంకటేశ్వర ! పరా కేలయ్య ! గోవింద ! ఓ
పాకారి ప్రముఖార్చితా ! రమణ ! నీ పాదంబులన్ గొల్వ నెం
తో కష్టంబున వచ్చినాము ప్రభు ! మమ్మోమంగదే సత్కృపన్.

అనుచు భజనలు చేయుచు నరుగుచుండె
పోఁతఁబోసిన భక్తియే పోవునట్లు
మాన మభిమానమును వీడి మదమువీడి
"భక్తిపరులకుఁ గలుఁగునే బాహ్యరతులు"

అట్లు భక్తి పరవశులైన భక్తులతోఁబాటు చనిచని.

వైకుంఠంబును గుంఠితంబుగ, నిజప్రాంచన్మహాన్నైభవ
ప్రాకట్యంబుగఁ జేసి వేంకటగిరిన్, రంజిల్లుచున్నట్టి యా
శ్రీకాంతా విభు సౌధమందు రమణన్ జెన్నారు షట్కక్ష్యలన్
వీఁకన్ దాఁటుచు ముందు కేగితిమి సంప్రీతాత్మ చిత్తంబులన్.

అట్లు పోవుచుఁ గొంతకాలమునకు గర్భాలయ ప్రాగ్భాగమునకుఁ జేరఁ గలిగితిమి- గర్భాలయములలో గోఘృత సంవర్ధిత చిరదీపికలే గాని యచిర దీపికలు లేవు- ఏలకో మహా దేవాలయములలో చంచలాపతి సన్నిధిలో చంచలా రుచులకు స్థానమీయరు- అందువలన గర్భాలయము కపర కపర చీకటిలో మసక మసకగాఁ గన్పడుచున్నది- ఆ తమస్సు మధ్యమందునఁ దత్తత్వమునకు భిన్నముగాఁ బరంజ్యోతిగ వేంకటేశ్వరస్వామి (వజ్ర భూషణకాంతులతో) ప్రకాశించుచున్నాఁడు.

తమమున కావలన్ బ్రకృతి తత్త్వము కూడనిచోటఁ గేవల
ప్రమకు నివాసమై బహిరుపాధుల కందక గంధవాహవే
గమునకు నాశ్రయంబు నవికారమునౌ గగనంబువోలె ని
ర్మమత సమస్త సృష్టికి నిరాశ్రయుఁ డాశ్రయుఁడైన వానినిన్.

తన కనుదీప్తి యంత్రముకతంబునఁ దీక్ష్ణము. దాని శక్తిచే
తన కను భక్తలోకము వెతల్ బడఁగూడదు. వారిఁ బ్రోవ నా
మనము దయార్ద్రి మానని సమంచిత పుంద్రము చేతఁ గన్నులన్
గొనగొని గప్పి భక్తులకుఁగూర్చెడి వానిని దీనపోషకున్.

తొలుకారు మెఱుపు జిగితో
వలితంబై చెలఁగు నంబువాహము రీతిన్
కలిత విభూషణ రుచితోఁ
జెలువారెడు నీలదేహ శృంగార ఘనున్.

ఆ గర్భ శ్రీమంతుని
భోగీంద్రశయానను గుణవిభూషితు నగుణున్

ఆగమ హృదయాంభోజ స
భాగత రాజాధిరాజుఁ బరమ కృపాళున్.
"కనులందున్ గదలాడు తారకలునై కాలమ్ము సర్వమ్ము చిం
తనముం జేసెడు నిత్య భక్తు లెపుడైనన్ దమ్ము రక్షింప ర
మ్మని యీ మంత్రణమున్ బొనర్తురను నూహన్ రక్తి నుత్తిష్ఠుఁడై
యనయంబుండెడు నవ్యయున్" గలిమదాహంకార హుంకారునిన్.
చీకటి బాటలో వెలుఁగుఁజిమ్ముచుఁ, గంటక మంట కుండఁగా
సాఁకుచు భక్తులన్ గరము సాఁచి, నిరంతర భక్త రక్షణన్
జేకొని దీక్షగాఁ బనరుఁ, జిన్మయు వేంకట శైలనాథుఁ బూ
ర్ణాకృతిఁదాల్చు భక్తి మధురాకృతిఁ గంటిని వేంకటేశ్వరున్.

ఆ కలియుగ దైవము మహిమ అచింత్యము. అనంతము. ఆ దేవుని పాదము.

నలువునెల్లను మ్రింగి తెలుపుగాఁ జేసెడు
వినువాకనాతికిఁ బెద్దతండ్రి
క్రిందుమీదుల నున్న మందిరంబులఁగొల్వ
అరిదియై పరఁగిన యడుగు బద్ద
పాఁపరాయని తలపైన ధింధిమ్మని
భరతమ్ముఁబలికించు భరతవేత్త
మంగమ్మ యెదపైన మరులతో విరులతో
పరవశమైన పట్టెద విరాట్టు.
నమ్మిఁగొల్చినవారికి నెమ్మి వనము
మేర మీఱినవారికి మృత్యుగృహము
తమ్ములను నేలునట్టి బాధ్యతల నెలవు
భక్త మందార మఖిలపావన మవనము.
తమములో నున్నవారికి దైత్యగురువు
అతల మందలి వారి కున్నత పదమ్ము

ఓపు లేనట్టి వారికి నూంతక్షోల
వజ్రకవచము భక్తుల వర్గమునకు.

అట్టిపాదములుకల నా వరదుని దివ్యరూప మాద్యంతము దర్శించితిని- ఆ స్వామిలోఁ జిమ్మ్రద పౌడసూపినది- ఒక తేజము స్ఫురించినది. బ్రహ్మానంద పడితిని- ఆయానందములోఁ గన్నులర మూతపడిలవి.

క్షణముల్ వింశతియేగె వేంకటగిరిన్ సానందముద్రా ప్రతీ
క్షణముల్ తోడుగ, నిక్కలల్ కఱగె భక్తప్రోక్త గీతావళిన్.
గనులన్ విచ్చితిఁ, గాంచితిన్ ముదముతోఁ గల్యాంతరాంతమ్మునన్
కనువిందై కనుపించు వేంకటపతిన్ గాలాధినేతన్ ఘనున్.

మనసు దర్పణమందున మా సతీశు
దివ్య రూపము కన్పడఁ దృప్తికలిఁగె
దేవదేవుని మరల సంభావనమ్ము
నపుడు చేసితి భక్తితో నాదమఱచి.

**ఒక్కమాట :**

రుజాపీడితుఁడనై స్వామిని దర్శించిన సందర్భములో నా శ్రీనివాసుని గుణగణములను యథాశక్తి వర్ణించితిని- తిరిగి యిపుడాస్వామి దర్శనము వలన ఆ ప్రభువును స్తుతింప నుత్సాహము కలిగినది- ఆ దేవదేవుఁడు నాకిచ్చిన వాక్కుతో నా యిలువేలుపును భక్తి ప్రపత్తులతో స్తుతించుచున్నాను, భగన్మహిమల వర్ణనములకుఁ బునరుక్తి దోషములేదు- ప్రత్యుత అది గుణమేయగును- దానికి దృష్టాంతము భాగవతమే

ఓ ప్రభూ !

కులము మతమును మనుజులే కూర్చుకొనిరి
లేదు భేదము- ముఖ్యమౌ కాదెగుణము
అన్న ధర్మార్థమై ముసుగున్న సతినిఁ
గట్టుకొంటివి- యజ్ఞుల కర్థమగునె.

తొలిపల్కు దోఁచిన దుండగు శిక్షింపఁ
దెఱగంటి మిన్నవై పఱగినావు
నీటివామిని దాఁగు నెఱగట్టు నిల్పంగ
తా మేటి మేటివై తనరినావు
నీట బందాయైన నిధిగర్భఁ దేర్పంగ
నోంటి గాడవుగ మిన్నంటినావు
నినునమ్ము వానిని మొనసి రక్షింపంగ
కంబము పట్టివై కదలినావు
పొట్టివాఁడే బహుగట్టివాఁడని తెల్ప
రెండేళ్ళ జగముల నిండినావు
పుడమి ఱేడుల గొంటఁ బొంగునహమ్మును
నింకింపఁ బరశువు నెత్తినావు
మాటలో బాటలో వ్రేటులో సామ్యము
కల రామరాజువై వెలసినావు
దేహాభిమానంబుఁ దీర్పంగ వలువల
దొంగవై కొమ్మల దూఱినావు
జగములన్ గాపాడఁ, దగు నల్పదోషమం,
చవని ధర్మోన్నతిఁ జాటినావు
గుఱ్ఱముగిట్టలన్ గ్రూరలోకము మచ్చ
మాడంగ రౌతుగా మాఱినావు.

ఇన్నియని యేమి ? కాలము నెన్నలేని
కార్యరూపుడవై వెలుఁగందినావు
ఇట్టి నీకున్న నామము లెన్నఁదరమె
నైకనాముఁడ ! నైకగుణాలవాల.

కలరూపున్ దెలియంగ మాదృశులకున్ గల్యాణధామా ! కనులో
కలవే ! లేవు కదా ! వచింతురు నినున్ గాంక్షించి బాలాంబగా

నెలతాల్పించును గొంత త్రివిధములన్ నీపాద పద్మంబులన్
గొలువన్ వత్తురు, వేంకటేశ్వరునిగా గొల్వంగ నిన్ వచ్చితిన్.

ఎక్కడో మాఱుమూల నరులెవ్వరు నేగని తెల్లదీవిపై
మక్కువవీడి నిత్యము సమస్త జనంబులు నేల యీనిన
ట్లొక్కట నిన్నుఁగొల్వఁగ నగోన్నత పీఠముపై వసించితే
మ్రొక్కులదేవరా! భువన మోహన! శ్రీపతి! వేంకటేశ్వరా!

ఇట్లా దేవదేవుని జగత్కేళీ విలాసములను స్మరించుకొనుచు పెన్నిధియైన యా స్వామి సన్నిధిలోఁగొన్ని నిమేషములు మాత్రమే యుండఁగలిగితిని-స్వామి సన్నిధిలో నున్న యా స్వల్పకాలమే మాకెంతో యానందమును సంతృప్తిని గలిగించినది.

కుత్తుకబంటి త్రాగి వినఁగూడని భాషలఁ బొందరాని సం
పత్తుల మత్తులైన కులసాంసుల దగ్గఱ జీవితాంతమున్
గత్తర లందుచున్ మనుటకంటెను నుత్తమ దైవసన్నిధిన్
జిత్తము తృప్తితోఁ బరవశించును గొన్ని కళల్ వసించినన్.

లోక జనకుఁడైన లోకేశు సన్నిధి
యల్పకాలమైన యఖిలదమ్ము
సారమింత లేని కూర తట్టెడు కంటె
నల్పమైన మేలె యాకుకూర.

మదిలోఁ జెఱుగని ముద్రగఁ
బదిలమ్ముగ వేంకటేశ పాద యుగమ్మున్
ముదమున నిలిపితి. నెవరును
గదలింపఁగరాని యట్లుగా దృఢభక్తిన్.

శ్రీశ్రీశ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనానంతరము బయటకు వచ్చి ప్రదక్షిణ క్రమములోఁ గొంత ముందునకుఁబోయితిమి- అచ్చట నవనిధులకంటె భిన్నమైనది వస్త్రాచ్ఛన్నమైనదియైన యొక యక్షయ నిధియున్నది-అది సర్వ జగచ్చక్ర

వర్తియైన లక్ష్మీనాథుని ధనాగారము- దానినే "హుండి" యని వ్యవహరింతురు- ఆ హుండి అజ్ఞాన తటాకమునకు గండి- ఆధ్యాత్మిక ప్రచారమును సాగించు బండి- రారండి- ఆగండి- ఆ హుండినిఁజూడండి. అది బాహ్యమునకు సామాన్యమైనను నాంతర్యముగ నసామాన్యము- రత్నాకర మగుట అగాధము. భక్తులు చెల్లించు ధన కనక భూషణాదులెప్పుడు చూచిన నాకంఠము నిండియుండును-ఆ పైడినెలవు నీటి బుగ్గవంటిది.

బుగ్గపై నడ్డుతొలిఁగినఁ బొంగి పొరలు
నట్లుగా, హుండిపైఁ గప్పినట్టి చేల
విప్పినంతన గలగలఁబెరిఁగి వచ్చు
అష్టవిథలక్ష్మి గణకులఁ గష్టపెట్ట.

జామున కొకమారు హుండినుండి "మఁడుగు జలము నేతముతోఁ దోడు నట్లు" ధనభూషణాదులను దీయుదురు- ఆ ధనమును గణనార్థము భద్రమందిరములో భద్రముగా నుంతురు, అది యక్షయ పాతాళగంగ- దానికి క్షయమెక్కడిది.

పదునాఱు వన్నెల పైఁడి సారంబంత
లీలగాంచిన కమసాలిమిన్న!
తులలేని కాంతులఁ దులకించు రత్నాల
మర్మము తెలిసిన భర్మవేత్త
ఇనరశ్మి నెదురించు నెనలేని వజ్రాల
పరువు గుర్తించిన ప్రాఁతకాఁపు
తిరుమలన్ సిరిదేవి తీరిక విడిదిగా
మూర్చఁగల్గిన యట్టి మంత్రవరము.
నేల నాలుగు చెఱఁగుల నిలచియున్న
భక్త సంతతి యసలుగాఁ బరిఢవిల్లు
కనక వృక్షము, కమనీయ నినద హృద్య
గానముల స్వామి మెల్కొల్పు గాణ జాణ.

భూమిలో నూట హరియించి పోవుగాక
జలధిలో నీరు పేంతిలోఁ గలియుగాక
హుండియందున్న సంపద యొక్క నాఁడు
నింకిపోవదు ప్రత్యహ మెదుగుచుండు.

చక్షురగోచరంబయిన జన్మమునందున వేంకటేశ్వరుం
డక్షయ భాగ్యమిచ్చునని యందురు భక్తులదేమొ ! నేఁడు ప్ర
త్యక్షముగా "ప్రజావళి" కహర్నిశ మాత్మ ధనమ్ము నిచ్చుచున్
లక్షలు కోట్లు, నైహిక పరంబులఁ బెంచుఁ బ్రజాహితైషియై.

ఈనాఁడు వేదశాస్త్రములు కళాశాలలు విశ్వవిద్యాలయములు నా యేడు కొండల వాని యనుగ్రహ పాత్రములై గదా వర్ధిల్లుచున్నవి. హుండిలో యథా శక్తి యడుగరలర్పించుకొని ముందునకు వెళ్ళితిమి. ఆ హుండికి సమీపములోనే.

కౌబేరావసథంబు నాఁ బరఁగునై కార్యాలయం బొక్కటం
దా బద్ధంబయి యుండె రక్షక భటాయత్తంబు దుర్గమ్యమై,
వేఁబోకన్ మొదలైన ద్రవ్యగణనం బెన్నొగతుల్ సాఁగు న
చ్చోఁ, బారంబును ముట్టదైనను, గడున్ జోద్యంబగున్ జూడఁగన్.

అది చతుర్దశ భువనాధిపతియైన శ్రీవేంకటేశ్వర స్వామివారి యాదాయ గణనాలయము. అక్కడ ఐదుపైసల రాశి మొదలు రత్నరాశుల వఱకు వేలు వేలుగ సంపచ్చయములు వింగడింపఁబడుచుండును రక్షకభట దక్షతతో నక్కడ ననుదినము శ్రీస్వామి వారి యాదాయమును గణించి గుణించి తదహరాదాయ మెంతో నిర్ణయించి నిశ్చయించి యా మొత్తమును సముద్రముగ భద్రము చేయుదురు. ఆ రాజాధిరాజు రోజుసరి యాదాయము పదిలక్షలు (సుమారుగ) ఆ పద్మజాని తన తోటివారినిఁ దనతో సమానముగాఁ జూచు దయామూర్తి. అందు వలననే తనయంశాంతరులైన దేవతామూర్తులకుఁ దనద్రవ్యములతోనే వసతి. పూజా పురస్కారాది సౌకర్యముల నేర్పాటుచేయుచున్నాడు. తనయైశ్వర్యమును దనతోటివారికి నాశ్రితులకుఁ బంచిపెట్టుటయే కదా ఉత్తమ పురుషలక్షణము.

ఆ ప్రభువు ఎంతటి భాగ్యవంతుఁడో ఎంతటి యుదారుడో ఎంతటి భక్త వత్సలుఁడో ఎవరును జెప్పనక్కఱలేదు. ఆ స్వామి యాదాయము, మేతొడవులు

జగత్కల్యాణము కొఱకై యా జగగేస్తు వ్యయించు గోట్లాది ధనసముదాయమే చెప్పుచుండును. నిరంతరము నేల యీవిధముగ వచ్చు భక్త సంతతులే యా దయామయుని భక్త వాత్సల్యమును బ్రకటించుచుండును.

ఆ స్వామికసాధ్యమేమున్నది.

పాతాళ మాదిగా బ్రహ్మలోకముదాక
యేలెడు వానికి నేది కొఱటు
రతనాల నిలయుని సుతకేలు కొన్నట్టి
యోగజాతకున కేముండు లోటు
కలుముల జవరాలి నెలవుగా డెందము
నిచ్చు వానికి సిరికేమి కొదవ
భాగ్య చిహ్నంబుల బ్రభలతో వెలిగెడు
కోటీశ్వరున కేమి కొదవ కలుగు.
సాగరోర్మ్ముల వోలె విశ్రాంతిలేక
పొంగిపొరలుచు పాదము ముందు తిరుగు
మొల్లమున్నట్టి వాని కేముండు కొదవ
సర్వశక్తులవాని కసాధ్యమేది?

గణనాలయము దాటి కొంచెము ముందుకుఁబోతిని. అక్కడగూడ జనులు బారులు తీరియున్నారు. ఔత్సుక్యముతో నచ్చటకుఁబోయి చూచితిని. అక్కడ స్వామివారి ప్రసాదము లడ్లు విక్రయింపఁబడుచున్నవి.

దూరము భారమెంచకయు, దుర్గమ మార్గ విశేష కష్టములన్
దూరముచేసి, తన్గొలువఁ దూర్ణము వచ్చిన భక్తకోటిపై
మీఱిన ప్రేమకల్గి మది మెచ్చుచు వారి నవారిఁబ్రోవఁగాఁ
గోరిక దీర్పఁగాఁ దలఁచి గొబ్బున మానసవత్సలత్వమున్.
భాగములఁజేసి పరిమళం బద్ది రుచుల
నేర్పుగాఁగూర్చి జనులకు నిచ్చుచున్న

యమృత ఖండంబు లాయన నచటిలడ్లు
పిలుచుచుండును భక్తులఁ బ్రేమమీఱ.

యాత్రికులా ప్రసాదమును (లడ్లును) స్వామివారి మహా ప్రసాదముగా భావించి యథా శక్తి కొనుచుందురు. అక్కడి పరిస్థితినిఁ జూడఁగా లడ్డు కొననిదే తిరుమల యాత్ర పూర్తికాదేమో యనిపించును. అంతటిది యచటి లడ్ల ప్రభావము. భక్తులు స్వామిప్రసాదమును (లడ్లను) తాము కొనుటయేకాక తమ బంధుమిత్రుల కొఱకుఁగూడఁ గొనుచుందురు. లడ్ల వలన ప్రతివర్షము స్వామికి లక్షల యాదాయము వచ్చుచుండును.

భక్తులు వందలు వేలు రూపాయలు ఖర్చుపెట్టి స్వామియనుగ్రహ సంపాదనమునకై తిరుమల వెళ్ళుచుందురు గదా, తన ప్రసాదమును స్వీకరించనిదే స్వామి యనుగ్రహింపడుగదా- అందువలన స్వామి ప్రసాదమైన లడ్లను తిరుమల వచ్చిన ప్రతిభక్తుడు తప్పక కొనుచుండును. అన్ని వస్తువులతోఁబాటు లడ్డువముల ధరఁగూడ ప్రతి సంవత్సరము పెరుగుచుండును.

కొందఱు వితండవాదులు మెరకచూపు కలవారు శ్రీ శ్రీనివాసునిట్లు విమర్శింతురు.

అంతటి భాగ్యవంతుఁడు మహా జలరాశి తరంగ సంఘ వి
భ్రాంతినిఁ గల్గఁజేయు ధనరాశులు కల్గినవాఁడు కూడ న
శ్రాంతముఁ గొల్వఁగా విధివిరామము లేకయె తన్నుఁజేరు నా
శ్రాంతుల కమ్మెలడ్లను గరంబు ధనంబుగడించు లీలకో.

ఎంతయున్నను నాశకు నంత మేది?
ధనముపై నాశపోదె యే జనునకైన
మనుజ మాత్రున కున్న దుర్గుణము దైవ
మునకు నుండిన నెట్లగుఁ బూజ్యుఁడతఁడు?

పరమాత్మ నిస్సంగుడు నిరాకారుఁడు నిర్గుణుఁడు శాశ్వతుఁడు అని కంఠోక్తిగాఁ బార్థునకుపదేశించిన పరాత్పరుని దివ్యవాణిని వారు వినలేదో- విన్నను

మఱచినారో- లేక "యేనకేనా ప్యుపాయేన ప్రసిద్ధః పురుషః భవేత్" అను లౌకిక నీతి వాక్యముననుసరించి పెడత్రోవ త్రొక్కినారో! ఎవరికిఁ దెలియును? అందులకే వారిని మెరకచూపుకల వారని యన్నాను- వారికి లోతుచూవుకూడ నున్నచో నీ విమర్శ వారి ముఖ విగ్రత మెట్లు కాఁగలదు?

లడ్డుక విక్రయములో నర్థమొకటి పరమార్థ మొకటి యున్నది. కోట్లాది భక్తులకు నుచితముగా లడ్లు పంచిపెట్టినచో భగవంతుని యదాయములో నెక్కువ భాగము లట్వ నిర్మాణమునకే పరిమితమై పోవును అప్పుడు భగవదాదాయము ద్వారా నిర్వహింపఁబడు లౌకికాధ్యాత్మిక కార్యక్రమ మంతయు స్తంభించిపోవును. అంతేకాక రంగరంగ వైభవముగా జఱుగు నా స్వామి పూజా పురస్కారములకే యంతరాయము కలుగును అందువలన లడ్డుల ఉచిత ప్రదానము సముచితముకాదు. ఇది యర్థము.

లోకములో నుచితముగా లభించు వస్తువునకు విలువయుండదు జలము కొన్నిచోట్ల సమృద్ధిగా లభించును- అచటివారి దృష్టిలో నీటికి విలువయే యుండదు- దానిని వారెంతగానో వృథాచేయుదురు.

కొన్నిచోట్ల జల మపురూపముగా నుండును- డబ్బుపెట్టికూడ నీటినచ్చటఁ గొనుచుందురు. అచ్చటివారు నీటి బిందువునైనను వృథా చేయక అమృతమును వలెఁజాల భక్తిశ్రద్ధలతో వాడుకొను చుందురు- కనుక లడ్ల వినియోగము సక్రమముగా జఱుపుటకు, వాని విలువ తగ్గకుండ నుండుటకు, వానికి విలువ నిర్ణయించుట యావశ్యకము- ఇది పరమార్థము.

కొందఱు పమత్కారు లీ లడ్ల విక్రయము నిట్లు చమత్కరించుచున్నారు

కొలువ వచ్చిన వారికి, విలువఁగొనక
యీ యఁదగినట్టి లడ్లనే. ఇట్లు స్వామి
అమ్ముచున్నాఁడు దయగల అయ్యయయ్య
అప్పుబాధలు తప్పునే గొప్పకైన.

శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రసాదములలోఁ బ్రథమ స్థానీయము లడ్డు గదా! ద్వితీయము స్ఫటికగుడ శకలములు (పటిక బెల్లము ముక్కలు) కొన్ని కిలోల

పటికబెల్లము అచ్చులను శ్రీ స్వామివారికి నివేదనముచేసి యా నైవేద్యమును శకల శకలములనుగాఁజేసి పొట్లములలోఁబోసి మూతి బిగించి భక్తులకు నమ్ముచుందురు. అతి దవళములై నాతికఠినములైన యాస్పటికగుడ శకలములు.

వేసగియందుఁ దాపమున వేఁగిన జీవుల యార్తిఁబాపఁగా,
గాసిలు భూతధాత్రి యెద గాయము మాన్ప, రసార్ద్రమూర్తియై
భాసిలి, నింగియందు జలబంధుర వారి ధరమ్ము కుప్పఁగాఁ
బోసిన నీటిగడ్డలను బోలును స్వామి దయాపినద్ధముల్.

ప్రథమ ప్రసాదము కతి పయదివస పరిమళము. సుందరము. అటుపైన నుపయోగ్యము కాదు. రెండవ ప్రసాదము కాశీగంగవలె నెంతకాలమైన నుండదగినది. కావునఁ బటికబెల్లము ముక్కలను గొంత యెక్కువగాఁ దెచ్చుకొన్నచోఁ బ్రతిదినమొక శకలమును గన్నులకద్దుకొని శ్రీ స్వామి ప్రసాదముగా స్వీకరింపవచ్చును. శ్రీ స్వామివారికిఁ బటికిబెల్లము ప్రియమైనది. దీనినే కండ చక్కెర అనిగూడ నందురు.

**నామనిర్వచనము :**

శ్రీ స్వామివారికి సహస్రనామములున్నవి. వానిలో "శ్రీ వేంకటేశ్వర" యను నామము సర్వ జగత్ప్రసిద్ధమైనది.

'వేం' అనునది పాపార్థమునందు నిపతింపఁబడిన యవ్యయము. వేం= పాపం, కటతి=దహతీతిః వేంకటః. అనగాఁబాపములను బోఁగొట్టునదని యర్థము. వేంటశ్చాసౌ అచలశ్చ వేంకటాచలః. అనగాఁబాపమును బోగొట్టునట్టి కొండయని భావార్థము. ఇదే బ్రహ్మాండ పురాణములో.

శ్లో॥ సర్వపాపాని వేంప్రాహుః. కటస్తద్దాహ ఉచ్యతే
సర్వ పాప సహో యస్మాత్ వేంకటాచల ఇత్యభూత్"

అని యున్నది. వెంకటాచలస్య ఈశ్వరః. వేంకటాచలేశ్వరః. అనగా వేంకటాచలమునకుఁ బ్రభువని భావము.

"నామైకదేశే నామగ్రహణమ్" అను నొకన్యాయమున్నది. అనగాఁ బేరులోఁ గొంతభాగము గ్రహించినను పేరు మొత్తము గ్రహించినట్లే యని

యాన్యాయమునకు భావము- ఆ న్యాయము ప్రకారమే భీమసేనుఁడు భీముఁడుగా వ్యవహరింపఁబడుచున్నాఁడు అట్లే- వేంకటాచలము- వెంకటమని వ్యవహరింపఁబడును. వెంకట మనగాఁబై న్యాయముచే వేంకటాద్రి యనియే యర్థము వేంకటస్య = (వేంకటాచలస్య) ఈశ్వరః (ప్రభుః) వేంకటేశ్వరః అని యగును- అనగా వేంకటాచలేశ్వరుఁడని యే భావము లేక వేంకటశ్చాసౌ ఈశ్వరశ్చ వేంకటేశ్వరః అనియు చెప్పవచ్చును, అనగాఁ బాపములను బోగొట్టు వాఁడైన ప్రభువని యర్థము-

ఒకనికె రెండు మూఁడగుచు నుండును బేరులు, సూక్ష్మమందుఁ దా నొకఁడతి సూక్ష్ముఁడై మఱియు నొక్కఁడె స్థూలములందు స్థూలుఁడై ప్రకటిత దివ్య భావుఁడయి పర్వి సమస్త జగంబులందుఁ బ్రే షకుఁడును బ్రేష్యుఁడైన పురుషాధికు నామ విభూతి సాంతమే ?

## వేంకటాద్రియందలి తీర్థములు

వేంకటాద్రియందనేక తీర్థములున్నవి- తీర్థపాదుని సమీపములో తీర్థము లుండుట సమంజసమేకదా,

"తరంతి అనేన పాపానీతి- తీర్థం-" అని తీర్థ శబ్దమునకు వ్యుత్పత్తి- అనగాఁ బాపములను బోగొట్టునది యని యర్థము- ఏ జలము తనను సేవించిన వారి పాపములను బోఁగొట్టకలదో ఆ జలమునకే తీర్థ నామధేయ మన్వర్థ మగును- జల సామాన్యమునకుఁ దీర్థనామ ముచితముకాదు-

మహర్షులు సేవించుటచేతను మహర్షి సేవ్యుఁడైన భగవంతుని సాన్నిధ్యముచేతను తీర్థములకటువంటి శక్తి కలుఁగుచున్నది- అందువలననే లోకము, పవిత్ర నద్యాది జలమును- భగవదభిషేక జలములను భగవంతుని సన్నిధిలో నుండు జలాశయములను మాత్రమే తీర్థపద వాచ్యములు చేయుచున్నది.

అయితే లోకములోఁ దీర్థపద మన్యార్థములందుఁగూడఁ బ్రయోగింపఁపడుచున్నది- ఉదా॥ "అమ్మా ! కొంచెము తీర్థమిస్తావా" దాహమగుచున్నది. ఇచటి తీర్థ శబ్దమునకుఁ దాహమును బోగొట్టునది యని యర్థము- అపుడు తీర్థ పదమునకు "తరంతి అనేనపిపాసాం" అని వ్యుత్పత్తి చెప్పుకొనవలెను.

ధాత్వర్థము నాధారముగాఁ జేసుకొని వక్త కర్మార్థముల నైచ్ఛికముగఁ జెప్పుకొనవచ్చును. యథా. తరంతి అనేక పాపాని. తరంత అనేనపిపాసాం. ఈ పద్ధతి ప్రకారము. తీర్థపదమును నదీపరముగాఁ జెప్పునప్పుడు. ఆ పదమునకు "తరంతి అనేన అనారోగ్యం" అనియు వ్యుత్పత్తి చెప్పవచ్చును. అనగా వ్యాధులను బోగొట్టి ఆరోగ్యమును జేకూర్చునది యని యర్థము. ఓషధి ప్రచుర ప్రదేశ ప్రయాతములైన నదులు తనయందున్న మూలికా ప్రభావముచేత స్నాతల యనారోగ్యములను దూరము చేయుట జగత్ప్రసిద్ధమేగదా.

తీర్థములు కొన్ని ప్రవాహరూపములు. కొన్ని జలాశయ రూపములు. కొన్ని కూపరూపములు. జలాశయరూప తీర్థములకుఁ కూపరూప తీర్థములకు (తిరుపతి) బాపాపనోదనశక్తి తత్సన్నిధిలోనున్న భగవంతుని ప్రభావముచేతనే కలుఁగుచున్నది. సామీప్య సంబంధ మాత్రము చేతనే ప్రకృతికి సృష్టి స్థితి లయములను జేయు శక్తి నిచ్చు భగవంతుఁడు తన సన్నిధిలో నున్న తీర్థములకు దురితనివారణ శక్తి నిచ్చుటలో నాశ్చర్యమేమున్నది. అందువలన వేంకటాద్రియందున్న తీర్థము లన్నియు శ్రీశ్రీ వేంకటేశ్వరానుగ్రహలబ్ధ పాపపరిహార శక్తి కలపై ప్రసిద్ధి చెందినవి.

వేంకటాద్రి యందలి తీర్థములను. యథాకాలము యథాశక్తిఁగొన్నింటిని మాత్రము సేవింపఁ గల్గితిని. కొన్నింటి మహిమానుభూతులను బెద్దల ద్వారా తెలిసికొంటిని. ఆ తీర్థములు కొన్ని స్నానమాత్రముచేతనే శారీరక మానసిక మల విమోచకములు. వేంకటాద్రి, వేంకటేశ్వర నిలయమగుటచేతనేగాక యనేక పుణ్యతీర్థ నిలయమగుటచేతను గూడ మహాక్షేత్ర ప్రఖ్యాతినందినది. తీర్థ సేవనము చేయలేకపోయినను వానిని స్మరించినను బాపహరణమగునని పురాణములు చెప్పుచున్నవిగదా. అందువలన శ్రీ వేంకటాద్రి తీర్థచరిత్రల నతి సంగ్రముగ నిందుఁ బొందుపఱచుచున్నాము.

## స్వామి పుష్కరిణీ :

ఇది సాక్షాత్తు వైకుంఠమందలి విరజానదీ సరూపము సదృక్షముకాదు. వైకుంఠపతి వరాహమూర్తియై వేంకటాద్రికి వేంచేయునపుడు స్వామి యాజ్ఞచేత వైనతేయుఁడు విరజానదిని వైకుంఠమునుండి తరలించి శేషశైలమందుంచినాడని

వరాహ పురాణ ప్రవచనము. ఇది శ్రీ వేంకటేశ్వరస్వామికిఁ గ్రీడా సరస్సుగాఁ బ్రఖ్యాతి నందినది. దీనిని గుఱించి వరాహ పురాణములోఁ

శ్లో॥ స్వామిపుష్కరిణీ స్నానం, సద్గురోః పాదసేవనమ్
ఏకాదశీ వ్రతంబాపి త్రయమత్యంత దుర్లభమ్.

అని ప్రశంసింపఁబడి యున్నది. ఇది సర్వతీర్థములలోఁ బ్రముఖము దీనిలో మే మఘమర్షణ స్నానముచేసి శ్రీ వేంకటేశ్వరస్వామికి సతీర్థ్య సంబంధ బంధువులమైతిమి.

**కపిల తీర్థము :**

కపిల మహర్షి చేత నిది ప్రభావితము చేయఁబడినది. అందువలన దాని కాపేరు వచ్చినది. ఇది దిగువ తిరుపతిలోఁ గొండక్రిందనున్నది. పై తిరుపతికిఁ బోవువారు దానిలో నవశ్యము స్నానముచేసి పోవుదురు. ఇది ముక్తికి సోపాన మని చెప్పుదురు.

**గోగర్భము :**

ఇది దేవాలయమునకు సమీపములో నున్నది. ఇది ప్రవహించుచున్న చిన్న కాలువ వలెనుండును. ఈ కాలువ చూచుటకు గోగర్భము వలె నుండుటచే నా నామము వచ్చినది. ఇచ్చట స్నానముచేయు పద్ధతి విచిత్రముగా నుండును. దిగుటకచ్చట రేవుండదు. స్నానముచేయు వా రందులో దూకవలయును. దూకుటకు భయపడువారిని నచట స్థానికులు త్రోయుదురు. వెంటనే వారిలో నొకడు నీటిలో పడినవానికిఁ జేయూఁత నిచ్చి పైకి లాగును. ప్రమాదమేమియు నుండదు. దీనికి భావము. నీటిలోఁ బడుట యనఁగాఁ బాపపంకిలమైన దేహమును వదలుట. పైకి వచ్చుట యనఁగా పాపవిముక్తుఁడై పునర్జన్మ నందుట. అనగా గోగర్భ స్నానము వలన మానవుఁడు పాపవిముక్తుఁడగునని భావము.

ఈ గోగర్భము దగ్గఱ నొకఱాయి యున్నది. దానిని "క్షేత్రపాలక గుండు" అని యందురు. అది చాల మహిమగలదఁట. ఎవరికైనను వివాదములు వచ్చినపుడు. వారీ ఱాయి దగ్గఱకు వచ్చి యథార్థము నంగీకరించి పరిష్కారములను జేసికొనెడివారఁట. అచ్చట నబద్ధమాడిన మరణము సంభవించునను భయముండెడిదట బహుశా ఆ క్షేత్రపాలుఁడీ ఱాయిమీద కూర్చుండి తీర్పులు చెప్పెడి వాఁడేమో. గ్రామములలో రచ్చబండపై నుపవిష్టుఁడై యూరిపెద్ద తీర్పులు చెప్పుట మన దేశములోఁ బరిపాటియే కదా!

పాపనాశనము :

ఇది యాలయమునకు నుత్తరముగా సుమారు మూడుమైళ్ళ దూరములో నున్నది- ఇదియొక జలపాతము- ఇచ్చట ప్రకృతి సహజ రమణీయము- ఆ జలపాతములో నొక శబ్దము వినిపించుచుండును- అది ప్రణవనాదమఁట- ఇచ్చటి నుండియే తిరుమలకు నీరు సరఫరా చేయఁబడుచుండును.

సుమతి యను విప్రబాలుఁడు బ్రహ్మరాక్షసిచేత బాధింపఁబడుచు వచ్చి ఆ జలధారలలో స్నానము చేసినాఁడఁట- ఆ తీర్థ మహిమచేత నాతిని పాపము నశింప బ్రహ్మరక్షస్సు వదలిపోయినాఁడట- అందువలన నా తీర్థమునకుఁ "బాపవినాశన" మని పేరు వచ్చినదఁట.

పాపనాశనమునకుఁబోవు మెట్లమార్గ మెగుడు దిగుడుగా నుండును- ఆ మార్గములో నేమాత్ర మధోగతి తప్పినను సిద్ధించునది యధోగతియే- ఆ తీర్థము.

లోకములన్ని నిల్పఁదనలోఁగల జీవనశక్తి నిచ్చి, స
ర్వాకృతిఁ బ్రోచు సప్తగిరి వాసుని రాజ్యములోని వారికిన్,
దూకొని జీవనమ్ము, సతతోత్సుకమై యొసఁగూర్చునట్టి. య
ప్రాకృత శక్తి, పాపగణ భంజన, మాశ్రితరంజకమ్ముగున్.

జీవనమిచ్చెడు వానికి
జీవనమిచ్చుట యటన్నఁ జిత్రమె జగతిన్
శ్రీవారి భక్తులకు నది
వేవిధముల జీవనముల విడువకయిచ్చున్.

భక్త భగవంతులకు భేదములేదుగదా! అందువలనఁ బాపవినాశనము భగవంతునకే జీవదానము చేసినదైనది.

పాపవినాశన జలపాత మించు మించుగ కుర్తాళ జలపాతమును బోలి యుండును- కాని వాని కొక భేదమున్నది- కుర్తాళ జలపాతము.

నాకము నుండి జాఱుచు, జనౌఘము పాపము నాహరింప న
స్తోక జలప్రవాహములఁ దూర్ణముగా దిగుచున్న గంగగా

మూకను దోయికిన్ నిరుపమానశిలోచ్చయ శృంగ భంగమై
తాఁకెను విస్మయంబొదవ, దర్పజలస్వన తాడితాశ్రమై.

పాపవినాశ తీర్థ మొక పట్టునఁగన్పడ దెక్కడుండియో
యోపుగవచ్చి వచ్చి కుధరేంద్రుని మూఁపులనుండి జాతి సం
దీపిత వేగమూచు ధరణిన్ బడిపాఱునుఁ. గానఁబట్టదే
కోపున నుండి యూర్ఘర మకుతితమై ప్రవహించుచుండెనో.

అఘముసందున బడకుండ నచటి జనుల
కూఁతగా ధర్మనీతుల నుంచినట్లు
జాతి పడకుండఁ బైనుండి స్నాతకులకు
గొలుసులన్ వ్రేలఁదీసి రా కొండదంత.

కేశములందుఁ బాపములు కీర్ణములై నివసించియుండు నా
రాశిని క్షోభపెట్ట బెదరంది చనున్ వృజినౌఘమంత" యం
చా శిఖరాగ్రమున్ విడిచి యంబర వాహిని నార కేశ సం
వేశము క్షోభపెట్టుఁ దన బెందరఁగల్ వడిదూఁకి యూర్వఁగన్.

సబ్బులకక్కఱలేక యే సలిలధారఁ
దోఁగియున్న శరీరము తొలఁగ మఱికి
"భ్రమను బాయుట శుద్ధమై పరిఢవిల్లు
ప్రమ విభాతిగ" శోభిల్లు విమలకాంతి.

అటనుండి మేము ఆకాశగంగ కభిముఖులమైతిమి.

**ఆకాశగంగ :**

పాపవినాశము నుండి యాకాశగంగకుఁబోవు నపుడు పాతాళమునుండి స్వర్గమున కెగఁ బ్రాకుచున్నట్లున్నది.

ఆకాశగంగ నామము
నాకేశఘునీ పరమ్మునై పెంపొందెన్

పోఁకక యేదృష్టులకిది
దూఁకుట ధర, నట్టి సన్నతో నది వెలసెన్.

పాపనాశనమునుండి యాకాశ గంగకుఁబోవుచు ఆ నదిని నిలువెల్లఁబొంగు పెనువెల్లువగా నూహించుకొంటిని కాని యా భావము గంగను జూడగానే తాఱుమాఱయినది.

రూపము లేదు లేవు బెదరున్ గలిగించు తరంగ సంఘముల్
కాపుఁగ గట్లు లేవు వెదుకన్ గనుపట్టదు వచ్చుత్రోవ యే
దాపున పుట్టువందె నెట దైర్ఘ్యమునందెనో యించుకంతయున్
దోఁపదె ? యెంత మేధకు ననూహ్యము లీ ప్రకృతి ప్రచారముల్.
కానఁగ రాని సాధననికాయము నుండి హఠాత్తుగా సు సం
దానితమైన పూర్ణ సుకృతంబన, మూర్ఖుని మోమునుండి యెం
తో నయవిద్య యొక్కపరి దూకిన యట్లుగ కొండ గుండెలో
లీనమునై వసించు నది లేచి మహోద్ధతి పొంగినట్లుగన్.

కానఁబడుచుండు నచట నాకాశగంగ
కొండమోమున నిలిపిన గొట్టమనెడు
దారివెంబడి భూమికి జాఱునపుడు
నదుల పుట్టువు తెలియగ నరులవశమె.

గజతుండ పరిమాణముగా వెలువడు జలధార ముందున్న పల్లములో నొకేమాఱు ముగ్గురు స్నానము చేయవచ్చును. అందువలన.

ఒక్కడు తలవంచె నుదకము క్రిందుగా
నొక్కడు వానిపై నుంచె శిరము
వానిమీద నొకండు వంచగా దేహ మిం
కొకడు వానికిఁ గ్రింద నుంచుఁదలను
స్నానార్థ మిద్దఱు జగడ మాడుచు నుండ
మూఁడవ వాఁ డందుఁ బూర్ణఫలము

గట్టివా రొక్కటె గదుముచు మగవారిఁ
దన్మధ్య మందునఁ దానమాడె
చొరవతోఁ బురుషుఁడు బోరఁబడి వచ్చిన
ధృష్టుఁడంచును వానిఁ దిట్టునొకతె.
క్రింద గొట్టముఁజేరఁ గేంద్రీకరించి
యున్న వారలఁ గొందఱే యుఱుకులెత్తి
సగము స్నానము చేసి యచ్చటను బాసి
పోవుచుండిరి జనత యూపులకు బెదరి.

ఆకాశగంగాజల మతిమధురము. అది యాకాశగంగకదా! దానిలో మాధుర్యమునకేమి కొఱత యుండును. స్వామివారి యర్చనకై యర్చకులు ప్రతి బ్రహ్మ ముహూర్తమున నిచ్చటనుండియే వెండి బిందెలలో జలము నంచె లంచెలుగా దీసికొనిపోయి దానితో స్వామిని స్నానముచేయింతురు.

మలములనెల్ల గెంటె పులుమాసిన ముత్యములట్లు భక్తులన్
గలకలలాడఁజేసెడు ఖగాధిపవాహన దేహమెల్ల ని
ర్మలముగఁజేయు దోయనది, జలంబుల నెంతటి శక్తి యున్నదో!
నలువ పురంధ్రి యూ భుజగనాయకుఁడైన వచింపనేర్తురే ?

భగవంతుఁడాకాశ సదృశుఁడుగాదా. అందువలననే ఆ యాకాశగంగోదక మాయన కంత యిష్టమైనది. ఆ తీర్థ సమీపమందే అంజనాదేవి పనతస్సు చేసి యాంజనేయునిఁ బుత్రునిగాఁబొందినదఁట.

ఆకాశగంగా ప్రాంత మతి మనోహరము. మధురాతి మధురమైన ఆ జల సేచన ప్రభావముచేత నచటి ప్రకృతికాంత పంచభూతములనే పరవశింపఁజేయు నట్లుండును "అచటి యా సుందరప్రకృతికాంత సుకుమార శరీరముపై నొక మాటే యేడు వారముల సొమ్ములు సొబగులీనుచుండును.

ఆకాశగంగా దర్శనానంతరము మేము తదితర తీర్థముల మహిమలఁదెలిసి కొంటిమి.

మాన్యములు కళంకవంక ప్రక్షాళకములునైన మహా తీర్థములు శేషాద్రి యందు తత్పరిసరములందు ననేకములున్నవి.

శేషాద్రిపైన విశేషపాపఘ్నమై
శక్ర తీర్థంబుండె సారజలము,
జారత్వ దోష నిర్ధారణంబున కింద్రుఁ
డందులో మున్గి కృతార్థుఁడయ్యె,
వరుణ కుమార విష్వక్సేను పేరున
నాపైన నొకతీర్థ మవతరించె,
పరమ తపస్వియై వరుణాత్మజుండట
సాయుజ్యమును బొందె సద్గుణుండు,
విష్ణుపంచాయుధ విమల తీర్థములైదు
కలవు దానికి పైన కల నెలవున,
అగ్నితీర్థం బొక్క టాప్రక్క నుండెను
పాపాటవికి దావవహ్ని యగుచు,
బ్రహ్మ తీర్థంబను భవ్య తీర్థంబుండె
నాపైనఁ గొండపై నమలవారి,
బ్రహ్మకుఁగల్గిన బ్రహ్మహత్యాపాప
మంతరించెను దానియందు మున్గ,
సప్తర్షి తీర్థముల్ సప్తనగోపరి
విలసిల్లుచుండు నిర్వేదరిపులు
పాండవుల్ నీరాడి ఫలితమ్ము నొందిన
తీర్థము పాండవ తీర్థమయ్యె,
ఫల్గునీతీర్థ జాబాలితీర్థము లుండె
జనజన్మ సాఫల్య సాధనములు,
పాపనాశమునకుఁ బైన నుత్తరమందు
కలదు నిర్మలమను జలనిలయము,
సనక సనందన ఘనతీర్థరాజముల్
సరసనే యుండె రసాయనములు,

ఈ మేఘపుష్ప మందించు మున్గినవారి
కధిక యౌవనము రోగములఁబాపి,
తుంబురు తీర్థంబు దుర్యోగముల మాన్పు,
దేవతీర్థంబిచ్చు దేవపదము,
పద్మకు నిలయమై పద్మ సరోవర
మాపైన నున్నది యఘవినాశి
రమ్యమైన "కుమారదార" యను తీర్థ
మవల నుండు ననేక దోషాపహమ్ము
వేంకటాద్రియు నొప్పారు వేయి తీర్థ
నేత్రములతోడ సురగణనేతయట్లు.

ఇవి యిప్పటికిఁ దెలిసిన తీర్థములు. వెంకటాద్రియందిప్పటికివి దెలియని తీర్థము లెన్నోయున్నవని పెద్దలనుచున్నారు.

## శ్రీ వేంకటాద్రి నామాంతరములు

కలియుగ దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామికి నిలయము వేంకటాద్రి ఈ గిరికి ననేక నామములు పురాణములలోఁ గన్పడుచున్నవి. ఆ నామములు కలిగిన విధముకూడఁ బురాణములలో నున్నది. ఆ విషయము నిక్కడ పల్లవాగ్ర భక్షణ న్యాయముగఁ బరిచయము చేయుదును.

వైకుంఠ మందలి పద్మనాభుని కొండ
నామ భేదంబుల నందె భువిని
చింతితార్థద మాటఁ జింతామణి గిరీంద్ర,
మది జ్ఞానమిచ్చి జ్ఞానాద్రియయ్యె,
సర్వ తీర్థం బుంట సర్వ తీర్థాద్రిగఁ,
బుష్కరాద్రిగఁ బేరుపొందె వివిధ
పుష్కరిణీ స్థానముగనుండి, కనకాద్రి
యయ్యె సౌవర్ణ వర్ణాంశువగుట,

నారాయణాద్రియా నారాయణునకును
నెలవై నకతన నా శిలలరాశి,
వైకుంఠమందలి పర్వతంబై యుంటఁ
బరఁగె వైకుంఠాద్రి బిరుదమంది,
నారసింహుఁడు మెట్టినట్టి శైలంబౌట
సింహాచలంబని చెలఁగెఁబేర
అంజనా తపమున కాశ్రయంబౌటచే
నంజనాద్రిగ ఖ్యాతినందె నదియు,
ఆది వరాహున కాశ్రయ భూమియై
కీర్తిఁబొందె వరాహ గిరియటంచు,
విష్ణుభక్తుండైన వృషదైత్యు నాఖ్యచే
వెలసె వేంకటగిరి వృషభగిరిగ,
"నీల"వానరునకు నెలవౌచుఁబేరందె
నీలాద్రియనఁగ నా శైలరాజు,
శయ్యయా శేషాహి సారభూతంబయి
శేషాద్రినామ విశిష్టమయ్యె.
గరుడుండు తెచ్చుట గరుఁడాచలంబన్న
చిహ్నముఁదాల్చె, నా శ్రీశు నెలవు.

బహుళ నాముఁడు నౌ పరబ్రహ్మ - యట్టి
శేషి నిత్య నివాసమై చెలఁగుకతన
వేంకటాద్రియు బహునామ విలసితమ్ము
వేద వేద్యుని లీలలు వేవిధములు.

వేంకటాద్రి కనేక నామములున్నను వానిలోఁ గొన్ని కొన్ని యుగము లలోఁ జాలప్రసిద్ధి జెందినవి. ఆ విషయము నీ శ్లోకము స్పష్టము చేయుచున్నది.

శ్లో॥ కృతే వృషాద్రిం వక్ష్యంతి- త్రేతాయాం మంజనాచలమ్
ద్వాపరే శేష శైలంతు కలౌ శ్రీ వేంకటాచలమ్
నామాని యుగభేదేన శైలస్యాస్య భవంతిహి.

ఈ పర్వత మాయా యుగములలో నా నామములు వహించుటకాధార కథలు పురాణాంర్గతములు.

తిరుమల యందమైన యొక శాఖా నగరము- వైశాల్యమునకుఁజిన్నదైనను జనరంజక వస్తుసముదాయము కలిగి చక్కగాఁ దీర్చి దిద్దఁబడుటచేత సర్వ మనోజ్ఞమై యొప్పారుచుండును- అది వైకుంఠధాముని నిలయము గదా- దాని వైభవము వర్ణనాతీతము- అక్కడ.

యాత్రకు ముఖ్య వస్తువులు హాళినిఁగూర్చెడు మేలి వస్తువుల్
నేత్ర యుగంబుఁదన్పు సరణిన్ సమకూరిన గేహవస్తువుల్
పాత్రలు పూసలున్ భవుని భక్తి నిదానములౌ శివాక్షలున్
జిత్రములై కనంబడును శేషగిరీశుని యింటిముంగిటన్.

వైష్ణవ సంప్రదాయములోఁ బుణ్యక్షేత్రములను దివ్యదేశములందురు- ఆ దివ్య దేశములు 108 గా నిర్ణయింపఁబడినవి- వానిలోఁ దిరుమల ప్రథమ దివ్యదేశము.

తిరుమలలో సంవత్సరము పొడవునా యేవో యుత్సవములు జఱుఁగుచుండును- వానిలో బ్రహ్మోత్సవములు నవరాత్రి దినములలో మహా వైభవముగా జఱుగును- తిరుమలలోఁ దెప్పయుత్సవము కనులకు విందై భవరోగమునకు మందై మిగుల పసందై యుండును

ఆ ప్రాంతమందే శ్రీ స్వామివారికొక యుపవనము నిర్మింపఁబడినది- అదియొక పుష్పవనము కూడా- దాని సౌభాగ్యమును సౌందర్యమును దెలియఁ జేయు పేరా పూలతోఁటకు మఱియొకటి యున్నది- అది గులాబి తోఁట- స్వామివారి యర్చనాదికమునకై యాతోఁట పుష్పములే తీసికొని పోవఁబడుచుండును- ఆయుపవనములో కాలము నియమము లేక వసంతుఁడు సర్వదా నివసించుచుండును. రామణీయకమునకు నిలయమైన ఆ గులాబితోఁట.

ఇంద్రుని నందనంబును ధనేంద్రుని చైత్రరథంబుఁ జెల్వమం దుం ద్రపఁజెంది వీఁగ వసుధోపరి నున్న సమస్త పుష్ప వాటీంద్రమునై యనేక నయనేంద్రియ తర్పకమై సమీహితార్థ తంద్ర ఫలప్రదాయియగు ధన్యమగున్ హరికిన్ ప్రియంబునై.

శ్రీ వేంకటేశ్వర ప్రభువు వెన్నవంటి మనస్సు కలవాఁడు. గత జన్మలో నా భక్త బంధువు తిన్నది స్వచ్ఛమైన యావుపాల వెన్నయే కదా అందువలననే భక్తుల బాధలను జూచినను. వారి యార్తనాదములు విన్నను నాస్వామి మనస్సు ఇట్టే కఱగి పోతుంది. ఆ స్వామి భక్త వాత్సల్యమును దెలుపుటకు వేఱుగ సాక్ష్యములక్కఱలేదు. నేల యీని నట్లుగ ప్రతిదినము స్వామికిని మ్రొక్కులు చెల్లించుకొనుటకై కొండకు వచ్చు వేలాది భక్తులే ప్రత్యక్ష సాక్ష్యము.

మేము సుమనోభిరామమైన యా యుపవనమును సానందముగ వీక్షించితిమి. ఇంకను. ఆ నగాగ్రముపై నగహృదయముపై నగ పాదముపై గల పెక్కు విశేషముల దర్శించి జన్మ సార్థకమైనట్లు భావించితిమి.

## శ్రీస్వామివారి యాలయ ప్రాకార నిర్మాణము

శ్రీ స్వామివారి యాలయ ప్రాకార నిర్మాణము మహాశ్చర్యము. అత్యద్భుతము. భగవత్కృప లేని వారి కసాధ్యము.

తొండమానుఁడు. ఆకాశరాజు సోదరుఁడు. విష్ణుభక్తుఁడు. ఆకాశరాజు మరణానంతరము శ్రీనివాసుని దర్శించి భజించి సేవింప సాగినాఁడు. కొంత కాలము గడిచినది.

ఒకనాఁడు తొండమానుఁడు వేంకటేశ్వరస్వామికి నమస్కరించి "మహాత్మా! నాకు మీకైంకర్యము చేయవలయునని ప్రభూతాభిలాష యున్నది. అందువలన నా జన్మను దరింపఁజేయునది. నాకుఁజిర కీర్తిని సంపాదింపఁగలది. స్వామివారి సేవా రూపమున నుండునది యైన యొక సత్కార్యము నాదేశించండి. ఆ సత్కార్యమును భక్తి ప్రపత్తులతోఁ బూర్తిచేయుదును." అని విన్నవించుకొనెను.

దేవతా చక్రవర్తి తొండమానుని విన్నపమాలకించి తనకొక విమాన రాజమును (గోపురముతోఁ గూడిన యాలయము) నిర్మింపుమని యానతిచ్చెను- భక్తుఁడైన తొండమానుఁడు దాని కంగీకరించినాడు.

తొండమానుఁడు కష్టపడి యాలయమును త్వరగాఁ బూర్తి చేయవలయునని డబ్బుకు వెనుకాడక వందలమంది శిల్పులను నియోగించి కార్యమును వేయి కళ్లతో సాఁగించినాఁడు- దాని ఫలితముగా.

పూర్వాభిముఖముగాఁ బురుషోత్తమాలయ
మచట నేర్పడె తొండమాను కృషిని
గోపుర ద్వయముతోఁ గొమరారు గుడియొప్పు
శిఖరద్వయముతోడి శిఖరి వోలె
మూడు సాలము లిరుమూడులు నొకటియుఁ
గలిఁగిన కక్ష్యలు గ్రాలుచుండ
శ్రీవారి యున్నత భావరూపంబుగాఁ
దనరు చుండగ ధ్వజస్తంభ మొకటి.

మండపంబులు గోశాల మనుజశాల
భూమ కర్పూర శాలలు పుష్పశాల
కలిఁగి యుత్తడి స్వర్ణ శృంగార కాంతి
నిలయమై యొప్పు శ్రీపతి నిలయమచట.

ఆ విధముగా స్వామికి నాలయ గోపురాదులు నిర్మింపఁబడినవి- మానవుఁ డెంత ప్రయత్నించినను దైవమనుకూలముగా లేనిదే యా ప్రయత్నము సంపూర్ణ ఫలప్రదము కానేరదు- భక్తుఁడైన తొండమానుని కృషికి దైవమనుకూలించుట చేత నా నిర్మాణ కార్యక్రమము నిరంతరము నిరంతరాయముగా సాఁగి త్వరలోఁ బూర్తియయినది.

ఆ భక్తబంధువైన శ్రీనివాసుఁడు తొండమానుఁడు గట్టించిన బంగరు దేవాలయములో వేంచేస నివసించుచుఁ గనియుగ ముఖ్య దైవతముగా విరాజిల్లు చున్నాఁడు.

శ్రీ స్వామి కరుణా సింధువే- భక్తవత్సలుఁడే- అయినను- స్వార్థము గర్వము కల భక్తులను బాలింపఁడు. ఆ దేవ దేవునకుఁగావలసినది సహజమైన స్వార్థరహితమైన నిశ్చలభక్తి- ఆదేవునకు వీఁడు కూటికి లేనివాఁడు వాఁడు కోటికెత్తినవాఁడు- అను భేదభావమావంతయైన నుండదు- ఆగడుసరి స్వామి.

సరస నూతన సుమముల సరసఁబోక
కోరుకొనుచుండు నీరస కుసుమములను
స్వామి భక్తపరీక్షలో చతురతముఁడు
గుణము ముఖ్యము స్వామికి గోట్లుగాదు.

వైకుంఠ వాసుఁడెందఱో భక్తులను కరమిచ్చి కాపాడినాఁడు- ధ్రువ ప్రహ్లాద గజేంద్రాదు లెందఱో యా జగజ్జనకుని కరుణాసారములో నోలలాడి తరించినవారున్నారు- అవి యన్నియు స్వామివారి పూర్వ గాథలు- శ్రీ తిరుమల వేంకటేశ్వరుని దయకుఁగూడ పాత్రులెందఱో యున్నారు. వారిలో నొక యుత్తమ భక్తుని కథ నిందు దహరింతును.

## భీమ భక్తుని కథ

తొండమాను మహారాజు శ్రీ వేంకటేశ్వర స్వామికి నాలయ ప్రాకారాదులను గట్టించి యందు స్వామిని ప్రతిష్ఠించి యున్నాఁడు గదా- అంతకుముందుఁ దొండమాను సహజ భక్తుఁడే- తాను నిర్మించిన యాలయ ప్రాకారములను జూడగా జూడఁగా నాతనికి నహంకార ముదయించినది- ఇతరు లెవ్వరు చేయలేని యా మహా నిర్మాణమును దానొక్కఁడే చేయగలిగితిననియు- తానే మహా భక్తుఁడననియు వేంకటేశ్వర స్వామి భక్తులలోఁ దానే ప్రథమ గణ్యుఁడననియుఁ గర్వము రాజులోఁబుట్టి పెరిగినది- అంతేగాని శ్రీనివాసుని యనుగ్రహమే యాలయాది నిర్మాణములోఁ దనకుఁదోడు పడినదను భావమేమాత్ర మాయజ్ఞానికిఁ గలుఁగ లేదు.

తొండమానున కహంభావము తీగలు వేసినది. తనంత మహా భక్తుఁడు సామాన్యునివలెఁ బ్రతిదినము వేంకటేశ్వరస్వామి గుడికిఁ బోవుట యేమి- తన భక్తికి మెచ్చి యా దేవుఁడే కొండదిగి తన యింటికి రావలెను- అందులకుఁగాను వేంకటపతినిఁ దన గృహపతినిగాఁ జేయవలయు ననుకొన్నాఁడా మహీపతి.

తొండమాను- ఆ విషయము నంగిరస మహర్షికి విన్నవించి యందులకు మార్గముఁ జూపుడని ప్రార్థించినాఁడు.

అంగిరస మహర్షి యా రాజు విజ్ఞాపనమును మన్నించి యిట్లన్నాడు. "ఓ భూపతీ! శ్రీనివాసునకుఁ దులసీదళములన్న ప్రీతిమెండు తులసి యనగా రూపాంతరములో నున్న యాతని యర్ధాంగి లక్ష్మియే కదా- అందువలన నీవు ప్రత్యహము తులసీదళములతో నా వనమాలి నర్చింపుము- ఆ తోమాలి నీ పూజల కత్యంత ప్రీతుఁడై నీ యభీష్టమును దప్పక నెరవేర్పఁగలఁడు-

తొండమానుఁడు తులసీదళములతో దేవతార్చన ప్రారంభించినాడు మామూలాకులవలె నున్న యా తులసీదళములను జూడగానే "నా యంతటి మహారాజు కేవల మాకులతోఁ బూజించుటయేమి ? ఈ యాకులతోఁబూజ దరిద్రులు చేయుదురుఁ గాని నేనుఁగాదనుకొని- ఆకులతో బూజించుట తన గౌరవమునకు భంగమని బంగరు దళములతోఁ బూజించిన భగవంతుఁడు తన కోర్కెను మన్నించి తన యిలువేల్పుగా త్వరలో రాఁగలఁడని భావించాడు- కాని భగవంతు నాకర్షించేది సాత్వికమైన భక్తియేగాని తామసమైన యహంభావము- ధనము- ఆడంబరములు కావని యాతఁడు గ్రహింపలేదు- ఆ యుద్దేశముతో.

పదియు నార్వన్నె పలిసిడి శోభల చెలంగు
మేలి తులసీదళంబుల వేలవేలు
తానె చేయించి వానితోఁ దిరుమలేశు
నర్చనముఁజేయు నాతఁ డహంకృతిమెయి.

రోజులు మాసముల్ జనె. సురోత్తమ దర్శన సూచనైన నా
రాజుకుఁ గల్గలేదు- అది దురాశగఁ దోఁచెను దొండమానుకున్
రాజెను దానకోప మసురాంతకుఁ దప్పక చూతునంచు స
వ్యాజమనస్కుఁడా ధరణి పాలకుఁ డుంకువతోడ మెండుగా.

తులసీదళముల బూజల
నలఘు ప్రారంభకముల నహామానఁజేయన్
దొలఁగెను బంగరు, మృత్తిక
వెలసెను నాదళములందు వింతలు మొలవన్.

కంటికి మేలుసేయ నొడికంబగు మందును వేయఁ జూపు ని
ష్కంటకమౌనుగాని యొకసారిగఁబోవునె? శ్రీనివాసు నా
కంటను దారగానిలిపి కాంచన పత్ర సమర్చ సేయ నే
మంటకు లేని యట్లు- అవియు మాతెరు మన్నును దిన్న యాకులై.

గుడులును గోపురంబులును గొబ్బుగ ద్రవ్యము కర్చుపెట్టి వెం
బడిఁబడి లెక్కచేయక శ్రమన్, బొలుపారగఁగట్టినట్టి నా
యెడఁదగునా? యలక్ష్యము రమేశ్వర నా తులసీ దళార్చనన్
బుడమినిఁ బాతిపెట్టితివ! పొందుదువే! ననువంటి భక్తునిన్.

అని గర్వంబునఁబల్కు రాజునకు వ్యోమాధ్వంబునందుండి క్ర
న్నన విన్పించెను వాణి "ఓయి! యెవఁడైనన్ దంభియై నన్ను గొ
ల్చినఁ గన్నెత్తియు వానిఁజూడ. మది నిల్చెన్ నన్ గులాలుండు భీ
మన నామం డతనిన్ గనుంగొనుము నీ యజ్ఞాన మారున్ నృపా.

తిరుమల శేఖరాజ్ఞ మదిఁదేర్చఁగ, గర్వము దూదిపింజయై
పరుగిడఁ దొంటమానుఁడు త్రపాభరనమ్రనిజోత్తమాంగుడై
యరిగెను కుమ్మరిండ్ల నిలయంబులకున్ బదచారియై నిరా
భరణుఁడు శాంతి భూషణుఁడు" భక్తులు దైవత మూర్తులే కదా.

కుమ్మరి వంశపావనుఁడు కూర్మి శ్రియఃపతిపాద భక్తుఁడై
పమ్మిన చిత్తశుద్ధి భగవంతుని రూపము నెల్ల రూపులన్
నమ్మికఁ జూచువాఁడు కలినాయకు మృత్తులసీదళ ప్రసూ
నమ్ముల నిమ్ములన్ గొలుచు నన్య మెఱుంగక ధ్యాననిష్ఠుఁడై.

మట్టియుఁబైడి యొక్కటిగ మానసమందున నెంచి, సృష్టిలోఁ
దుట్టతుదన్ జనించినను దుర్భర లోకము మోయు పూనికన్
మొట్టమొదల్ గణింపఁదగు భూతము మేదిని, కాన దానిచే
నెట్టనఁజేసినట్టి గణనీయ దళంబుల వేంకటేశ్వరున్.

మఱచి సమస్తమున్ మనసు మందిరమందున నిర్వికారుఁడై
తిరముగ నున్న వేంకటపతిన్ మనుపూల సహస్ర సంఖ్యలన్
నిరతము పూజసేయ నవి నిత్యము స్వర్ణదళంబు లౌచుఁ జూ
పఱపఱ ముంచు నచ్చెరువు వార్ధిని బ్రస్ఫురదాత్మ రోచులై.

గత మోహంబున భక్తితత్పరుఁడు నిర్గర్వుండునై పల్లెలో
వ్రత దీక్షన్ సిరిచెల్వు పూజనములన్ బద్ధాత్ముఁడై చేయఁగా
మతిమంతుల్ గని భీమునెంచిరి గతం బందైన ప్రారబ్ద సం
గతిచే నిట్లు కులాలుఁడయ్యెఁ. గన యోగభ్రష్టుఁ డీతండగున్.

ఇట్లు కుమ్మరియైన భీముఁడు త్రికరణ శుద్ధిగ శ్రీ వేంకటేశ్వరుని మృత్తులసీదళంబులఁ బూజించుచుండ నవి బంగారు తులసీదళంబులై ప్రకాశించుచుండెను. ఇట్లుండగా.

గిరిపతి తొండమాన్ నృపుడు "కిమ్మన" కుండఁగఁ బల్లకెగి సా
దరముగ భీమునింట నరుదా హరిపూజను, స్వర్ణకాంతితో
మెఱయు దళంబులన్ గని నిమేషము లేని సమీక్షణంబులన్
వెఱఁగును బొంది మానమును వేర్పడఁజేసి తలంచె నెమ్మదిన్.

నా యింటన్ గల స్వర్ణ పత్రములు న్యూనత్వంబునన్ మట్టివై
పోయెన్. గుమ్మరియింటి మృత్తికలె యబ్బో! స్వర్ణరూపంబులై.
ఈయున్కిన్ భుజగాద్రి తుల్యముగ భాసింపంగఁ జేసెన్ భళీ.
నా యుద్యోగ మహంయుతాధమము స్వర్ణస్వచ్ఛ మెట్లయ్యెడున్.

అని తలఁచి విజిత రాజేంద్రుఁడా రాజేంద్రుఁడు జిత సర్వేంద్రియుఁడై భీముని సమీపించెను. రాజు రాకవలనఁగలిగిన కలకలముచు విని పరవశుఁడై శ్రీనివాసుని బూజించుచున్న యా పరమ భక్తుఁడు కొంత సేపటికిఁగన్నులను దెఱచి లేవఁబోవఁగా మహీపతి" "వలదు వలద"ని యా భక్తుని వారించి యాతనికిఁదానే నమస్కరింపఁబోయెను. అంత నా భక్త శిఖామణి.

తక్కువ జాతియందు ధనధాన్యములన్నవి లేని వర్గమం
దక్కట! పుట్టినాను చదువన్నది లేదిటువంటి నాకు మీ

రుక్కున పక్కి మోకరిలు టొప్పునె భూవర ! మీ పదంబులే
దిక్కగు మాకు, మాకు భవదీయ పదంబుల మ్రొక్కె ధర్మమా.
భీముని మాటవించు రిపు భీముఁడు పల్కె నగోన్నతా ! పరం
ధాముని యాత్మవై తనువు ధన్య మొనర్చిన నిన్ను మించు ను
ద్దాముఁడు లేడు చూడ వసుధాతల మందున. రాజ్య భోజ్యముల్
దోమలవంటివే, కనుక దోర్యుగ మెత్తి నమస్కరించెదన్.

నీవు గొప్ప వు గొప్పవు నీవె యంచు
రాజు భక్తులరాజు పోరాడు కొనఁగ
పాలిత ద్విజరాజు లోకాలరాజు
పలికె నీ విధి భక్తికి విలువకట్టి.

రాగము ద్వేషమున్ వదలి లక్ష్యము నందె మనస్సు నిల్పి దు
ర్యోగములందుఁజిక్కక యరుంతుద దుర్భర సన్నివేశముల్
వీఁగి, జలంబువోలె నెలవిచ్చు నుపాధుల భావ మందకే.
యోగును స్వస్వరూపమున నెవ్వఁడు వానికి దాసుఁ డీశుఁడున్.

ఈతఁడు శుద్ధ చిత్తమున నీశసమర్పిత సర్వకృత్యుఁడై
చేతమునందు నిల్పినను జేయును బూజల నెల్లయప్పు నీ
వో ! తనివోని సౌఖ్యములఁబొంగుచు నన్ భజియింతు వందుచే
నీతఁడు నిచ్చ మించి కఱగించెను నాహృదయంబు యోగియై.

నేను నా భక్తులొక్కటే కాన లోక
మంతయున్ వారిఁగొల్వ నా యంతరంగ
మందు సంతృప్తి. భక్తులఁ గ్రిందుఁ జేయు
వాని నంగీకరింప నెవ్వానినైన

అని పద్మావతీజాని నిర్వచనమీయఁగా తొండమానుఁడు గర్వము నహం
భావముచు దూరముచేసి భీముని మిక్కిలి గౌరవించెను. తిరుమల వాసుఁడును భక్త
భక్తుడైన యా పరమభక్తుఁడు తొండమానునకుఁగూడ తన సాయుజ్య మొసఁగెను.

ధనముల్ జూపడు రూపముల్ గనడు బాంధవ్యమ్ము వీక్షింపఁ డె
వ్వని యేపల్కు-బడిన్ గ్రహింపఁజనఁ డేస్వార్థం బనర్థంబుగా
మనమం దెంచును దైవ, మాతనికి నెవ్వాఁడిక్కన్ దోసంగానునిచ్చిన
లంచం బని యెంచి శుద్ధమతితో సేవించుటే యొప్పగున్.

ఈ కథ శ్రీ వేంకటేశ్వర స్వామియొక్క భక్త వాత్సల్యమును దెలుపుచున్నది. శ్రీ స్వామివారియొక్క భక్త రక్షణమును దెలుపుకథ లెన్నియో పురాణములలో నున్నవి. ఈ యుగములో శ్రీ వేంకటస్వామి యొకఁడే భక్తులకు మిక్కిలిగా నందుబాటులోనున్న దైవము. అందువలననే "కలౌ వేంకటనాయకః" (కలియుగములో వేంకటేశ్వరస్వామియే గొప్పదైవము) అను మహా వాక్యము ప్రచారములోనికి వచ్చినది.

తిరుమల యొకప్పుడు శిలాప్రాయము. ఈనాఁడు చిన్న పట్టణము. అది శ్రీ వేంకటేశ్వర ప్రభువుయొక్క మహా సామ్రాజము. ఒకప్పుడు ఒక్క భక్తుఁడుగూడ నుండుటకు నవకాశము లేని యా ప్రదేశమిపుడు వేలాది భక్తులు సుఖముగా నివసించుటకు యోగ్యములైన విడుదులతోను సౌకర్యములతోను నిండి కళకళలాడుచున్నది.

భోజనశాలలు భాజనశాలలు ఫలహారశాలలు. ఒకటేమిటి యాత్రికులకు నెప్పుడేమి కావలసినను నన్నియు నిప్పుడచ్చట లభించుచున్నది.

ప్రతినిత్యము తెల్లవాఱు జామున శ్రీ స్వామివారికి నాకాశగంగోదకముతో నభ్యంజన స్నానమును జేయింతురు. ఆ సమయములో స్వామి తన సహజ స్వరూపముతో భక్తులకు దర్శనమిత్తురు. అపుడాస్వామి నిరాభరణుఁడు నిరలంకారుఁడు నై యుండును. శ్రీ స్వామి సహజస్వరూపదర్శన మందఱకు లభింపదు. రుసుము చెల్లించినవారికిఁ బ్రత్యేకముగా ననుమతి పత్రములు గలవారికే లభించును. ఆ దర్శనము పుణ్యప్రదము.

"సహస్ర శీర్షాపురుషః సహస్రాక్ష స్సహస్రపాత్" అని శ్రీస్వామివారి యొక్క విరాడ్రూపము పురుష సూక్తములో వర్ణింపఁబడినది.

రత్నహారములో నంతర్గతముగ దారమున్నట్లుగ శ్రీస్వామి సర్వచరాచర జీవులయందు నంతర్యామిగనున్నాఁడు. అనగా శ్రీ స్వామి సర్వజీవ స్వరూపుఁ

డని విశదమగుచున్నది. పైనఁజెప్పిన శ్రీ స్వామివారి విరాడ్రూపము ఆ క్షేత్రములో నిరంతరము సందడించు జనకదంబములోఁ గనుపించును. కనువిచ్చి చూచినచో నా తిరుమల నిజముగా వైకుంఠమే. ఆ క్షేత్రాధిపతి సాక్షాత్ వైకుంఠవాసుఁడైన శ్రీమన్మహావిష్ణువే. వైకుంఠవాసుని తిరుమలలోఁజూడఁగలిగిన మనము ధన్యులము.

ఆ విధముగా శ్రీవేంకటేశ్వరస్వామి రాజధాని యందలి లౌకిక పారలౌకిక విశేషవిషయములను దర్శించి చరితార్థులమైతిమి. అక్కడున్నంతసేపు భక్తిభావ బంధుర హృదయులమై బ్రహ్మానంద మందితిమి. పిమ్మట భక్తసులభుఁడు పరమ కారుణ్యమూర్తియైన యా దేవాది దేవున కభిముఖుఁడనై యిట్లు మనవిచేసికొంటిని.

రాళ్లగుట్టలపైన రాణించుచున్నను
వెన్న మనస్సుతో వెలయువాఁడ
చూడకున్నను భక్తు నీడగా వెన్నంటి
వేలిచ్చి నడిపించు ప్రేమమూర్తి
ఏనభక్తుఁడు భక్తుఁడేనయంచును బల్కి
భక్తుల నెదఁజేర్చు బాంధవుండ
కోటానుకోట్ల సంకోచమ్ము లేక యే
సంస్థలకిచ్చు నిస్స్వార్థ జీవ.

మహిమల దర్శించి నీ దివమూర్తి మిమ్ము
సార్థకమ్మయ్యె నింద్రియ సమితి యిపుడు
వెళ్ళివచ్చెద దేవ! నిన్విడిచి నేను
వెళ్ళలేనయ్య! వచ్చెద వేంకటేశ!

ఊపిరి నిచ్చితి వీ వీ
యూపిరి నిలఁబెట్టు ధర్మమున్నది నీ కీ
యూపిరి నీదిగఁ జేకొను ?
టే పనియయ్య వేంకటేశ్వర నీకున్.

వయసును పైబెనపడ్డ దిఁక పాదులుదప్పెను దేహబంధముల్
మెయినడయాడ లేదు స్థిర మేధ చలించెను శేషజీవితాఁ
ధ్యయనము పాలుపోదు నను ధన్యునిఁజేయుము వేంకటేశ్వరా !
అయములఁగూర్చి చిక్కుల లయంబున శాంతిని నిమ్ము మాపతీ !

అమ్మను నీ కొమ్మను మం
గమ్మను జగదంబఁజూచి గమ్యమరుగు దిం
కిమ్మా ! యనుమతి, నతుల శ
తమ్మును నర్పింతు నన్ను దయతోఁ బ్రోవన్.

అట్లు జగదంతర్యామిని యథార క్తి యథాశక్తి యథాభక్తిఁ బ్రార్థించి సెలవు తీసికొని బహిర్ద్వాలయ మరుదెంచి యట నగయానము నధిరోహించి దిగువ తిరుపతికిఁ జేరితిమి. అసలే పర్వతారోహణము- వక్రాతి వక్రమైన మార్గము- తీవ్రమైన బస్సు వేగము- ఆ పరిస్థితులలో మేము సరిగాఁ గ్రిందకుఁ జేరఁగల మా ? యను సందేహము కలుగకపోలేదు- సర్వేశ్వరుని యనుగ్రహ మున్నచో నెట్టి ప్రమాదము రా దన్నది ప్రసిద్ధ వచనము.

దిగువ తిరుపతిలో శ్రీ గోవిందరాజ స్వామి యున్నాఁడు- ఆ స్వామి యాలయ ప్రాంగణ మతి విశాలముగనుండును. ప్రాకారమును దాఁటి లోపలకుఁ బోవునప్పుడు గ్రామాంతరము పోవుచున్నట్లే యుండును- ఆ దైవము- శ్రీ వేంకటేశ్వర స్వామివారి యపరావతారము- ఆ గోవిందరాజస్వామి తలక్రింద మానిక పెట్టుకొని శయనించినట్లుగ నిర్మింపఁబడినాఁడు- ఆ శయనము, తనను కొలిచిన భక్తులకెల్ల వరములను కొలిచి (వరములనిచ్చి) యలసి విశ్రమించుటను సూచించును- అందువలననే గోవిందరాజస్వామికి వరదరాజస్వామి యని సార్థకమైన మఱియొక నామమున్నది.

వరదరాజస్వామి దర్శనానంతరము కోదండరాముని దర్శనార్థము ఆయన యాలయమునకుఁబోయితిమి- కోదండ మనగా ధనుస్సు. ధనుస్సు రాజన్యత్వము సూచించు ముఖ్యాయుధము- అందువలననే యుత్తమ క్షత్రియుఁడైన శ్రీరాముడు నిరంతరము కొదండము ధరించుచుఁ గోదండరాముఁడైనాఁడు.

ఆలయములో నిలువెత్తున ఆయతమైన పాలరాతి సంచాయతన మున్నది పంచానాం=ఆయతనం- పంచాయతనమ్- అనగా నయిదుగురు నివసించు గృహము (గుడి) యని యర్థము- శ్రీరాముని కొలువునకుఁ బంచాయ తన మను నామము ప్రసిద్ధము.

దేవాలయములో బంచాయతనములో నారు (హనుమత్ సీతారామ లక్ష్మణ భరత శత్రఘ్నులు) మూర్తులున్నవి గదా- అపుడది షడాయతనము- (షణ్ణాం= ఆయతనం- ఆఱుగురున్న స్థానము) అగునుగాని పంచాయతన మెట్లగును- అని ప్రశ్న.

సీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు- ఐదుగురు మాత్రమే యున్నచో నది పంచాయతన పదవాచ్యమగుటకెట్టి యనుపపత్తియు నుండదు కాని తన శరీరమందలి యణువణువున శ్రీరామునిఁ బ్రతిష్ఠించుకొన్న నమ్మినబంటు అంజనా తనయుడు లేనిదే శ్రీరామచంద్రుఁడు కొలువుతీరడే- ఏ పంచాయతనమును బరిశీలించినను పవిత్రాంతరంగమైన కపిసింగము శ్రీరామ పాదాబ్జ భృంగమై దృష్టి గోచరుఁడగునుగదా- అపుడది షడాయతన మగునుగాని పంచాయతన మెట్లగును ?

సీత రాముని యర్ధాంగి- అనగా సగము శరీరము- శరీరములోఁ దక్కిన సగము శ్రీరాముడు- ఆ రెండర్ధములు (సీతారాములు) కలిసినపుడే వారిది పూర్ణ శరీరమగును- అనగా సీతారాములిద్దఱు నొక్కరి క్రిందనే పరిగణన మన్నమాట- సీతారాములిద్దఱొకరైనపుడు మఱియూ స్థానములో నున్నది. యైదుగురే యగుదురు గదా ! అపుడు పంచాయతనమునకు విప్రతిపత్తియు నుండదని సమాధానము.

ఆ యాలయము తదంతర్భాగము మనోహర శిల్పకళానిలయము- ఆ గర్భాలయములో శ్రీరామచంద్రమూర్తి కొలువు తీరినట్లే యుండును- తరువాత వేంకటేశ్వరస్వామి పోషణములో వృద్ధిపొందుచున్న శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయమును జూచి- 22-10-84 ఉదయం యలిమేల్ మంగమ్మను దర్శింప నలమేల్మంగాపురముఁ బోయితిమి.

# అలమేల్ మంగమ్మ

ది. 22-10-84 ఉదయము 5 గం॥లకే యఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుఁడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి దిగువ విడిదిని (దిగువ తిరుపతిని

వదలి శ్రీ స్వామివారి యర్ధాంగిని శ్రీ యలమేల్ మంగమ్మను జూచుటకు నలమేల్ మంగాపురము వెళ్ళితిమి. ఈ పురమునకే తమిళమున "తిరుచానూర్" అని పేరు.

"అలమేల్" మంగమ్మ యనగాఁ బుష్పమువలె సుకుమారమైన శరీరవల్లి కలది యని యర్థము. ఆ తల్లి శరీరమే కాదు. మనస్సుకూడ నటువంటిదే. అలమేల్ మంగాపురమునకుఁ దిరుపతికి మధ్యమున రెండుమైళ్ళ వ్యవధాన మున్నది. ఆ యంతరాయము గృహాది నిరంతరాయము.

ఉదయము 6 గం॥లకే మేము. అమ్మవారి యాలయ ప్రాంగణములో ప్రవేశించితిమి. అక్కడి వాతావరణము ప్రశాంతముగా నున్నది. అయ్యవారి ప్రాంగణములోనున్న జనఘోషలు గాని యతిదీర్ఘశ్రేణులు గాని యమ్మవారి ముంగిలిలో లేవు.

ఆరసాతల సత్యలోకావధికము
రాజ్యమేలెడు రాజాధిరాజు కనుక
స్వామిలోగిలి నిరతము సందడించు
వచ్చిపోయెడు భక్త సంబాధనమున.

ఆ యలమేలుమంగ దరహాసములన్ వెదఁజల్లుచున్ మహా
ప్యాయతతోడ నింటినిఁ బ్రజాళిని బ్రోచుచునుండు. నందుచే
నాయమ గేహమంతయు మహత్తర శాంతియుతమ్మె. ఉండునే?
వేయిగ రాజకీయముల వేసరు వాని గృహమ్ము శాంతమై.

వత్తురు లక్షలాది భగవంతుని వేంకట నాథుఁజూడ నా
మొత్తములో దశాంశమును బూనిక సేయరు తల్లిఁజూడఁగా
మెత్తని యమ్మయన్న భయమేరికిఁగల్గును? మాట తప్పినన్
బెత్తము నెత్తు తండ్రిఁగన భీతికలుంగదె? ఎంత వారికిన్.

తల్లిలక్క, రాయి తండ్రి, యనన్ జెల్లు
సుద్ది వినమె యది యబద్దమగునె

తల్లిసైచు నెన్ని తప్పులు చేసినఁ
దండ్రి సైఁప డొక్క తప్పునైన.

అను లోకోక్తిని విన్నవారగుట యాత్రార్థుల్ భయభ్రాంతులై
మునుగాస్వామినిఁ జూడఁబోదు రటనే ప్రొక్కుల్ సదాతీర్తు రా
వెను కేకార్యము లేకయున్న జననిన్ వీక్షింప మంగాపురం
బును దర్శింతురు. భీతి" లేని యెడ నెప్పున్ గల్గునే లక్ష్యముల్".

వచ్చిన రాకయున్న తన భక్తులఁ బుత్రులఁ గన్నతల్లి గో
ర్వెచ్చని మాటనైన నదలింపదె యక్కునఁ జేర్చుఁగాని, యే
రొచ్చమునైనఁ దల్లి తనయుండొనరించిన సైఁచు, నందుచేఁ
గుచ్చిత బుద్ధు లమ్మయెడఁ గొంత యలక్ష్యము చూపుచుందురే.

తల్లియుఁదండ్రి యిర్వురును ధాత్రిఁగనంబడు దైవమూర్తులే
తల్లియె యిద్దఱన్ ప్రముఖ దైవతమై చెలువొందుఁ. గావునన్
గల్లలెఱుంగనట్టి దయఁగల్గిన వేల్పును జూడకుండ నే
ప్రల్లదుడేగు వాని కిహ బంధము సున్న పరంబు శూన్యమే.

అట్టి పవిత్ర భావములు కలవారు జగముల తల్లినిఁ జల్లని కల్పవల్లిని శ్రీ యలమేల్ మంగమ్మతల్లినిఁ జూచుటకుఁ దప్పక మంగాపురమును దర్శింతురు- ధన్యులగుదురు.

ఇక్కడకనొక విషయమును గుర్తింపవలెను- వాస్తవముగాఁ దల్లిఁ దండ్రులిరువురునూ మానవునకుఁ బ్రత్యక్ష దైవములే- సంతతి యొక్క యోగ క్షేమముల నరయు బాధ్యత తల్లిదండ్రుల కిద్దఱకును సమానమే- కాని వారి ప్రకృతులు మాత్రము భిన్నములుగా నుండును,

తల్లికిఁగుమారుఁడు ప్రాణములలోఁబ్రాణము- ఆతఁ డాయుష్కంతుఁడై తన కన్నుల వెలుఁగై తనయింటి చందమామయై యుండుటయే తల్లికిఁగావలసినది- అందువలన నామె కుమారుని నేమాత్రము మందలింపఁజాలదు- వాఁడ సన్మార్గమునఁ గాలుపెట్టుచున్నను గట్టిగా మందలింపఁజాలదు- తూష్ణీంభావమును వహించును- వాఁడు బాధపడునేమో యనుకొనును.

తండ్రి యట్లుకాదు- తండ్రికిఁగూడఁ దనయుఁడాతని ప్రాణమే. కాని తండ్రికిఁ గావలసినది కుమారుని యాయురారోగ్యములు మాత్రమే కాదు- అంతకంటెఁ బుత్రుని- ఉజ్జ్వల భవిష్యత్తు- అందులకుఁగావలసిన చదువు సంధ్యలు- వానికి మెఱుఁగులు దిద్దు సత్ప్రవర్తనము- దానికి విలువనిచ్చు యోగ్యమైన శీలసంపద- యనునవి యత్యంత ముఖ్యములు.

తనయునిఁ దీర్చిదిద్దవలయునను నభిలాషయున్న తండ్రికిఁ బుత్రుని విషయములో నవకాశమునుబట్టి కఱకు తన మావశ్యకము- అంతియేకాని తల్లి వలె నెల్లపుడు మెత్తఁదనము పనికిరాదు.

ఆ యుద్దేశముతోనే శ్రీవేంకటేశ్వరస్వామి కరుణాసాగరుఁడైనను నాడిన మాటను దప్పిన వానిని దండించును- చెడు స్వభావము కలవానిని దురాచారపరుని శిక్షించును- ఆ శిక్షణము వానిని బాగుచేయుటకే. నమ్మెటపెట్టు పడనిదే నిప్పులోఁ గాల్చనిదే యినుము దారికి రాదుగదా.

పోనీ తండ్రిగూడఁ బ్రేమతో నాదరముతోడనే కుమారుని తీర్చి దిద్ద కూడదా ! దండిచుట యెందుల కనరాదు.

పిల్లల పెంపకంబున వివేకము కల్గిన తండ్రి, కక్కటన్
బెల్లుగఁజూవు బిడ్డలను వృద్ధికిఁదెచ్చు తలంపు పెంపునన్
మెల్లగఁజెప్పినన్ వినఁడు మీఱి చరించును బిడ్డ, పాముకున్
బెల్లుగఁబాలుపోసినను వీడునె? దుష్టనికృష్ట వృత్తులన్.

నయమునఁ బాలుంద్రావరు
భయమునను విషమ్ము నైన భక్షింతురుగా
నయమెంత దోసకారియొ
భయమే హితకారి యన్న పలు కనృతంబే.

లోకముఁదెల్ప, నొత్తిడులలో నిజసంతతి వారవారమున్
గాఁకలఁబెట్టువారు పలుగాకులుకారు, మొగలంబులందుఁ జీ
కాకును దోఁచనీక నుడికారములోపల (పంచదారలన్
దూకొని చల్లువారు హిత దూర్వహు లింతయుఁగారు చూచినన్.

హితము వికారమై నరునకించుకయున్ రుచియింపఁబోదు సం
తత మహితంబు లోకమును దానయిలోఁగొను. గాన పథ్య వా
గితరుఁడు, సొంతగాఁ జెవికింపుగఁ బల్కెడు వాఁడు- నమ్మనే?
హితకరు మేక, కుత్సుక గ్రపించెడు వానిని నమ్మ చావదే.

పుత్రుని భావిజీవితము పొంపిరి వోవకయుంట కెంతయో
మాత్రముఁజెంది తండ్రి కఠినాత్ముఁడుగాఁగనుపించు దల్లి యే
మాత్రము బిడ్డ కస్తినిఁ బ్రమాదము నోర్వక పట్టయున్కనే
నేత్రములందు నిల్పు. జననీ హృదయార్ద్రిత, ప్రేత కందునే?

కఠినుఁడయ్యుఁదండ్రి గౌరవనీయుఁడే
అమ్మ పూజ్యురాలె యమృత హృదయ
త్రోవ వేఱుగాని భావము లొక్కటే
యిద్దఱకును బిడ్డ వృద్ధిఁగనుట.

చెప్పు డిపుడు తండ్రి చెడ్డవాఁడా! తల్లి
తండ్రికంటె మంచిదగున ! ? మందు
తేనెలందు నేది న్యూనముఁగాబోదు
గతులు వేరు వాని గమ్యమొకటె.

భగవంతుడు కరుణామయుఁడు- సర్వ జీవులను దన బిడ్డలనుగానే ప్రేమిం పఁగల సమతా భావముకలవాఁడు, అయినను నవతారములనెత్తి దుష్టులను శిక్షించు చున్నాడు- ఈ దుష్ట శిక్షణయే సాధురక్షణమునకు హేతువగుచున్నది- ఈ దుష్ట శిక్షణము దుష్టరక్షణమునకుఁగూడ హేతువగుచున్నది- తన బిడ్డఁడొకఁడు దుర్మార్గుఁడైనపుడు వానిని దండించి పాపవిముక్తుఁజేసి తన సాన్నిధ్యము వాని కిచ్చుట దుష్టరక్షణమే యగునుగదా.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంరక్షణార్థాయ సంభవామి యుగే యుగే.

అను గీతాశ్లోక మీ భావమునే సమర్థించు చున్నది.

శ్రీ భాగవతము కూడ "మర్త్యావతార స్త్విహ మర్త్య శిక్షణమ్" అని యవతార ప్రయోజనమును నిర్దేశించినది. ఇచ్చట "శిక్షణ" పదమునకు దండించుట- తీర్చి దిద్దుట- అను రెండర్థములున్నవి- అనగా భగవంతుఁడు తన పుత్రులతోఁ జెడుగున్నచో నా చెడుగును దండనము ద్వారా తొలగించి వారిని యోగ్యులను జేయునని స్పష్టార్థము- ఏతావతా తల్లిదండ్రులిద్దఱు పిల్లలకు సమాన గౌరవనీయులే యగుదురని ఫలితార్థము దూరాలోచనగలవారీరహస్యమును గుర్తించి తల్లిదండ్రులను సమానముగానే గౌరవింతురు- ఆ నీర్ఘము నుప్రహాస్యము చేయువారు (దురాలోచన) మాత్రమే యయ్యవారినిఁజూచి యమ్మను జూడకుండ వెళ్ళుచుందురు.

## శక్తి పీఠములు :

భారతదేశములో ననేక శక్తి పీఠములున్నవి- ఆ పీఠములు 108 అని కొందఱు 24 అని కొందఱు 21 అని కొందఱు 18 అని కొందఱు పేర్కొను చున్నారు- ఆ విభాగములలో 18వ విభాగమే యుక్తమైనదని పరిశీలకుల యభిప్రాయము.

శక్తి పీఠములలో శ్రీ మంగమాంబా దేవ్యాలయ పీఠమొకటియఁట ఈ పరిగణనము వలన- శ్రీ మంగమాంబ పీఠాంతర దేవతలైన మధుర మీనాక్షి కంచికామాక్షి మొదలగువారివలె- మహాశక్తి సమన్విత- భక్త వరదాన దీక్షిత యని స్పష్టమగుచున్నది.

శక్తి పీఠము- అను పదము వినగానే మనకు శైవ సంప్రదాయమే బుద్ధి గోచరమగును- ఇది సామాన్యభావము- మూలశక్తిని గుఱించి విచారించినచో నచట శైవ వైష్ణవముల భేదము కానఁబడదు- శక్తిస్వరూపమంతయు నొకటియే మఱియు- నారాయణి- భార్గవి మొదలగు పదములు- లక్ష్మి పార్వతీ పదములకుఁ ర్యాయ పదములై (శై వైష్ణవముల యభిన్న తత్త్వమును ప్రతిపాదించు చున్నవి-శక్తి పీఠమనగా- నది శైవము కావచ్చును వైష్ణవము కావచ్చును అనునది విశేష భావము- ఈ భావానుసారమే శక్తి పీఠములలో- కామాక్షి- మీనాక్షి- మొదలగు శైవశక్తులతోఁబాటు వైష్ణవ శక్తులైన- శ్రీమహాలక్ష్మి కొల్హాపూర్) సీతాదేవి (జనక్‌పూర్) రుక్మిణీశక్తి (ద్వారక) అలమేల్ మంగమ్మ

(తిరుపతి) మొదలగువారికి గూడ స్థానము లభించినది. అలమేల్ మంగాపురము నకే తమిళములో తిరుచానుర్ అని పేరు.

యజ్ఞసభలో దక్షుఁడు మేరమీఱి శివ దూషణమును జేసినాఁడు- భర్తృ నిందను వినలేక సతీతిలకమైన సతీదేవి దేహత్యాగము చేసినదఁట- పవిత్ర వంతములు తేజోవంతములైన యామె యస్థి శకలములను భక్తులెన్నియో ప్రదేశములందు నిక్షేపము చేసినారఁట- మహాత్ముల శరీరములో నణువణువు శక్తివంతమే కదా. అందువలన అస్థి శకలములున్న యా ప్రదేశములన్నియు మహా క్షేత్రములై సమస్త పాప పరిహార దక్షములై- అఖండ ప్రభావ ప్రదర్శకములై విరాజిల్లినవఁట మహాశక్తి- అస్థి ప్రభూతములగుటచేత నా క్షేత్రములకు శక్తి పీఠములని ప్రసిద్ధి లభించినదట- మహాశక్తీనాం- శక్తిరూపిణీనాం మహా దేవతానాం- పీఠాః- స్థానాని- మహాశక్తి పీఠాః- అని విగ్రహము- అనగా శక్తి స్వరూపిణులైన మహా దేవతలుండు స్థానములు- అనిస్పష్టార్థము.

మేము మంగమ్మతల్లి ప్రాంగణములోఁ బ్రవేశించు నప్పటికే యరుణ కిరణుఁడు తన సుకుమార సుందర బాలకిరణములతో జగదంబ గోపురాగ్రమునకు బంగరు పూఁతలఁ బూయుచున్నాఁడు- యంత్రజలము ప్రాంగణ ప్రదేశమంతయుఁ బరిశుభ్రము చేయుచున్నది. జలార్ద్రమైన యా ప్రదేశ మాఱుటకై చిఱుతెమ్మెర మెల్లగాఁజల్లగా వీచుచున్నది- పృథివి, సహజ కాఠిన్యమును వదలి జలసేచనము వలన మృదు తనువై పరిమళములఁ జిందించుచున్నది- రాత్రి యంతయుఁ పైఁగ్రమ్మిన హిమసంతతి యమ్మవారి యాలయముపైఁ గట్టిన సితవితాన సౌందర్యమును సంతరించుకొన్నది ఆకాశము నిర్ధూమమై దిశలను విశదముల నొనర్చినది. ప్రతిదినము ప్రభాత కాలములోఁ బంచభూతములు పైవిధముగా జగన్మాతను సేవించు చుండును. ఆ శుభముహూర్తమునకే మేము పవిత్ర పుణ్య భూమిలోఁ బ్రవేశించితిమి. అక్కడఁగూడ నొక పుష్కరిణి యున్నది.

ఆలయ ప్రాంగణమునఁ గోనేరుండుట సామాన్యము- "దైవదర్శనము నకుఁబోవువారు స్నాతులై పునీతులై పోవలయును- స్నానము చేయకపోయినను కనీసము కరచరణ ప్రక్షాళనమునైనను విధిగాఁజేసి దైవదర్శనము చేయ వలయును- అను నియమమును ఆ కోనేరులు సూచించుచుండును.

అమ్మవారి యింటిముందున్న భక్తబృందము చిన్నది. అందువలననే యయ్యవారి సన్నిధిలో లేని దర్శన వేళలక్కడ నిబంధింపఁబడినవి. భక్తుల వరుస నాత్యల్పమగుటచేత నొక గంటలోనే మేము దేవి సన్నిధికిఁ జేరఁ గల్గితిమి. ఆ మాత.

"ఎల్లరు నా ప్రజల్ ననుభజింపఁగ వచ్చిరి. ఏరి కేవి నా
వల్ల గ్రహింప నున్నవియొ వారి ముఖంబులఁజూచి యిచ్చుచే
చెల్లును నాకటంచు" గుణసింధువు వేల్పుల గిడ్డివోలె ని
ల్వెల్ల ద్రవింపఁగన్పడె నలింప గణాధిప సేవ్యపాదయై.

ఆ జగన్మాత వదనమును నిర్నిమేష దృష్టులతో భక్తి తత్పరుఁడనై దర్శించితిని.

అమ్మముఖమ్ము షోడశ కళాఢ్యమునై వెలుగొందుచుండె. నం
గమ్ము చిరత్న రత్నగత కాంతి విరాజితమై రహించె నే
త్రములజిమ్ముచుండె ననురాగ సుధామయ దీప్తి ఫాలధా
మమ్మునఁ గుంకుమమ్ము సుషమా గరిమాశ్రయమై వెలింగెడున్.

జగన్మంగళ దాయినియైన యా మంగళదేవత మంగళాకారమును గన్నుల పండువుగా నవలోకించి.

తల్లీ! యంగమ! పుణ్యదంపతులు మీ సౌధంబులో పాపముల్
చెల్లంబోవని మే మెఱుంగుదుము సచ్చిత్తముల్ మిమున్ సృష్టి సం
ధిల్లం జేసెడు మూర్తి మూలముగ నెంతే గొప్పగాఁజెప్పరే!
తెల్లం బియ్యది యోగివర్గములకున్ దీనావనా! పావనీ!
ఆలు మగలనడుమ ననలంబు చెలరేగి
వేలు వేలుగాను మీరలుండు
రంధ్రము. మీకు నడుమ ననిలంబు జూఱలేదె!
తెలియవశమె జగదీశు మహిమ.

ఎవరు లక్ష్మి? పద్మ యెవరమ్మ? బీబినాం
చారియెవరు? వారె కారె ప్రకృతి

ప్రకృతి పురుష దివ్య బంధము లౌకిక
బంధమగునె ? యట్లు పలుకనగునె ?
వచ్చిన భక్త సంతతికిఁ బారము ముట్టిన ప్రేమతోడ సం
పచ్చయ మిచ్చి పంపి యెదఁబండిన ప్రేమముతోడఁజూపఁగా
వచ్చునటంట నీ పతి విభావరి నీ సదనంబుఁ జేర. నిన్
మెచ్చునటంట తల్లి ! యలమేలు సతీమణి ఎంత ధన్యవో.
తండ్రినిన్ జూచి నీపాద దర్శనమును
జేయవచ్చితి మమ్మ ! ఆశీస్సులిమ్మ !
అమ్మ ! మంగమ్మ ! నీ బిడ్డలైన మమ్ము
దయను గనుమమ్మ ! అదె మా నిధానమమ్మ !
నిఖల మేలెడు నా జగన్నేత కెపుడుఁ
దీరికుండదు మా మొరల్ చేర వినఁగ
సమయ మారసి చెప్పవమా ! సదయ హృదయ
"వీఁడు మనవాఁడ" టంచు నీ ప్రియునితోడ.

అని యాజనయిత్రిని స్తుతించి యథాశక్తి నాశక్తి నర్చించి తీర్థప్రసాదముల స్వీకరించి యామె ముంగిలిలో నున్న యితర దేవతా మూర్తులను సందర్శించి యా తల్లిదగ్గఱ సెలవు తీసికొని యాలయము బయటకు వచ్చితిమి.

ఆ తల్లి సన్నిధిలో నున్నంత సేపు మాకుఁగన్న తల్లి యొడిలో నున్న బిడ్డల యనుభూతి కలిగినది.

ఆవునెడఁబాసి దూడలు పోవునట్లు
తీవలన్ వీడి రాలెడు పూవులట్లు
వదలి మంగమ్మ తల్లిని వచ్చినాము
మనసు రాలేదు త్రిభువనమాత వదలి.

తరువాత నాడంబరములకుఁదావీయక గుండెలో గూడుకట్టుకొన్న నిజమైన భక్తికే పట్టముఁగట్టిన శ్రీకాళహస్తీశ్వరుని దర్శనము కొఱకై శ్రీకాళహస్తి కభిముఖులమైతిమి.

# శ్రీ కాళహస్తి

శ్రీ ఆలమేల్ మంగాపురమునుండి ఉదయము 9 గం॥లకు బయలుదేరి- 11 గం॥లకు శ్రీకాళహస్తి క్షేత్రముఁజేరితిమి. అది ప్రసిద్ధ శైవక్షేత్రములలో నన్యతమము.

ఈ క్షేత్రనామము చరిత్రను బట్టియే యేర్పడినది. ఆ సార్థకనామమా క్షేత్రపతియొక్క భక్త పరతంత్రతను వెల్లడి చేయుచున్నది.

తరతమ భేదముల్, పశుకదంబము నార మటన్న శంక, యం
తరమున ఁబార్వతీపతికిఁ దథ్యము లేదు. హృదంబుజంబు నె
వ్వరు మనసార స్వీయ పదపద్మములందునఁ గానుకపెట్ట నెం
తురో తనవారు వారని యదూద్వహిఁడాఁడడె యుద్ధ భూమిలో.

ఆ నుడికారమున్ దన గృహంబున సార్థకమున్ బొనర్ప నీ
శానుఁడు సాలె సర్పగజ సంస్కృతులన్ గల వెల్గుఁజూచి య
వ్వానికి మోక్షమిచ్చె. నదిపాటిగ నయ్యది క్షేత్ర తీర్థ సం
తానమునన్ బ్రసిద్ధిఁగనె ధారుణి నవ్యయ మోక్షదాయియై.

శ్రీకాళహస్తి భక్తులఁ
జేకొని హృదయంబునందుఁ జేర్చియు వారిన్
మేకొని మోక్షము నిచ్చుట
శ్రీకాళగ జేశుఁడనుచు శివుఁడటఁబరఁగెన్.

శ్రీకాళహస్తి మహిమను
వాకొన శక్తుండె సర్పపార్థివుఁ, డది యా
పాకారి వివిధ సురవర
లోకార్చిత ముఖిల భక్త లోకాశ్రయమున్.

చెలఁది పుర్వొక్కటి శివునిపై గూడుంచె
వర్షోష్మ బాధలు వ్రాలకుండ

భుజగంబు పాతాళ భువనరత్నములతో
　　　　శూలిమస్తకమున శోభఁబెంచె
గజరాజు కరముఖ గంగాజలముతోడ
　　　　నభిషేకమును జేసె నభవునకును
భక్తి పెంపున నీసుప్రబలమై యా రెండు
　　　　పోరాడి మడిసెఁ బురారి యెదుట.
వాని యర్చనలో వేద వాక్కు లేదు
విధి విధానము శూన్యము వెలయదింత
నిర్మలత్వము కాని తన్నిష్ఠఁ జూచి
శివుఁడె యచ్చెరు వంది నిశ్చేష్టుఁడగుచు
మోక్షమిచ్చెను వానికి దీక్షమెచ్చి.

జ్ఞాన హీనములైన శ్రీకాళహస్తులకు హస్తమిచ్చి యాదరించి యక్కునఁ జేర్చుకొన్న యా కాళహస్తీశ్వరుని భక్తవాత్సల్యము జగత్ప్రసిద్ధము.

శ్రీశ్చ కాళశ్చ హస్తీచ శ్రీకాళ హస్తయః (బహుపదద్వంద్వః) తేషాం ఈశ్వరః- మోక్షప్రదానే సమర్థః శ్రీకాళహస్తీశ్వరః- శ్రీకాళహస్తులకు మోక్ష మిచ్చిన ప్రభువు- లేక

శ్రీకాళహస్తీనాం సంబంధి క్షేత్రం- శ్రీకాళహస్తి- తస్య తన్నామక క్షేత్రస్య- ఈశ్వరః- ప్రభుః శ్రీకాళహస్తేశ్వరః శ్రీకాళహస్తి యను పేరుగల క్షేత్రమునకధిపతి.

శ్రీకాళహస్తీశ్వరాలయము సువర్ణముఖీ నదీతీరమునయున్నది- ఇచ్చట పరమేశ్వరుఁడు పశ్చిమాభిముఖుఁడై యున్నాఁడు- సాధారణముగా దైవము పూర్వాభిముఖుఁడై యుండును- సువర్ణముఖిని గుఱించి యొక కథయున్నది.

వింధ్యాద్రి యొకప్పుడు బలదృప్తమై మేను పెంచసాఁగినది- అట్లు నిరవధికముగాఁ బెరిగిన వింధ్య పర్వతము చుక్కలనంటి సూర్యచంద్రుల గమనమున కవరోధము కల్గించినది- అందువలన భూమండలమున కొకప్రక్క నెల్లప్పుడు పగలు మఱియొక ప్రక్క నెల్లప్పుడు రాత్రి యేర్పడినవి- ఈ

విపత్కర పరిస్థితికి లోక మాకులమైనది- వింధ్యుని యౌన్నత్య మణచుటకు లేక అపుటకు నెందఱో పెద్దలు ప్రయత్నించినారు- వింధ్యుఁడు వారి మాటలను బెడఁజెలినిఁబెట్టినాఁడు.

వింధ్యమునకు గురువగస్త్య మహర్షి - గురువన్న వింధ్యున కమితభక్తి- అది తెలిసికొన్న పరమేశ్వరుఁడు కాశిలో తపస్సు చేసికొనుచున్న కుంభసంభవునిఁబిలిచి యెట్లైనను వింధ్యుని గర్వమడచి సూర్యచంద్రుల గమనమున కాను కూల్యము గల్పింపుమని యాదేశించెను.

అగస్త్యుఁడు చాల పొట్టివాఁడు- అందువలననే పొట్టివానిని గుఱించి చెప్పునప్పుడు "వాడు" అగస్త్యభ్రాత- అని యనుచుందురు- అనగా అగస్త్యుని కంటెఁ బొట్టివాఁడని భావము.

అగస్త్యుఁడు పొట్టివాఁడైనను బహుగట్టివాఁడు- వింధ్యుని మదమణచుటకు నొక యుపాయ మాలోచించుకొని లోపాముద్రా (అగస్త్యుని భార్య) ద్వితీయుఁడై దక్షిణముగా వింధ్యపర్వతమునకభిముగా బయలుదేరినాఁడు.

అత్యున్నతుఁడైన వింజము గురుమూర్తిని జూచి, అపార పారావారమును జుఱికించిన గురువుగారి మహిమ గుర్తుకురాగా బాగిలబడి గురువుగారికి నమస్కరించి గురుదక్షిణ కోరుకొమ్మని ప్రార్థించెను ఉపాయశాలియైన పొట్టిముని తాను తిరిగి వచ్చువఱకు నట్లే బాగలిపడి యుండుమని చెప్పియట నుండి దివ్యస్థలమైన శ్రీకాళహస్తికి వెళ్ళెను- అగస్త్యుడు తిరిగి యుత్తరమునకు రానూలేదు వింధ్యుడు పైకి లేవనూలేదు- ఆ విధముగా సూర్యచంద్రుల మార్గము సుగమమైనది- లోకములు నిరాకులములైనవి- అగస్త్యుఁడు శ్రీకాళహస్తిలోనే నివాసమేర్పఱచుకొనిఁబరమేశు నారాధించుచుండెను. శ్రీకాళహస్తికి దక్షిణ కైలాసమను ప్రతీతి యున్నది.

ఒకనాఁడు కుంభసంభవుఁడు మహేశ్వరుని దర్శించి "భక్తవత్సలా! ఇంతః పూర్వము వారణాసిలో నివసించునాకు ననుష్ఠానానుకూలముగా భాగీరథీనది యందు బాటులో నుండెడిది- ఇపుడిచ్చట ననువైన ప్రవాహము కఱవగుటచేత నాకు స్నాన సంధ్యాదులు కష్టతర లభ్యములగుచున్నవి- ఆ కొఱతను నివారింపవే దయామయా'' అని విన్నవించు కొన్నాఁడు- అది విని భక్తవశంకరుఁడైన శంకరుఁడు తన జటాజూటమును నిదలింప నందుండి యొకస్రోతస్విని వినిర్గతమై

యగస్త్యునకు నచటి ధరణీరమణికి మానసోల్లాసమును గల్గించినది. ఆ నదియే తరువాత సువర్ణముఖి నామముతో వెలసినది

## — సువర్ణముఖి —

ప్రవాహములు ద్వివిధములు- నదులు- నదములు అని. నదులు ప్రాఙ్ముఖములుగాఁ బ్రవహించుచుండును- నదములు పశ్చిమాభిముఖములై సాగరుని యొడి నలంకరించును- సువర్ణముఖీ ప్రవాహము మాత్రము నదీ నద భిన్నము- ఆ ప్రవాహ ముదఙ్ముఖియై సంధించి విడిచిన బాణమువలె దూసికొని పోవుచుండును.

సువర్ణముఖి ఆ శరద్గ్రీష్మపర్యంతము నీరసయౌట నీరసముగా గమించుచుండును- శ్రావణ భాద్రపదములలో మాత్రమే యది సరసయై సరసముగా నడయాడుచుండును- అందువలన నా ప్రవాహమును బెనువాగుగాఁ బోల్చవచ్చును- సెలయేఱంతేకదా వర్షాసమయమునఁ బొంగుచుండును. వర్షాంతమునఁ గ్రుంగుచుండును,

ఉత్తమ జాతి మానవుని యొక్క- మనస్సునఁబుట్టుకోప మా
యత్తము కాక యొక్క-పరి హద్దును మించిన యట్లు రేఁగియున్
గత్తర యేమి సేయక పొకాలునఁబోవు క్షణద్వయంబులో
సత్తువఁబాసి, యట్లెయగు స్వర్ణముఖీనది వెల్లువెప్పుడున్.

అందువలన స్వర్ణముఖి యల్పకాల జీవనయైనను ననల్ప జీవనగా నుత్తమ తత్త్వము కలదిగానే వాసికెక్కినది- కావుననే యా జలస్పర్శ పాపహారిణి యగుట.

స్వర్ణముఖి నదీనద భిన్న ప్రవాహము కలదియైనను నదీ సామాన్య సంబంధముచేత నదిగానే వ్యవహరింపఁబడుచున్నది

ప్రావృట్కాలమందే స్నానయోగ్య యగు నానది తదన్యకాలమందు వేణీ మాత్రప్రవాహ యగుటచేత స్నానమునకుపయోగింపదు- అప్పుడు తైర్థికులు చెంబులతో నీళ్లముంచి పోసికొందురు వేసవిలోఁ జెంబు మునుగు జలములేనపుడు గుంటలను ద్రవ్వి యక్కడ ఊరిన నీటితోఁదల తడుపుకొందురు-

సువర్ణం ముఖే= అగ్రభాగే- యస్యాః సా- సువర్ణముఖి- అనగా నెచ్చటఁ

బైభాగమున సువర్ణముండునో- ఆ నది సువర్ణముఖి- ఈ నదికా నామము కలిగిన విధమిది.

కొండొక కాలమందున నఘోర మహోగ్ర విరూపచక్షు వా
దండను నుండె నాశ్రయము దారసుతాదులు లేక తిప్పుడై
యెండకు వానకుందడిసి, యింపుగ వానికి గొప్ప గూలయం
బండగ నుండఁజెయఁగ ధరాధిపుఁడొక్కఁడు భావమందునన్.

తర్కము చేసి శిల్పుల నుదారుల దారు కళాప్రవీణులన్
గోర్కెలఁ బండఁజేయఁగల కోవిదులన్ బిలిపించి "శైవ సం
పర్కము రూపు నందఁగ నుమాధవు దేవళమిచ్చటన్ శుభో
దర్కముగా రచింపు" మని ధారుణి నాధుఁడు చేసెఁగట్టడిన్.

ఆ రాజు నారాయణ నగరాధిపుఁడైన యాదవ భూపతి- ఆతఁడు పరమేశ్వరాజ్ఞచేత నాలయ నిర్మాణమునకుఁ బూనుకొని యా కార్యక్రమమును జేపట్టినాఁడు- అంత.

వేలకు మించు శిల్పులు వివేకులు చేతులఁగన్నులుంచి ని
ర్వేల సుమేధలన్ గఱుగ వేచి శివాలయ నిర్మిమీాపతోఁ
గాలముయానమున్ మనసు కందని రీతిగఁ గార్యదక్షులై
హేలఁగఁ జేయఁ బూనిరి మహేశ్వరు నాలయ కార్య మాదృతిన్.

దేవాలయ నిర్మాణము నిరంతరాయముగ సాఁగుచున్నది- మహారాజు తన చేతికి నెముకలున్నవన్న సంగతి మఱచిపోయి యాలయ నిర్మితికి రెండు చేతుల ధనమును వ్యయము చేయుచున్నాడు- ఎంతకొండయైనను ప్రతిదినము కొన్ని రాళ్లను దీసివేయుచున్నచో నెంతకాలము స్వస్వరూపమును బోషించుకొనఁగలదు? చివఱకు దిబ్బకాక తప్పదుకదా- నిరంతర ధన వ్యయమువలన మహారాజ కోశముకూడ శూన్యము కాకతప్పలేదు.

కఱఁగెను శిలాప్రపంచము
కఱఁగెను ధనసంచయంబు, కార్మిక దీక్షల్

కఱఁగెను జీతము లందక,
కఱఁగెను శివదేవ నిలయ కర్మలు, వరుసన్.

జీతము బత్తెమునేన్నక శిల్పుల దొక్కలు మాడె, టంకముల్
వాతులు విప్పకుండె, బరువయ్యె శిలావళి శిల్పి చేతికిన్,
భూతల నాథుఁ డీ ప్రలయమున్ గమనించుచు భూతనాథుపైఁ
జేతము నిల్పి యాతని భజించె భుజింపక ధ్యాననిష్ఠుఁడై.

బోళాశంకరుఁడంతటఁ
బాలింపఁగఁదలఁచి భక్తుఁ బలికెన్ గలలో
ఆలయము కర్మకరులకుఁ
జాలిన జీతంబులిచ్చు సర్వము, నదియే.

ఏదిన మెంతకర్మ విచికీర్షువు కార్ముఁడు చేసి యంతఁ దా
నేదిన కార్మికుండునయి యేగుచుఁ జేనిసుకెంతదాల్చునో
ఆ దినకర్మకున్ దగిన యంత సువర్ణము వానికందు నీ
మాదిరి దేవళమ్ము పని మానకసాఁగును ధైర్యమూనుమా!

అష్ట సిద్ధుల కధినాథుఁడైనవాని
యిష్ట కర్మము దేవళ మెదిగిపోయె
పోష్ట సంతృప్తి నందెను. బొందెను ధుని
స్వర్ణముఖి యన్న నామము సార్థకమ్ము.

స్నానార్థులమై మేము మా ముఖములను సువర్ణముఖి కభిముఖములనుగాఁ జేసితిమి. కాని యా ఝరిలో జల మల్పావశేషమైయున్నది. అందువలన "అపవిత్రః పవిత్రోవా" అను మంత్రము చెప్పుకొని సువర్ణముఖిలోని జలమును శిరమున ప్రోక్షణము చేసికొని తావన్మాత్రముచేతనే పవిత్రులమైనట్లుగా భావించుకొని దైవదర్శనమునకు వెళ్ళితిమి.

శ్రీకాళహస్తీశ్వర ప్రాంగణము కూడ నతివిశాలమే. ప్రహరీగోడ తాళప్రాంశువు. శైలపటిష్ఠము.

ప్రహరీకిఁ బ్రాగ్భాగమున సింహద్వారమున్నది. అది మన దేశమునకు నుత్తరమున హిమాలయములో నున్న "కైబర్" కనుమ వంటిది. దానిపై నొక గోపురమున్నది. అది దశనారికేళోత్తుంగము. శైలపరిణాహము. ఆ గోపురము నఖశిఖ పర్యంతము అద్భుత శిల్పలక్ష్మీ వివిధ పదవిన్యాస దృశ్య మనోజ్ఞము.

ఆ మహోన్నత ప్రాకారమునకు నాల్గువైపుల నాలుగు గోపురములున్నవి. అవి ప్రధాన గోపురాపేక్షచేత చిన్నవైగని సహజముగాఁ బెద్దవే.

ప్రాంగణము దాటి దేవాలయ ముఖమునఁ బ్రవేశించితిమి. ఆ ప్రవేశించుట యే పాతాళములోనో ప్రవేశించుటగా నాకుఁదోఁచినది. ద్వారమును దాటి యిరువది బారల దూరమేగితిమి అక్కడ.

తూణీరంబును వీఁపుపై నిలిపి ప్రాదుర్భూత శౌర్యంబు నాఁ
గానన్ వచ్చెడు మోము దీప్తి వెలుఁగన్ గక్షాంతరంబందునన్
బాణ ప్రేరకమున్ ధరించి యటవీ వాసాంకముల్ ముద్రలై
కానంబట్టెడు విగ్రహం బొకటి మాకఁదోఁచుకిన్ విందుగా.

పోతఁబోసిన యినుమట్లు భూతపతికి
నమ్మఁదగినట్టి ప్రమథగణాదిపురుషుఁ
డనఁగ రెండు ధనుస్సుల యంత యెత్తు
కలిగియున్నది కనఁబడె కలిమి కలది.

అదియే తిన్న నిరూపము
కదలని శివభక్తి రూపుఁగన్నది కంటిన్
జదివి పినాకికి నిచ్చిన
పిదపన్ గన్నప్పయన్న పేర్గనినదియున్.

తిన్నఁడొక పుళింద నందనుఁడు చిత్తశుద్ధికిఁ బట్టము కట్టిన గట్టి ప్రాకృత భక్తుఁడు. అతనిదొక విచిత్రగాథ. మఱపురాని కమ్మని బోధ. ఎదలఁ గదలించి యుఱ్ఱూతలూగించఁగల కమనీయ బాధ. ఈ చరిత్ర ఈశ్వరునకు నాలయప్రాకారము లేర్పడగక ముందు జరిగినది.

## తిన్నప్ప — కన్నప్ప

అదియొక మహారణ్యము. ఆయరణ్య మధ్యమున నొక యుత్తుంగ మహీధరము. ఆ కుధరశృంగముకూడ నతిగహన గుహాసంకులము. నానావిధ హింస్రక జంతు సంతాన నిబిడము.

ఆ శిఖరి మధ్య కాంతారములో నివాసమేర్పఱచుకొన్నాఁడొక కొండవీటి జంగము. ఆయనకు నిల్లులేదు. వాకిలిలేదు. ఇల్లాలులేదు. చుట్టములు పక్కములు లేరు. ఒక కల్జువ్విక్రింద నెండకు నెండుచు వానకుఁదడియుచు నొంటరిగా "బిక్కు బిక్కు" మనుచుఁ గాలక్షేపము చేయుచున్నాఁడు. ఆతడొక నిరుపేద. ఆయన దిగంబరుఁడు. ఎగుడు దిగుడు కన్నులుకలవాఁడు.

ఒకనాఁడు తిన్నఁడు,, మింటఁబాఱు పక్షినిఁ గోలఁగూలనేయ గలవాఁడు. కత్తివాటుకు మొక్కవోని యయశ్శరీరుఁడు. అజ్ఞానావృతమైన చిద్రూపమువలె. కిరాత దేహాచ్ఛాదితమైన ఆధ్యాత్మిక హృదయ జ్యోతికలవాఁడు. మృగ యా వినోదార్థమై యా ఘోర విపినమునఁ గ్రుమ్మరుచు నొక కటిక కిటిని వెంటాడుచు వచ్చి వచ్చి జువ్విగీము వానినిఁజూచినాఁడు. చూచుటయే తడవుగా వానికిఁగను పొర తొలఁగినది.హృదయ కవాటము విచ్చుకొన్నది. ఎడద దివ్వె కనువిచ్చినది. ఆ కాంతిలో నాతని సంస్కార కుసుమము శత దళములతో విరిసినది. అపుడా భిల్లుఁడు. ఆర్తి పెల్లుబకగా నిట్లన్నాఁడు.

ఓ దేవా! ఇట నొంటి సుండఁదగునా? ఉగ్రాటవీ భూమి నీ
కేదైనన్ గలుఁగన్ సహాయపడు వా రేరీ ప్రదేశంబునన్
వాదుల్ పైఁగొనఁ గోపగించి యెటు నీ వామార్ధమున్ వీడి నీ
వా దిక్కెనను లేక యుండఁగలవయ్యా ఘోర వన్యస్థలిన్.
"అంగట నన్నియుండియును నల్లునినోట శనైశ్చరుండు నుం
డుంగద" యన్న సామెతకు నోయి శివయ్య! నిదర్శనంబు నీ
కుంగల యీ యరణ్య. మెటుఁగ్రుంగిరి నీకగువారు నాకెదో
బెంగగ నున్నదయ్య నిరుపేదను నిన్ననుగొన్న యంతటన్.
నీకును నాకుఁ గన్పడదు నిక్కపు బంధము చూడ నీ జనిన్,
నా కనులందు నిన్నుఁ గనినంతన వెచ్చని నీరమూరె సా

మీా! కరుణించి నా మనవిమేరకు రాగదవయ్యా! దేవ! నా
ఆకుల గూటికిన్ గహనమంతయు వెన్నెల పూచి పండగన్.

అని ప్రార్థింపఁగఁ దిన్నఁడు
కనువిప్పడు పెదవి విప్పఁగాంక్షింపఁడు మో
మునఁగన్ను కలుఁగు దేవర
కని తిన్నఁడు శివుని తీరుఁ గలఁగిన మతియై.

కూడు నీరును మాని కూర్చుండి ప్రార్థింప
ఫాలనేత్రములోన వరల సుధలు
ముక్కంటి కన్పించి ముచ్చటగాఁ దిన్నఁ
డర్పించు కఱకుట్ల నందికొనియె
అనుదినంబును దిన్నఁ డడవిలోఁ గెడపిన
మెకము మాంసము కాల్చి మిత్తిమిత్తి
కీయఁగా నాతఁ డాప్యాయముతోడ నా
హారించుచుండె నిత్యంబు మెచ్చి.

ఆహారహంబును బోయ రోగా హరునిసేవఁ
జేయుచుండగ శివునిల్లు హేయమయ్యె
ఏల హేయము కాదా? భిల్లేశు మూఢ
పూజనంబున శుచియంత పోవు కతన.

విల్లు చంకనఁబెట్టి పిపునమ్ముల పొది
కట్టి మంటలలోనఁ గాల్చినట్టి
కఱకుట్లు నింపిన గట్టి దొప్పలఁ జేతు
లందునఁగదియించి యమితభక్తి
పుక్కిటియందు సంపూర్ణముగాఁ గాంచ
నముఖి నీరము పట్టి నడచివచ్చి

పానువట్టము చుట్టివచ్చి మున్మ్రొక్కులు
ఎదిగిన మనసుతో నెదుటనిల్చి

చెప్పుకాలను ముక్కంటి శీర్షమందు
నున్న కసుమాల మంతయు నూడ్చివైచి
నోటి జలమున మనసారఁగాటి జేని
కమర నభిషేకముం జేసి కలుగ మనసు.

ఆరగింపుము శివదేవ! యాదరమున
ననుచుఁదిన్నప్ప విజ్ఞాపనంబు సేయు
నారగించును బిమ్మట హరుఁడు ప్రేమ
నిట్లు చేయుట శివభూమి యేహ్యమయ్యె.

ఇట్లు కొన్ని దినములు గడిచినవి. శివసన్నిధి యంతయు నెంగిలి దొప్పల తోను దుమ్ముతో నిండిపోయినది. శివలింగము నీటిచాటికలతో మలినమైనది. పూతి గంధము దుస్సహమైనది. ఒకనాడు.

ఒక హరభక్తుఁడు శంభుని
నికటంబున కేగుదెంచి నిర్విణ్ణుండై
సెకకంటి తనువు రోయుచు
వికటంబుగ నిట్లు పలికె వినయము వీఁగన్.

మసనము నీ నివేశనము మత్తగజాజిన మంగవస్త్రమా
విసమది కూడు పాత్ర మతిభీకరమైన కపాల మంగమం
దు నబముబూది కంఠమున దుర్భర దుస్సహసర్పహార మో
యసమ శరాంతకా! శుచియటన్నది మృగ్యము నీ గృహంబునన్.

కానీ నీ మాలిన్యము
నే నోపను గారణంబు నీవే చెపుమా
నే నందాకను గదలను
జ్ఞానప్రద యనుచుఁ బలుకు నావిప్రమణిన్.

చూచి దయఁజూపి యాశ్వాసించి యా యరపదిమోములవేలుపు తిన్నని తిన్నని భక్తిప్రపత్తిని విశదీకరించి "ఓయీ! హరద్విజుఁడా! నీవు నా వెనుక దాఁగియుండి పొరపాట్లు పొరయని ఈ మృగాజీవి హృదయ పద్మ గంధము నా ఘ్రాణింపుము- అందుఁ బరిమళములొలసెనేని యాతఁడు సద్భక్తుఁడు- అపు డాతని స్వీకరింతును- పూతిగంధము లలమిన నాతని భక్తిని నేమ దిరస్కరింతును.

శివుని వాక్యముల నంగీకరించి విప్రుఁడు శివలింగము మాటున నొదిగి యుండి తిన్నని రాకకై యెదురు తెన్నులు చూచుచుండెను.

తిన్నయ్య యథాప్రకారము శివసన్నిధినిఁజేరి యర్చించి పలలఖండము లందీయఁగా గరళకంఠుఁడు వాని నందుకొనలేదు సహజ భక్తుఁడైన దండెనంద నుఁడు గమనించి అంజలిఘటించి.

దోసంబేమి యొనర్చితిన్ దొర! ననున్ దుర్మార్గుగా నెంచి నీ
వాసం జేయవు మాంసఖండముల నీకై కానిమార్గంబులన్
గాంసింజెఁదుచు నొంటిగానిఁగని డొక్కన్ జీల్చి కార్చిచ్చులో
హేం సర్వేశ్వర! కాల్చి తెచ్చితిని. సామీ! ఏనిఁ గైకోగదే.
ఎక్కువ కాలి మాడినవ! యించుక మాత్రమె కాలి తింటకన్
జక్కఁగ లేవ! ఏయొకడో చయ్యన ముందుగ నీకుఁబెట్టె నా
యెక్కువ మాంసఖండముల నెందుకు నీదినమందుఁ దీసికో
వక్కట- యంచు బాధపడె నాటవికాగ్రణి గుండె నీరుగాన్.

మాట పలుకులు లేక యారాటపడక
మిన్నకుండెను లింగయ్య కన్నుమూసి
ఉన్న యట్లుండి యాతని కన్ను మిగులఁ
గదలనాఁగెను దిన్నయ్య కలఁతపడఁగ.

ముక్కంటి యొకకంట ముసురు నీరముఁజూచి
భక్తుఁడు కళవళపడెను భీతి
మందు లెన్నో వేసె మానక భిల్లుఁడు
నీరు కారెడు నట్టి నేత్రమునకు

గాలికి నెగిరిన పాలిపిండియు వోలె
అన్ని మందులు వ్యర్థమయ్యె నంత
నీరు కాఱుటనూని నేత్రము రక్తముఁ
జిందించెఁ దిన్నని చిత్తమనియ
కన్నె చక్కని మందు కంటికంచును నెంచి
తనకన్నుఁ బెకలించి యునిచినంత
"బాగుపడెఁగన్ను రక్తము వీఁగిపోవ"
నంచుఁదిన్నఁడు సంతోషమందు వేళ
నరుణమయ్యెను మునిమాపు నభ్రమువలె
నన్యనేత్రము కురిసెను, నరుణ జలము.

రక్తం బాగక కాఱు నేత్రమును నారాటంబుతోఁ గాంచి యే
యుక్తింగానక "పూర్వ వైద్యమును సంయుక్తంబుగాఁ జేసినన్
రక్తం బాగును బాధ కిప్పుడును నేత్రంబింపుగా నుంచ నీ
భుక్తిన్ గైకొను శర్వుఁడంచు మదిలోఁ బొంగెన్ వనేచారుఁడున్.

తన ప్రాణంబులు పోయినన్ వెఱువకే చైత్యారి సేవించు వాఁ
డనఘుం డాద్యుఁడు- ప్రాణరక్షణము లక్ష్యంబెంచి దిక్వస్త్రి పూ
జనమున్ జేసెడివాఁడు మధ్యముఁడు నౌ. స్వార్థంబు సార్థంబుగా
ముని భావ్యున్ భజియించు వాఁ డధముడే హో! పూజ్యుఁ
డాద్యుండగున్.

కర్మలు చేయుట శుద్ధికి
వర్మములుగ నుండుటకునె. భావవిశుద్ధిన్
నిర్మితి చేయని కర్మల
ధర్మము పండించు జీవితంబును ద్రుంచున్.

దేహికి దేహమేవిధము దీక్షగ రక్షణమిచ్చు నట్లె సం
దేహము లేక కర్మగత దీప్తి మనస్సును బెంచు మంచి, న

వ్యాహతశక్తి దైవమనయంబును గోరును జిత్తశుద్ధిచే
ప్రాహతమున్ బోసర్చు నితరంబును, జూచుచు బేసికంటితో.

తిన్నండంతట నిశ్చయించెను మహాదేవాంఘ్రిపద్మాంతరా-
చ్ఛిన్నాసక్త నిజాంతరంగుఁడయి గాసించెండకే, యెవ్వఁడీ
కన్నుల్ నాకొసగెన్ బ్రపంచముఁగనన్ గామేశ్వరీనాథుఁ డా
పన్నత్రాణుఁడు వాని చూపు నిలుపన్ భావ్యంబు చూపిచ్చుటే.

ఊటగ నెత్తురోడు కనునొద్దను దా నడిమూలముంచి య
ఘ్యాటవికోత్తముండు పదమందలి చెప్పును దూణినుండి ప
బ్బాటునఁగోల లాఁగి వెఱసందక గ్రుడ్డు పెకల్పఁబూనఁగా
నోటుపడెన్ జగత్తు, సకలోర్వియు స్థైర్యముఁబాసి యూఁగఁగా.

సకల లోకమాత వికలయయ్యెను జాల
వెండికొండ రాజు వీడెఁగొండఁ
జలువఱేఁడు జాఱెఁ దలనుండి తొడిబడి
కన్నుఁ బెఱుకఁబూను తిన్నని గని.

నీరదకుక్షినుండి పయనించెడు శంపనుబోలి కోల తూ
ణీరము వీడి కంటికొన నెత్తురు త్రాగకముందె దాని నా
తీరునఁబట్టె శంకరుఁడు, తిన్నని కన్నులదోయి యజ్జ్వలం
బై రససిద్ధినంది నిరవద్య మహాద్వయ మూర్తిఁజూడఁగన్.

పెడతల బాలచంద్రుఁ డరవిచ్చిన గన్నెరు మొగ్గకాఁగ సం
దడివడి సేయు గంగ శివునొదలఁబూచిన మల్లె తీవగా
బెడగగు బేసికన్ను నరవింద మరందముఁ గ్రుమ్మరింపఁగా
నుడుపతిశేఖరుండు తనయొద్దకు వచ్చినఁజూచి తిన్నఁడున్.

అడుగులు తడఁబడ నుడువులు
వెడలక పొడవడఁగి మేను వినతముకాఁగా

ఎద దడదడ పడఁగ నా
యదపిమనికి సాఁగి మ్రొక్కె నగజాపతికిన్.

తిన్నని భక్తికిఁ బన్నగధరుఁడు ప్రసన్నుఁడై యాతని కెన్నటికి దఱుగని పుణ్యలోక నివాసమిచ్చినాఁడు. శివబ్రాహ్మణుఁడును దిన్నని హృదయ సౌందర్యమున కంజలి ఘటించినాఁడు. అది మొదలుకొని తిన్నయ్య కన్నయ్యగా నామాంతర మందినాఁడు.

తిన్నని వర్తన నందుటఁ
దిన్నఁడుగాఁ బేరుపొంది దేవరకొలుకై
కన్నిచ్చుట నదిమొదలుగ
దిన్నడె కన్నప్పయయ్యె దివిజులు మెచ్చన్.

పార్వతీ పతియుఁ దిన్నప్ప ప్రగాఢ భక్తికిఁ బరవశుఁడై కరుణాళువై.

తిన్నా! నీ మధురార్ద్రి భక్తి మధుపాథేయంబు నీ యాత్రలో
కన్నా! తోడుగనుండురా! సహజ భక్తాగ్రేసరా యింక నా
కన్నన్ మించుగ నర్చనార్హతను నీ కందింతుఁ గైకొమ్మురా
కన్నా! నా తలచావడిన్ నిలువరా! కన్నాపలన్ నీవవై.

అని యా భక్తుని తన యాంతరంగికునిగా నాదరించినాఁడు పరమేశ్వరుఁడు. అందువలననే శ్రీకాళహస్తీశ్వరాలయమున మునిముంగల తిన్నని విగ్రహము నిలుపఁబడినది. భక్తులు తొలుత నా భక్తశేఖరున కభివాదముచేసి యావలనే చంద్రశేఖరు నర్చింతురు. భక్తవత్సలుఁడైన పశుపతి తిన్నని భక్తికి ముగ్ధుఁడైన హరద్విజునిఁగూడ ననుగ్రహించెను.

ఈ కాళహస్తీశ్వరస్వామి, తిన్నప్ప సేవించిన యీశ్వరుని యపరావతారమఁట. తిన్నని హృదయాధినాథుఁ డా ప్రక్కనఁగొండపై గడియెడు దూరములోఁ జిన్నగుడిలో నున్నాఁడఁట. క్రిందివారి కా గుడి కనుపించుచునే యుండును. ఇది తిన్నని దివ్య చరిత్ర.

ఇంతకూ కన్నప్ప ఎవరను కొంటున్నారు. మహా యోగీశ్వరులకుఁగూడ సిద్ధింపని ఈశ్వర సాయుజ్య మక్షర జ్ఞానములేని యా బోయవానికెట్లు లభించిన దనుకొంటున్నారు.

తిన్నప్ప పూర్వజన్మములో నర్జునుఁడు- పార్థుఁడు శ్రీకృష్ణభక్తుఁడే- అయినను నాతని భక్తి నవవిధ భక్తులలో నెనిమిదవదియైన సఖ్యమువఱకే యెదిగినది- చివరి భక్తి ఆత్మనివేదనము- అనగా త్రికరణ శుద్ధిగా నాత్మశరీర పద్మమును భగవత్పాద పద్మములకు సమర్పించుకొనుట- అంతటి త్యాగమును పాండవ మధ్యముఁడు చేయలేక పోయినాఁడు- అందువలన గిరీటికి ఆ జన్మములో మోక్షము రాలేదు- ఆ కొఱవ పూర్తిచేసికొనుటకే తిన్నప్పగా నవతరించిన- కిరీటి తన జీవితమును పరమేశ్వరునకు నివేదనము చేయఁగలిగినాఁడు- సాయుజ్యమును బొందినాఁడు.

శ్లో॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం
తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వ దైహికం.

యతతేచ తతో భూయః సంసిద్ధౌ కురునందన- (యోగభ్రష్టః) అని గదా భగవద్వచనము.

ఆ యాలయాంతర్భాగ మతి భయంకరము- ఇద్దఱు ముగ్గురు కలిసి వెళ్ళినను వెఱపుఁబుట్టించును- ఆ యంతర్భాగములో వీథులున్నవి- వానికిరువైపుల బీతు గోడపు వివిధవిధరూపములున్నవి- వానిలోఁగొన్ని దీర్ఘదంష్ట్రిలు- కొన్ని వికృత నేత్రములు- కొన్ని స్ఫుటిత భీకర భ్రూలతలు- కొన్ని దీర్ఘ కర్ణములు- కొన్ని హ్రస్వపాదములు- వానిలోఁగొన్ని సప్త మాతృకలకు మాతృకలు- కొన్ని భద్రకాళి భయంకర ప్రతిరూపములు- కొన్ని భూత భేతాళాది మహా మాంత్రిక భిన్నరూపములు- పరమేశ్వరుఁడు భూతపతి కదా- భూతములన్నియు వికృతాకార చేష్టలు కలవికదా ! అచట నిరుపైపుల నున్న వికృతాకారములన్నియు నా భూత పతి పరివారమే- భూతపతికిఁ గాత్రేనికి నింతకంటే భిన్న పరివారమెట్లుండును.

ఆ దేవాలయ నిర్మాణము కూడ మనసునకందనిదే- ఆ మహా శిల్పులు- అంతటి మహా శిలల నంతటి యెత్తున కెట్లాకర్షించినారో ! ఆ స్తంభ నిర్మాణము- శిల్ప విన్యాసము- అభూతపూర్వమనిపించును- ఈ మాట పూర్వోక్త దేవాలయ శిల్ప వర్ణనావసరములయందుఁగూడఁ జెప్పఁబడినది- దాక్షిణాత్య శిల్ప మంతటిది! దాని వర్ణనములలోఁ బునరుక్తము లనివార్యములు" అయినా- ప్రతివ్రత విషయములో "ఇదం వ్రతానాముత్తమంవ్రతమ్" అని చెప్పు సంప్రదాయము మనకున్నది కదా !

ప్రదక్షిణ మార్గముగా నాలయ మార్గ మధిగమించుచుఁబోయి మృత్యుం జయస్వామి నివాసమును సమీపించితిమి- అదియొక మోహాంతకుని సమ్మోహాత్మక పవిత్ర మందిరము- అచటి ప్రకృతి పాపవిహారము- శాంతికి నిలయము- పుణ్య సహితము.

భరత దేశమునందుఁ బంచ భూతాంశముల్
పంచలింగంబులఁ ప్రథితి కెక్కె-
కంచియందున నుండెఁ గాశ్యపి లింగంబు
జంబు కేశ్వరమున జలమయంబు
అరుణాచలంబందు నగ్ని లింగంబుండె
గంధవాహాంశంబు కాళహస్తిఁ
బరఁగు లింగము చిదంబరమందు నాకాశ
రూపము భగవత్స్వరూప మగుచు.

సర్గ రక్షణ విలయముల్ సాఁగుటకును
భూత పంచకమే హేతు భూతమగును
అట్టి యా భూత పంచక మమరెఁ బంచ
లింగరూపముగాను ధరిత్రియందు.

పంచభూతంబులందునఁ బ్రాణమిచ్చు
పరమ భూతమె యా జగత్ప్రాణుఁడెపుడు
కాళహస్తిని నాతఁడు కల్గఁ, గాళ
హస్తి పేరందె నైదింట నధికమగుచు.

ఆ క్షేత్రమును సేవించిన యే జీవియైనను బరమేశ్వర సాయుజ్యమును బొందఁగలదు- ఆ విషయమును స్వామి చరిత్రయే ప్రకటించుచున్నది- తొలి మంటపమునకు నేబది బారల దూరములోఁగల మలి మంటపములోఁ గాళహస్తీ శ్వరుఁడున్నాఁడు.

శ్రీకాళహస్తీశ్వరుఁడు- అమేయ మహిమా సంపన్నుఁడు- భక్తవత్సలుడు- ఆ మృత్యుంజయునిఁ జూడగానే నాకు నిర్నిమేషత్వము (తెప్ప వేయకుండ

స్వామిని(జూచుట) సిద్ధించినది. దర్శన మాత్రముచేతనే భక్తునకు నిర్నిమేషత్వ మును (దేవత్వ) ప్రసాదించిన యా కపర్ది ఎంత కరుణామయుడు.

సమున్నత ప్రాకారాంతరమున నున్న యా ప్రాంతములో సదాగతియు శూన్యగతి కాకతప్పదు- అక్కడ పరగడయే నిర్వాయువైన అంతర ప్రదేశ మున నవిలు(డెట్లు సంచారము చేయ(గల(డు ?

మఱి గర్భాలయములో నా వాయు సంచారమేమి? లింగము పైభాగమున సాలెగూడొకటి లీలగ గోచరించుచున్నదే- ఓహో ! ఆ గూడు స్వామిపై నిస్స్వార్థముగా( జెల(ది పురుగు నిర్మించిన చాందినీయన్నమాట "పత్రం పుష్పం ఫలంతోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి" యని గీతాచార్యు(డు గీతలో నిచ్చిన సందేశానుసారము భగవంతు(డు భక్తు(డిచ్చిన తృణమైనను మేరువునుగా భావించునని తెలియుచున్నది- కావుననే యా సాలెగూ(టిని( బరమేశ్వరు( డపురూపముగా నాదరించుచు( గాపాడుకొనుచున్నా(డు- బహుశా ఆ గూ(డు మూల తంతువాయమున కౌరసకీటక నిర్మితమై యుం(డవచ్చును.

గర్భాలయాంతర్భాగమున నున్న యా గూ(డు రెపరెపలాడుచున్నదేమి ? లఘువస్తువు రెపరెపలాడుట గాలివలననే కదా ! అచట( బ్రమిదలలో హైయంగ వీన దీపరాజి విరాజిల్లుచున్నది- అదియు గాలికి లోనైనట్లే యూ(గులాడుచున్నదే- ఆ గర్భాలయములోనికి( బవమాను( డెచటినుండి యెట్లు వచ్చుచున్నా(డు- మహా బలు(డు మహాబలుడైనను నచ్చటికి రాలేడు గదా !

ఆ( ! తెలిసినది. అచ్చట నున్నది వాయులింగము కదా- అన(గా వాయువునకు నుత్పత్తి స్థానముకదా- మఱి దానినుండి వాయువేల యుద్భవింపదు ;

వే(డి వెలుంగునుండి యతివేలగభస్తులు పుట్టునట్లు పా
త్రాడెను మబ్బునుండి మధురింబులు నీరము బారినట్లుగా
మూడవ భూతమందున( బ్రభూతమునై చను మంటలీల సం
దోషక వాయులింగమున నొయ్యన(బుట్టును బిల్లతెమ్మెరల్.

ఆదృశ్య "మసల లింగము
కాదది" యను వాదులాట కాశ్రయమిూకే

ఊఁది వచించును, మారుత
మా దివ్య ప్రతిమ యనుచు నంచిత ఫణితిన్.

భక్తవత్సలుఁడు లయకారుఁడైన యాలయకారుని గని ముదమందిన నా కవితావాణి యిట్లు పలికినది.

జననంబున్ మరణంబు జంతువులకున్ స్వాభావికంబౌను దు
ర్జన సంహర్త! త్వదీయ పాదయుగకంజంబుల్ గనుంగొంటి నా
జని సార్థక్యమునందె యల్పులము మీ సాన్నిధ్యమే మాకు వా
సిని వన్నెన్ గలిగించునయ్య గిరిశా! శ్రీకాళహస్తీశ్వరా!

జన సంచారము మృగ్యమౌ యడవి నీ సత్వంబునన్ నిర్జర
ధ్వని సంకీర్ణము నయ్యె. నీ తలపయిన్ వర్తించు బాలేందు దే
వనదీస్పర్శల నార్ద్రి పూతములునై వనస్థలుల్ పండె మిం
చిన నిశ్శ్రేయస సస్యముల్, మినుసిగా శ్రీకాళహస్తీశ్వరా!

అనలం బాననమందు భీగరము కంఠాగ్రంబునన్ వ్యాళరాట్
ఘన వక్షస్స్థలమందు నంగమున నాగార్ద్రాజినంబుండియున్
ఫునుకన్ జేతఁబినాక, మున్కి మసనంబున్, గాని చిత్తంబె కా
చెను భక్తౌఘము, భావమే ప్రముఖమౌ శ్రీకాళహస్తీశ్వరా.

మిత్తిన్ మొత్తిన యుగ్రనేత్రుఁడవు స్వామీ! మాతమోభావమున్
జిత్తుం జేయుము బాలచంద్రకళలన్ జేమోడ్పు లర్పింతు నీ
చిత్తంబందున నీయు మల్పతలమున్ శేషీ! కృతార్థుండ నో
చిత్తోద్భూతహరా. హరా సెలవయా! శ్రీకాళహస్తీశ్వరా!

ధూర్జటి వాగమృతంబున
ధూర్జటి! విహరించు నిన్ను దుస్సాహసినై
యర్జున వర్ణించితి నా
కర్జము మన్నింపు మయ్య ఖండేందు ధరా!

అని చిదంబరుఁడైన యా దిగంబరుని సంస్తుతించి- భవహరుఁడు భవుఁడునైన యా యభవుని యొద్ద సెలవు తీసికొని బహిర్ద్వారాలయమునకు వచ్చితిమి- అనంతర మనంతములైన యాలయ విశేషముల నవలోకించుచు ముందుకు సాఁగితిమి- యచ్చటి యిడుపులపైఁ బార్వతీ పరమేశ్వరుల చిత్రముల ననేకము- అంచులవా రంచెలంచెలుగాఁ జిత్రించినారు- ఆ చిత్రములు సజీవములు- ఆ రంగులు శాశ్వతములు- ఎండలకు వానలకు మఱుఁగు పడనివి-

అయ్యవారిని దర్శించి అమ్మవారిని దర్శింపనేగితిమి ఆయమ్మ పేరు జ్ఞాన ప్రసూనాంబిక- ఆయమ్మ నల్లనమ్మ! తెల్లనయ్యకు నల్లంత దూరములో నున్నది- వారి యాయునికి శంకరుని యర్ధనారీశ్వరత్వమునకు నపార్ధమును గలిగించునదిగా నున్నది- ఈ యున్కి బాహ్యము- ఆంతరికముగ శివుని యర్ధనారీ శ్వరత్వమవిచ్ఛిన్నమే. అది యోగి మానసగమ్యము,

పార్వతి తల్లి యప్సరస, సొగసుల రాశి- మేలికడాని తీవ మేనకాదేవి. తండ్రి సహజధవళరుచి- దేవతాత్ముఁడు- నగాధిరాజు హిమవంతుఁడు- మఱి యట్టి దంపతులకు జన్మించిన పార్వతికి నీలకాలాంబుద వర్ణమేమిటి?

కారణము లేకుండఁగార్యోత్పత్తి యనునది యలంకార శాస్త్రమునకే పరిమితము- లౌకికముగ నది యసంభావ్యము- కావున నపర్ణ నల్లనిదగుటకుఁ గారణమున్నది- గిరిజ ఆదిశక్తియైన భద్రకాళి యపరావతారము- 'కాళి' అనగా నల్లనిదియని యర్థము గదా! కాళియే భద్రకాళి-మఱియుఁ గాళిమాతంగ కన్యగదా- మాతంగులు నల్లనివారుగదా.

మాతృ పితృ వంశ సంస్కారముకంటె నాత్మ సంస్కారము ప్రబల మైనది- అది నూటికి నూఱుపాళ్లు జీవునికి (శరీరమునకు) సంక్రమించును. అందువలన దాక్షాయణికిఁ బితృ మాతృగతమైన శ్వేత వర్ణము రాక తన మూల ప్రకృతియైన భద్రకాళి నీలవర్ణము సంక్రమించినది- అందువలన నామె నల్లనిది యయినది- పార్వతి రూపాంతరయైన జ్ఞానప్రసూనాంబికయు నీలవర్ణయైనది.

మఱి భద్రకాళికి నానీల చ్ఛాయ యెందులకు వచ్చినది.

రాక్షసులు ఘోర నీలాకారులు తమోగుణప్రధానులు భయంకరులై భువనములను భయభ్రాంతములనుగాఁ జేయుచున్నారు వారి భయంకర నీలఘోరా కారములను జూచి యెల్లలోకములు కల్లోలితములగుచున్నవి.

లయకారవి యాత్మశక్తి దుష్టశిక్షణమునకు నడుము కట్టినది. "వజ్రం వజ్రేణ భిద్యతే" అను న్యాయానుసారము భయంకరాకారులను మట్టుపెట్టుటకు నంతకంటె నీల భయంకరాకారముఁ దాల్చి కాళి (నల్లనిది) యను ప్రసిద్ధ నామమును బొందినది. తమోగుణమునకు రౌద్రమునకు భయంకరత్వమునకుఁ జిహ్నము నల్లదనమేకదా. జగత్కంటకులను హతమార్చి శాంతించిన యా కాళీ మాత భక్తుల యభ్యర్థనముల మన్నించి నీలదేహగానే యుండి నమ్మికొలిచిన వారిఁజల్లని చూపులతో నేలుచున్నది. మఱియు నామె మాతంగ కన్యగాదా. మాతంగులు నీలవర్ణములు కలవారుగదా.

భద్రప్రదా కాళీ. భద్రకాళీ. యని యర్థము. అనగా దుష్టసంహారము చేసి తద్ద్వారమున లోకకల్యాణము చేయు దేవతయని ఫలితార్థము.

శ్రీకాళహస్తీశ్వరుని సామేను జ్ఞానప్రసూనాంబిక యని చెప్పుకొన్నాము గదా !

ప్రకృష్టం సూనం. ప్రసూనం. (ఉత్తమమైన పుష్పము) జ్ఞానమేవ ప్రసూనం యస్యాః సా = జ్ఞానప్రసూనా .జ్ఞానమను నుత్తమ పుష్పము కలది. అనగాఁ బుష్పమును శ్రద్ధతో ధరించినట్లే జ్ఞానమును ముఖ్యముగా భావించి హృదయములో నుంచుకొనునది యని భావార్థము. అర్థాత్ జ్ఞాన స్వరూపిణి యని ప్రతీయ మానార్థము. జ్ఞానప్రసూనాచ సా అంబా = జ్ఞానప్రసూనాంబా (జ్ఞాన స్వరూపిణియైన తల్లి)

జ్ఞాన ప్రసూనాంబిక జ్ఞాన స్వరూపిణిగదా. అందువలన నామె "యోయద్వాన్ స తద్దత్తే" (ఎవరిదగ్గఱ యేది యుండునో వారు దానినే కోరినవారికిత్తురు) అను న్యాయానుసారము భక్తులకు జ్ఞానము నిచ్చుచుండును. పైగా నామె సర్వమంగళ. తన నాశ్రయించిన వారికి సర్వశుభములను గలిగించుచుండును. ఆ యుద్దేశముతోనే భక్తు లనేకు లామె పాదారవిందముల నారాధింతురు.

తల్లీ ! సద్గుణవల్లి ! నీదు పదమందారమ్ములన్ వైశ్యమం
దుల్లంబార ధరింతు భూషలనుగా నోకల్పవల్లీ ! తదీ
యోల్లాసాంకుర సత్పరీమళములన్ యుక్తంబునై మద్గృహం
బెల్లన్ వాసితమౌను, జీవితములో నిందు ప్రభల్ చిందెడున్.

జ్ఞానదాయిని! మాత! విజ్ఞాన రవిని
నహరహమ్మును నాలోన నహరనిమ్ము
ఎవని కాంతుల, హృదయమం దేపు మీఱు
ఘూకసంతతి వెలిపుచే ఘోషపెట్టు.

అట్లు జ్ఞానప్రసూనాంబను గవితాకుసుమములతో నర్చించి ముందునకుఁ గదలితిమి. అక్కడ భిత్తిఫలకములపై.

హృదయము పిండి వాగరను హృద్యమషీసుధలందు ముంచి వా
రిద ఘనగర్జలన్ మెలపి వృష్టి మహోద్ధతి ధారనిచ్చి య
భ్యుదయముఁ గూర్చు ధూర్జటి మహోదయు నాంధ్ర కవిత్వ వాణి యా
త్రిదశుల వాణియై పలుకరించెను మమ్మధిభిత్తికావళిన్.

కమ్మని ధూర్జటి పలుకుల
నిమ్మాడ్కిని దేవభాషకెత్తిన మాన్యున్
గొమ్మను సంస్కృతలతికకు
అమ్మక చెల్లా! యెఱింగి యచ్చెరువడితిన్.

కులపతి ప్రాచ్య భాషలకుఁ గోటను గట్టిన కోవిదుండు సం
కుల కుల భేదమెంచక యనుంఠిత దీక్షను శిష్యకోటికిన్
సులువున విద్యలన్ గఱపు సూరివరేణ్యుఁడు స్వర్ణకాంతితో
కలకలలాడు రూపసి యగాధ మనస్కుఁడు కావ్యకర్తయున్.

వరదాచార్యాఖ్యులు నిం
దిరకున్ శారదకు నిచ్చు నెలవగువారున్
వరచిటి గూడూరున నా
దరమునఁ గాలేజి సంస్కృతాంధ్రంబులకున్.

ప్రోది చేసినవారు మహోదయులును
ఆంధ్ర శతకాళి కమరత్వ మందఁజేయు

కవివతంసులు గుదిమెళ్ళ కంధిసోము
లాంగ్ల మందున నిష్ణాతు లమరసములు.

క్రీ॥ శే॥ శ్రీ వరదాచార్యులవారు సంస్కృతీకరించిన ధూర్జటి కృత శ్రీకాళహస్తీశ్వర శతక పద్యములు శ్లోకములుగా గోడలపైఁ జక్కగ లిఖింపఁబడి యున్నవి. గోడలకే యలంకారమైన యా శ్లోకములను జదివి బ్రహ్మానంద మందితిని.

శ్రీవరదాచార్యులవారి నారసింహ సంస్కృత కళాలలో నేను సాహిత్య విద్యాప్రవీణఁజదివితిని. ఉత్తీర్ణుఁడనైతిని. ప్రకరణ మనుకూలించినపుడు గురుస్మరణము చేయుట ధర్మముగదా.

ఆ కళాశాలలో బ్రహ్మశ్రీ కొల్లూరు సోమశేఖర శాస్త్రివర్యులు నాకుఁ బ్రధాన గురువర్యులు. వారు తర్కాలంకార వేదాంత మీమాంసా శాస్త్రముల నాపోశనించిన కుంభసంభవులు.

ఆ కళాల ముఖ్యులు నధికవాగ్మి
తర్కగజసింహ మేక సంధాగ్రహీత
సోమశేఖర శాస్త్రి భాసురమనీషి
కంజలింతును భక్తితో గౌరవమున.

అట్లు గురుస్మరణమును జేసి. యా యావరణములోనే యున్న పాతాళ గణపతిని సంభావించి యచటినుండి లేఖినీ కరవాల విక్రమముల కాకరమైన విక్రమసింహ పురమునకు సాఁగితిమి.

## విక్రమసింహ పురము (నెల్లూరు)

నెల్లూరు పెన్నానది యొడ్డున నున్నది. పెన్నానది యెప్పుడు పొంగునో నెవ్వరికినిఁ దెలియని విషయము. పూర్వక్షణములో నిద్రపోవుచున్నట్లు ప్రశాంతముగా నున్న యా స్రోతస్విని ఉత్తరక్షణములో నిద్రాభంగమైనందువలనఁ గోపించిన యున్మత్త పిశాచివలె రౌద్రాకారయై యగమ్యయై పరుల ప్రాణములు తీయుటకుఁ బరవళ్ళు త్రొక్కుచుండును. ఆ పరుక్షణమే గచ్చులాడివలె మంద

మందముగా సంచరించుచుండును- విక్రమ సింహపురమే యనంతర కాలములో నెల్లూరుగా మాఱినది.

నెల్లూరులోని దేవునిపేరు శ్రీరంగ నాయకస్వామి- ఆయన భక్తవరదుఁడు అందువలన నాస్వామిని దర్శించుటకై భక్తబృందములు దేశదేశములనుండి నెల్లూరు వచ్చుచుండును. కాని వారికి, రంగనాయక స్వామికి నడుమన ఁజపల చిత్తయైన పెన్నెనది యున్నది- పెన్నదాటినగాని శ్రీరంగని దర్శనము కాదు- ఆమె క్షణహృష్ట- క్షణరుష్ట- ప్రవాహము లేదుగదాయని నదిని దాటఁబోయినచో మరుక్షణములోఁ బెరిగిన పెన్న తితీర్షువులను దనపొట్టను బెట్టుకొనును- పెన్న తరణము- ఆసన్న మరణమే- అందువలననే "పెన్న దాటినగదా పెరుమాళ్ళ సేవ" యను సామెత యేర్పడినదిఁ ఈ పరిస్థితి పెన్నపై రైలువంతెన కట్టని కాలమునాఁటిది.

పెన్నపైఁగట్టిన వంతెన దక్షిణ భారత వారధులలో వైశాల్యమున నగ్ర గణ్యమఁట- దాని వెడల్పు 32 అడుగులు- దక్షిణోత్తర భారత భాగముల కైక్యతను జేకూర్చు సంధాన కర్తలలో నిదికూడనొకటి.

మేము నెల్లూరులోఁ బ్రవేశించి "శ్రీరంగ నాయకస్వామి దేవాలయ మెచ్చటనున్నది" యని ప్రశ్నించితిమి- వారు" పెన్నలో నున్నదని చెప్పినారు ఆ సమాధానమునకు యాత్రికులు దేవాలయము నదిలో నెట్లున్నదా యని యాశ్చర్యపడిరి- సాంప్రదాయము తెలిసినవారు మౌనముగా ముందుకు వెళ్ళిరి- అందఱము దేవాలయము దగ్గఱకు వెళ్ళితిమి.

శ్రీరంగేశ్వరుని యాలయము పెన్నానదికి చాల దగ్గఱలోనే యున్నది- ఆ నదీజలము యౌవనదశలో (వర్షాకాలములో) శ్రీరంగేశ్వరుని పాదకమలముల కభిషేకము చేయుచుండును- ఆ దృశ్యమును జూచిన తరువాత "దేవాలయము పెన్నలో నున్నది" అను వాక్యము యాత్రికుల కర్థమయినది- కాలేదు.

పెన్నానదీ తీరమందు గుడియున్నది అని చెప్పక పెన్నానదిలో గుడి యున్నది యని చెప్పిన విశేషమేమైన్న యున్నదాః అన్నయెడల తప్పక విశేష మున్నది- అట్లు చెప్పుట యలంకార శాస్త్ర సంప్రదాయము దానినే "లక్షణ" అని శాస్త్రకారులన్నారు. అది భాషానభిజ్ఞులకుఁ దెలియదు.

"లక్షణ" శబ్దవృత్తులు మూడింటిలో రెండవది." వాచ్యార్థానుపపత్యా, తత్సంబంధిన్యారోపితః శబ్ద వ్యాపారః లక్షణా-" అని లక్షణకు నాలంకారికులు చెప్పిన లక్షణము- అనగా వాచ్యార్థమునకు సమన్వయము కుదురనప్పుడు సమన్వయముకొఱకై ఆ వాచ్యార్థ సంబంధమునందారోపింపఁబడిన శబ్దవ్యాపార మని యర్థము.

ప్రస్తుతమున- పెన్నానదీతీరమున గుడి యున్నది- అని వాక్యప్రయోగము చేసినయెడల నదినానుకొని గుడియున్నది- యను భావము పాఠకునకుఁ గలుగదు- ఎందువలననగా, తీరమునకు నైదాఱు కిలోమీటర్ల దూరములో నున్నవిగూడఁదీర శబ్దముచేతఁ జెప్పఁబడుచున్నవి గదా! యథా- బందరు సముద్ర తీరమున నున్నది- అని యందురు కాని బందరునకు సముద్రము యేడు కిలోమీటర్ల దూరములో నున్నది.

యథార్థమునకు శ్రీరంగ నాయకస్వామి దేవాలయము పెన్నానది నాను కొనియే యున్నది- ఆ అతి సామీప్యార్థము "పెన్నలో గుడియున్నది" అని యన్నపుడే ప్రాప్తింపఁగలదు.

నదిలో గుడియుండుట- అసంభవము కనుక- వాచ్యార్థము బాధితమైనది- అపుడు తత్సంబంధమున నారోపించఁబడిన లక్షణ- గుడి నదిలో లేదు- నది నానుకొని యున్నది యను భావమును తెలియఁజేయుచు భావ సమన్వయము చేయుచున్నది. ఇట్లనుటవలన నాధార విశేషములాదేయమునకు సంక్రమించును.

ఇంతేకాక- వాఁడు గోవాడ ప్రభవోలెనున్నాడు (ఉత్ప్రేక్ష- మిక్కిలి పొడుగువాఁడు) వాఁడు మనుష్యుఁడా మందర పర్వతమా (సందేహము- మిక్కిలి స్థూలకాయుఁడు) వాఁడు కొట్టకముందే వీని ప్రాణములు పోయినవి (అత్యంతాతి శయోక్తి- కొట్టిన వెంటనే) ఇత్యాది ఆలంకారిక వాక్య సంప్రదాయములు గూడ సంఘ జీవనములోఁ బెనవేసికొనిపోయినవి. ఇటువంటి యుత్తమ శాస్త్రీయ మర్యాదల కలవాటుపడినదే యుత్తమ సాహిత్యము.

చూచారా! మనకుఁదెలియకుండగానే యపండితులలోఁ గూడ శాస్త్ర మర్యాదలు సంప్రదాయము లెట్లు చోటుచేసికొన్నవో. ఇదియే సాహిత్యమునకు సంఘమునకుగల యవినాభావ సంబంధము- ఉత్తమ సాహిత్యముగల సంఘము సజీవము- అది లేనిది నిర్జీవము.

అనంతరము దైవదర్శనమున కేగితిమి- దేవాలయము హృద్యమే- చక్షుః ప్రీతి సంవర్ధకమే- దాక్షిణాత్య దేవాలయముల దృష్ట్యా ఆ యాలయముచిన్నది. మన ప్రాంతీయ దేవాలయముల దృష్ట్యా పెద్దది- శిల్పకళ సామాన్యము.

దేవాలయములోని కేగి దేవతామూర్తిని సందర్శించితిమి ఆ చిన్మయమూర్తి- దేవాలయాంతర్భాగమున.

ఎత్తయి శేషరూపముగ నింపుగఁజెక్కిన నల్లరాతిపై
నొత్తుచుఁ బాదపద్మముల నుండఁగ వారిధిపుత్రి సర్వసం
పత్తుల నిచ్చుతల్లి, జగమందలి భక్తుల భాగ్యరూపమై
సత్తును చిత్తుతానగుచు సర్వశరణ్యానుఁడు మాకుఁగన్పడెన్.

చుట్టును నున్న నీరము ప్రసుప్త మహోదధి యట్లు మెట్టపై
గట్టిన దేవళంబు వెలుగారెడు తెల్లని దీవియట్లుగా
పట్టునఁ దెట్టువై నిలచు భక్తులు నిర్జరకోటియట్లుగాన్
నెట్టనఁ దోఁచు నాగుడి గణింప వికుంఠ పురంబు రీతిగా.

ఎక్కడఁ జూచినన్ జగములేలెడు దేవుని విగ్రహంబు లా
ప్రక్కన నుండు దేవు లలరారుచు నుందురు దేవాళాలఁ బెం
పెక్కఁగ నల్లరాళ్లపయి నింపుగఁ, గారణమేమి ? శిల్పమున్
జెక్కుట కర్హమైన యది శ్రేష్ఠము నీలశిలా విభాగమా !

విగ్రహ నిర్మాణ యోగ్యమైన శిలయే నీలాతి నీలమో- లేక విగ్రహమును జెక్కిన తరువాత నా ప్రతిమపై నల్లరంగు పూయుదురో తెలియదుగాని దేవాలయములలో విగ్రహములు నల్లవిగానే యుండును అందులకుఁ గారణమిది.

త్రిగుణాత్మికమైన ప్రకృతి- అనగా నవిద్య తమస్స్వరూణిఁ తమోగుణము గలది- తమోగుణవర్ణము నల్లనిదని ప్రతీతి. అది తెలిసికొనుటకు శక్యముకానిది.

"మాయాశబళితం బ్రహ్మ" యనునది వేదాంత వాక్యము- అనగా సచ్చిదానందరూపమై స్వయంప్రకాశమైన బ్రహ్మపదార్థము సదా మాయచేత (ప్రకృతిచేత) నాచ్ఛాదింపఁబడి యుండును-అందువలన భగవంతుని ప్రతిమయందు సామాన్యులకు గనుపించునది మాయా స్వరూపమేకాని తదంతర్గతమైన మాన్యమైన

జ్యోతిస్స్వరూపముకాదు- యోగులు ధ్యానయోగముచే మాయ నుత్తరిలచి దాని కావలనున్న బ్రహ్మమును జూడఁగలుగుదురు- అను భావమును దెలుపుటకు దేవతా విగ్రహములన్నియు నీలశిలా నిర్మితములై యుండును- నీలవర్ణాచ్ఛాదితుఁడైన భగవంతుఁడు తన బాహ్యరూపముద్వారా మానవకోటి కొక సందేశమిచ్చుచున్నాఁడు

ఓ మానవులారా ! నేను మాయా వృతుఁడను- కావుననే నీలరూపముతో మీకుఁగనుపించుచున్నాను- మీరు బాహ్యమైన నా ప్రకృతి మాయను యోగ సాధనముద్వారా నతిక్రమించి నాలోనున్న శుద్ధ నిత్య చైతన్య జ్యోతిని దర్శించండి- అవుడే మీకు లక్ష్యము కరబదర సమానము కాఁగలదు- అని.

"శ్రీరంగనాయకః" యనునది యొక సమాసము- ఇచ్చట 'శ్రీ' శబ్దము మోక్షలక్ష్మి కుపలక్షకము- శ్రియః రంగః- శ్రీరంగః యనునది యా సమాసమునకు విగ్రహ వాక్యము అనగా మోక్షలక్ష్మి విహరించు స్థానమని భావము= శ్రీరంగం నామక్షేత్రం- తస్యక్షేత్రస్య నాయకః శ్రీరంగనాయకః=ప్రభుః- మోక్షప్రదాతా- ఇతి భావార్థః.

శ్రీరంగనాయకస్వామి శయనముద్రలో నున్నాఁడు- వైకుంఠుని యుత్థానము సృష్టిసూచకము- శయనము ప్రలయ సూచకము- అనిగదా గీతాచార్యుని సందేశము- ప్రలయ సూచక నిద్రాముద్రితుఁడైన శ్రీరంగస్వామి లోకమున కిట్లు ప్రబోధము చేయుచున్నాఁడు.

జననంబెప్పుడు కల్గునో యపుడె సంస్థానంబు. నాపైనఁ గ
ల్గును గాదే మరణంబు. మోఱకు సదా క్రూరస్వభావుండు పెం
పునఁ గానండిది. యంతమందున మహా మోహాక్రిమూ పక్వపం
క నిమగ్నుండయి కన్నుమూయునుఁ గుశంకల్ త్రోవతప్పింపఁగన్.
చూపుల్ గానని దివ్యతేజమును జూచున్ యోగి, తద్దృష్టిలోఁ
బ్రాపున్ గాంచవె యర్థకామములు, దుష్ప్రాప్యంబు మోక్షంబు తా
నై పొందాతనిఁ గన్నుమూత సులువై యూ ముష్మి కాధారమై
తాపం బార్పును. జ్ఞాని నేయెడను సంతాపాగ్ని బాధించునే ?
ముందుఁ జూచుచుఁ బాదము మోపువాఁడు
గర్తమందునఁ బడఁబోఁడు కాలుజాఱి

నిలువరించును, శీవిగా నిలుచుఁబిదప
ముందుచూపది నరునకు ముదమునిచ్చు.

అర్థకామములంబడి యీాదమఱచి
అవియ నిత్యమటంచును నదరిపడకు
ముందురాఁబోవు ముప్పు పెన్ ముప్పుఁదెచ్చు
వెన్నెలన్నది నిత్యమా వెఱ్ఱివాఁడ!
శయనముద్రాంకితుండు కేశవుఁడు రంగ
నాథుఁడిచ్చును నెల్లూరు నగరమందు
భక్తులకు దివ్య సందేశ సూక్తులెన్నొ
యవియ నేఁటికిఁ గ్రొత్తలై యలరుచుండు.

ఆ యాలయము ప్రక్కనే యాదర్శప్రాయమైన యాదర్శభవనమొకటి యున్నది. ఆదర్శ భవనమనగా నద్దాలమేడ. అది నిజముగా జీవాత్మ పరమాత్మ తత్వ జిజ్ఞాసువుల కాదర్శమే.

ఆ భవనములో స్వామివారికిఁ బవళింపు సేవ చేయుదురు. ఆ గది విద్యుద్దీప కాంతులలో ద్విగుణ దేదీప్యమానముగ నున్నది. అందులో బంగరు తూగుటుయ్యలలోఁ గైంకర్యము చేయించుకొనుచున్న శ్రీరంగయ్య ఆదర్శమణి మందిరములో ననంతరూపిగా గోచరించుచుఁ దనయనంతత్వమును బ్రకటించుచున్నాఁడు,

ఆ గది యద్దముల మయమగుటవలన ధవళము. విద్యుద్దీపకాంతిలో నతి ధవళము. గది యంతయు నిండియున్న యాధావళ్యము డోలారూఢుఁడైన పరమాత్ముని సత్త్వతేజము.

నెల్లూరునకు భూతపూర్వ నామము విక్రమసింహపురము. గదా అదియొక నాఁడు పోతుగడ్డ. అక్కడ పెందెరువులోఁ బోవుచున్ననాకు నా నగరము పూర్వ చరిత్ర స్ఫురణకు వచ్చినది. అపుడు పులకించిన నా హృదయములో.

మెఱసెను ఖడ్గధారల సునింపించిన చంచలరేఖ కావ్యము
ర్మర మధురార్ద్రి గీతికల రావములన్ జిగురించి నాఁటి ని

ర్భర కవి రాజ సఖ్యపరివర్ధిత రమ్య కవిత్వ తత్త్వముల్
మొరసెను ఖేదమోదములు పుట్టెను గాఁగిన డెందమందునన్.

మండెడు కట్టెయైన దినమంతయు మండదు. కీల తూలఁగాఁ
జండిమఁబాయుఁ గాని యెగసన్ వడిఁ ద్రోయఁగ ముందుకంటె ను
ద్దండత మండి బూదియగు. ధర్మము బంటుతనానికిద్ది ఆ
ఖండల తుల్య! నీచరిత కాంచగ నిట్టిదె ఖడ్గతిక్కనా!

విఱిగిపోయినపాలు వెచ్చఁదనంబును
రెచ్చఁగొట్టెను నీదు మచ్చమాయ
నులకమంచము కన్నమలపిన యహమును
గిల్లి కయ్యానికై కెరలఁజేసె
పసుపు ముద్దయు మండి పండించె నీలోన
రక్తారుణ ప్రభా రౌద్రగతుల
కన్నవారల నినుఁగొన్నవారల పలుకు
లగ్గి పుట్టించె నీయంతరమున.

అది మహోజ్వాల, సంక్షుబ్ధమైన యబ్ధి
విలయ గంభీర ఘోష, విశ్వేశ ఘోర
వీక్షణాక్షిప్త పావకాఽవేల కీల,
ఖడ్గతిక్కన! యపుడు నీ కదనవేళ.

విస్తుపోయెను లోకము, వెఱపునందె
వీరలోకము, మృత్యువు కొఱలందుఁ
దేఱిచూడఁగ రాని నీ తీరుఁజూచి
ధన్యుఁడవు ఖడ్గ తిక్కనా! మాన్యమణివి.

అని యా మహావీరుని శౌర్య ధైర్యములను సంస్మరించి మా బృందముతో నగ్రగామినైతిని.

ఆ పట్టణములో నొక శ్రేవ హరిహరనాథ దేవాలయమున్నది- అది శిథిలావస్థలో జర్జరిత శరీరుఁడైన శతాధిక వృద్ధునివలెఁ గనుపించినది- ఆ దేవుని పేరులిన్నంతనే, ఐక్కపలచగాఁ బొడుగుగానుండు వాఁడు- మోముపై మూడు విభూతి రేఖలక్రింద ఉదయార్క రేఖా సముల్లాసమైన కుంకుమాంకము కలవాఁడు- విశాలమైన ఫాలఫలకము కలవాఁడు- సోమయాజిత్వమునకుఁ జిహ్నములై చెవులయందుఁ జొకశించు స్వర్ణ కుండలములు కలవాఁడు- వెనుకకు గదిమిన యజ్ఞానమువలె వ్రేలాడుచున్న గోష్పారమంత వైశాల్యముకల జాఱు జుట్టుముడి కలవాఁడు- కించిదున్నతములైన కనుబొమ్మలక్రింద మిలమిల మెఱయుచున్న నిశిత నేత్రములు కలవాఁడు- అర్ధ నిమీలితములు ధ్యానముద్రా ముద్రితములు- అభంగుర కవితా భారబంధురములునైన యాలోకములలో ఏ లోకములోనో యున్న తెలుఁగు సరస్వతీ పాదారవింద సాక్షాత్కారమును నింపుకొన్నవాఁడు. నీతిని రాజనీతినిఁ జూపులలో నిలుపుకొన్నవాఁడు- మిట్ట యురమున గునిసియాడు రుద్రాక్షమాల కలవాఁడు- చామనచాయకలవాఁడు- ఉభయ కవి మిత్రుఁడు- కవిబ్రహ్మ- తెనుఁగు నుడికారమునకుఁ బ్రాణము పోసినవాఁడు- అయిన తిక్కన మహాకవి నాకు మనస్సులోఁ బొడఁగట్టినాఁడు- ఆ కావ్యవిధాత.

ప్రాఁబల్కుసారము భారతరూపానఁ
బోతపోసిన వాణి పుత్రుఁడతఁడు
శివకేశవాఽభేద సిద్ధాంత కర్తయై
యజ్ఞలోకముఁ బ్రోచు ప్రాజ్ఞుఁడతఁడు
రాజనీతిని సుధాప్రాయముగాఁ జేసి
భూనాథులన్ దీర్చు ప్రోడయతఁడు
చిఱుతెల్గు పల్కులో బరువైన భావముల్
పండింపఁగల కవిబ్రహ్మయతఁడు.

ఓరుగల్లును భారతీ భూరినాట్య
మంజుమంజీర శింజిత మధురరావ

పరవశన్ జేయు కవిసార్వ భౌముఁడతఁడు
తిక్కనాఖ్యుఁడు కుకవితా తిగ్మరశ్మి.

మహాత్మా ! పుంభావసరస్వతీ ! నీవా శారదామాతకుఁ గై సేసిన మేలితొడవుల జిగులు నేఁటికి నిత్యనూతనములై సాహిత్యాంబరమునఁ బ్రకాశించుచునే యున్నవి. నీకైతలోని సొబగుల నెన్నికసేయ నేనెంతవాఁడను. అయినను బరవశ్య త్రొక్కు నుత్సాహము నాపనోపక దిఙ్మాత్రముగాఁ నాయోపినకొలఁది నీ "సాహిత్యస్తుతి జేయ సాహసింతును. క్షమధ్వం.

చలికొండ శిఖరముల్ తలవంచి కన్పించు
ఒక్కొక్కచోట నీయొక్క కవితఁ
బాతాళ వారిధుల్ బరఁగు జాంగలములై
ఒక్కొకచోట నీయొక్క రచన
అచిరరుక్కులు సార్థకాభిధానంబులౌ
ఒక్కొక్కచోట నీయొక్క సేఁత
పీయూషరసములు విఱిగి నీరసములౌ
ఒక్కొక్కచోట నీయొక్క యూహ.

ఒదుగు మధువాసమంత యొక్కొక్కచోటఁ
బ్రకృతియంతయు నీదు గోకభాగదుందు
బ్రహ్మ యా విధి, కవిబ్రహ్మవీవు,
ముల్లు నీపైనె యిర్వురన్ మొగ్గు నిజము.

ఆ నెల్లూరున నీదు భారత కవిత్వారంభముల్ వాఁగులై
సోనల్ సాఁగెడు నేరులై నదములై దివ్యజ్జలౌఘుంబులై,
నానా తెల్గు ధరిత్రి నిండినవి. యా నద్యుద్ధతాంభస్సులన్
లీనంబైనవి యాంధ్ర సర్వ కవితారీతుల్ కవీంద్రోత్తమా.

ఒకచేతన్ బదునైదు పర్వములఁ బీయూషంబులో లేఖినిన్
సుకృతీ ! ముంచి రచించినాఁడవని, నే నూహింతుఁ, గాదేని పా

శక జిహ్వల్ మధువానినట్లుగ నఖండానందమున్ బొంది నేఁ
టికి నీ పద్యములన్ బఠించు, నెటఁ బోటీలేదు నీ కైతకున్.

కత్తిధారను కానట్టి కర్జమగును
కలము కన్నతి సూటిఁగాఁ గాంచినపుడు
ననెడు నిజమును జాటినావయ్య! తిక్క
నార్య! భాషాప్రవీణ! కావ్యాంతరాత్మ!

నన్నయ నాటు మొక్కలకు నంటునుగట్టి మఱొక్క మొల్కతో
తిన్నఁగసోఁకి పెంచితివి, తీయని మూఁడవ యొక్కపుట్టె నీ
పన్నిన యంటునుండి, యిరుభంగుల పోల్కలు దానికుండె. తి
క్కన్న మహాకవీ! నవయుగంబున కేలికవైతి దానిచే.

వ్యాసుని పల్కులన్ వినినయంతన వానిని నక్షరాత్మలన్
జేసెను విఘ్ననాయకుఁడు. నీ పలుకుల్ గురునాథుఁ డన్యహా
ధ్యాసను మాని తాళముల యందు బిగించెను నక్షరాత్మలన్
మీఁ సరివారు లేరు గమనించిన నాంధ్రమహీతలమ్మునన్.

"ఫలప్రదం హి స్మరణం దర్శనంచ మహాత్మనాం" అని బుధులబోధ-
అనగా మహానుభావుల సందర్శనమేకాక స్మరణము కూడఁ గామితార్థముల నీయఁ
గలదు- అని పై వాక్యమునకు భావము- అందువలన- ఓ కావ్యస్రష్టా! భక్తితో
నిన్ను స్మరించుచు నాయభీష్టమును విన్నవింతును. దయతో మన్నించి యను
గ్రహింపుము.

ఏదోమాదిరి నాల్గు గీతలను గీయించెన్, గవిబ్రహ్మ! నా
చే దేహాంతర గాఢకాంక్ష యది వాసింపన్ దయామూర్తి! నా
మీఁదన్ బ్రోక్షణఁ జేయుమయ్య! బుధులన్ మెప్పించు నీ సాహితీ
వేదశ్రీ సర్వశక్తి యుక్తరసవద్వ్యాఖ్యా ప్రసారంబులన్.

అని ద్వితీయ యుగకర్తను సంఘసంస్కర్తను- దురాచార సంహర్తను
ఆంధ్రకవితా భూభర్తను ఆంధ్ర మహాకావ్య స్రష్టను దిక్కన మనీషిని మధుర
పదభాషిని సంస్మరించి పురోగముఁడనైతిని.

నెల్లూరి దర్శనముతో మా "కన్యాకుమారి" యాత్ర పూర్తియైనది. (దక్షిణాది యాత్ర) మొత్తము 56 క్షేత్రములను 24 రోజులలో నిరంతరాయముగ సందర్శించితిమి.

నెల్లూరు నగరమును నచ్చటి విషయములను దర్శించి స్మరించి సంభావించితిని. అప్పటికి మధ్యాహ్నము 2 గంటలయినది. ఆ సమయములో మా పుష్పక విమానము నెల్లూరును వదలి స్వగృహాభిముఖమైనది (తెనాలి)

నెల్లూరినుంచి ఏకాయకిఁ దెనాలి పోవలయునని బస్సువారి యభిప్రాయము మేము నట్లే యనుకొన్నాము.

మధ్యాహ్నము 3 గం॥లైనది. త్రోవలో మాకుఁ బాడుపడినట్లున్న యొక సత్రము కనుపించినది. ఆ సత్రమును జూడగానే యచట నాగి భోజన ప్రయత్నములు చేయవలయునని మేమనుకొన్నాము. బస్సువారికిష్టములేకున్నను దప్పనిసరి యగుటచే నచ్చట బస్సునాపి వంటప్రయత్నములఁజేయసాఁగిరి.

ఆ సత్రమునకు ముందుఁదరులతాగుల్మములు బలిసి యున్నవి. ఆ చెట్ల మధ్యమునఁ దలక్రిందైన యాదోఁక యాకారములో నొక వేదిక ఆ వేదికపైన లీలామనుష విగ్రహుఁడైన నీలవర్ణుఁడు వేణువినోదియై నిలఁబడియున్నాడు. సహజముగా నా గోపాలుఁడు నీలవర్ణుఁడే. కాని యా చెట్ల క్రింద శ్వేతవర్ణుఁడైనాఁడు. పక్షులు రెట్టలువేయుట కాయన విగ్రహమే దొరకినది కాఁబోలు ! చెట్ల క్రిందనున్నాడుగదా. అజ్ఞుల కర్మలు. ఉచితానుచితములఁ బరిశీలింపవుకదా !

సర్వ జగత్తులకు నాచ్ఛాదనము తానయై కాపాడు సర్వజగద్రక్షకునకు నక్కడ నాచ్ఛాదనము కూడఁగఱవైనది. పక్షి రెట్టలచేత నాదేవుని శరీరమంతయు మలినమై యసహ్యముగా నున్నది. కాని యాతాయాత జనములకు నా విషయమే పట్టినట్లు లేదు. భగవానుఁడక్కడ విగ్రహరూపమున నున్నాఁడను విషయముకూడ వారికిఁబట్టి నట్లు లేదు. నేఁటి ప్రబుద్ధుల సంస్కారమటువంటిది. పైవారి విషయమెందులకు. ఆ విషయము. ఆరాధామనోహరునకే పట్టినట్లు లేదు. పట్టినయెడలఁ దన్నివారణార్థమేకొంచెమైన ప్రయత్నము చేసికొనఁడా. అదియే రహస్యము విచిత్రము. నామాన్యులకు నందక మాన్యులకు మాత్రమే యందునది.

దైవము సర్వాకారుఁడు ముదంబునఁ గష్టసుఖంబులెల్ల స
ద్భావముతో భరించు నటువంటి మహాత్ముఁడు సేసినంత నా

యేవము ప్రస్తుతే యనుభవింపక తప్పదు. దైవమెప్పుడున్
బావనమూర్తి యే- నళినపత్రమునంటునె? నీటి బిందువుల్.

దోసంబున్ దొలగింపఁజాలియును నేదో సాకుఁగల్పించి యీ
దోసంబున్ దొలఁగింపఁబూనని నరుల్ దుర్దాంత దుఃఖంబులన్
జేసేతన్ గయికొందు, రవ్యయమునై చెన్నొందు దైవమ్ము, చి
ద్భాసంబయ్యది, యీ రహస్యమును వేదాంతుల్ తగన్ జెప్పరే.

మానవులైనవారు. గుణమాన్యులు చెప్పిన ధర్మమర్మముల్
కానఁగనేర్తురా! యవి సకాలమునన్ నెఱవేర్తురా? యటం
చా నవనీత చోరుఁడు జనాళికిఁబెట్టె పరీక్ష. దానినిన్
గానని వాఁడు మూర్ఖుఁడగుఁ, గాంచినవాఁడు గుణోత్తరుండగున్.

ఇది కలికాలముకదా- ధర్మ సూక్ష్మములు నేఁటివారికి దుర్గ్రాహ్యములై పోయినవి- నేఁటి వారికనగాఁ నెక్కువమందికని భావము.

నాకాదృశ్యము బాధాకరమైనది- అందువలన- యథాసమయము యథాశక్తి ఆ కొంచె గోపయ్యమీద నున్న మాలిన్యమును దొలగించి సంస్కరించి నమస్కరించితిని- నా యీ కార్యము కొందఱ కపహాస్య కారణమైనది- అపుడు వారి పండ్లే భయల్పడినవేగాని నాకేమియు న్యూనత కలుగలేదు- ఒకమారా ప్రదేశము బరిశీలించితిని.

నేనెక్కడివాఁడను- ఈ ప్రదేశమెక్కడిది- నేనిక్కడ భుజించుట యేమి? కలలోనైన నాకు నీ ప్రదేశమునకు సంబంధములేదే- ఏ యనుభూతి సంబంధము గత జన్మలకు సంబంధించినది లేకపోయిన నాకీనాఁడిక్కడ నీయనుబంధ మెట్లు కలిగినది- గత జన్మ సంస్కారము వర్తమాన కాలమున (జన్మమున) ప్రబుద్ధ మగునుగదా! కావున నీ స్థలమునకు నాగతజన్మకు నేదియో సంబంధమున్నది- దాని ఫలితమే కలలోఁగూడఁ గన్పడని యీ స్థల భోజనము.

ఎంత విచిత్ర మీ ప్రబతు, కదెక్కడ నెప్పు డనూహ్యపద్ధతిన్
వింతగ బంధమేర్పడగ నెయ్యము గయ్యముఁ బొందుచుండునో

నెంత యెఱుంగ రెవ్వరును. జోద్యము! ప్రాక్తన జన్మకర్మల
త్యంతము ప్రవర్తమానములయందు ఫలించును జిత్రరీతులన్.
లేనియెడన్ దెనాలి నగరిన్ వసియించెడు మేము స్వప్నమం
దైనను గానరాని విజన స్థలిలో భుజియించుటేమి? ని
ధ్యానముఁగాననట్టి విషయంబిది. మాకును నా స్థలానికిన్
జానెడొ బెత్తెడో గతమునందున నుండును బంధమెట్టిదో.

ఒకనిఁజూచ నొకని కొదవును బ్రేమమ్ము
వాని నెప్పుఁడతఁడు కాన లేదు
కలుఁగు నెట్లు వారి కభిమాన భావము?
అదియె భూతజన్మ యనుభవమ్ము.

నరులకు నన్యవస్తులకు నట్టి పురాభవ సంధి బంధముల్
తెలుగవు జన్మజన్మలకు. దానికి గ్రంథము లెన్నొ గట్టిగా
నిరవును జూపఁగల్గినవి. యిట్టిదె బంధము సాన్నిహిత్యమున్
దెలిపెను మాకు నా స్థలికి. నేరరు దీని నెఱుంగ జ్ఞానులున్.

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి.

శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్.

ఇవి గీతాచార్యుని ప్రవచనములు. అనగా

వాయువు మొదటఁదానున్న పుష్పమును వదలి యన్య పుష్పమును జేరు నపుడు. ఆ మొదటి పుష్పమును వదలి యందున్న పరిమళమును మాత్రము తనతోఁదీసికొని పోవుచున్నాఁడు. అట్లే జీవుఁడు కర్మవశమునఁ బూర్వదేహమును వదలి నూతన దేహమును బొందునప్పుడు పూర్వ శరీరమును మాత్రమే వదలి యందున్న పంచజ్ఞానేంద్రియములను వాని ప్రచార సాధనమైన మనస్సును దనతోఁబాటుగ నూతన దేహములోనికిఁ దీసికొని పోవుచున్నాఁడు. అట్లు

ప్రవేశించిన తరువాత వర్తమాన జీవితములో నా యింద్రియములతోనే గతజన్మ సంస్కార లభ్యమునైన సుఖదుఃఖముల ననుభవించుచున్నాఁడు- గతజన్మ సంస్కారములో భాగముగానే యా జన్మకు సంబంధించిన వ్యక్తి స్థల గృహాదుల పరిచయములను గూడఁ దనలోఁ దెచ్చుకొనుచున్నాఁడు- కాని యా గత జన్మ పరిచయములు ప్రత్యక్షముగా నీ జన్మములో నింద్రియాదులచే నుపలభ్యమానములు కావు- అందువలననే గత జన్మవ్యక్తులు మొదలగువారు- ఈ జన్మలో గుర్తింపఁ బడుటలేదు- కాని యా గత జన్మ పరిచిత వస్తువులయందు- ఈ జన్మలోగూడ జీవునకు మనస్సునకు కూడ నజ్ఞాతమైన యాదరము ప్రేమ కలుఁగుచున్నవి- మా యావిమోహితుఁడైన జీవుడు- ఈ జన్మలోఁ దన ప్రేమకుఁ బాత్రమైన జీవి గతజన్మలోఁ దన ప్రేమకుఁ బాత్రుఁడైన వాఁడే యని గ్రహింపలేకున్నాడు.

అంతేగాక గత దేహేంద్రియములే వర్తమాన దేహేంద్రియములగుట వలనఁ బూర్వజన్మ పరిచిత వస్తుసముదాయము సన్నిహితమైనప్పుడు అతర్కిత ముగా నప్రయత్నముగా జీవునకుఁ బూర్వసంస్కార బలము వలన ఆ వస్తువులపై నభిమానము కలుఁగును "ఆ స్థలమునకు మా యాత్రికులకు భూతజన్మమున సన్నిహిత సంబంధమేదియో మున్నది- లేకపోయిన మాకందఱకు నా స్థలమును జూడగానే యొకమాఱే హఠాత్తుగ నక్కడ నాగవలయునను నభిలాష యేల కలిగినది?

అట్లు పురాజనుస్సంబధమేదియో యుండుటవలననే యా స్థలము మా కానాఁడు- అప్రయత్నముగ ననూహ్య పద్ధతిలో నన్నప్రదానము చేసినది- అట్టి బంధము నూహించుకొని యా ప్రదేశమును నించుక యాదరముతోఁగను గొంటిని.

మాబస్సు ఇంటి మొగమైనందువలన భూమిమీదఁ గాళ్ళూన నీయక పఱుగు లెత్తుచున్నది- ఆ బస్సువేగములో మధ్యమధ్య వచ్చు గ్రామములు గ్రామములలోఁ బ్రక్కపక్కగనుండు గృహమువలెఁ గన్పడినవి- తిరిగినంతకాలము తెగతిరిగి ఊరిముందఱికి వచ్చిన తరువాత నుఱకులెత్తు పధికులవలెఁ బ్రయాణీకుల మనస్సులు గూడ బస్సువేగమును మించిన వేగముతో ముందుకు దూసికొని పోసాఁగినవి- అట్లు మహావేగముతోఁ బ్రయాణించు బస్సు గుంటూరునుంచి తెనాలి పోవుచు హెచ్చరికలు చేయసాఁగినది- ఆ హెచ్చరికలు "యాత్రికులారా!

మీరు యాత్రకు బయలుదేరునపుడు తిరిగి తిన్నగా నిండ్లకు రాఁగలమా- లేదా" యని యాందోళనపడినారు. అపుడు మిమ్మందఱను క్షేమముగా మీ యూళ్లకుఁ జేర్చుభారము నాది యని నేను మీకు హామీ యిచ్చినాను- జ్ఞాపకమున్నదా? ఆ ప్రకారమే మిమ్మందఱను క్షేమముగాఁ దీసికొనివచ్చి నా మాట నిలఁబెట్టుకొన్నాను- అని చెప్పుచున్నట్లున్నవి.

బస్సు తెనాలి నగరోపకంఠమునఁ బ్రయాణించుచున్నది- బస్సులోనివారు- సంతోషముతోఁ గోలోహాలము చేయుచున్నారు- ఆ శుభసమయములో నెవరెవరి మనస్సు లెటుపోయినవో నాకుఁదెలియదు. నా మనస్సు- మాత్రము ఇంటిపైకిఁ బోలేదు- ఇంటిలో నున్నవారిపైకిఁ బోలేదు. సర్వ ప్రజలను దనప్రజలనుగా భావించి వారినిఁ దనకండ్లలోను గుక్షీలోను నుంచుకొని రక్షించి పోషించు వేంకటరమణుని పాదపద్మములవైపు పోయినది- ఆ స్వామియేకదా మమ్ములను గంటికి ఱెప్పవలె నుండి కాపాడి క్షేమముగా నింటికిఁ జేర్చినది.

ఇలవేల్పైన మా యిలువేల్పును స్మరించినంతనే యా దయామయుని భక్తవాత్సల్యమునకు నా కనురార్ద్రములైనవి- హృదయము కృతజ్ఞతాభార బంధురమైనది- నా ప్రయత్నమక్కఱలేకుండగానే రెండు నొకటై నెత్తికెక్కినవి- అపుడు నా మనస్సులోనుండి యీ ధ్వనులు కలధ్వనుగా వెలువడినవి.

అయ్యావు సర్వలోకముల కవ్యయ ! యవ్యయ శాంతిసీమకున్
నెయ్యురఁ జేర్చఁగల్గు నెఱనేతవు దీనుల దాసులన్ మన
శ్శయ్యను నిద్రపుచ్చు సర్వసంపదఁగల్గిన గాణవీవు వెం
కయ్యా ! యహీంద్రశయ్యా ! వినయంబున నీ యనుకంప కంజలుల్.

క్షణమున కొక్కబస్సు నిముసంబునకొక్కటి లారి సోదిలోఁ
గనుపడకుండఁబోవు చెడుకాలమునందున మేము యాత్రకున్
జనునెడ నీ పదంబులకు సాఁగి నమస్కృతిఁ జేసి క్షేత్రముల్
గనుగొని వచ్చినారము సుఖంబుగ నీదయ వేంకటేశ్వరా.

నాలుగువేలమైళ్లు కరుణాకర ! నీ కనుచూపు చల్వచే
మూలుగు ముక్కలేక తలపూవులు వాడక దేశదేశముల్

పేలగఁజూచివచ్చితిమి యింటికి. మీ కృపయున్నవారి నా
కాలుఁడుఁ దేఱిచూడ వెనుకాడును బక్షికులేంద్ర వాహనా!
భానుఁడు వేయిరెట్లు తనవారి కవారిగ వారినీయఁగాఁ
బూని జలంబులం గొనును. బూచిక యంతటి పూజసేయ నీ
వో! నగమంత యర్ఘము నపూర్వము నిత్తువు సూర్యనేత్ర! యే
రైనను భక్తవత్సలతయందున మిమ్ములఁ బోలనేర్తురే?
జోతలు దేవరా! సరసిజోదర! లక్షలు కోట్లు నీ పదా
బ్జాతి యుగమ్మునందుఁ బ్రణిపాత సుమంబుల నుంతు, నందు సం
జాత పరిమళంబు లనిశంబును నా గృహాప్రాతి గంధముల్
చేతులఁబాఱఁబోసి, మముఁజేర్చును మీ హృదయాచ్ఛపేటికన్.
ఇంద్రవందిత నీకేమి యీయఁగలను
ఉన్న మనసును గాన్కగా నొసగియుంటి
"పేఁడు నావాఁడు భక్తిలోఁ బేదవాఁడ
టంచుఁ బ్రోపుము! నన్ను మంగాబ్జభృంగ!

మా బస్సు తెనాలి చేరి యాగినది. సుమారు షష్టిసంఖ్యాకులు మా బస్సులో 24 రోజులు ప్రయాణము చేసినాము. ఒకచోటనే భుజించినాము. ఒకచోటనే శయనించినాము. స్నేహ బంధబద్ధులమైనాము. కాని బస్సు తెనాలిలో ఆగగానె. ఆ బంధములు అనుబంధములేమైనవో. "ఎవరికివారే యమునాతీరే" యన్నట్లుగా నెవరిత్రోవను వారు పోయినారు. ఆ కలుపుకోలుతనమేమైనది? ఆ యాప్యాయతలేమైనవి? ఎంత విచిత్రము!

జీవితంబను దారిలో నావహిల్లు
కొన్ని మజలీలు చిన్నవి, కొన్ని పెద్ద
వగును, గృహమన్నదే పెద్దదైన మజలి.
ముందు వెనుకఁగ నివియున్న డిందిపోవు.
చిన్న వసతుల మనుగడల్ సున్నలగుట
తెలిసియున్ బెద్దమజలీనిఁ దలఁచు శాశ్వ

తంబుగాఁ జీవి. యది విచిత్రంబుగాదె
మూఢులన్ జూచి తెలివినిఁ బొందవలదె?

అందులకుఁ దారకాణ మా యాత్రవారె
"యిల్లు వాకిలి సతమగు నితరమెల్ల"
గొంతకాలమె యుండు. రవ్వంత మజిలి
తోడ మాకేమి పనియని తొలఁగిచనిరి.

అందిన యట్టి స్నేహము, గృహంబులఁ జేరు తలంపుతోడ వా
రందఱు త్రోసిరాజనిరి. యంతియె యీ యిహబంధమెల్ల, నే
చందమొ యెక్కడో యణగు. శాశ్వతమంచును దీనినమ్మినన్
గ్రిందగు లక్ష్యసిద్ధి, పరికింపరు దీనిని మూఢమానవుల్.

అనంతరము మేమును మా గృహముల కేగితిమి. ఈవిధముగా మా దక్షిణ తీర్థయాత్ర ముగిసినది.

తీర్థయాత్రాసక్తి నా చిత్తములో హత్తినపుడే యా యాత్రావిషయములను జంపూకావ్యముగా రూపొందింపవలెనను సంకల్పముకూడ నా హృదయములోఁ జోటుచేసికొన్నది. అందులకై ప్రతిక్షేత్రములోను వాచికముగానో ఆర్థికముగానో యా యాక్షేత్రజ్ఞుల నాకట్టుకొని వారివలనఁ దెలిసికొన్న విషయములను వ్రాసి కొంటిని. అంతేకాక యా స్థలదేవతలను, జరిత్రలను నధ్యయనముచేయగా, భగవదనుగ్రహముచేత నాలోఁగలిగిన భావములుగూడ నీ గ్రంథరచన కాధారము లైనవి. పిమ్మట సమయము చూచుకొని యథాశక్తి తిరుమలవాసుని యనుగ్రహ మాధారముగా గ్రంథము రచించితిని.

చంపూకావ్యము పూర్తియైనది. నా హృదయమున నానందరేఖ పొడసూపినది. మనసు రసపూర్ణమైనది.

బిడ్డ యెటువంటిదైనను బితృప్రేమ యల్పముకాదుగదా. దానికి గుణదోషము లడ్డుపడవుకదా! ఆ బిడ్డ గుణదోషములెన్నఁగలవారు అనసూయాపరులు కావ్యమర్మపారగులు విశాలదృష్టికల రసజ్ఞులే. ఆ బాధ్యత వారిదే. అనంతరము యాత్రలను బూర్తిచేయించి గ్రంథమును గ్రంథముద్రణమును గూడఁ

బూర్తిచేయించిన మా యిలువేల్పునకు వేంకటేశ్వరునకుఁ గృతజ్ఞతతో విన్నవించుకొంటిని.

దక్షిణదేశయాత్రల నుదంచిత ధార్మిక బుద్ధిఁజేసి ప్ర
త్యక్షముగాఁగనుంగొనిన యాత్రల సంగతులన్ని గూర్చి స
ల్లక్షణ బంధురంబుగఁ జలంబున వ్రాసితి నొక్క కావ్యమున్
పక్షితురంగ ! నీ దయకుఁబాత్రముఁ గన్యకుమారి నామమున్.

వ్రాసితి చంపూకావ్యము,
నాసించితి సరసపాఠకానందము, నా
యాస సఫలంబుఁజేయుము
నీ సత్కృప దుష్టమైన నిర్దుష్టమగున్.

నామది నీవయుండి గిరినాయక ! కాన్యకుమారి కావ్యమున్
సామి ! రచింపఁజేసితివి. సత్యమె, యీకృతి మీది, దీనినె
ట్లోముదువో ! చిరాయువుగ నుంతువో ! భారముమీదె, మీ దయా
ధామము నిత్యనూతన కథా మధురధ్వని జీవనంబగున్.

.: ఓమ్ తత్ సత్ :-

